Siddha Samaj



# సిద్ధవేదము

సిద్ధసమాజ స్థాపకులైన
స్వామి శివానంద పరమహంసలు వారిచే
ఉపదేశింపబడిన

## మోక్ష సూత్రము

### జీవచరిత్రము

ఒక సిద్ధసమాజ ప్రకటనలు

# సిద్ధవేదము

జీవచరిత్రలు అనేకమైనవి, ఈ ప్రపంచమున ఉన్నవి. కాని అవి ఏవియు జీవచరిత్రములు కావు. అవి జీవిత చరిత్రములైనున్నవి. జీవ చరిత్రము జీవునియొక్క చరిత్రము. అది ఒకటే ఉన్నది. అదియే సిద్ధవేదము - సిద్ధసమాజ స్థాపకులైన స్వామి శివానంద పరమహంసలు వారి స్వానుభవమైన మహోన్నతమైన **జీవచరిత్రము.**

తననుంచి నశించి పోవుచున్న జీవున్ని తనలోపలనె రక్షించుటకై తత్వములను స్వష్టమయిన వివరములచే సులభమైన గురు - శిష్య సంవాద రీతిగా వివరించుచున్నది **సిద్ధవేదము.**

బందమునుండి విడుదలగుటయే మోక్షము. **సిద్ధవేదము** మోక్షము పొందుటకు సూత్రములను వివరించుటవలన అది **మోక్షసూత్రము.**

అన్ని చదువులు అవి ఏవైయున్నను తన్ను తాను తెలిసికొన లేకపోతే అవి నిష్ప్రయోజనమే. తనకు తాను నేర్చుకొన వలననిన తనను తానుచూసి నేర్చుకొన వలను. తనను తాను చూసి నేర్చుకొ వలసిన కలయే సిద్ధవిద్య (బ్రహ్మ విద్య). తనను తాను నేర్చుకొనటకు ఆధ్యాత్మికముగా వివరముల నిచ్చుచున్నది సిద్ధవేదము.

**జీవరక్షణము తనను తాను తెలిసికొనుటకు మూలకారణము.** బందనములనుండి మరియు కష్టములనుండి విడుదలై ఆధ్యాత్మికముగా ఉత్కృష్టమైన బ్రహ్మానందమును శాశ్వతముగా ప్రసాదించు చున్నది. జీవ నాశనము మాయా లేక తన అజ్ఞానమునకు మూల కారణము. బందములకు మరియు కష్టములకు హేతువై నశ్వరతమైన మరణమునకు అంత్యమగు చున్నది. ఈ ఆత్మ తత్వములు వివరములతో ఉన్నది **సిద్ధవేదము.**

మాయా సముద్రమునుండి బయట వచ్చుటకు సరియైన మార్గమును చూపించుచున్న దీపస్తంభము **సిద్ధవేదము.**

సర్వదా **లోకశాంతి! లోకశాంతి!! లోకశాంతి!!!**

| | | |
|---|---|---|
| Language | : | Telugu |
| Name | : | SIDDHA VEDAM |
| Subject | : | Spiritual |
| Author | : | HIS HOLINESS<br>**SWAMI SIVANANDA PARAMAHAMSA**<br>FOUNDER OF SIDDHA SAMAJ |
| First Edition | : | 1941 |
| Second Edition | : | 1948 |
| Sixth Edition | : | 2013 - December |
| Copies | : | 1000 |
| Size | : | Demmy 1/8 |
| Pages | : | 424 |
| Printed at | : | Sri Murugan Process, Sivakasi. |
| Copy Right | : | General President<br>Siddha Samaj H.O.<br>Vatakara, Kerala, 673 104 |
| Publishers | : | Siddha Samajam<br>Publication Division.<br>Siddha Samaj H.O.<br>Vatakara, Kerala, 673 104 |
| Available at | : | Siddha Samaj H.O &<br>Branches. (Siddhasramams) |
| Price | : | Rs. 160/- |

---

| | | |
|---|---|---|
| Third Edition | : | |
| Fourth Edition | : | 1981 |
| Fifth Edition | : | 1996 |

# సిద్ధవేదము

సిద్ధసమాజ స్థాపకులైన

## స్వామి శివానంద పరమహంసలు వారిచే

ఉపదేశింపబడిన

## మోక్షసూత్రము

ఓం




ఆరవ ముద్రణము

2013

ప్రకాశకులు

**సిద్ధసమాజం ప్రచురణ విభాగము**

సిద్ధసమాజం ప్రధాన కార్యాలయము,

వటకర, కోషిక్కోట్, కేరళ 673 104

# ప్రధాన కార్యాలయము

**సిద్ధసమాజం ప్రధానకార్యాలయము,**
సిద్ధసమాజం P.O, వటకర,
కోషిక్కోట్ జిల్లా, కేరళం రాజ్యం, 673 104

**శాఖలు**

1) **వటకర సిద్ధాశ్రమము,**
సిద్ధసమాజం P.O, వటకర,
కోషిక్కోట్ జిల్లా, కేరళం రాజ్యం, 673 104

2) **కాయణ్ణా సిద్ధాశ్రమము,**
చెరుక్కాట్ P.O, పేరాంబ్ర,
కోషిక్కోట్ జిల్లా, కేరళం రాజ్యం, 673 527

3) **ఇయ్యూర్ సిద్ధాశ్రమము,**
కురుమాత్తూర్ P.O, తళిపరంబ,
కణ్ణూర్ జిల్లా కేరళం రాజ్యం, 670 142

4) **మణ్ణార్క్కర సిద్ధాశ్రమము,**
పరుత్తిప్పళ్ళి P.O, కాట్టాక్కట,
తిరువనంతపురం జిల్లా, కేరళం, 695 574

5) **అమ్మంపాళయం సిద్ధాశ్రమము,**
అమ్మంపాలయం P.O, ఆత్తూర్,
సేలం జిల్లా, తమిళ్‌నాట్ రాజ్యం, 636 141

# ఆరవ ముద్రణమునకు పీఠిక

సిద్ధసమాజ స్థాపకులైన స్వామి శివానంద పరమహంసలువారి అనుగ్రహముతో చెప్పిన మహోన్నతమైన గ్రంథము (మోక్ష సూత్రము) అను గ్రంథముయొక్క ఆరవ ముద్రణమిది. దీనికి మునుపు ఉండిన ముద్రణములలో కనబడిన తప్పులను ఈ ముద్రణములో సరిపరిచియున్నది.

1948 సంవత్సరములో మలయాళ భాషలోనుండు సిద్ధవేద గ్రంథమను స్వాములువారు పరిశోదించి అనేక తత్వములను విపులముగా సామాన్య జనలకు కూడ అర్థమై గ్రహించుటకు సరిపరిచియున్నారు. అందువల్ల స్వాములువారు సరిపరిచిన మలయాళ భాషలోనుండు సిద్ధవేదమును అనుసరించి, ఈ ముద్రణమున సిద్ధవేదమను మెము సరిపరిచి యున్నాము.

సిద్ధవేదమునుంచి ప్రకాశింపతోకూడి వేదాంత తత్వ శాస్త్రరంగములో కొత్తగ ప్రకాశము నిచ్చేటివంటిది. వేదాంత సంబందమైన అనుష్ఠించివచ్చుచున్న పలు అసంబందమైన ఆలోచనములకు గణ్యమైన మార్పులు ఈ గ్రంథమూలముగా వచ్చినది. అనుగుణమైన సామాన్య లోకజనులలో తెలివి, ఉత్సాహము అపారమైయున్నది. గ్రంథమునుంచి వివిద భాషలలో గల ముద్రణములలో సామాన్య లోకజనలలో నుండి వచ్చుచున్న అంగీకరము ఇది స్పష్టపరించు చున్నది.

ఈ గ్రంథము అచ్చువేయుటకు, కాగితముల వెల, గ్రంథముయొక్క కొలత మరియు గ్రంథమునకు అట్టలు వేయుటవలనను ఖర్చులు ఎక్కువైనందున ఈ గ్రంథము యొక్క వెల ఎక్కువగా వేయవలసివచ్చినది.

సాధ్యమైనంతవరకు జనులకు గ్రంథము చేరుటయే గాక, కొత్త కొత్త వేదాంత తత్వములు ఉండునటువంటి ఈ అమూల్య గ్రంథమును శ్రద్ధతో చదివి, తత్వములను గ్రహించి యధార్థరీతిలో ఈశ్వరసేవ(సిద్ధవిద్య)చేసి సాయూజ్యము దొరుకున రీతి జీవించుటకు సర్వాత్మనా ప్రార్థన చేయు చున్నాము.

ఓం లోకశాంతి! లోకశాంతి!! లోకశాంతి!!!

సిద్ధసమాజం
వటకర
డిసెంబర్ 2013
(మలయాళము; 1189 వృచ్చికం)

జనరల్ ప్రెసిడెంట్
సిద్ధసమాజము

# సిద్ధ వేదము - జీవునియొక్క - చరిత్ర

ఓం




క్రోహ్, అప్పర్ పెరక్
23.3.1936

స్వామివారి ఆజ్ఞ

జనరల్ ప్రసిడెంట్‌కు

మీరు 7.3.36 తేదిగల వ్రాసిన కాగితములో "లోకశాంతి కోసము స్వామీజీ చేత, సమాజము చేత, స్వామీజీ ఫెడరేషన్ ఆఫ్ మలయా స్టేట్‌కు ఓడలో ప్రయాణమునకు బయలు దేరువరకు చేసిన అన్ని పనులు లోకశాంతికోర్కైన జీవితమను పుస్తకముయొక్క మూడవ ప్రచురణములో చేర్చి ముద్రించుటకు తయారు చేయబడి అచ్చు చేయుబడుటకు మీరు ఇచ్చియున్నారని" వ్రాయబడియున్నది. ఇదియనుగాక "జాతి అనగా ఏమీ?" అను పుస్తకముయొక్క వెనుక భాగమున ఉన్న అట్టపై "స్వామి పటముతో శివానందపరమహంసవారి జీవ చరిత్రతో లోకశాంతి కోర్కైన జీవితము ముద్రణములో ఉన్నట్లు

అచ్చుపడియుండుట కనపడినది. ఇది పూర్తిగా అర్థములేని పనియైయున్నది. మేము చేసియున్నదాని గురించి వ్రాయుట అకారణమైయున్నది. ఎందుకనగా మేము లోకమునకు చెప్పుటకు ఏమియు చేసియుండ లేదు. కాని వారంతటవారే బాగగుటకే చేసియున్నాము. అందు గురించి మరియొకరిని ప్రశంస చేయ అవసరము లేదు. అయినను మా గ్రంథములు పై మీరు వ్రాసిన దానిగురించి మేమేమియు చెప్పుట లేదు. మాయొక్క జీవచరిత్ర వ్రాసి ముద్రించుటకు ఇయబడిన అంశము అచ్చువేసి కనపడిన దానిపై మేము చెప్పవలసి యున్నది. ఏలనగా మనకు ప్రత్యేకమైన ఒక జీవుడు లేదు. ప్రామాణ్యముగలా మాయొక్క మూల సిద్ధాంతమును మీరు సరీగా అర్థము చేసికొనియుండినట్లయితే ఆవిదముగ మీరు వ్రాసియండేడివారు కారు. **జీవచరిత్ర అనగా జీవునియొక్క చరితయై ఉన్నది. శివానంద పరమహంసలువారికి ప్రత్యేకమైన ఒక జీవుడు లేదు. జీవుడు ఒకడే ఉన్నది. ఆ జీవునియొక్క చరిత్ర 'సిద్ధవేదము' అయియున్నది.** ఇది మీరు అర్థము చేసికొనియుండక పోవుట మాకు చాలా విచారము మిక్కిలి ఆశ్చర్యముగా ఉన్నది. కాబట్టి ఆ పుస్తకము అచ్చుపడక ఉండినట్లయితే అచ్చు వేయవద్దు. అచ్చుపడియున్నట్లయితే ప్రచురించుటకు ముందుగ ఆ ప్రత్యేక భాగము తీసివేయుము.

మూలము: మలయాళము

(పైన చెప్పబడినది సిద్ధసమాజ స్థాపకులైన స్వామి శివానంద పరమహంసలువారు; ఫెడరేషన్ ఆఫ్ మలయా స్టేట్ నుండి సిద్ధసమాజము జనరల్ ప్రసిడెంట్‌కు పంపిన ఆజ్ఞయై ఉన్నది. స్వాములవారి జీవచరిత్ర గురించి అనేకమైన ప్రశ్నలుండుటవలన వారిచ్చిన ఆజ్ఞ ఇక్కడ ప్రచురించుటయైనది.)

# విషయ సూచిక

# రెండవ ముద్రణమునకు పీఠిక

సిద్ధ వేదమను ఈ తత్వ గ్రంథము స్వామి శివానంద పరమహంస వారిచే ఉపదేశింపబడి. మొట్ట మొదట 1922 సం.లో మలయాళ భాషలో 5000 కాపీలు కళ్ళికోటయందలి మితవాది ముద్రాక్షరశాలలో ముద్రింపబడి ప్రచారము చేయబడి, తరువాత అరవభాషలో మొదటి ముద్రణముగా 2500 కాపీలు 1928 సం.లో కొయంబత్తూరులోని ఎలక్ట్రికల్ ప్రింటింగ్ వర్క్సు యందు ముద్రింపబడి ప్రచారముచేయబడి యున్నది. మొట్టమొదట సిద్ధవేదము నందు 21 అధ్యాయములు మాత్రమే యుండెను. తరువాత 1934సం.లో స్వామి వారు కన్నడభాషలో యింకొక అధ్యాయమునుగూడ జేర్చి 22 అధ్యాములుగా జేసి మొదటి ముద్రణముగా 2500 కాపీలు మంగళాపురము (Mangalore)లోని రథవీధియందలి మంగళూరు ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి ప్రచారము చేయబడి, అటు తరువాత కన్నడ భాషయందలి సిద్ధ వేదముననుసరించి అదేవిధముగా తెలుగుబాష యందు మొదటి ముద్రణముగా 1941 సం.లో 500 కాపీలు బెజవాడ యందలి ఆంధ్ర గ్రంధాలయము ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి ప్రచారము చేయబడినది. కాని మలయాళభాషయందును, అరవభాష యందు కాపీలు పూర్తి అయినందువలన పలుచోట్ల నుండి జనులకు కావలసియున్నట్లు స్వామి వారికి తెలియపరచుటవలన మలయాళము నందును, నము నందును సిద్ధ వేద పుస్తకములను స్వామివారు పరిశోధించి అన్ని అధ్యాయములందును క్రొత్తగా అనేక తత్వములను విపులముగా జేర్చిరి. అదియునుగాక తొమ్మిదవ యధ్యాయములో బ్రహ్మను గురించియు, సరస్వతినిగురించియు అతి విపులముగా తత్త్వములను జేర్చియుండిరి. అదియునుగాక క్రొత్తగా షడాధారములు బ్రహ్మానందము మొదలగువాటిని గురించి మిక్కిలి విశదముగా 22 వ అధ్యాయముగా జేర్చి రెండవ ముద్రణముగా అచ్చు వేయబడినది. మలయాలమునందును, అరవమునందును, మొదటి ముద్రణములో లేనటువంటి కొన్ని తత్వములు 22వ అధ్యాయమును క్రొత్తగా చేర్చి యుండుటవలన పాఠకులకు తెలియజేయు నిమిత్తము ఈ అవతారిక వ్రాయబడినది. ఇట్లే తెలుగుభాషయందు గూడ రెండవ ముద్రణము వేయవలసివచ్చినది.

S.విశ్వం ,
జనరల్ ప్రెసిడెంటు.

సిద్ధసమాజము.
(1948)

# సిద్ధ వేదము

సిద్ధ సమాజ స్థాపకులైన

**స్వామి శివానంద పరమహంసలు వారిచే**

ఉపదేశింపబడిన

**మోక్షసూత్రము**

" వందే పరబ్రహ్మ చిదాత్మకం స
ద్వందే గురుం శాంతము మేశమీశం
వందే శివానంద గురు ప్రవీరం
వందే సదాన్యానపి వందనీయాన్ "

" అనంతసుఖ దాతార
మఖండానర విగ్రహం
దయాళుమతి సంతుష్టం
వందేహం మమ సద్గురం "

# సిద్ధ వేదము

సిద్ధ సమాజ స్థాపకులైన

స్వామి శివానంద పరమహంస వారిచే

ఉపదేశింపబడిన

# మోక్షసూత్రము

ఓం తత్ సత్.

" రాగాదిరోగాన్ సతతానుషక్తా
న శేషకాయ ప్రసృతానశేషాన్
ఔత్సుక్యమోహా రతిదాన్జఘాన
యః పూర్వవైద్యాయ నమోస్తుతస్మై ॥

తాత్పర్యము:

దేహముల సమస్త భాగములలోను వ్యాపించి యెల్లప్పుడును విడువక స్నేహము, మోహము, మొదలగు దుర్వృత్తులను కలుగ జేసుకొనుచున్న రాగద్వేషాది మహారోగములు, ఎవరివలన సంపూర్ణముగా నాశనము చేయబడినవో అట్టి అసాధారణ వైద్యునకు నమస్కారము.



HIS HOLINESS

**SWAMI SIVANANDA PARAMAHAMSA**

FOUNDER OF SIDHASAMAJ

# సిద్ధవేదము

## మొదటి అధ్యాయము

శిష్యుడు : సద్గురూ! మాయాసముద్రమునందుండి కెరటములచే అటునిటు త్రోయబడి కష్టపడుచున్న నాకు అందుండి దరిజేరుటకు మంచిమార్గమును సూచింపవలయునని భక్తి విశ్వాసములతో అపేక్షించుచున్నాను.

గురువు : శిష్యుడా! మాయాసముద్రమునుండి ఎచ్చటకు దరిజేరుటకు మార్గమును చూపవలెను?

శిష్యుడు : సర్వశక్తుడైన ఈశ్వరుని జేరుటకు.

గురువు : ఈశ్వరుడని చెప్పునది ఇట్టిదని మీకు తెలియునా?

శిష్యుడు : ఈశ్వరుడనునది లోకమునందు సృష్టి, స్థితి, సంహారకర్తలగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని చెప్పుచున్నారు. వారిని అనేక విధములుగా అనేక క్షేత్రములందు ప్రతిష్ఠాదులుచేసి, పెక్కుమంది సేవించుచున్నారు. అందుచే ఆ ప్రకారమే ఉండునని నేను గ్రహించి యున్నాను.

గురువు : కాని అట్లే మీరును గ్రహించియున్న ఎడల, ఈశ్వరునికి సర్వవ్యాపకత్వము ఉన్నదనియా? లేదనియా మీ నమ్మకము ఏలాగు?

శిష్యుడు : ఈశ్వరుడు సర్వవ్యాపి, అనగా అంతటనిండి

ఉన్నాడని నా పూర్ణవిశ్వాసము.

గురువు : అయిన సర్వవ్యాపిగానుండు ఈశ్వరునకు నామ రూపములు కలుగుటకు అవకాశమున్నదా?

శిష్యుడు : ఈశ్వరునకు నామరూపములు కలిగినప్పుడు, సర్వవ్యాపకత్వము ఉండుటకు అవకాశములేదు. అందుచే ఈశ్వరునకు నామరూపములులేవనియే నేను తలచు చున్నాను.

గురువు : ఈశ్వరుడు నామరూపాదులు లేక సర్వవ్యాపి అనియేకదా మీరు చెప్పినారు. అప్పుడు ఈశ్వరుడు మనలో ఉన్నాడనియా, లేడనియా?

శిష్యుడు : ఈశ్వరునకు సర్వవ్యాపకత్వము ఉండుటవలన, మనలోకూడ ఉన్నాడు.

గురువు : మనలోనే ఈశ్వరుడు ఉన్నప్పుడు, మనలోలేడని, అట్టి ఈశ్వరుని బ్రహ్మయనియు, విష్ణువనియు, మహేశ్వరుడనియు సంకల్పించుటగాని లేక ప్రతిష్ఠ కాబడిన క్షేత్రములలోని బింబములలో ఉన్నాడనిగాని సంకల్పించునప్పుడు మనము ఎవరము? ఈశ్వర మతస్థులమా? నిరీశ్వర మతస్థులమా?

శిష్యుడు : సర్వ వ్యాపియగు ఈశ్వరుని ఎట్లు సంకల్పించినను అది ఈశ్వరమతమే అని చెప్పక, నిరీశ్వర మతమని చెప్పుటకు అవకాశములేదు.

గురువు : ఈశ్వరుడు మనలో లేనియెడల, మనకు ఏదినైనను

చూచుటకుగాని, మాట్లాడుటకుగాని, తెలిసికొనుటకుగాని సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముగాదు.

గురువు : దీనికి ఒక దృష్టాంతము చెప్పెదను. ఎట్లనగా, ఒక మనుష్యుడు చచ్చిపోయిన శవమగును. ఆ శవమునకు ఏదియైన వినుటకుగాని, చూచుటకుగాని, తెలుసు కొనుటకుగాని, మాట్లాడుటకుగాని, కదలుటకుగాని వీలగునా?

శిష్యుడు : సాధ్యముగాదు

గురువు : ఎందుచేత?

శిష్యుడు : దానిలో ఈశ్వరచైతన్యము లేకపోవుటచేత.

గురువు : కావున ఈశ్వర చైతన్యము లేనియెడల, మనకు ఎట్టి ప్రజ్ఞయును లేదు. ఈ కనబడు లోకము మొదలగు ఎట్టి అవస్థయును లేదు. అప్పుడు ఈశ్వరచైతన్యము వలననే, మనకు ఇవియన్నియు చూచుటకును, మాట్లాడుటకును, తెలిసికొనుటకును అవకాశమున్నది. అందువలన ఈశ్వరుడే దీనినంతయును తెలిసికొనువాడని నమ్మవలెను. అప్పుడు, ఈశ్వరుడైయుండు మనమే, "మనము కాదు ఈశ్వరుడు, బ్రహ్మయగును, విష్ణువగును, మహేశ్వరుడ గును. క్షేత్రములలోని బింబములలోని దిగును." అని అట్లు అనేక విధములుగా సంకల్పించుచున్నాము. ఈ ప్రకారముగా మనముకాదు వేరొకటని సంకల్పించు నప్పుడు, మనము ఈశ్వరమతస్థులమని చెప్పుటకు

సాధ్యమగునా?

శిష్యుడు : ఆ ప్రకారముగా ఆలోచించునప్పుడు మనము నిరీశ్వర మతస్థులచే అగుదుము.

గురువు : కావున మనలోనుండు ఈశ్వరశక్తిని బైటవిడువక, ఎవరు తమలోనే స్థాపించుదురో వారే ఈశ్వర మతస్థులమని చెప్పబడుచున్నారు.

శిష్యుడు : గురువర్యా! మనలోనుండు ఈశ్వరశక్తిని బైట విడువక మనలో ఏవిధముగా స్థాపింపవలెను? నాకా మార్గమును చూపవలసినదిగా ఆపేక్షించుచున్నాను.

గురువు : ఆ ప్రకారముగా మార్గమును చూపువారెవరు?

శిష్యుడు : వారే గురువులు.

గురువు : గురువనగా నెవరు?

శిష్యుడు : గురువనువారు ఈశ్వరుడని నా నమ్మకము.

గురువు : ఈశ్వరుడు ఒకప్పుడును గురువు అగుటకు సాధ్యముకాదు. ఎట్లనగా ఈశ్వరునకు నామరూపములు లేక సర్వవ్యాపియగు వస్తువని నీవే చెప్పినావు. అట్లుండే వస్తువు మననుండి భిన్నమై వేరైయున్నదా? అభిన్నమై యున్నదా?

శిష్యుడు : అది అభిన్నమై మనలను విడువనున్నది.

గురువు : ఆ ప్రకారము ఉండు వస్తువు మనకు గురువై వచ్చుటకు వీలులేదు. కారణమేమనగా, గురువని వచ్చు

నప్పుడు, గురువును మనము భిన్నముగా సంకల్పింప వలయును. అప్పుడు గురువు మనకు వైతైయుండును. ఆ ప్రకారము భిన్నమగునప్పుడు, ఈశ్వరుడు గురువై వచ్చుటకు వీలగునా? ఇదిగాక, ఈశ్వర చైతన్యము మనలోలేనియెడల మనము శవములగు చున్నాము. ఆ ప్రకారముగానుండు చైతన్య వస్తువు మనలోనుండి గురువై వేఱుగా వచ్చునప్పుడు మనము శవము లగుచున్నాముగదా! అట్లు చూచునప్పుడు ఈశ్వరుడు గురువై వచ్చుటకు వీలుకలదా?

శిష్యుడు : ఈ ప్రకారముగా ఆలోచించి చూచునప్పుడు ఈశ్వరుడు గురువై వచ్చుటకు వీలులేదు.

గురువు : ఈశ్వరుడు గురువు కాడనుటకు ఒక దృష్టాంత మేమనగా, ఈశ్వరుడున్నాడనియా? లేడనియా మీా నమ్మకము?

శిష్యుడు : ఉన్నాడనియే.

గురువు : అయితే, ఈశ్వరుడు ఒక సమయమున మాత్రమే ఉన్నాడా? లేక అన్ని సమయములందును ఉన్నాడా?

శిష్యుడు : అన్ని సమయములందును ఉన్నాడు.

గురువు : నీవు నిద్రించునప్పుడు కలడా?

శిష్యుడు : కలడు.

గురువు : ఆ సమయమున, గురువు నీ సమీాపమునకు వచ్చినచో నీకు తెలియునా?

శిష్యుడు : తెలియదు.

గురువు : నీవు నిద్రించు సమయమున ఈశ్వరుడున్నాడుకదా ? నీవు తెలిసికొనకుండుటకు కారణమేమో చెప్ప సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : కారణమేమనగ, ఈశ్వరునకు రెండువస్థలు గలవు. అవేవనగా 'సకళత్వము, నిష్కళత్వము.' ఈశ్వరునకు సకళత్వము సంభవించినప్పుడు, అతడు సగుణుడగుచున్నాడు. అప్పుడు వికారాదులు ఉద్భవించి, సృష్టి, స్థితి, సంహారాదులజేసి రాగద్వేషియై అణగియున్నాడు. ఎప్పుడు ఈశ్వరునకు నిష్కళత్వము సంభవించునో అప్పుడు నిర్గుణుడై, నిర్వికారుడై, సృష్టి, స్థితి, సంహారాదులు లేనివాడై, రాగద్వేషాదులు లేనివాడై కనపడును. దీని ననుసరించియే పై కనబరచిన అవస్థలు సంభవించును. ఈశ్వరుడు మనలోనేయున్నాడు. లేనియెడల శవములగుచున్నాము. దానికెట్టి బాధ్యతయు లేదు. ఈశ్వర చైతన్యము మనలోనున్నప్పుడే, అన్ని అవస్థలు కలుగుచున్నవి. ఎట్లనగా, మనలోనుండు ఈశ్వరశక్తి మనలో లయించి బైట వ్యాపింపకయున్నపుడు నిష్కళత్వము అగుచున్నది. ఇదియే నిద్రావస్థ. ఇట్టి అవస్థలో జీవుడుండియు ఏ ఒక్క కళంకము లేక నిర్మలుడై ఆత్మగానున్నాడు. దీనికి దృష్టాంతము: ద్రోహియు,

క్రూరుడును, కులపాతకుడుగానున్న వానికి గూడ నిద్రాసమయములో జీవుడున్నాడు. ఆ సమయమున జీవునకు ఏ ఒక్క కళంకమును లేదు. ఆ సమయమున జీవుడు నిష్కళత్వముతోనున్నాడు. ఆ జీవుడే శివుడు. ఇదియే **జీవశ్శివోహం** అను అవస్థ. ఈ అవస్థ తప్పి బైట వ్యాపించి మరొకటి అని ప్రతిబింబించినప్పుడు అది జీవుడు. ఆ ప్రతిబింబమునుండి బైట వ్యాపింపక, తనలో తాను లయించునప్పుడు శివుడగుచున్నాడు. అందుచేతనే **జీవశ్శివోహం** అని చెప్పుటకు కారణము. శివుడే ఈశ్వరుడు. ఆ ఈశ్వరునకే ముందు కనబరచిన అవస్థలు. అనగా నిష్కళత్వము కలిగినది. అప్పుడే ఈశ్వరుడు నిర్గుణుడగును. నిర్గుణమనిన గుణరహితమైనది. గుణములు :- సాత్వికము, రాజసము, తామసము ఈ మూడు గుణములు లేక వచ్చు స్థితికి నిర్గుణుడగును. అప్పుడు నిర్గుణుడై, నిర్వికారుడై, నిర్మోహియై రాగద్వేష రహితుడగుచున్నాడు. అదే మనకు నిద్రా సమయ ముననుండు అవస్థ. అప్పుడే మనలోనుండు ఈశ్వర చైతన్యము మనలో అణగి, నిర్గుణ, నిష్కళంక, నిర్వికారియై వెలయును. ఎప్పుడు నిద్ర మేల్కొని తన శక్తి బైట వ్యాపించునో అప్పుడు సకళత్వ మగుచున్నది. సకళత్వ మనగా కళలతో చేరునటువంటిది. అప్పుడు వికారియు, సగుణుడను అగుచున్నాడు. సగుణుడనగా

మూడు గుణములు కలిగిన వాడు. పై కనబరచిన మూడు గుణములు కలిగినప్పుడు, సృష్టి, స్థితి, సంహారాదు లగుచున్నవి. ఇవి అన్నియూ మనలోనె కలుగుచున్నవి. తాను లేనియెడల, ఏ అవస్థలును లేవు. కావున సకళుడగుటకు, నిష్కళుడగుటకు; సగుణుడగుటకు, నిర్గుణుడగుటకు; వికారియగుటకు, నిర్వికారియగు టకు, తనకు తానే కారణము, కావున తనకు తానే ఈశ్వరుడు. తానైయున్న ఈశ్వరచైతన్యము తనలొ తాను అణిగి, నిద్రావస్థలో ఉన్నప్పుడు ఈశ్వరచైతన్యము ఒక్కటె ఉన్నది. వేరొకటి లేక వెలయుచున్నది. ఇందుచేతనే నిద్రయందు గురువు సమీపములోనున్నను తెలిసికొన లేకుండుటకు కారణము. అయితే గురువు వచ్చెను అను సంకల్పము నీకెప్పుడు కలిగినది?

శిష్యుడు : నిద్ర నుండి మేల్కొనినప్పుడు.

గురువు : నిద్ర మేల్కొనినప్పుడు, సంకల్పమెక్కడనుండి కలిగినది?

శిష్యుడు : మనలో నుండియే.

గురువు : మనలోనెక్కడనుండి? నిద్రించుసమయమున నీవు లేవా? అప్పుడు సంకల్పము కలిగియున్నదా? నిద్ర మేల్కొన్నప్పుడు అదెట్లు కలిగినది?

శిష్యుడు : నిద్ర మేల్కొన్నప్పుడు నాకు వికారముకలిగి ఆ వికారము నుండి కలిగినది.

గురువు : వికారాదులెచ్చట నుండి కలిగినవి?

శిష్యుడు : జీవుని నుండి కలిగినవి.

గురువు : జీవుని నుండి ఏలాగు కలిగినవి? నిద్రించు సమయమున జీవుడు లేడా? అప్పుడు వికారాదులు లేవా? నిద్ర మేల్కొన్నప్పుడు నీకేమి కలిగినవి?

శిష్యుడు : సంకల్పము కలిగినది.

గురువు : ఆ సంకల్పమెక్కడనుండి కలిగినది?

శిష్యుడు : మనస్సులో నుండి కలిగినది.

గురువు : మనస్సు లేకున్న వేరేదైనా ఉన్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు, గురువను సంకల్పమెక్కడనుండి కలిగినది.

శిష్యుడు : మనస్సులో నుండి.

గురువు : అట్లయిన గురు వెవరు?

శిష్యుడు : మనస్సు

గురువు : 'సంకల్పశక్తి ఎవరికి కలదో వారే పురోహితులు' వారే గురువులు; దానికి ఉదాహరణము: ఒక క్షేత్రమును కల్పించి దానిలో సంకల్పము చేసెదరు. అక్కడ సంకల్పము కలుగజేసినవారే పురోహితులు; సంకల్ప శక్తి ఎవరికున్నదో వారే సంకల్పించేవారు. ఆ ప్రకారము ఉండువారికి, ఆ స్థానములోనే తంత్రియనియు,

పురోహితుడనియు చెప్పబడును. ఈ ప్రకారముగా మనకు ప్రపంచము అని సంకల్పము ఎక్కడనుండి కలిగినది?

శిష్యుడు : మనస్సునించి.

గురువు : సంకల్పశక్తి ఎవరికున్నది?

శిష్యుడు : మనస్సునకు.

గురువు : అయిన పురోహితుడెవరు?

శిష్యుడు : మనస్సే.

గురువు : ఆలాగైన మనకెన్ని గురువులు?

శిష్యుడు : ఒక్కడే గురువు.

గురువు : అది కాదు; వారివారి మనస్సు వారి వారికే గురువు. వేరే గురువు లేడు. కావున గురువు, శిష్యుడను అవస్థ లేదు. ఏలాగన, మనస్సు లేకున్న ఏ ఒకటియు లేదు. అన్నియు మనస్సు నుండియే ఉద్భవించుచున్నవి. కావున మనస్సే గురువు. అయితే, ఒకటి నుండి రెండు కలిగినదా? లేక రెంటినుండి ఒకటి కలిగినదా? నీ నమ్మకము యేమి?

శిష్యుడు : ఒకటి నుండియే రెండు కలిగినదని చెప్పుచున్నారు. అదియే నా నమ్మిక.

గురువు : అట్లయిన నీవు గ్రహించినది తప్పు. ఒకటి నుండి రెండు అగుట లేదు. రెంటినుండియే ఒకటి కలుగుచున్నది. దానికి కారణము: ఒకటియని చెప్పవలయుననిన. దానియొక్క ఆది అంత్యము

కనుగొనవలయును. ఆది అంత్యము కలిగినప్పుడే ఒక వస్తువని తీర్మానించనగును. ఆది అంత్యము లేకున్న ఒక వస్తువని తీర్మానించునప్పుడు అదియుండుటకు ఒక స్థానము కావలెను. ఆ స్థానము లేకున్న అది నిలుచుటకు వీలులేదు. అంత్యము కావలెనన్న దానిపైన ఒక బయలుండవలెను. బైటనుండి ఆకాశము లేకున్న అంత్యమనునది కలుగదు. ఆ అవస్థకు, ఆదిగానుండు వస్తువు నిలుచుటకు స్థానమైన యొకటి దిగువను, అంత్యము చూచుటకు బయలైన ఆకాశము మరొకటి పైన కలిగియుండవలెను. అప్పుడు రెండైనది. ఆ రెండింటిలో ఒకటి నిలబడునది. అదియునుగాక, భూమియని ఆకాశమని రెండవస్థలు లేనియెడల ఏ యొక్క వస్తువైనను కలుగుచున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : కావున అన్నియును రెండింటిలోనుండియే ఒకటి కలుగుచున్నది. దృష్టాంతరము: ఒక విత్తనమును దీసి చూచిన దానిలోనుండు మొలక కనబడదు. ఏలనగా, దాని లోన నిండి, అణగి, ఆది, అంత్యము లేకున్నది. దాని నుండి ఒక మొలక రావలయునన్న అది ఏలాగైె తీరవలయును?

శిష్యుడు : దాని ముఖము రెండై చీలవలయును.

గురువు : అప్పుడు ఆ మొలకైన ఒకటి యెక్కడ నుండి ఉద్భవించినది?

శిష్యుడు : రెండు నుండియే.

గురువు : ఆ విధముగనే మన జననమును రెంటిలో నుండియే. అదేలాగుననన, ఒక స్త్రీ లేకున్న పురుషునివలన సంతానముగాని, ఒక పురుషుడు లేకున్న స్త్రీ వలనగాని సంతానము కలుగుటలేదు. స్త్రీ, పురుషుల చేరిక చేతనే సంతానము కలుగచున్నది. కావున మనమును రెంటి నుండియే ఒకటై కలిగినాము. ఇది ఇట్లుండగా, ఒకటి ఎన్ని నుండి ఉద్భవించినది?

శిష్యుడు : రెంటిలో నుండి.

గురువు : రెండు లేకున్న?

శిష్యుడు : ఒకటి అనునదిలేదు.

గురువు : ఇదియే అద్వైతమనబడుచున్నది. అద్వైతమనగా ద్వైతరహితము అనగా రెండనునది లేనిది. అయితే రెండను అవస్థ ఎచ్చటనుండి కలిగినదనిన, తనలోనుండి తానే, తన శక్తికి చలనము కలిగినప్పుడు రెండను అవస్థ కలిగినది. తా నను నది అక్షరము. అక్షరమనగా క్షరరహితము. అనగా నాశనము లేనిది. మనము వినునది, చూచునది, కనబడునది, ఆది, అంత్యము యొక్క అన్ని అవస్థలును నశించునవి. ఏవస్తువు ఆది, అంత్యము లేకున్నదో ఆ వస్తువు నశించనది. ఆ వస్తువే ఈశ్వరుడు. అప్పుడు ఈశ్వరుడే తానై ఆది, అంత్యము లేనివాడై అక్షరమైయుండు దానిలోనుంచి బైట ఈ ఖాళీయైన ఆకాశము కలిగినది. ఆ ఆకాశములోనే తాను తానే శక్తియై

చలించును. అప్పుడు దానినుండి అన్ని అవస్థలును కలుగును. అప్పుడే బయలైయుండు ఆకాశమై, శక్తియై ఎప్పుడు చలించుచున్నదో అప్పుడది రెండైనవి. దానికే బ్రహ్మ మనియు, మాయయనియు చెప్పబడుచున్నది.

శిష్యుడు : ఓ గురు శ్రేష్ఠా! నాశరహితమైన వస్తువు నుండి బ్రహ్మమనియు, మాయయనియు రెండవస్థలు గలిగి నవని చెప్పినారుగదా! దీనినే మరల వివరింప వలయునని అపేక్షించుచున్నాను.

గురువు : ఆది, అంత్యము లేక నాశరహితమైన వస్తువు ఎప్పుడు ఆకాశముగానున్నదో అప్పుడు పైన దిగువ యను రెండవస్థలు కలుగుచున్నవి. వాటిలో పై నుండు వస్తువు బ్రహ్మము. దిగువనుండు వస్తువు మాయ. మాయ నుండియే సకలము ఉద్భవించుచున్నవి. చూచునది, వినునది, తెలిసికొనునది ఇవన్నియు మాయవలననే. అదే మన బ్రహ్మమై, తానై యుండు వస్తువునకు చలనము కలిగినది. ఆ చలనమే మాయ అనబడును. మాయయను మనశక్తి ఎప్పుడు మనలో లయించు చున్నదో అప్పుడు ఏదియును లేదు. బ్రహ్మయను అవస్థయును లేదు. తనకు చలనము కలుగు సమయమున, బ్రహ్మయను అవస్థ కలుగుచున్నది. అదేభ్రాంతి! ఎప్పుడు భ్రాంతియను చలనము మనలో లయించుచున్నదో, అప్పుడు ఆది, అంత్యము లేక శబ్దాతీతమై, అగోచరమై, శూన్యపదవి యగు ఆనందము కలుగుచున్నది. అప్పుడే బ్రహ్మమను

అవస్థ లేదు. కావున శబ్దాదులు మొదలగు అన్ని అవస్థలు మాయ నుండియే కలిగినవి. మాయయనునదేది? అది ఒకటియు లేనిదేనా? అదేదనగా, ఈ కనబడు చరాచరములు లోకమున మాయయని చెప్ప బడుచున్నవి. ఇది సరికాదు. మాయలోనే అన్ని అవస్థలు ఉన్నవి. అన్నిటికి మూలము మాయయే. మాయలేకున్న ఏదియులేదు. అదేలాగనగా ఇదిగో ఒక దీపము. ఈ దీపమును చేయుటకు, తీసికొనిపోవుటకు, తుడుచుటకు, మరియు అనేక విధములుగా ఉపయోగించుటకు భూమి ఆధారముగా నున్నది. భూమిలేకున్న దీనిని చేయుటకు, తీసికొనివచ్చి పెట్టుటకు, లేక తీసికొనిపోవుటకు, తుడుచుటకు, ఏదొకటియు సాధ్యపడదు. కాని ఈ దీపమును భూమియని చెప్పుటకు వీలులేదు. భూమికి భూమి యనియు, దీపమునకు దీపమనియే పేరు. పై జెప్పిన ప్రకారము దీపమును చేయుటకు, నిలుపుటకు, భూమియే పీఠమైయున్నది. ఈ విధముననే, ఏదొకటియు కలుగుటకు, నశించుటకు, చూచుటకు, ఉత్పత్తి చేయుటకు, నాశనము చేయుటకు, వీనికన్నిటికి ఆధారము మాయయే. మాయలేనియెడల ముందు చెప్పినదేదియు కలుగుటకు వీలుపడలేదు. కనుక ఈ కనబడు చరాచరములన్నియు మాయలోనే ఉన్నవి. మనము చూచునవన్నియు మాయకాదు. అయిన మాయయనునది ఏదొకటి ఉండియు లేకపోవుచున్నదో, అదియే మాయ. అదే మనగా, పైన జెప్పిన ఏదొకటి

శిష్యుడు : కాదు.

గురువు : అది ఎందువలన?

శిష్యుడు : చనిపోయినందువలన.

గురువు : చనిపోయినప్పుడు దానిలో లేకుండపోయిన దేది?

శిష్యుడు : బుద్ధిలేకుండ పోయినది.

గురువు : బుద్ధి లేకపోవుటకు కారణమేమి?

శిష్యుడు : జీవుడు లేనందువలన.

గురువు : జీవుడులేడని ఏవిధముగా తీర్మానించితివి?

శిష్యుడు : ఏవిధమైన చేష్టగాని, చలనముగాని లేనందువలన.

గురువు : ఒకడు నిద్రించునప్పుడు వానికి చేష్టయు, చలనముగాని కలవా?

శిష్యుడు : లేవు.

గురువు : కాబట్టి అతడు చనిపోయినాడని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : వానికి జీవుడున్నందువలన.

గురువు : అట్లయిన, వానికి జీవుడున్నాడని ఏ విధముగా తీర్మానించితివి?

శిష్యుడు : వానికి ఉచ్ఛ్వాస, నిశ్వాసాదులున్నందు వలన.

గురువు : చనిపోయినాడని ఏకారణము వలన తీర్మానించితివి?

శిష్యుడు : శ్వాసగతి లేనందువలన.

గురువు : కనుక జీవశక్తిగానుండు వాయువు మనలో నుండునప్పుడు మాత్రమే మనకు తెలివికద్దు మనలోనుండు జీవశక్తియైన వాయువు మనలో కొంచెముగూడ లేని సమయమున మనకు ఏ తెలివియులేదు. అదెట్లనగా, ఒకని మరణ సమయమున పై శ్వాసముతీసి, భ్రూమధ్యమునకు కొంత దిగువ భాగమున రవంత జీవుడుమాత్రమే అచ్చటయుండునప్పుడు, కనులతోను, ముఖముతోను చేష్టలు చూపుచున్నాడు. మిగత అవయవములను కదలించుటకు సాధ్యపడదు. ఆ జీవశక్తియగు వాయువు బైటికిపోగానే, ఆ పీనుగ చేష్ట కదలిక లేక ఒక మ్రానుముక్క తీరున, ఎచ్చట దొర్లించినను దొర్లును. అగ్ని లోనుంచినను రగులును. అప్పుడు దానికెట్టి తెలివియు లేదు. అందుకు కారణమేమి?

శిష్యుడు : దానిలో జీవశక్తియగు వాయువులేనందు వలన.

గురువు : అదియునుగాక ఒకడు నిద్రించు సమయమున వానిలో వాయువు గతాగతము చేయుచున్నదా?

శిష్యుడు : చేయుచున్నది.

గురువు : ఆ సమయమున వానిని తట్టి లేపినచో?

శిష్యుడు : అతడు తెలిసికొనుచున్నాడు.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : వానిలో వాయువు గతాగతము చేయుట వలన.

గురువు : శవమునందు వాయువు గతాగతము చేయుచున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : శవమును తట్టిన, దొర్లించిన, నిప్పులో నుంచినను దానికి తెలివికద్దా?

శిష్యుడు : లేదు

గురువు : ఎందువలన?

శిష్యుడు : దానిలో వాయువు గతాగతము చేయనందున.

గురువు : అప్పుడు బుద్ధియను వస్తువేది?

శిష్యుడు : జీవశక్తియగు వాయువు.

గురువు : అదియునుగాక నీవు ఐదుదినముల క్రిందట ఒక విషయమును గురించి ఆలోచించినావు. దానిని నీవు మరచితివి. నీవు దానిని మరల జ్ఞప్తికి తెచ్చుటకు ఏమి చేయవలయును?

శిష్యుడు : దానిని గురించి ఆలోచింపవలయును.

గురువు : ఆలోచించు సమయమున, నీశ్వాసగతి నీలోనే అణగియున్నదా? లెక బైటకు పోవుచున్నదా?

శిష్యుడు : బైటకు వెళ్ళక నాలోనే అణగియున్నది.

గురువు : అట్లు దీర్ఘముగా ఆలోచించు సమయమున నీ ముందుగా పోవుచున్నవానిని నీవు చూచుటకో, కనుగొనుటకో వీలగునా?

శిష్యుడు : వీలుకాదు

గురువు : ఎందువలన?

శిష్యుడు : ఆ సమయమున నా ఆలోచన వేరొకటిపై లేక నాలోనే అణిగినందువలన.

గురువు : కాని, నీవును, మరొకడును ఒక విషయమును గురించి మాట్లాడుచున్నారు. అట్లు మాట్లాడుకొనుచుండు సమయమున వేరొకడు మీ ముందునుండి వెళ్ళిన వానిని చూచుటకు, కనుగొనుటకు వీలగునా?

శిష్యుడు : వీలగును.

గురువు : దానికి కారణమేమి? మీ ఆలోచనయంతయు, మీ సంభాషణలో ఉండలేదా?

శిష్యుడు : అందే ఉండెను. కాని నా మనస్సు అప్పుడు బైట వ్యాపించియుండెను. పై జెప్పిన ఆలోచన సమయమున నా మనస్సు నాలోనే అణగి నిలిచి ఆలోచన చేసినది. కావుననే ఎదురుగ పోయినవానిని చూచుటకు, తెలిసికొనుటకు సాధ్యము లేకపోయినది.

గురువు : ఆ మనస్సు బైట వ్యాపింపక ఆ సమయమున నీలోనే అణగియుండుటకు కారణమేమి?

శిష్యుడు : నా మనస్సు ఒక విషయముపై స్థిరముగా ఆలోచించినందువలన అణగిపోయినది.

గురువు : అదెప్పుడు నీలో అణగినది అట్లు అణగినందుకు కారణమేమో చెప్ప సాధ్యమగునా?

శిష్యుడు : పై జెప్పిన కారణము తప్ప వేరొకటి నాకు తెలియదు.

గురువు : అయితే నీ ఆలోచన సమయములో నీగతి నీలో అణగినదనియు బైట వ్యాపింపలేదనియు నీవు చెప్పినావు. ఆ గతియనునది జీవశక్తియైన వాయువు. అట్టి జీవశక్తి బైట వ్యాపించుటచేత వాయువని పేరు గలిగెను. వాయువు అనగా చలనము. ఆ చలనము నుండియే విచారములు కలుగుచున్నవి. ఈ విచారములకే మనస్సు కర్త. చలనముగలవస్తువు నీలో అణగిన సమయమున నీ మనస్సు నీలో అణగినది. అందువలననే నీకు ఏదొకటిని చూచుటకు, కనుగొనుటకు వీలులేకుండెను. అప్పుడు మనస్సులో నుండి బైట చలనమగుచుండు శక్తికే వాయువని చెప్పబడుచున్నది. అది మనస్సులో నుండి బైటకుపోక, మనలోనే గతాగతము చేయుచు, బ్రహ్మ రంధ్రమును తాకుచుండు సమయమున దానికి సమీరణమని పేరు. సమీరణమనిన బ్రహ్మరంధ్రములో ఈరాణము చేసియుండునది లేక ముట్టుకొని ఉండునది. బ్రహ్మమనునది ఏదియనగా నిత్యముగా నుండు వస్తువు. ఆ వస్తువులో కలసి వేరుపడక ముట్టుకొనియుండు స్థితియే ఈరాణము. ఈ ప్రకార ముగానుండు గతి అనగా

మనలోనే పైకి, క్రిందకు నడచుచు బైటకుపోకుండ బ్రహ్మరంధ్రములో ముట్టుకొని యుండు స్థితి సమీరణ్ అనబడును. ఆ విధముగాక బైట చలనమగు గతికి వాయువని పేరు. కాబట్టి, ఎప్పుడు మన శక్తి మనలో లయించునో ఆ సమయమున మరొకటిని కనుగొనుట లేదని మనకు దృష్టాంతము కనబడుచున్నది. మనస్సు చలనమైనప్పుడే మనకు అన్ని అవస్థలు కలుగుచున్నవి. అది తప్ప మన చలనము మనలో నిలిపి ఆలోచించు సమయమున మనకు బుద్ధి కలుగుచున్నది. అదెట్లనగా, ఆలోచించు సమయమున విషయము జ్ఞాపకము వచ్చుటకు తెలివియై ఎక్కడ నుండి జ్ఞాపకము కలుగుచున్నదనగా ప్రకాశమునుండి. ప్రకాశమెక్కడ నుండి కలుగుచున్నదనగా అగ్నిలోనుండి. అగ్ని వాయువులో నుండి. అప్పుడు వాయువై, అగ్నియై, ప్రకాశమై, బుద్ధిగానుండి మన జీవశక్తి మనలో అణగినప్పుడే మనకు తెలివి కలుగుచున్నది. అప్పుడు బుద్ధియను వస్తువేది?

శిష్యుడు : జీవశక్తి.

గురువు : బుద్ధియై జీవశక్తియైన వస్తువు మనలోనుండి చలనమై వాయువు బైటకు పోవుచుండునది మాయ యనబడును. ఏదొకటి లేకుండ పోవుచున్నదో అది మాయయని చెప్పుటకు కారణము. ఏదొకటి అనునది బుద్ధి. ఆ బుద్ధి వాయురూపముగ బైటకుపోయి

నశించుటకు మాయయని పేరు. దీని వలననే మన యొక్క మాయయనియు, అది మనలోనుండి ఉద్భవించినదని చెప్పుటకు కారణము. తాను అనిన ఎవరని నీవు ఆలోచించితివి?

శిష్యుడు : తా, అనిన అతడు.

గురువు : అప్పుడు మాయయొక్క ఉద్భవము ఎక్కడ నుండి?

శిష్యుడు : వాని, వానిలోనుండియే.

గురువు : అయితే మాయయనునది మునుపు జెప్పిన ప్రకారము ఉద్భవించినది. దానికి పిమ్మటనే మనస్సు యొక్క ఉద్భవము. ఆ మనస్సే గురువు!



# రెండవ అధ్యాయము

శిష్యుడు : గురూ! ప్రపంచమనునది వానివాని మనస్సే యనియు, ఆ మనస్సే గురువనియు చెప్పినారుగదా! అట్లయిన, ప్రపంచమే మనకు గురువై వచ్చుచున్నదిగదా?

గురువు : అవును. కాని, నీవు గ్రహించిన ప్రకారముకాదు. ఏలాగనిన, పై అధ్యాయములో వివరించిన ప్రకారము మాయనుండియే రెండవస్థలు ఉద్భవించినవి. మొదటిది కారణము. రెండవది కార్యము. ఈరీతిగా రెండవస్థలు చేరు సమయముననే ప్రపంచము కలుగుచున్నది. దానిలో కార్యమననుదేది? కారణమనునదేది? అని మనము కనుగొనవలయును. కార్యమనునది, ఏదొకటి అనుభవ ములోవచ్చి, ఫలమైవచ్చి ఏదొకటి దొరకునో, అది కార్యము. ఏ విధముగా అనుభవములో వచ్చుచున్నదో, అది దొరుకుటకు ప్రయత్నమేదో అది కారణమైయున్నది.

శిష్యుడు : స్వామి! లోకము లేనియెడల ఈ రెండవస్థలు గలుగునా?

గురువు : లోకమనునది ఏలాగున్నదని నీకు తెలియునా?

శిష్యుడు : తెలియదు.

గురువు : అట్లయిన, లోకమనునది మూడవస్థలైయుంటున్నది.

అవి చూచునది, వినునది, తెలిసికొనునది. ఇది తప్ప లోకమే లేదు. ఏలననగా చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు లేని యెడల, ఇక వేరేలోకము అను అవస్థ ఏమున్నది?

శిష్యుడు : వేరేదియును లేదు.

గురువు : కాబట్టి ఈ మూడవస్థలే లోకము. ఈ మూడవస్థలు మనకేమైనది. కార్యమైనదా? కారణమైనదా?

శిష్యుడు : కార్యమైనది.

గురువు : అప్పుడు లోకమును చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు మనకేమి కావలయును?

శిష్యుడు : మనస్సుండవలయును.

గురువు : మనసు లేకున్న ఏదొకటి చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు కారణమేది?

శిష్యుడు : మనస్సు.

గురువు : అప్పుడు మనస్సు కారణము మఱి మిగిలివన్నియు కార్యము అయినది. అదేలాగనగా, నీకు ఇప్పుడు హఠాత్తుగా పదిరూపాయలు కావలసివచ్చినది. ప్రస్తుతము నీ చేతిలో లేవు. నీ స్నేహితుడగు మరొకనివద్ద నున్నట్లు తెలిసినది వానివద్దనుండి డబ్బు లభింప వలెననిన నీవు ఏమి చేయవలెను?

శిష్యుడు : వానిని అడుగవలయును.

గురువు : అడిగినప్పుడు లభించినది. వాని వద్ద లభించినది కార్యమా? కారణమా?

శిష్యుడు : కార్యమైనది.

గురువు : అట్లు దొరుకుటకు కారణమేమి?

శిష్యుడు : కావలెనని అడుగుట.

గురువు : అప్పుడు ఏది మనకు దొరకునో అది కార్యమును, అది లభించుటకు చేయు ప్రయత్నమేదో అది కారణమును అగును. అప్పుడు ఆ యత్న మేమైనది?

శిష్యుడు : అడుగుట యైనది.

గురువు : ఆ అడుగుట నీకెక్కడినుండి వచ్చినది?

శిష్యుడు : మనస్సులో నుండి.

గురువు : అప్పుడు కారణమేది?

శిష్యుడు : మనస్సు.

గురువు : కారణమనునది వానివాని మనస్సును కార్యమననుది లోకమునై యున్నది. లోకమనునది సర్వచరాచరములను అణగినదైయున్నది. అనగా బ్రహ్మ మొదలు చీమ వరకు ఉండునది. అట్లుండగ బ్రహ్మయని ఒకనిని మీరు గ్రహించితిరిగదా? బ్రహ్మ మీకు ఒక ఉపదేశమును చేయును. దానిని మీరు అభ్యాసము చేయని ఎడల ఫలము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : చీమ మీకొక ఉపదేశము నిచ్చును. దానిని మీరు అభ్యాసము చేయనియెడల?

శిష్యుడు : ఫలము దొరకదు.

గురువు : బ్రహ్మ ఇచ్చిన ఉపదేశమును సరిగా చేసిన యెడల?

శిష్యుడు : దానికి ఫలము దొరుకును.

గురువు : చీమ ఇచ్చిన ఉపదేశమును సరిగా చేసిన యెడల?

శిష్యుడు : దానికిని ఫలము దొరుకును.

గురువు : అప్పుడు బ్రహ్మను, చీమను వ్యత్యాసముగా తలచుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : అదేలాగున బ్రహ్మ ఇచ్చిన ఉపదేశమని, గొప్పదని, సృష్టికర్తయని తలచి దానిని చేయని యెడల దాని ఫలము దొరకదు. చీమ ఇచ్చిన ఉపదేశమును గ్రహించి, దానిని అల్పజీవిగా తలచక దానిని చేసిన ఫలము దొరకకను పోదు. కాబట్టి బ్రహ్మకును, చీమకును వ్యత్యాసము లేదని చెప్పుటకు కారణము. అప్పుడు మనకు ఫలము దొరకుట ఎక్కడ నుండి?

శిష్యుడు : మన ప్రవర్తనలో నుండి.

గురువు : అటువంటి ప్రవర్తన ఎచ్చట నుండి కలిగినది?

శిష్యుడు : మనస్సు నుండి.

గురువు : మనస్సు లేనియెడల ప్రవర్తన, బ్రహ్మ చీమ, లోకము ఏదొకటియు కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : కాబట్టి బంధమోక్షములకు మనస్సేకారణమనియు, గురుశిష్యుడను భేదము లెదనుటకు కారణము. వాని వానికి వానివాని మనస్సే గురువు. అటువంటి మనస్సైన గురుస్థాన మెక్కడో చెప్పుము?

శిష్యుడు : అది నా హృదయము.

గురువు : హృదయమను స్థానమేది? దానిని తాకిచూపుము?

శిష్యుడు : ఇదిగో నా వక్షస్థలము మధ్యనుండు గుండియ.

గురువు : అదెప్పుడు హృదయముకాదు. హృదయమని చెప్పబడునది మనస్సు యొక్క స్థానము కదా!

శిష్యుడు : అవును.

గురువు : అయితే మనస్సులేనియెడల ఏద్దైన సృష్టి కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : అయితే ఈ దినమున పుట్టిన బిడ్డకు మనస్సు కలదా? లేదా?

శిష్యుడు : కలదు.

గురువు : అది ఏడ్చుచున్నది, మరియు పాలు త్రాగుచున్నది కదా?

శిష్యుడు : అవును.

గురువు : కాని ఈ బిడ్డ నిద్రించునప్పుడు పాలు త్రాగునా? ఏడ్చుచున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : అప్పుడు దానిలో ఏదొక స్మరణ లేదు.

గురువ : అప్పుడు దానికి కారణమేమి? అప్పుడు దానిలో ఏమి లేదు?

శిష్యుడు : అప్పుడు దానిలో ఏమియులేదు.

గురువు : దానిలో ఏమియులేదని చెప్పవచ్చునా? ఏమియు లేనియడల అది శవముకదా? కాబట్టి అందులో ఏమున్నది?

శిష్యుడు : జీవుడున్నాడు.

గురువు : కాని జీవుడు మాత్రముండునప్పుడు, ఈ విధముగా ఏదైన వినుటకు, చూచుటకు, తెలిసికొనుటకు సాధ్య మగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : జీవుడు ఏదైన వినుటకు, చూచుటకు, తెలిసి కొనుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : జీవునకు ఏదైనను చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు ఏమి ఉండవలయును?

శిష్యుడు : మనస్సుండవలయును.

గురువు : మనస్సు లేనియెడలఏదైన చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు వీలగునా?

శిష్యుడు : వీలుపడదు.

గురువు : నిద్రించునప్పుడు ఉండినదా?

శిష్యుడు : ఉండియుండెను. కాని నిద్రించునప్పుడు మనస్సు అణగిపోయినది.

గురువు : ఎక్కడ అణిగిపోయినది?

శిష్యుడు : దానిలోనే అణగిపోయినది.

గురువు : అయిన దానిలోనే అణగుటకు ఏమి ఉండవలయును?

శిష్యుడు : జీవుడుండవలయును.

గురువు : జీవుడు లేని యెడల మనస్సు ఉన్నదా?

శిష్యుడు : ఉండదు.

గురువు : అప్పుడు మనస్సు ఎక్కడ నుండి వచ్చినది?

శిష్యుడు : జీవుని నుండియే.

గురువు : కాబట్టి నిద్రించు సమయమున మనస్సు జీవునిలో

లయించి ఏదొకటి లేకపోయినది. అదెట్లనగా, ఒక పాత్రను కొంచెము నీటితో తెచ్చి ఇక్కడ ఉంచి, దానిలో ఉప్పునుంచిన అది ఏమగును?

శిష్యుడు : ఆ ఉప్పు నీటిలో కరగి లయించినది.

గురువు : ఇదే విధముగా నిద్రించు సమయమున మనస్సు జీవునితో లయించి, జీవరూపము మాత్రమే అయి, వేరొకటి లేకపోయినది. అయితే మనస్సు జీవునిలో లయించుటకు కారణము ఏవిధముగా ననగా ఉప్పు నీటిలో లయించుటకు కారణమేమని తెలిసికొన వలయును. కాబట్టి ఉప్పు ఎక్కడ నుండి ఉద్భవించినదని తెలిసికొనినప్పుడు మాత్రమే, ఉప్పు నీటిలో లయించిన కారణము తెలిసికొనుటకు సాధ్యపడును. కాబట్టి ఉప్పు ఎందులోనుండి తయారైనది?

శిష్యుడు : ఉప్పు నీటిలో నుండి వచ్చినది.

గురువు : అప్పుడు ఉప్పు యొక్క స్వరూపమేది?

శిష్యుడు : జలరూపము.

గురువు : కాబట్టి ఉప్పు నీటిలో నుండి తయారైనది. కాబట్టి ఉప్పుయొక్క స్వయరూపము జలమైయున్నది. ఆ జలమునుండి వచ్చిన ఉప్పు, తాను తయారైనదానిలో చేరునప్పుడు, అదే రూపమై వేరు రూపము లేకపోవును. ఈ విధముగానే జీవుని నుండియే మనస్సు కలుగునది. ఆ మనస్సు తాను ఉద్భవించిన జీవునిలో జేరు సమయమున

జీవునిలో లయించి, వేరేమియు లేక జీవరూపము మాత్రవేం అయినది. అందువలననే నిద్రించు సమయమున ఏదొకటియు వినుటకు, చూచుటకు, తెలిసికొనుటకు సాధ్యము లేకపోయినది. అయితే ఆ బిడ్డ నిద్రనుండి లేచినప్పుడు ఏడ్చుట, పాలు త్రాగుట చేయుటలేదా?

శిష్యుడు : చేయుచున్నది.

గురువు : మనస్సు లేనియెడల ఏడ్చుటకు; పాలు త్రాగుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : అది ఏడ్చుచున్నది. పాలుత్రాగుచున్నది. కాని పాలు ఏలాగు కలుగుచున్నది. ఎక్కడ నుండి దొరకుచున్నది; వీటిని గురించి ఆలోచించుటకు, ఆ బిడ్డకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : దానికి శక్తిలేనందున.

గురువు : శక్తిలేదని చెప్పరాదు. ఏలననగా, శక్తి లేకున్న, ఏడ్చుటకు, పాలు త్రాగుటకు సాధ్యపడదు. అయితే ఆలోచన ఎచ్చుట నుండి కలుగుచున్నది?

శిష్యుడు : మనస్సు నుండి.

గురువు : ఆలోచించుటకు ఏమి కావలయును?

శిష్యుడు : మనస్సుండవలయును.

గురువు : మనస్సున్నను, ఆలోచించుటకు సాధ్యము కాదు. ఏలననగా, ఆ బిడ్డ ఏడ్చునప్పుడు, పాలు త్రాగునప్పుడు దానికి మనస్సులేదా! అప్పుడు దానికి ఆలోచించుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యమగుట లేదు?

గురువు : దానికి కారణమేమి? సాధారణముగా బిడ్డలకు ఏదిలేదని చెప్పుచున్నారు?

శిష్యుడు : బుద్ధి లేదని చెప్పుచున్నారు.

గురువు : అప్పుడు బుద్ధిలేని యెడల, ఆలోచించుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యమగుట లేదు.

గురువు : అప్పుడు ఆలోచించునదేది?

శిష్యుడు : బుద్ధి.

గురువు : బుద్ధిలేకున్న ఆలోచించుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు ఆలోచించునది బుద్ధి. అటు వంటి బుద్ధి అనేక కార్యములగురించి ఆలోచించు చున్నది. ఆ ప్రకారముగా ఆలోచన చేయుటకున్న కార్యములు ఎచ్చట ఉండవలెను?

శిష్యుడు : మనస్సున.

గురువు : అప్పుడు మనస్సు అనేక కార్యములను గురించి ఆలోచించుటకు ఒక స్థానమైనది. అటువంటి మనస్సు అను స్థలములో బుద్ధివెళ్ళి ఆలోచించుచున్నది. ఆ మనస్సు యొక్క స్థానమేదియనగా, మీకు ఒక కార్యమును గురించి ఆలోచన చేయు సమయమున, మీ ఆలోచనమును, కన్నులచూపును ఏప్రక్కన వెళ్ళు చున్నది?

శిష్యుడు : పై భాగమునకు.

గురువు : ఆలోచన ఎచ్చట నుండవలయును?

శిష్యుడు : మనస్సున.

గురువు : అప్పుడు మనస్సునకు స్థానము, దిగువ స్థానమున నుండు గుండికాయ మధ్యలో నుండిన, ఆలోచన పై భాగమునకు పోవుటకు కారణమేమి? వక్షస్థలము మద్యను గదా చూడవలసినది!

శిష్యుడు : అవును , ఆ గుండియనే చూడవలయును.

గురువు : అయిన ఆలోచించు సమయమున, అలాగ ఎవరైన చూచుటకద్దా?

శిష్యుడు : అట్లెవరును చూచుట లేదు.

గురువు : ఇదిగో ఈ గృహము లోపలిభాగమున ఉత్తరము ప్రక్కన ఒక సామానునుంచి అవసరము వచ్చినప్పుడు

దక్షిణభాగములోనుండు ఒక గదికి వెళ్ళి చూచిన అదిదొరకునా?

శిష్యుడు : దొరకదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : పెట్టిన స్థానమున చూడనందున.

గురువు : పెట్టిన స్థానమును విడిచి వేరొక స్థానమున చూచిన దొరకునా?

శిష్యుడు : దొరకదు.

గురువు : అప్పుడు మనము ఆలోచించు కార్యము, ఎచ్చట నుండవలయును? ఇదే విధముగనే మనముఏదైన కార్యమును ఆలోచించుటకు భద్రపరచుటకు స్థాన మెక్కడ?

శిష్యుడు : మనస్సున.

గురువు : కావున, మనము ఆలోచించు కార్యములను భద్రపరచు స్థానము మనస్సు. అందువలననే మనస్సు నకు స్థానము భ్రూమధ్యమని చెప్పుటకు కారణము. భ్రూ అనునది ఏదనగా, ఈ రెండు కనుబొమ్మలు. వీటి మధ్యభాగమునే భ్రూమధ్యమనునది. అదే మనస్సునకు స్థానము. ఆ స్థానమునకే హృదయ మనబడును. ఆ హృదయము, మీరు అంటిచూపిన గుండియలో నుండిన అచ్చట మూయుటకు, తెరచుటకు, ఏదైన ఉన్నట్లు

కనబడుచున్నదా?

శిష్యుడు : కనబడుట లేదు.

గురువు : హృదయము లేనియెడల మనలో ప్రకాశమున్నదా? మరియు ఏదొకటిని చూచుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు ప్రకాశించుట ఎచ్చట నుండి?

శిష్యుడు : హృదయము నుండి.

గురువు : నీవు గ్రుడ్డివారిని చూచి యున్నావా?

శిష్యుడు : చూచియున్నాను.

గురువు : వారికేదైన ప్రకాశమున్నదా? అదియును గాక వారికి చూచుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : దానికి కారణము ఏమి? వారికి కండ్లు గ్రుడ్డియా? హృదయము గ్రుడ్డియా?

శిష్యుడు : వారికి కన్నులు గ్రుడ్డి

గురువు : హృదయము మీరు చెప్పిన స్థానమైన అచ్చట నుండి ప్రకాశించుచున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : కండ్లు గ్రుడ్డికనుక.

గురువు : మీ కిప్పుడుకన్నులు గ్రుడ్డియా?

శిష్యుడు : లేదు.

గురువు : మీకు ప్రకాశము లేదా? మరియు మీరు ఇవన్నియు చూచుట లేదా?

శిష్యుడు : ప్రకాశమున్నది. చూచుచునుయున్నాను.

గురువు : కన్నులు మూసిన మీకు ప్రకాశముగాని, ఏదైన చూచుటగాని వీలగునా?

శిష్యుడు : లేదు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : కన్నులుమూసినందువలన.

గురువు : కన్నులు మూసిన ఏమైనది?

శిష్యుడు : చీకటైనది.

గురువు : ఎందువలన? మీ కన్నులా మూయబడినది, లేక హృదయమా మూయబడినది?

శిష్యుడు : కన్నులు మూయబడినవి.

గురువు : మీరు చెప్పినట్లు హృదయము, గుండియ మధ్యనుండిన ఎడల చూచుటకు ఏల వీలులేక పోయినది?

శిష్యుడు : కన్నులు మూసినందువలన.

గురువు : కన్నులు తెరచినచో?

శిష్యుడు : ప్రకాశము కలుగును.

గురువు : అట్టి ప్రకాశము మనకు ఎచ్చట నుండి కలుగుచున్నది?

శిష్యుడు : పై నుండి.

గురువు : అప్పుడు ఎట్లుచూచినను, పైనతప్ప క్రింద నుండి ప్రకాశము కలుగుటలేదు. అదియుగాక రాత్రియైన మన కేమగుచున్నది?

శిష్యుడు : చీకటి యగుచున్నది.

గురువు : పగలైన?

శిష్యుడు : వెలుతురగుచున్నది.

గురువు : వెలుతురెచ్చట నుండి కలుగుచున్నది.

శిష్యుడు : ఆకాశము నుండి

గురువు : పై నుండియా? క్రిందనుండియా?

శిష్యుడు : పై నుండి.

గురువు : అప్పుడు ఎట్లుచూచినను, పై నుండియే ప్రకాశము కలుగుచున్నది. క్రిందనుండి కాదు. అదియును గాక మనము ఒక దీపమును వెలిగించిన, ఆ దీపము వెలుతురు ఏ ప్రక్క నుండి కలుగుచున్నది?

శిష్యుడు : పై భాగము నుండి.

గురువు : దాని నుండి వెలుతురు మాత్రము కలుగుటకు ఏమి కావలయును?

శిష్యుడు : అగ్ని కావలయును.

గురువు : అగ్ని లేనిచో వెలుతురు ఉండునా?

శిష్యుడు : ఉండుట లేదు.

గురువు : వెలుతురు లేనిచో అగ్ని లేదని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : అప్పుడు వెలుతురు లేకపోయినను, అగ్ని యుండును కాని అగ్ని లేనియెడల వెలుతురు లేదు. అగ్నిలో నుండి వెలుతురు కలుగుచున్నది. అటువంటి అగ్ని మనలో నున్నదా? లేదా?

శిష్యుడు : ఉన్నది.

గురువు : అటువంటి అగ్ని మనలో ఎచ్చటనున్నది?

శిష్యుడు : మన కడుపులోనున్నది.

గురువు : మన కడుపులోనున్న అగ్ని యొక్క గుణమేమి?

శిష్యుడు : మనము తినిన వస్తువులనన్నటిని దహించును

గురువు : ఇంతవరకు ఈ లోకములో ఎవరికైన భక్షించినది దహించినదా?

శిష్యుడు : దహించియున్నది.

గురువు : ఎప్పుడును లేదు. ఎందుకనగా, మనము తినుచున్న అన్ని వస్తువులు ఏ విధముగా అగును అనగా మిరియాలు, ధనియాలు మొదలగు సువాసన ద్రవ్యము సానరాయి మీద నుంచి నూరి ముద్దచేసినట్లు, మనము తిను ఆహారపదార్థములను, నోటిలో వేసుకొని పండ్లతో నమిలి నూరినట్లు మ్రింగుదుము. ఆ విధముగా ముద్దలు ముద్దలుగా బైటకువచ్చుచున్నది. అప్పుడది రగిలినట్లు కనబడుటలేదు. అదియునుగాక మనము భక్షించు పదార్థములలో ఏదైనను ముక్కలు నమలక మ్రింగబడిన అవి ఏవిధముగా బైటకు వచ్చుచున్నవి?

శిష్యుడు : అదేవిధముగానే బయటకు వచ్చుచున్నవి.

గురువు : దానికి కారణమేమి? కడుపులో అగ్ని ఉన్నదిగదా? ఆ అగ్నిలోనుంచిన వస్తువులన్నియు రగిలి పోవలెనుగదా? అదియునుగాక, అగ్నిలో ఏ ఒక్క వస్తువునుంచినను, ఆ వస్తువు అగ్నియొక్క వేడికి వాడి, పొగ బారుటలేదా? ఆ ప్రకారము మాత్రమేగాక, ఏ విధమున మ్రింగబడినదో, ఆ విధముగనే బైటకు వచ్చుటను మనము చూచుటలేదా?

శిష్యుడు : అవును అది వ్యత్యాసమేమియును లేకుండ అట్లే బైటకు వచ్చి కనబడుచున్నది.

గురువు : అది ఎందువలన? అదియునుగాక మనము ఇచ్చట నొక అగ్నిగుండము చేసి అందు పలువిధములైన వస్తువులనుంచిన ఎడల, అవన్నియు ఏమగుచున్నవి?

శిష్యుడు : అవన్నియు రగిలిపోవుచున్నవి?

గురువు : రగిలిపోయిన ఏమగుచున్నవి?

శిష్యుడు : బూడిద అగుచున్నది?

గురువు : అప్పుడు అగ్నిలో ఏ వస్తువునుంచినను బూడిద అగుచున్నది. అటువంటప్పుడు మన కడుపులో అగ్ని యున్నదని గదా మీరు చెప్పినది! కాని మనము ఇంతవరకు భక్షించినదంతయు ఆ అగ్నిలోనేగదా పడినది! అప్పుడు అదియంతయు రగిలి బూడిద కావలెను గదా! అయిన ఈ లోకములో ఎవరైనను ఇంతవరకు కొంచెమైనను బూడిదను బైటకు వదలియున్నారా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు, ఏ విధమైన దుర్గంధపు వస్తువులను నిప్పులో నుంచినను, వానియందలి దుర్గంధమును పోగొట్టి శుభ్రపరచును. ఇదియే అగ్నియొక్క గుణము అట్లుండునప్పుడు, మనము ఎంతయో సుగంధమయిన వస్తువులను భక్షించినను, అవి మన కడుపులో నున్న అగ్నిలో పడి మరలబైటకు వచ్చునప్పుడు, అది ఎట్లుండును?

శిష్యుడు : అది మిగులదుర్గంధమై ముక్కు మూసి కొనవలసి వచ్చును.

గురువు : అదెందువలన? ఇదియేనా అగ్ని యొక్క గుణము? మిగులదుర్గంధముగాను, అశుద్ధముగా నుండు వస్తువులను అగ్నిలోనుంచిన, వాటియొక్క దుర్గంధము

పోయి వాసన ఏమియును లేక కనబడును. అదియు నుగాక, మనము మిక్కిలి సుగంధమైన వస్తువులను మన కడుపులోనున్న అగ్నిలో నుంచిన, అది బైటకు వచ్చునప్పుడు బహుదుర్గంధమై, అశుద్ధమై కనబడు చున్నది. కాబట్టి మన కడుపులో అగ్ని లేదా?

శిష్యుడు : లేదు.

గురువు : అదియునుగాక మనము మలవిసర్జన చేయునప్పుడు దానిలో అనేక క్రిములు, జీవులు బైటకు వచ్చుటను చూచుట లేదా?

శిష్యుడు : అవును . ఆ ప్రకారముగా కనబడుచున్నవి.

గురువు : అదియునుగాక, లోకములో నుండు సర్వ చరాచరములకు ఆహారము లేకుండ జీవించుట సాధ్యపడదు. అనగా సస్యాదులు మొదలైనవి, మనము పెంచు చెట్లు, మొక్కలు మొదలగు సస్యములకొరకని ఎరువు చేర్చి పెట్టుటలేదా? అది ఏ ప్రకారము అనగా, మనము ఒక గొయ్యి త్రవ్వి ఎరువు వస్తువులను పడవేసి, అవి అట్లే ఉన్నయెడల అది ఎరువు అగునా?

శిష్యుడు : ఎరువగుట లేదు.

గురువు : అది ఎట్లు ఎరువగుననగా, పైన జెప్పిన ఎరువు గుంటనుమూసి ఉంచిన, కొలది దినములకు ఆ వస్తువులు అన్నియు మ్రగ్గి, క్రుళ్ళి, జీర్ణించి, చెడి ఎరువ గును. ఆ ఎరువునే సస్యాదులకు అహారముగా ఉప

యోగింతురు. ఇదే విధముగా మనము జీవించియుండు టకు ఎరువగు ఆహారము అవసరము. ఆ ఎరువును సేకరించునది పైన జెప్పిన సస్యాదులకు ఏవిధముగా ఎరువు తయారగు చున్నదో అదే విధముగా ఎరువును తయారు జేయుటకున్న గొయ్య మన ఈ కనబడు కడుపు. ఈ విధముగా కనబడుచున్న ఎరువు గుంటయైన మన కడుపులో పలువిధములైన వస్తువులను చేర్చి ఉంచినా ము. అవి మ్రగ్గి, క్రుళ్ళి జీర్ణించి చెడును. ఆ విధముగా జీర్ణించని యెడలదానినే అజీర్ణమని చెప్పుట. అజీర్ణమనగా జీర్ణము లేకపోవుట, జీర్ణము అనగా క్రుళ్ళి చెడుట, ఆ విధముగా కుళ్ళి చెడిన యెడల, పలు రోగములు వచ్చును. అందువలన పైన జెప్పిన ప్రకారము మన కడుపు ఒక ఎరువుగుంట. అదియునుగాక మనము సస్యాదులకొరకై సేకరించుచున్న ఎరువును తీయునప్పుడు, పలువిధ ములైన క్రిములు కనబడుచున్నవి. అవి ఏవిధముగా ఉత్పత్తియైనవి? దానిలో మనము ఏవైన జీవులను ఉంచితిమా?

శిష్యుడు : ఉంచుటలేదు.

గురువు : ఆ ఎరువు గుంటలో ఉంచిన వస్తువులు కిక్కిరిసి నిండినప్పుడు మ్రగ్గి, ఆ మ్రగ్గుట నుండి ఉష్ణము ఏర్పడి, ఆ ఉష్ణము నుండి ఆవిరి తయారై, ఆ ఆవిరికే స్వేదమని చెప్పుట. స్వేదమనగా చెమట. ఆ చెమటయే శుక్లము. ఆ శుక్లము అగ్నిలో నుండి ఉద్భవించును. ఆ ఎరువుగుంట

యందుంచిన వస్తువులు నిండి, క్రిక్కిరిసి, మ్రగ్గినప్పుడు వచ్చిన ఉష్ణము అనగా వేడి, అగ్నిలో నుండియే చెమట యగు శుక్లమగుచున్నది. అందువలననే అగ్ని స్వరూపమైన శుక్ల మని చెప్పుటకు కారణము. ఆ శుక్లమే బ్రహ్మము. ఆ బ్రహ్మమునుండియే సృష్టి. ఆ బ్రహ్మము లేని యెడల ఏదొక సృష్టియులేదు. అందువలననే "బ్రహ్మాండ కటాహం స్వేదజోద్భవం" అని చెప్పుటకు కారణము. అనగా ఈ కనబడు లోకము యావత్తును చెమట నుండి ఉద్భవించినది. అదే విధమనగా, ఎరువుగుంటలో నుంచిన వస్తువులనుండి పై విధముగా తయారైన చెమటతో పైన జెప్పిన వస్తువులయొక్క డాగు చేరును. ఆ డాగేరక్తము. ఆ రక్తమునే శ్రోణిదమని చెప్పుట. ఆ విధముగా నుండు రక్తమగు శ్రోణిదమును, స్వేదమగు శుక్లమును ఒకటిగా జేరునప్పుడు దానితో వాయువు జేరును. అదే జీవియగును. ఈ ప్రకారముగనే జీవులైన క్రిమికీటకాదులయొక్క ఉద్భవము. ఈ విధముగనే మన కడుపను చెప్పబడు ఎరువుగుంటయందు ఉంచిన వస్తువులు, పై జెప్పిన ప్రకారము స్వేదమై, ఆవిరి రూపమైన శుక్లము తయారై, దానితో పైన జెప్పిన వస్తువుల డాగైన రక్తము అగు శ్రోణిదము చేరునప్పుడు, వానితో వాయువు చేరును. అప్పుడు అది జీవులగును. ఈ విధముననే మన కడుపగు ఎరువుగుంటనుండి వచ్చు క్రిమి కీటకాదులయొక్క ఉద్భవము. అందువలన పై జెప్పిన విధమున ఆలోచించునప్పుడు, కడుపులో అగ్ని

లేదని తెలియుచున్నది. అదియునుగాక లోకములో నుండు సస్యాదులు ఎండిపోవుటలేదా?

శిష్యుడు : ఎండిపోవుచున్నది

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : ఎండవలన.

గురువు : ఎండ ఎక్కడ నుండి వచ్చును?

శిష్యుడు : సూర్యుని నుండి

గురువు : సూర్యుడెక్కడున్నాడు?

శిష్యుడు : ఆకాశమున నున్నాడు.

గురువు : ఆకాశ మెక్కడనున్నది?

శిష్యుడు : పైగ నున్నది.

గురువు : అట్లుండు సూర్యుడు లోకమునకు ఏ భాగమున నున్నాడు.

శిష్యుడు : ఎక్కువ దూరమునను, ఎంతో ఎత్తునను ఉన్నాడు.

గురువు : అప్పుడు భూమి నుండి ఎంతో పైగనుండు సూర్యుని రశ్మి, ఎంతయో క్రిందనుండు లోకమునందు సర్వభాగము లందును ఒకేరీతిగా వ్యాపించియున్నది. అదియునుగాక, ఎంతో దూరముగా నున్న సూర్యునిరశ్మివలన, ఎంతో క్రిందనున్న భూమియందలి సస్యాదులయందలి సత్తై, జలరూపమైన జీవుని సూర్యుడేవిధముగా ఆకర్షించునో ఆ

ప్రకారము గానే మన ఎరువుగుంటయగు కడుపులో నుండు ఎరువులో నున్న సత్తును, మన భ్రూమధ్య మందున్న ప్రాణమైన సూర్యుడు ఆకర్షించి, అసత్తును మలముగా బైటకు త్రోయుచున్నాడు. అందువలననే సూర్యుడై, అగ్ని స్వరూపమైన ప్రాణము ఉండు స్థలము మనకు పైభాగమైన భ్రూమధ్యముననున్నది. అటువంటి స్థలమునకే హృదయమని పేరు. అదిమాత్రముకాదు. హృదయము ఆకాశమున నున్నది. అటువంటి ఆకాశమనునది ఏదని మీరు గ్రహించు చున్నారు?

శిష్యుడు : ఆకాశమనునది మన తలకు పైభాగమున ఎత్తుగా కనబడునది.

గురువు : అదెప్పుడును ఆకాశముకాదు. ఏలననగా ఆకాశము అదే యైనయెడల అచ్చటనే హృదయముండవలసినది. హృదయము అచ్చట ఉండినయెడల మనకు ప్రకాశించుటకు వీలున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అది మాత్రము కాదు. హృదయము మీరు చెప్పిన స్థలమందున్నయెడల శవమునకు ప్రకాశముండ వలయునుగదా? మీరు జెప్పిన ఆకాశమును, హృదయ మును పోలేదు కదా! కనుక శవము ప్రకాశించకపోవుటకు కారణమేమి?

శిష్యుడు : చనిపోయినందువలన.

గురువు : చనిసపోయిన ఏమియుండదు.

శిష్యుడు : జీవుడుండదు.

గురువు : జీవుడు లేనియెడలప్రకాశమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు ప్రకాశమైయుండు వస్తువేది?

శిష్యుడు : జీవుడు.

గురువు : జీవుడై ప్రకాశమై, తనలోనుండు వస్తువు తనలో నుండి నాశనమై పోయినప్పుడు ప్రకాశము లేకపోయినది. కావున ఎచ్చటనుండి ప్రకాశించుచున్నది అని స్పష్టమగుచున్నది?

శిష్యుడు : తనలో నుండియే.

గురువు : తనలో ఎచ్చట నుండి ప్రకాశించుచున్నది?

శిష్యుడు : పై భాగమునుండి.

గురువు : అప్పుడు తనలో తానే పైగా నుండు స్థలమునకు ఆకాశమని చెప్పుట. ఆకాశమనగా మిగులప్రకాశించునదై, పైగా నుండునదై చూచుటకు వీలులేనిదై యుండునది. అట్లయిన ప్రకాశించునది ఎచ్చటనుండి?

శిష్యుడు : ఈ కనబడు ఆకాశమున నుండు సూర్యుని నుండి.

గురువు : అది ఒకప్పుడు వీలుకాదు. ఏలననగా చనిపోయి

నప్పుడు. ఈ కనబడు ఆకాశము, సూర్యుడు ఉన్నవిగదా? అయినను ఆ శవమునకు ప్రకాశములేదని మీరే చెప్పితిరి. అదియునుగాక ఇప్పుడు సూర్యుడు ఉదయించి, మధ్యాహ్నా మైనదని చెప్పెదరుగదా? ఈ సమయమున ఒక్కడు పరుండి నిద్రించుచున్నాడు. వానికేమైన ప్రకాశమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : దానికి కారణము ఏమి? మీరు చెప్పిన ఆకాశము, సూర్యుడు లేవా? అట్లయిన అతనికి ఎందువలన ప్రకాశించుట లేదు?

శిష్యుడు : అతడు నిద్రించుట వలన.

గురువు : అలాగైన నిద్రించువానికి ఎప్పుడు ప్రకాశించు చున్నది?

శిష్యుడు : నిద్రమేల్కొన్నప్పుడు.

గురువు : అప్పుడు ప్రకాశమెక్కడ నుండి కలిగినది?

శిష్యుడు : వానిలోనుండియే.

గురువు : అతనిలో ఎచ్చటనుండి ప్రకాశించినది?

శిష్యుడు : అతనిలో ఆకాశము నుండి.

గురువు : ఆ ఆకాశమేది?

శిష్యుడు : అతనిలో పై భాగములో నున్నది.

గురువు : అదేది?

శిష్యుడు : శిరస్సు.

గురువు : మనకు ఎక్కువగా ప్రకాశించుట ఎచ్చట నుండి.

శిష్యుడు : శిరస్సు నుండి.

గురువు : కావున మనకు పై భాగమేది?

శిష్యుడు : శిరస్సు.

గురువు : అదిగాక, ఆకాశము చూచుటకు అసాధ్యమని కదా చెప్పుట! అయిన నీవు చెప్పిన ఆకాశము అదియైన ఇదిగో చూడుము.

శిష్యుడు : కనబడుచున్నది.

గురువు : అట్లయిన ఆకాశము చూచుటకు సాధ్యములేదని చెప్పుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలు లేదు.

గురువు : అయిన మనకు చూచుటకు సాధ్యముకాని వస్తువు వానివాని శిరస్సు . అది యెట్లనగా, ఒక అద్దములో చూచిన ముఖము మాత్రము కనబడును. ఒకటికన్న ఎక్కువ అద్దములను, మనము ఎన్ని భాగములయందుంచి, చూచినను నేలనుండి తలక్రిందుగా చూచినను, శిరస్సంతయు ఒకేసారి కనబడదు. ఇందువలననే ఆకాశము మనకు చూచుటకు సాధ్యముకాని వస్తువు అని

చెప్పుటకు కారణము. అది మన శిరస్సై యున్నది. అదిగాక ఆకాశమునుండియే శబ్దముద్భవించుట, ఆకాశము నుండియే శబ్దము వినబడుట. మీరు చెప్పునట్టి ఆకాశమునుండియే అయిన, నేను నా నోటిని మూసి మాట్లాడ కుండిన నాశబ్దము మీరు చెప్పిన ఆకాశము నుండి కలుగుచున్నదా?

శిష్యుడు : కలుగుట లేదు.

గురువు : అప్పుడు శబ్దముద్భవించుట ఎచ్చటనుండి?

శిష్యుడు : వానివాని శిరస్సు నుండి.

గురువు : శిరస్సు లేనియెడల శబ్దము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : ఇందువలననే ఆకాశము నుండి శబ్దముద్భవించు నని చెప్పుటకు కారణము. ఆ ఆకాశమే శిరస్సు. శిరస్సు నుండియే శబ్దము కలుగుట. అదియునుగాక శబ్దము వినుటకు ఏమి కావలయును?

శిష్యుడు : శిరస్సుండవలయును.

గురువు : ఇందువలననే ఆకాశము నుండి శబ్దముద్భవించు ననియును, ఆకాశమువల ననే వినుటయనియును చెప్పుటకు కారణము. అప్పుడు ఆకాశమైయున్న శిరస్సు లేని యెడల శబ్దము కలుగుటకు, శబ్గము వినుటకుగాని సాధ్యము కాదు. అదియునుగాక, మనకు కాళ్ళు, చేతులు,

కండ్లు, ముక్కులేవని అనుకొనుము. శిరస్సు, జీవుడు, నాలుక ఉన్నవి. అప్పుడు మనకు ఏవిధముననైనను శబ్దము కల్గించుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలుకాదు.

గురువు : ఇదిగో చూడుము: మన రెండు చేతులను తట్టిన ఏమి కలుగును?

శిష్యుడు : శబ్దము కలుగును.

గురువు : అది ఎందువలన?

శిష్యుడు : మన రెండు చేతులను ఒకటితో నొకటి చేర్చి తట్టినందువలన.

గురువు : అది ఎప్పుడును చేతులవలన సాధ్యముకాదు. ఎందువలననగా, మనశిరస్సును తీసివేసిన, మిగిలిన జడమునందు చేతులున్నవిగదా! ఇప్పుడు చేతులను ఎత్తుటకును, వానిని తట్టుటకును సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : అప్పుడు సర్వశక్తియు ఎచ్చట నున్నవి?

శిష్యుడు : శిరస్సు నందు.

గురువు : శిరస్సు లేకున్న ఆకాశమనునదియును, ఆదియని యును, అంత్యమనునదియు, ఏదైనయున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అన్ని అవస్థలును కలుగుటఎచ్చట నుండి?

శిష్యుడు : వానివాని శిరస్సు నుండి.

గురువు : మనకు శిరస్సు నుండియే ప్రకాశించుచున్నదనుటకు వేరే దృష్టాంతము: ఇదిగో మేడయిల్లు. ఈ ఇంటికి రెండంతస్థులున్నవి క్రింది అంతస్థులో రాత్రి అతి ప్రకాశముగల ఒక దీపమును వెలిగించి, ఆ అంతస్థు నందలి ద్వారమునలను కిటికీలను మూసి, దానిలోపల నుండి పై అంతస్థునకు పోవుటకు మేడమెట్లున్నవి. ఆ మెట్లగుండ పై అంతస్థునకు వెళ్ళి అందలి ఒక గది యొక్క కిటికీని తెరచి బైటకు చూచిన క్రింద అంతస్థునందు వెలిగించి పెట్టిన దీపపు వెలుతురు వలన బైటనున్న వస్తువులను చూచుటకు వీలుపడునా?

శిష్యుడు : వీలుపడదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : ఆ ఇంటి క్రింది అంతస్థునందు ప్రకాశమున్నది. దానికి కిటికీలు తలుపులు మూసినందువలన, బైటనున్న వస్తువులను చూచుటకు వీలులేకపోయినది.

గురువు : ఈ ప్రకారముగానే మన ఈ జడమును ఒక మేడయిల్లుగా భావించుదము. ఎట్లనగా మెడకు క్రింది భాగము క్రింది అంతస్థుగాను, పై భాగము ఇంటి పై అంతస్థుగాను భావించవలెను. ఇందు మెడకు క్రింది

భాగమైన క్రింది అంతస్థునందు ప్రకాశమైన వస్తువు నుంచిన, మెడ యొక్క పై భాగమైన పై అంతస్థులో నుండి బైటకు చూచిన ప్రకాశము చూచుటకు సాధ్యపడునా?

శిష్యుడు : చూచుటకు సాధ్యపడదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : ప్రకాశము మెడకు క్రింది భాగపు అంతస్థు నందుండుటవలన.

గురువు : అప్పుడు మనకు ఎచ్చటనుండి ప్రకాశించు చున్నదని స్పష్టమగుచున్నది?

శిష్యుడు : ఆ మెడయొక్క పై భాగపు అంతస్థునుండి.

గురువు : అదియునుగాక, ఈ గది మధ్యను దీపమును వెలిగించి తలుపులను మూసిన బైట ఏమగును?

శిష్యుడు : చీకటియగును

గురువు : తలుపులను తెరచినచో?

శిష్యుడు : వెలుతురు వచ్చినది.

గురువు : అప్పుడు ఎక్కడనుండి ప్రకాశము కలుగుచున్నది?

శిష్యుడు : గదిలోనున్న దీపము నుండి.

గురువు : అప్పుడు బైటకు ఎట్లు ప్రకాశించుచున్నది.

శిష్యుడు : ద్వారమునకు ఎదురుగానున్న దీపము నందు

వెలుగుచున్న అగ్నియొక్క శక్తిననుసరించి బైటకు ప్రకాశించుచున్నది.

గురువు : ఆ దీపమునందు నూనెయు, వత్తియు, అగ్నియు లేని యెడల ప్రకాశించునా?

శిష్యుడు : ప్రకాశించదు.

గురువు : ఆ దీపపు పై భాగము నుండియా ప్రకాశించుట?

శిష్యుడు : పై భాగము నుండి.

గురువు : అదే ప్రకారముగనే మనము ఈ జడమును ఒక దీపముగా ఉదహరించుదము. ఈ జడమైన దీపములో కర్మమైన, వాయువైన తైలమును నింపి, దానిలో మనసైన వత్తినుంచి, ఆత్మగానున్న అగ్నియు రగులు కొని యుండునదే ఈ కనపడు లోకము. ఇది ఏ ప్రకార మనగా, దీపపు పై భాగములోని వత్తి రగిలి, ప్రకాశించుచున్నదో ఆ ప్రకారముగా ఈ జడమై యుండు దీపపు పై భాగములో నుండి మనస్సైన వత్తిరగిలి, జ్వలించు చున్నదే కనపడునది. పై భాగము (తట్ట)లో ఎచ్చట నుండి ప్రకాశించుచున్నదనగా, భ్రూమధ్య మునుండి, ఈ కారణము చేతనే శివుడు విరుపాక్షుడ నియును, త్రిలోచనుడనియును చెప్పుట. అనగా శివుని రూపమును సంకల్పించి పటములు గీసి వ్రాయబడి యున్నవి. వాటిని చూచిన అందు శివునకు మూడు కన్నులు వ్రాయబడి వున్నవి. అందొకటి అగ్ని నేత్రమని చెప్పుచున్నారు.

అటువంటి శివుడు ఎవరనగా జీవుడై యున్నాడు. అటువంటి జీవుడై యుండు శివునకు మూడు కన్నులున్నవి. అవేవనగా ఇడ, పింగళ, సుషుమ్న యనునవి. వీటిలో ఇడ, పింగళ, చంద్ర సూర్యులుగాను, సుషుమ్న అగ్నియునైయున్నది. ఇందువలననే శివునకు మూడు కన్నులనియు, వాటిలో ఒకటి అగ్ని నేత్ర మనియును, అది భ్రూమధ్యముననున్నదని చెప్పుటకు కారణము. దాని ననుసరించియే పై జెప్పిన పటములో భ్రూమధ్యములో అగ్ని నేత్రమును వ్రాయుటకు కారణము. అప్పుడు భ్రూమధ్యమనునది, సుషుమ్నయని చెప్పబడు అగ్ని నేత్రమైయున్నది. అప్పుడు భ్రూమధ్యమునందు అగ్ని లేనియెడల మనకు ప్రకాశించుట వీలున్నదా?

శిష్యుడు : వీలు లేదు.

గురువు : అయితే అప్పుడెచ్చట నుండి ప్రకాశించుట?

శిష్యుడు : భ్రూమధ్యముననుండు సుషుమ్నయైన అగ్ని నేత్రమునుండి.

గురువు : దానినే హృదయమని చెప్పుట. ఈ విధముగా తనలో ఆకాశమధ్యమై భ్రూమధ్యమై, హృదయమై, సుషుమ్న యైన అగ్ని నేత్రము నుండియే మనకు ప్రకాశించుట.



# మూడవ అధ్యాయము

శిష్యుడు : గురువే! ఇదివరకు తాము చెప్పుచు వచ్చినదానిని విన్న వరకు తానే ఈశ్వరుడనియును, అట్లున్న తనశక్తి బైట వ్యాపించినప్పుడు దానిలో నుండి లోకము కలిగిన దనియును తెలియవచ్చినది. అయితే పుణ్య పాపముల నుండియే జనన మరణములు కలుగు చున్నవని సాధారణముగా లోకమున చెప్పుచున్నారు. అట్లు చెప్పుటకు కారణమేమి?

గురువు : పుణ్యము, పాపము అనునవి ఏమని మీరు గ్రహించియున్నారు?

శిష్యుడు : పుణ్యమనగా సుకృతము అనునది మంచి కార్యములను చేయుట. అనగా ఏదొకటిని హింసించక దయతో కలసియుండుటయు, అన్నదానము, గోదానము మొదలగు వాటిని చేయుట, యాగము, పూజ మొదలగు వాటిని చేయించుటయు మొదలగునవిగా నుండును. పాపము అనగా దుష్కృత్యమనునది చెడ్డపనులను చేయుట అనగా దాన, ధర్మ, పరోపకారములను చేయకుండుట, జంతువులను హింసించుటయుగా నుండునని నేను గ్రహించియున్నాను.

గురువు : ఇట్లు గ్రహించుట తప్పు. సుకృతమనగా మంచి

చేయుటయనియును, దుష్కృతమనగా చెడ్డది చేయుట యనియును చెప్పుటకు వీలులేదు. ఏలననగా సుకృత, దుష్కృతములనుండియే జననమరణములు కలుగు చున్నవని మీరే చెప్పినారుగదా? అట్లయిన ఏనుగ మొదలు చీమవరకు నుండు అన్ని జంతువులును సుకృత, దుష్కృతాదులకు బాధపడుచున్నది గదా? వీటిలో ఏవి సుకృతము నుండి జనించినవని చెప్పుటకు సాధ్యమగును?

శిష్యుడు : మనుష్యులైన మనమందరము సుకృతము నుండి, మిగిలిన జంతువులన్నియు దుష్కృతము నుండియు జనించినవి.

గురువు : మనుష్యులని చెప్పబడు మనము మనుష్యులై జనించుటకుగాను సుకృతము చేసినదెప్పుడు? ఏనుగు మొదలగు చీమవరకు ఉన్న ఇతర జంతువులు ఆ ప్రకారముగా జనించుటకు కావలసిన దుష్కృతము చేసినదెప్పుడు?

శిష్యుడు : పూర్వ జన్మములో.

గురువు : అట్లయిన ముందు జన్మములో మనము ఎవ్వరై యుంటిమి? ఈ జన్మములో మనము మనుష్యులై జనించుటకు ఎట్టి సుకృతములను చేసియుంటిమి? చీమ మొదలగు జంతువులు, ముందు జన్మములో యేవిగానుండెను? ఈ జన్మములో ఈ ప్రకారమై పుట్టుటకు, అవి చేసిన దుష్కృతములేవి? చెప్పుటకు

సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : కాబట్టి వాని వానికి అనుభవములేని సంగతులను నమ్ముటవలన ప్రయోజనము లేదు. వానివాని అనుభవ మునకును, యుక్తి, శ్రుతికును, అనుసరించి ఏది యున్నదో, దానిని నమ్మవలెను. ఏలననగా, చీమ మొదలు మనతోసహా ఏ ఏ సృష్టులు లోకమున చూడబడినదో, వినబడినదో, తెలియబడినదో, అవియన్నియు, ఒకటే జీవుడు. తానే ఈ ప్రకారముగా చూడబడినది. రూప వ్యత్యాసము మాత్రమే. అదిగాక వానివాని శక్తి బైట వ్యాపించి, శక్తియై, ఆ శక్తియైన జీవుడు మరొకటై ప్రతిబింబించునదియే ఈ కనబడు లోకము. దానిని పిమ్మట వివరముగా చెప్పెదను. అయితే సుకృత దుష్కృతములనుండి, జనన మరణములు కలుగు నెడల, రాజులని అభిమానించువారికిని అవి బాధ్యపడుచున్నవి. అదియునుగాక సుకృత దుష్కృతములను చేసినవాటిని అనుభవించుట ఎప్పుడు?

శిష్యుడు : పూర్వ జన్మములో చేసినది ఈ జన్మముననను, ఈ జన్మమున జేసినది మరుజన్మముననను, అనుభవించు టగా నున్నది.

గురువు : అది ఏ ప్రకారముగా అనుభవించుట ?

శిష్యుడు : సుకృతము చేసినవారు బ్రాహ్మణులుగాను, రాజులు

గాను, ధనవంతులుగాను, దుష్కృతములు చేసిన వారు దరిద్రులుగాను, రోగులుగాను జనించి, చివరకు అనుభవించుచున్నారు.

గురువు : అయిన రాజులకు, ధనవంతులకు రోగములు వచ్చుచున్నవా? లేవా?

శిష్యుడు : వచ్చుచున్నవి.

గురువు : దానికి కారణమేమి? అది ఏ కాలమున జేసిన దుష్కృతము?

శిష్యుడు : వెనుకటి జన్మములో చేసినదే.

గురువు : అట్లయిన వారు ఎట్లు బ్రాహ్మణులగుటయును, ధనవంతులగుటయును ఎట్లనగా, మనమును పై ప్రకారముగానున్నవారై జనించవలెనుకదా? ఎందువలన ననగా, దుష్కృతము కొంచెముగూడ లేకపోవునప్పుడు బ్రాహ్మణులగుటయును, రాజులగుటయుగా నున్నది. అయినుగాక, రాజులు అనగా పుణ్యోత్కృష్ట శరీరులని చెప్పుట అనగా పుణ్యము ఉత్కృష్టపదవి యైనప్పుడు పాపముయనునది పూర్తిగా లేదు. ఎందువలననగా పుణ్యము ఉన్నతపదవి అగునప్పుడు ఈశ్వరుడగును. దేనివలననగా ఉన్నత వస్తువు ఈశ్వరుడు. అప్పుడు పుణ్యము ఈశ్వరునితో చేరినది. అప్పుడు ఈశ్వరుడైనది. అప్పుడే రాజగుట ఈశ్వరాంశమే రాజు. దీని ననుసరించియే "**రాజా ప్రత్యక్షదేవతా**"అనుటకు కారణము. ఇది ఒక్కొక్క

పాఠశాలగోడలపైన వ్రాసియుండుటను చూచుచున్నాము. అప్పుడే రాజు ప్రత్యక్షమైన ఈశ్వరుడైయున్నాడు. అటువంటి రాజునకు ఏ విధమైన వ్యాధికలుగుటకు కారణములేదు. అయినను రాజులకు కలుగునటువంటి వ్యాధులు మనకు వచ్చుటలేదు. వారికి రాజయక్ష (అనగా క్షయ). రాచగడ్డ, భగంధరము, గుదంధరము, ప్రమేహము, పక్షవాతము మొదలగు మహావ్యాధులు కలుగుచున్నవి. గనుక వారు మిగుల అపరాధములను చేసినవారుగా నున్నారు. అట్లు మిక్కిలి దుష్కృతమైన అపరాధములు చేసినవారు రాజులుగా జనించుటకు వీలున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన మనకు సుకృత, దుష్కృతములు ఉద్భవించుట ఎచ్చటనుండి?

శిష్యుడు : అది మన మనస్సునుండియే.

గురువు : అట్లయిన, మనకు మనస్సు లేనియెడల, సుకృత, దుష్కృతములు కలుగునా?

శిష్యుడు : కలుగవు.

గురువు : అయిన మనస్సు నుండి ఉద్భవించునట్టి దుష్కృతములు లేని యెడల, అది ఏమగుచున్నది?

శిష్యుడు : సుకృతము అగుచున్నది.

గురువు : సుకృతమని చెప్పబడున దేది?

శిష్యుడు : ఈశ్వరునితో జేరుటకుండు ఒకటే అవస్థ.

గురువు : అప్పుడు, ఈశ్వరుడు మనలో ఎచ్చట నున్నాడు?

శిష్యుడు : మనలో ఉత్కృష్టపదవిలో నున్నాడు.

గురువు : ఈశ్వరుడు మనలో ఉన్నత స్థలములోనున్నాడు. అనగా మనకు పై భాగమైయున్నది. అది శిరస్సు. ఆ శిరస్సు నందే ఈశ్వరుడుండుట. అటువంటి పైగ శిరస్సు నందున్న ఈశ్వరునివద్ద చేరి, ఒకే అవస్థలో ఉండవలయునన్న, ఈశ్వరుడుండు స్థానములో ఏకగతియైయుండవల యును. అటువంటి అవస్థకే పుణ్యోత్కృష్టమని చెప్పుట. పుణ్యము, ఉత్కృష్టమైన శరీరముగలవారే ఈశ్వరుడై యున్నాడు. అనగా పుణ్యము ఉన్నతపదవియైవచ్చిన శరీరులెవరో వారే ఈశ్వరుడు. అందువలననే, ఈశ్వరాంశమే రాజులని చెప్పుటకు కారణము. కావున, తనలో నుండి ఉద్భవించు దుష్కృతములు ఉద్భవించక, తనలో పై భాగమున శిరస్సులోనున్న ఈశ్వరుడు ఏకగతియై వచ్చునప్పుడు, పుణ్యము. ఉత్కృష్టమై రాజగును. వీరు చండాలుడని పిలుచు, ఒక మాలవానికి పైజెప్పిన ప్రకారమైన వాడెవరగును?

శిష్యుడు : అతడు రాజగును.

గురువు : అప్పుడు రాజని ఒక సృష్టియున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన రాజగుట ఎట్లు?

శిష్యుడు : వానివాని ప్రవర్తనలచే.

గురువు : అదేలాగనగా, తనశక్తి బైటవ్యాపించి, పలువిషయములలో చేరి మోహించి, భ్రమించియున్నదానిని బైటకు వచ్చి వ్యాపించి, ఏదొక విషయములోను పోనీయక ఉద్భవస్థానమైన తనలోతానే చేరుటకున్న ఒకటేగతియై వచ్చునప్పుడు రాజను చెప్పబడు స్థితిగలుగుట. అదియునుగాక, ఇప్పుడు మనము రాజులని అభిమానించి వచ్చువారిస్థితి ఎట్లనగా లోకమంతయు వ్యాపించి యుండు జీవులకు సమానుగా అనుభవించుటకున్న సొత్తులను, బలముగలవాడు "కార్యస్థుడు" అనురీతిలో అక్రమముగా పట్టి స్వాధీనపరచుకొని, తమకు స్థానమును, అధికారమును స్థాపించుకొనుటయైయున్నది. ఒకడు అతిశక్తివంతుడును, పరాక్రమ శాలియు, జనుల స్వాధీనత గలవాడునైయుండిన అతడు ఇతర జనులను పట్టి , కట్టి, వారిని కొట్టి, "మీరందరు నాచేతి కింద నడచుకొనవలెను". అని అనేక విధములుగా వారిని బలాత్కరించి తనచేతి క్రింద వారిని తగ్గించి పరిపాలించుకొని వచ్చునదైయున్నది. ఈ ప్రకారముగానుండువారే ఇప్పుడు రాజులని, ప్రభువలని, ధనవంతులని చెప్పబడుచున్నారు. దానికి దృష్టాంతము. 1921 సం॥ములో అనగా మళయాళపు కొల్ల సంవత్సరము 1096 లో మలబారులో నడచిన మాపిళ్ళ కలహమునందు

ప్రధానమైన కుంజమ్మహమ్మద్ హాజీయను ఒకడుండెను గదా? అతనిని ఒకటి, రెండు సంవత్సరములు వరకు శిక్షించి, చెరసాలకు పంపిన విషయము మనము వినియున్నాముకదా! పై జెప్పిన హాజీగారు తనజన స్వాధీన శక్తిని వృద్ధిపరచుకొని, ఇండియా గవర్నమెంటుతో యుద్ధమునకు పోయెను. అటువంటి సందర్భములో వేలకొలది జనులకు కఠిన ఉపద్రవములను జేసి వారిని పట్టి, కట్టి, కోయుటకు మొదలుపెట్టెను. అప్పుడు అనేక రాజవాసులు భీతినొంది, హాజీగారు చెప్పులాగున నడచు చుండిరి. అటు వెనుక వారిని ఎవరని చెప్పదగును?

శిష్యుడు : వారిని రాజని చెప్పదగును.

గురువు : అప్పుడు రాజనుట ఒక ప్రత్యేక సృష్టియా లేక వానివాని దుష్కృతములనుండియా?

శిష్యుడు : వానివాని దుష్ప్రవర్తనలచేతనే.

గురువు : అలాగైన, సుకృత, దుష్కృతములను ఇట్టిదని తెలియకయుండుటవలన, తప్పు గ్రహించుటకు కారణమైనది. దుష్కృతమనునది నశించునట్టిది. అనగా సుకృతమనునది లేకయుండునది. అదిగాక ఒకడు రోగియై, అశక్తుడై పరుండియున్నాడు. వానిని దుష్కృతుడనియా, సుకృతుడనియా చెప్పవలసినది.

శిష్యుడు : దుష్కృతుడని చెప్పవలసినది.

గురువు : అట్లు చెప్పుటకు వీలులేదు. ఏలననగా సుకృతము

నాశనమైనయెడల అతడు చనిపోవును. అనగా పుణ్యము తీరిపోయిన చనిపోవుటయని చెప్పబడును. రోగియై పరుండినప్పుడు అతనికి జీవుడున్నాడుగదా? అతడు చనిపో లేదుకదా? పాపమనగాఈశ్వరచైతన్యము లేకపోవుట. రోగియై పరుండినప్పుడు అతనికి ఈశ్వరచైతన్య మున్నది గదా? ఈశ్వర చైతన్యములేనియెడల అతడొక కొయ్య బొమ్మకు సమానుడగు చున్నాడు. అప్పుడే "పాప మని" చెప్పవలసినది. "పాప" మనగా ఈశ్వరచైతన్యము లేనిదై జీవుడు దానిలో నశించునదై యున్నది. జీవుడే ఈశ్వరుడు. అదియే పుణ్యము. అటువంటి పుణ్యమై యుండు వస్తువు నశించి చంద్రమండలములోని మంచువలె పోయి పడును. అని చెప్పబడుట, అయిన అది సరియైయున్నది. ఎట్లనగా చంద్రుడను నది మనస్సు. చంద్రమండలము అనునది మనో మండలము. మంచుయనునది జలమైన ఆవిరి అనగా విచారమైన పొగయైయున్నది. అదేలాగనగా చంద్రమండలమందు జీవుడైన పుణ్యము, అది ఇది అను విచారాదులచేత నశించిపోవుట. అప్పుడే చనిపోవుట, దీనివలననే పుణ్యము. చంద్రమండలములో హిమమునకు సమానమై, ఆవిరి రూపమున పోవుచున్నదని చెప్పుట. అట్లు పోవునదేది?

శిష్యుడు : జీవుడై యుండు పుణ్యమని తెలియుచున్నది

గురువు : అట్లయిన, ఆ పుణ్యము తనలో నుండి

నశించిపోవునప్పుడే చనిపోవుట. కావున పుణ్యమైయున్న ఒకవస్తువు మనలో నున్నదని తెలియబడుచున్నది. అదేదనగా సుకృతమైయుండు ధనము. అదియే పురుషార్థము. అనగా పురమున సుషుమ్న లోనుండు అర్థము. పుర మనగా మందిరము (ఇల్లు) అది ఈ జడము. సుషుమ్న అనునది హృదయము అర్థమనగా ధనము, అనగా వస్తువు. కావున పురమున నుండు సుషుమ్నయైన హృదయములోనున్న ధనముగా నున్నది. అటువంటి ధనము నాశనమైన, సత్తువు పోయినదనుట. (చనిపోయి నదనుట) అదేలాగనగా, ఇదిగో చూడుము. ఒక పెట్టె, ఈ పెట్టెలోనిండుగ ధనముండెను. ఆ ధనమును ఖర్చు చేయుచు వచ్చినయెడల చివరకేమగుచున్నది?

శిష్యుడు : ధనము లేకపోవుచున్నది.

గురువు : కడపట ఏదిమిగులుచున్నది?

శిష్యుడు : పెట్టె మిగులుచున్నది.

గురువు : ఈ విధముగా కనబడు జడము ఒక పెట్టెయని భావింపుము. ఈ జడమైయుండు పెట్టెలో సుకృతమను ధనమున్నది అటువంటి ధనము ఖర్చుచేసి ముగించిన పిదప ఏమగుచున్నది?

శిష్యుడు : చనిపోవుచున్నది.

గురువు : అప్పుడు సుకృతమను ధనము నశించిన వెనుక ఏమి మిగులును?

శిష్యుడు : జడమైన పెట్టె మిగులును

గురువు : అప్పుడు సుకృతమను ధనము నశించిన వెనుక, జడమైన పెట్టె మాత్రము మిగిలియుండునప్పుడు, దానిని యొక గుంట త్రవ్వి దానిలో పూడ్చి వేయుదురు. లేదా కాల్చి వేయుదరు. ఇది మనకు ప్రత్యక్ష అనుభవము గదా? కావున ఈ జడములో ఒక ధనమున్నదనియు, అది సుకృతమనియు స్పష్టమగుచున్నది. సుకృతమనగా విశేషకృతము. విశేషమనగా తెలివియు, కృతమనగా చేయబడినది. కావుననే తెలివితో చేయునది సుకృతము తెలివి లేక చేయునది దుష్కృతము అని లోకమున చెప్పుచున్నారు. అది సరియైయున్నది. తెలివి అనునది ఏదని ముందుగ చెప్పబడియున్నది?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు అని.

గురువు : అదెట్లుండు వాయువు?

శిష్యుడు : బ్రహ్మరంధ్రమును తట్టుకొనియుండు సమీరణుడు.

గురువు : అట్లయిన, తెలివియైయున్న వాయువు చేత చేయబడునది సమీరణుడు. అది సుకృతమనియును, అదిలోన చేరియుండక బైటకు వెళ్ళి ముగియుటకు దుష్కృతమనియు పేరు. దీనివలననే పుణ్యము నశించిన పాపమని చెప్పుటకు కారణము. అప్పుడు పాపమని చెప్పబడునదేది?

శిష్యుడు : జీవుని నాశనము చేయునది.

గురువు : మీ జీవుని మీరు స్నేహించుచున్నారా?

శిష్యుడు : అవును, నేను స్నేహించుచున్నాను.

గురువు : అట్లయిన నీవు చనిపోవుదువా?

శిష్యుడు : అవును, నేను చనిపోవుదును.

గురువు : మీ జీవుని మీరు స్నేహించిన మీరు చనిపోవుటకు వీలున్నదా?

శిష్యుడు : అది ఎట్లో నాకు అర్థమగుటలేదు.

గురువు : అట్లయిన చెప్పెదను వినుము. మీ జీవుని మీరు స్నేహించిన, అటువంటి జీవుని బైట విడువక మీలోనే ఉంచుకొనవలయునుగదా?

శిష్యుడు : నాలోనే ఉంచుకొనవలయును.

గురువు : అట్లు చేసిన మీరు చనిపోవుటకు వీలుకలుగునా?

శిష్యుడు : చనిపోవుటకు వీలుకలుగదు.

గురువు : అది మాత్రము కాదు. మీ జీవుని మీరు స్నేహించిన మరొక ప్రాణిని హింసించుటకు వీలుండదు గదా? ఎప్పుడు తన్ను తానే స్నేహించునో అప్పుడు మరొకటిని హింసించుట లేదు. తన్ను తానే స్నేహించిన తన్ను విడిచి బైటపోవుటలేదు. తన్ను విడిచిబైట పోవనియెడల మరొకటిని హింసించుట కారణము లేదు. అదే ప్రకారమనగా ఇదిగో చూడుము. ఒకే గదిగాను, రెండు

భాగములుగాను, పై భాగమున ఎక్కువ కిటికీ లుండునదిగాయుండు నొక మందిరమున దాని క్రింది భాగమున, లోనికి పోవు తలుపులను మూసి దానిలోని పైగనున్న మేడ నెక్కిపోయి తలుపులను మూసి అందుండు కిటికీలమూలమున చూచిన, అన్ని అవస్థలను మీరు చూచుచుండ వచ్చును. అయిన అచ్చటనుండి క్రింద దిగి, బైటరాక ఏదొక జంతువులను మీకు హింసించుటకు వీలగునా?

శిష్యుడు : హింసించుటకు వీలుకాదు.

గురువు : పై జెప్పిన మేడపైన మీరుండు సమయమున అన్నిటిని చూచుటకు సాధ్యమగుచున్నది. ఇదే ప్రకారముగా తనలోనుండు జీవుడు, క్రింద దిగి బైట వ్యాపించుట వలననే పలువిధములైన హింసలను చేయుటకు వీలగుచున్నది. అటువంటి జీవుని బైటపోనీయక, తనలో తాను వృద్ధి పఱచి, అనగా, పై భాగములో నిలిపినట్లయిన, ఏదొక హింసయును చేయక, అన్నిటిని తెలిసికొనియుండవచ్చును. అప్పుడే జీవుని స్నేహించుచుండుటని చెప్పుటకు సాధ్యమగును. ఆ ప్రకారముగా జీవుని స్నేహించక, మన జీవుడు పలువిషయములలో చిక్కినందున, ముక్కు, నోరు మొదలగు త్రోవలచే బైట వెళ్ళి నశించిపోవుచున్నది. దానికే పాపమని చెప్పబడుట. అనగా తన సుకృతమై లోపలనుండు జీవశక్తియైన వాయువు, దుష్కృతమై బైటి

ఉచ్ఛ్వాస మనగా ముక్కు మొదలగు వాని ద్వారా బైటకు విడచుట. నిశ్వాస మనగా, అటువంటి ద్వారముల మూలమున లోనికి తీసికొనుట. అదే ప్రకారముగా గమిసూదు, అనుగమిసూదు (బైటకు లోపలకు వ్యాపించి) చేసి కడపట తనలోపలనుండి జీవుడు నశించి చనిపోవుట. చనిపోవుటనగా సత్తువుపోవుట. ఎట్లనగా, మనలో సత్తైయుండు జీవుడు తన్ను తాను తెలిసికొనక, అది ఇది అను విచారాదులచె దుష్కృతమై బైటికి వెళ్ళి నశించిపోవు అవస్థకే పాపమనిపేరు. అయిన ఇట్టి స్థితిలో ఇదివరకు మీరు మీ జీవుని స్నేహించి యుండిరా?

శిష్యుడు : స్నేహించి యుండలేదు.

గురువు : మీ జీవుని మీరు స్నేహించియున్న యెడల మీరు చనిపోవుదురా?

శిష్యుడు : చనిపోవుటలేదు.

గురువు : అట్లయిన, మనము దేనికొరకు సుకృతము చేయవలసినది?

శిష్యుడు : చనిపోకయుండుటకు.

గురువు : చనిపోయిన పీనుగకు బోధముగాని, జ్ఞాపకముగాని యున్నదా?

శిష్యుడు : ఏదొకటియు ఉండుట లేదు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : చనిపోయినందువలన.

గురువు : చనిపోయినప్పుడు దానిలో ఏదిలేదు?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : అప్పుడు మనలను రక్షించుటెవరు?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : దానికే **ఈశ్వరుడనుట.**



# నాలుగవ అధ్యాయము

శిష్యుడు : స్వామి! మొదటి అధ్యాయమున జీవశక్తియైన వాయువునే ఈశ్వరుడని చెప్పితిరిగదా! అదెట్లనగా వివరించి చెప్పవలయునని వేడుకొనుచున్నాను.

గురువు : ఎట్లనగా, ఈశ్వరుడనుటకు తాత్పర్యము, భరణ శ్రేష్ఠయనునదిగాయున్నది. అదెట్లనగా ఈశ్ + వరణ్ ఈశ్ = భరణ్ యనగా కాపాడుట. వరణ్ = శ్రేష్ఠుడు. అట్లయిన ఈశ్వరుడనగా, భరణ శ్రేష్ఠుడై యున్నది. కావున మనలను భరించుకొనియుండువారు, అనగా కాపాడుకొనియుండు వారు ఎవరు?

శిష్యుడు : జీవశక్తియైయున్న వాయువు.

గురువు : అటువంటి వాయువు లేనియెడలమనము అన్న పానాదులను తీసికొనుటకు, మాట్లాడుటకు, కదలుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : అది మాత్రముకాదు. సృష్టి, స్థితి, సంహారాదులను చేయుట, ఈశ్వరుడని చెప్పుచున్నారు. అది సరియై యున్నది. అట్లుచేయుట జీవశక్తియైన వాయువైయున్నది. దానికి ఉదాహరణము: ఇచ్చట కొంత అగ్నిని తెచ్చి పెట్టి,

దాని మీద కొబ్బరి మట్టలనుంచిన అది తానుగనే రగులునా?

శిష్యుడు : రగులదు.

గురువు : అది రగులవలయుననిన యేమి చేయవలయును?

శిష్యుడు : ఊదవలయును.

గురువు : ఊదుటెట్లు?

శిష్యుడు : జీవశక్తియైన వాయువులో నుండి

గురువు : ఆ వాయువులోనుండి యేమి కలిగినది?

శిష్యుడు : అగ్నిలో ప్రకాశము కలిగినది.

గురువు : ఆటువంటి ప్రకాశమును మనము చూచు చున్నామా?

శిష్యుడు : చూచుచున్నాము.

గురువు : ఆ ప్రకాశమును చూడవలయుననిన, ఏమి ఉండవలెను?

శిష్యుడు : రూపముండవలయును.

గురువు : వాయువునకు రూపమున్నదా?

శిష్యుడు : లేదు

గురువు : రూపము దేనికి కలిగినది?

శిష్యుడు : అగ్నికి

గురువు : అగ్ని యొక్క రూపమేది?

శిష్యుడు : ప్రకాశము.

గురువు : అప్పుడు ప్రకాశమైయుండు రూపమును సృష్టించిన దెవరు?

శిష్యుడు : వాయువు.

గురువు : అట్లయిన సృష్టికర్త యెవరు?

శిష్యుడు : జీవశక్తియైయుండు వాయువు.

గురువు : ఆ ప్రకారముగా వాయువునుండి సృష్టించబడిన ప్రకాశమైన రూపమునుండి, ఒక దీపమునందు నూనె పోసి వత్తినుంచి దానిని వెలిగించి, దానిని ఒక పెట్టెలో నుంచి ఆ పెట్టెను మూసిన అది వెలుగునా?

శిష్యుడు : వెలుగదు.

గురువు : ఏమి కారణము ?

శిష్యుడు : దాని లోపల వాయువు లేనందువలన?

గురువు : అది వెలుగుచుండవలయుననిన ఏమి కావలయును?

శిష్యుడు : వాయువు కావలయును.

గురువు : అప్పుడు స్థితి చేయున దెవరు?

శిష్యుడు : వాయువే.

గురువు : ఆ వెలుగుచుండు ప్రకాశమైన రూపమును ఆర్పవలయుననిన, ఏమి కావలయును?

శిష్యుడు : వాయువు కావలయును.

గురువు : వాయువుచేత ఆర్పుట యెట్లు?

శిష్యుడు : ఊది ఆర్పుట.

గురువు : అప్పుడు సంహారము చేయునదెవరు?

శిష్యుడు : వాయువే!

గురువు : అట్లయిన సృష్టి, స్థితి, సంహారాదులను చేయునదెవరు?

శిష్యుడు : జీవశక్తియైన వాయువేనని స్పష్టమగుచున్నది.

గురువు : కనుక అటువంటి వాయువేశక్తి. ఆ శక్తియందుండియే సృష్టి, స్థితి, సంహారాదులు కలుగుట. దీనికే శివశక్తియని చెప్పుట. కావుననే **శక్తి విడిచిపోయిన శివుడు శవరూపమై** ఉండునని చెప్పుటకు కారణము. అదిగాక, సర్వ అర్థములు, అనర్థములు కల్పించుటయు, ప్రపంచముయొక్క ఏ కారణముగాను, విశేషమైయుండు శరీరమై యున్నది.

శిష్యుడు : స్వామీ? ఇదివరకు అన్నిటికి కారణము జీవశక్తియైన వాయువని చెప్పినారు. కాని ఇప్పుడు శరీరమని చెప్పుచున్నారు. దీనికి కారణమేమి?

గురువు : శరీరమనగా ఏమని మీకు తెలియునా?

శిష్యుడు : తెలియును.

గురువు : అదేది?

శిష్యుడు : అది ఈ జడము.

గురువు : నీవు ఇప్పుడు తాకిచూపిన దానికి శరీరమని పేరు లేదు. దానిని రొమ్మని చెప్పుదురు. శరీరమును తాకి చూపుటకు వీలున్నదా?

శిష్యుడు : అన్ని అవయవములు కూడిన రూపమునకు శరీరమని పేరు.

గురువు : అయిన, అన్ని అవయవములు లేనిచో దానికి శరీరమని చెప్పరాదా?

శిష్యుడు : చెప్పకూడదు.

గురువు : ఒకనికి కాళ్లు లేవు. ఒకనికి చేతులు లేవు; మరొకనికి నేత్రములు లేవు, ఇంకొకనికి ముక్కులేదు, వేరొకనకి పై జెప్పిన అవయవములు, అనగా కాళ్లు, చేతులు, ముక్కు, కండ్లు ఏవియులేవు. అయిన అటువంటి వారికి శరీరములేదని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : అది మాత్రముకాదు. దేహమునందలి పై జెప్పిన అవయవములకు వేర్వేరుగా ఒక్కొక్క పేరున్నది. కావున

అదేదియు శరీరముకాదు. అదియునుగాక, చర్మము, నరములు, ఎముకలు మొదలైనవి శరీరమునకు సంబంధించినవని చెప్పబడియున్నది. అట్లున్న చర్మ నరములు, ఎముకలు, వీటిని తీసివేసిన శరీరమును చూడవీలున్నదా?

శిష్యుడు : చూచుటకు వీలులేదు.

గురువు : ఎందువలన? మిమ్ము ఇప్పుడు ఇద్దరు లేక ముగ్గురు తాకుకొనియుండిన, ఆ సమయమందు వారు మీకు సంబంధించియున్నారుగదా?

శిష్యుడు : అవును.

గురువు : వారు మిమ్ములను తాకకయున్న సమయమున, వారు మీకు సంబంధించియున్నారా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు మిమ్ములను వేరుగా చూడవచ్చును గదా?

శిష్యుడు : చూడవచ్చును.

గురువు : అట్లయిన శరీరమునకు సంబంధించిన చర్మ నరములు, ఎముకలు మొదలగునవి వేరుగా తీసివేసిన ఈ శరీరమును ప్రత్యేకముగా చూడవలయును గదా?

శిష్యుడు : చూడవలయును.

గురువు : అయితే అట్లు కనబడుచున్నదా?

శిష్యుడు : కనబడుటలేదు.

గురువు : కావున ఈ కనబడుదానికి శరీరమని చెప్పుటకు వీలులేదు. శరీరమనుదేదనగా, ద్రవించునది; అనగా ద్రావకము. అనగా ఊటజలమువచ్చులాగున ఉండునది లేక క్షయించు నటువంటిది అనగా తగ్గునటువంటిది, మఱియు క్షీణించునటువంటిది; అనగా తఱిగిపోవునటు; వంటిది; అనగా నాశనమైపోవు నటువంటిది. అట్లు న్నప్పుడు ఈ తాకి చూపినది శరీరమని చెప్పిన ఇది నాశమగు చున్నదా?

శిష్యుడు : నాశమగును.

గురువు : ఎప్పుడు?

శిష్యుడు : చనిపోయినప్పుడు.

గురువు : సత్తువు పోయిన (చనిపోయిన) ఇది నాశనమగునా?

శిష్యుడు : నాశనమగును.

గురువు : ఇది తప్పు. ఎప్పుడును నశించదు. నీవు దీనిని శరీరమని తాకిచూపినావు. అట్లయిన చనిపోయినను యిది కనబడుచున్నది. నశించుటలేదు; పిమ్మట దీనిని ఒక గుంటలో ఉంచి పూడ్చి , లేక కాల్చి బూడిదగ చేసినను పూర్తిగా నశించుట లేదు.

శిష్యుడు : ఇది పూర్తిగనే నశించుట కద్దు.

గురువు : అదెట్లు?

శిష్యుడు : కొంచెము కాలము ఉంచిన

గురువు : కొంతకాలముంచిన ఎట్లు నాశనమగు చున్నది?

శిష్యుడు : క్రిమికీటకాదులు (పురుగులు) తినిన నాశన మగుచున్నది.

గురువు : కాని, ఇది పూర్తిగా నశించుటలేదు. ఏలననగా, మరొకటి వలన దానికి ఉపద్రవము రాకుండునటుల భద్రపరచిన అది నశించుటలేదు. దానికి దృష్టాంతము. ఈజిప్ట మొదలగు అనేక దేశములలోనుండు అత:పురములలో అనేక వేలసంవత్సరముల క్రిందట నున్న శవములు ఇప్పుడునుయున్నవని నీవు వినియున్నావు గదా? మనము వాటిని చూడలేదు. చూచిన వాటిని చెప్పెదను. అనేక ప్రదర్శనశాలలలో అనేక శవములను ద్రావకములలోనుంచి పదిలపరచియున్నారు. అవి నశించి నటుల కనబడుట లేదు. అయిన వాటినిగూడ అందరును చూచియుండరు. లోకమున సర్వజనులు చూచువచ్చు దృష్టాంతము చెప్పెదను. అదేదనగా సముద్రమున నుండు తిమింగలము, మత్స్యాదులు మొదలగు పెద్దపెద్ద చేపలను పట్టి, ఉప్పువేసి ఎండబెట్టి పదివేల సంవత్సర ముల క్రిందటనుండినవి ఇప్పుడునున్నవి. వాటిని అనేకులు చూచు చున్నారు. అదే ప్రకారముగా దీనిని భద్రపఱచిన అది నశించునా?

శిష్యుడు : నశించుటలేదు

గురువు : అయిన ఇది నశించుట ఎట్లనగా పై జెప్పిన చేపలైన శవములను, మనుష్యులని అభిమానించివచ్చు పురుగులు తిని ముగించునట్లు, ఆ శవములయొక్క చర్మ, మాంసము మొదలగువానిని మాత్రమే తినుట తప్ప పూర్తిగా తినుటకు సాధ్యపడదు. ఈ విధముగా కాక అది పూర్తిగా నశించుటలేదు. అదెట్లనగా ఒకడు చనిపోయిన శవమగును. ఆ శవమును గుంటలో పూడ్చి పది లేక నూరు సంవత్సరములతరువాత తీసిచూచిన ఏమి ఉండును?

శిష్యుడు : అస్థికలును, పుర్రె యెముకలు మొదలగునవి కనబడును.

గురువు : ఆ విధముగా నశించిపోయిన ఎడల చూచుటకు సాధ్యపడునా?

శిష్యుడు : సాధ్యపడదు.

గురువు : దానికి ఉదాహరణము: బాగా ముదిరిన వృక్షము యొక్క మ్రాను ముక్క (లోపలనల్లగానుండునది). ను మట్టిలో పూడ్చియుంచి పదిలేక నూరుసంవత్సరముల పిదప త్రవ్విచూచిన ఎట్లుండును?

శిష్యుడు : ఆ మ్రానుముక్కలోపల నల్లని భాగము మాత్రము మిగిలిఉండును.

గురువు : అది ఎట్లనగా, వృక్షము పై బెరడు లోపలి పిండివంటి భాగము చెదలుపట్టి లోపలి నల్లని భాగము మాత్రము కనబడును. ఈ ప్రకారముగానే ఒక శవమును పై జెప్పిన

మ్రానుముక్కవలె గోతిలో నుంచి పూడ్చిన క్రిమికీట కాదులగు పురుగులు ఆ శవమునందలి చర్మము, కండతిని, దానియొక్క ఆధారమైన అస్థికలును, పుర్రె యెముకలును కనబడును. చర్మము, కండతో సృష్టి లేదు. దానికి అస్థిభారమైన పుర్రెయెముకలు, ఎముకలు నశించుటలేదు. అదియునుగాక, నిప్పులో నుంచి కాల్చినను, పూర్తిగా నశించుట లేదు. ఎందువలన ననగా పటకారుతో ఆ నిప్పునుండి ఎముకలను ఏరుదురు. వానిని గంగలోగాని (రామేశ్వరము) సేతువులోగాని కలుపుటయో, లేక భూమిలో దాచియుంచుటయో చేయుదురు. ఇది అంతయు చూచునప్పుడు, ఆలోచించునప్పుడు, జడము నాశనమగుటయో పూర్తిగా నశింపజేయుటకో సాధ్యము కాదని తెలియుచున్నది. ఈ జడము నశించి పోవును, అనుటయేగాని, యదార్థముగా దీనిలో నుండి ఏది నశించి పోవుచున్నదని ఆలోచించుటలేదు. కాబట్టి చనిపోయి నప్పుడు దీనిలోనుండి పోయినదేది?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : దీనిలో నుండు జీవశక్తి నశించిపోయిన సమయమున దీనికి ఏమని పేరు?

శిష్యుడు : శవమని పేరు.

గురువు : ఇది వరకు దానికేమని పేరు.

శిష్యుడు : శరీరమని పేరు.

గురువు : కనుక ఎప్పుడు శరీరమనియును, ఎప్పుడు శవమని పేరు?

శిష్యుడు : జీవశక్తియైయుండు వాయువున్నంతవరకు శరీరమనియు, అది లేనప్పుడు శవమనియు పేరు.

గురువు : ఇందువలననే జీవశక్తియైయుండు వాయువును శరీరమని చెప్పవలెను. అటువంటి శరీరమైయుండు వాయువు ఈ జడమున స్థితి చేయువరకు దీనికి శరీరమనియును, అది ఎప్పుడు ఈ జడము నుండి నాశనమగుచున్నదో అప్పుడు శవమనియు చెప్పుట. అది ఏలాగనగా, ఒక అరటిపండును ఇచ్చట తెచ్చియుంచిన దానికి ఏమని పేరు చెప్పుచున్నారు?

శిష్యుడు : అరటిపండనియే.

గురువు : అటువంటి అరటిపండును ఒలిచి వేసి పండును తినిన పిదప ఏది మిగులుచున్నది?

శిష్యుడు : తోలు.

గురువు : అట్లయిన దానికి ఏమని చెప్పుట?

శిష్యుడు : తోలనియే.

గురువు : అట్లు చెప్పుటకు కారణమేమి?

శిష్యుడు : దానిలో సత్తువు లేనందున.

గురువు : దానియందు సత్తువున్నప్పుడు దానికి పేరేమి?

శిష్యుడు : పండని.

గురువు : దాని యందు సత్తువయున్నప్పుడు దానికి పండని యు, సత్తువ లేనప్పుడు దానికి తోలనియు చెప్పుచున్నారు. అదేలాగున జీవుడు దీనిలో నున్నంతవరకు శరీర మనియును, జీవుడు నశించిన వెనుక శవమనియును చెప్పుదురు. అదే ప్రకారముగా ఈ శరీరము అగు వాయువు జడము నుండి నశించినప్పుడు శవమైనది. కావున వాయువే శరీరము. అదియునుగాక, శరీరము యున్నప్పుడు ఆహారము తినుటకు, చేష్టలను చేయుటకు, చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు, కదలుటకు మొదలగు వాటికి సాధ్యముకాదు. ఈ జడము అనునదే శరీరమనగా, చనిపోయినప్పుడును మీరు ఈ జడమును చూచు చున్నారుగదా?

శిష్యుడు : అవును. చూచుచున్నాము.

గురువు : అటువంటి సమయమున పైన చెప్పబడిన చేష్టలు మొదలగున వేవైన ఉంటున్నవా?

శిష్యుడు : లేదు.

గురువు : అది శరీరమైనయెడల పై జెప్పిన చేష్టలుండ వలయును గదా?

శిష్యుడు : అవును. ఉండవలెను.

గురువు : అట్లయిన దీనిని శరీరము అని చెప్పుటకు వీలగునా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన శరీరమనున దేది?

శిష్యుడు : జీవ శక్తియైన వాయువేనని స్పష్టమగుచున్నది.

గురువు : అట్లయిన జీవశక్తియైయుండు వాయువే ఈ జడము నుండి తఱిగితఱిగి నశించుచున్నది. అదెట్లనగా వూట జలము ప్రవహించులాగున పంచేంద్రియములని చెప్ప బడు ఐదు ద్వారములగుండా కరగి కరగి, బైట వెళ్ళి క్షయించి, అనగా తగ్గి, తగ్గి, క్షీణించి, నుండి, నశించి, లేకుండ పోవుచున్నది. ఆ ప్రకారముగా నశించి పోవు వస్తువేది?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : దానినే శరీరమనియును, దేహమనియును చెప్పుట. అదియునుగాక, ఒకని మోకాలు రక్తవాతముచే వాచి పోయిన, ఆ కాలును అతడు కదలించుటకు వీలగునా?

శిష్యుడు : వీలుపడదు.

గురువు : కారణము ఏమి?

శిష్యుడు : ఆ మోకాలునందు రక్తము గట్టిపడుట వలన జీవశక్తియైన వాయువు యొక్క సంచారమునకు అడ్డంకు వచ్చుటవలన.

గురువు : ఆ తరువాత పక్షవాతము వచ్చుటవలన చేతులు కాల్ళు పడిపోయిన వారి కాళ్ళు చేతులకు శక్తిగాని గిల్లిన

బాధగాని ఉండునా? అదియునుగాక ఆ కాళ్ళు చేతులను తనంతట తానే కదులపుటకు సాధ్యపడునా?

శిష్యుడు : సాధ్యపడదు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : జీవశక్తియైన వాయువుయొక్క గతా గతము లేనందువలన.

గురువు : అప్పుడు క్షీణించున దేది?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : ఆ జీవశక్తియైన వాయువే దేహము. దేహమనగా దహింపబడునది అని అర్థము. అట్లు దహించునది జీవశక్తియైన వాయువే. అదెట్లనగా, రాళ్ళచే కట్టబడిన ఒక గదిలో టెంకాయ చిప్పలను ఎండిన కట్టెలను ఉంచి, మట్టినూనె (కిరసనాయిల్) పోసి దానిలో నొక జడమును ఉంచి, రగిలించి దానిలో వాయువు పోనీయక భద్రపరచిన అది రగులునా?

శిష్యుడు : రగులదు.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : వాయువు దానిలో ప్రవేశించక యున్నందున.

గురువు : అప్పుడు వాయువు దేనిలో యుండుట?

శిష్యుడు : వాయువునందు

గురువు : ఇదిగో ఇచ్చట నుండు ఒకకట్టెకు అగ్నియుంచి, రగులుచున్నప్పుడు, దానికిచేరక దగ్గిరయుండు వేరొక కట్టె రగులునా?

శిష్యుడు : రగులదు.

గురువు : ఏ వస్తువునందు అగ్నియున్నదో ఆ వస్తువే రగులుచున్నది. కాబట్టి, వాయువునందు, అగ్ని ఉండుటవలన ఆ వాయువే దహించబడుచున్నది. అదెట్లనగా, శబ్దము అగ్ని స్వరూపమైయున్నది. ఆ శబ్దరూపముగా జీవశక్తియైన వాయువు దహించి, నశించిపోవును. కావున దానికి దేహమని చెప్పుట. అందువలననే అరవము నందు కత్తాదే. కత్తాదే (అరవకు, అరవకు) అని చెప్పుట. అదియునుగాక మలబారు నందు కొన్ని స్థలములందు ఏడ్చుటను. "కాలుగ " అనియు చెప్పుదురు. అట్లు చెప్పుటకు కారణము ("కత్తున్నదుం", "కాళున్నదుం") అరచుటయును, ఏడ్చుటయును అగ్నియైయున్నది. అందువలన అగ్ని స్వరూపమైన శబ్దరూపముగా, జీవశక్తియైయున్న వాయువు నశించి పోవుటవలన వాయువు దేహము అని చెప్పుట. కాబట్టి ఆ జీవశక్తియైయున్న వాయువే ఈశ్వరుడు. ఆ ఈశ్వరుడే సృష్టి, స్థితి సంహారాదులను చేయుట. అదియునుగాక, మనలను సృష్టించునది ఆ జీవశక్తియైన వాయువే. దానికి దృష్టాంతము. ఒక శవము సంయోగముచేయునా?

శిష్యుడు : చేయదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : ఆ శవమున జీవశక్తియైన వాయువు లేనందున.

గురువు : అప్పుడు జీవశక్తియైన వాయువు గతా గతము చేయునప్పుడు మాత్రమే సృష్టికలిగించుటకు వీలుపడును. అటువంటి సమయముననే సంయోగము చేయుటకు ఆగ్రహమును, సంయోగము చేయుటకు వీలుకలుగును. సంయోగము లేనియెడల సంతానము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : సంయోగము లేనందువలన.

గురువు : అట్లయిన సంయోగము చేయుటకు ఏమి కావలయును?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు కావలయును.

గురువు : అప్పుడు సృష్టించునది ఏది?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : అయిన అటువంటి వాయువొకటి ఉండిన మాత్రమున సృష్టియగునా?

శిష్యుడు : అగుటలేదు.

గురువు : అట్లయిన ఆ వాయువు దేనినుండి సృష్టించు చున్నది?

శిష్యుడు : పంచభూతములనుండి

గురువు : పంచభూతములేవి?

శిష్యుడు : పృథ్వి (మన్ను), అప్పు (జలము), తేజస్సు (అగ్ని), వాయువు, ఆకాశము ఇవియే.

గురువు : వీటినన్నింటిని రూపము లేని ఈశ్వరుడు ఒక స్త్రీ కడుపులోనికి తీసికొనివెళ్లి ఏవిధమున సృష్టించుట? అట్లు సృష్టించుటకు వీలగునా?

శిష్యుడు : వీలుకాదు.

గురువు : అట్లయిన దేని నుండి సృష్టించుటని మనము ఆలోచన చేయవలసినది. దానికి దృష్టాంతము. నాలుగైదేండ్ల ప్రాయముగల ఒకబిడ్డ సంయోగము చేసిన అటువంటి సంయోగమునుండి సంతానము కలుగునా?

శిష్యుడు : కలుగుట లేదు

గురువు : కారణమేమి?

శిష్యుడు : ఆ బిడ్డకు ఇంద్రియ స్ఖలనము లేనందున.

గురువు : ఇంద్రియమనగా నేమి?

శిష్యుడు : శుక్లము.

గురువు : శుక్లమై యుండు బీజము స్త్రీ యందు పోయి పడక యుండిన గర్భము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : అప్పుడు దేని నుండి సృషించుట?

శిష్యుడు : శుక్లము నుండి.

గురువు : అటువంటి శుక్లము జీవునకు క్రిందుగనున్నదా? లేక పైగనున్నదా?

శిష్యుడు : జీవునకు క్రిందుగనే యున్నది.

గురువు : అప్పుడు ఆ జీవుడు ఎచ్చట నున్నాడు?

శిష్యుడు : అకాశమున

గురువు : ఆ అకాశము ఏదని మునుపు చెప్పబడినది?

శిష్యుడు : శిరస్సుయని.

గురువు : కాబట్టి, ఆ అకాశము భ్రూమధ్యమునకు పైన శిరస్సులోపల మాడు(ఉచ్చి)వరకున్నది. ఆ అకాశము నందే జీవుడుండుట. ఆ జీవుని చలనమునకే జీవశక్తియైన వాయువని చెప్పుట. ఆ వాయువు ఉద్భవించిన భ్రూమధ్య ములోనే శుక్లముండుట. శుక్లము భ్రూమధ్యముననే ఉన్నదనుటకు దృష్టాంతము: వ్యాధి వలన జడము కృశించియో లేక నాడులకు క్షీణము కలిగియో, లేక చాలదూరము నడచుటవలన ధాతువులకు క్షీణము కలిగినందు వలననో, మొదట స్త్రీలను చూచి మోహించియో, అదియునుగాక వేరేదైనయొక విధమైన

కామము చేత స్వస్థానము నుండి చలించియున్న శుక్లము, సంయోగ సమయమున చలనమైన, ఎచ్చట నుండి శుక్లము బైట వచ్చుచున్నది తెలియుటలేదు. పై జెప్పిన ప్రకారము ఏ విధముననను కామకళయైన స్వస్థానము నుండి ముందుగనే చలించక, సంయోగశ్రమ సమయము మాత్రము శుక్లము చలించునట్లయిన జడము వణకును. కండ్లు మూసి, మూసి తెరచుకొనును. తలవణకును. దానికి కారణము సర్వనాడులును (నరములును) చేరు స్థలము భ్రూమధ్యము. అదియే సుషుమ్నయని చెప్పబడు అగ్ని నేత్రము. నాడులలో నుండి ఉద్భవించిన వీర్యమే శుక్లము. అది అగ్ని నేత్రమగు భ్రూమధ్యమునయుండును. దానికే అగ్ని స్వరూపమైన శుక్లమని చెప్పుట. జీవుని నుండి ఉద్భవించిన శక్తియైన వాయువు. జడములోన క్రిందకు మీదకు గతాగతము చేయుటయు, అటువంటి శక్తి పై విధమైన చలనము వలన పంచేంద్రియముల మూలముగా బైటకుపోయి నశించుచున్నది. ఈ ప్రకారముగా నశించబడు శక్తియే మాయ సృష్టి కలుగుట సంయోగమువలన అయిన సంయోగసమయమున పై జెప్పిన ప్రకారము పంచేంద్రియముల మూలముగా బైటకు పోవుశక్తి బైట పోక తనలోపలనే ఏకగతియై వేగశ్వాసమై, పై భాగమున తన ఉద్భవస్థానమైన భ్రూమధ్యమునకు వెళ్లి, అచ్చటస్థితి చేయుచున్న జీవునితో జేరును. అనగా, లోపల గతాగతము చేయుచుండు శక్తి స్త్రీగను, భ్రూమధ్యమున స్థితిచేయు చుండు జీవుడు

పురుషుడుగను యున్నది. ఈ ప్రకారముగా నుండు స్త్రీ, పురుష సంయోగము నుండి అగ్ని స్వరూపమైయుండు శుక్లమును చలింపచేసి, ఆ శుక్లమును పై జెప్పిన జీవుడు శక్తి సమేతముగా క్రిందికి కొనివచ్చి, శక్తిద్వారా, ఆ శుక్లము నుండి ఆ జీవశక్తియై ఉండు వాయువు సష్టించుచున్నది. ఈ విధముననే సృష్టి కలుగుచున్నది.

శిష్యుడు : గురువే! సృష్టి నాలుగు విధములుగనున్నది: అనగా స్వేదజ, అండజ, ఉద్భిజ, జరాయుజయని చెప్పుచున్నారు. కనుక అటువంటి సృష్టిస్థితులను వివరించవలయునని అపేక్షించుచున్నాను.

గురువు : మీరు స్వేదజ, అండజ, ఉద్భిజ, జరాయుజ యని సృష్టి నాలుగువిధములని చెప్పినారు గదా! అవి ఏవని మీరు గ్రహించితిరి?

శిష్యుడు : స్వేదజమనగా చెమట నుండి ఉద్భవించు పేనులు, నల్లులు మొదలగునవియు, అండజమనగా గ్రుడ్ల నుండి కలుగు పక్షులు, పాములు, చేపలు మొదలగునవి. ఉద్భిజమనగా పృధ్విలో నుండి ఉత్పత్తియైన పచ్చిక, పొదలు, వృక్షాదులవరకు ఉండునవి; జరాయుజ మనగా ప్రసవించు నటువంటి మనుష్యులు, పశువులు మొదలగునవియనియే.

గురువు : అయిన ఆ ప్రకారముండుటకు వీలులేదు. ఏలననగా, మీరు తలచిన ప్రకారము చెమట నుండియు,

గుడ్లనుండియు, భూమినుండియు, ప్రసవము



నుండియు, ఉద్భవించునవి అన్నియు వేర్వేరు విధమున గాదు. అన్నియు ఒకే విధముననే ఉద్భవించుట. అదేలాగననగా నల్లి, పేను మొదలగునవి గ్రుడ్లనుండియే ఉద్భవించునటువంటివి. నల్లులుండు స్థలములైన రంధ్రములలో అనేక నల్లులగ్రుడ్లను చూడవచ్చును. ఆ గ్రుడ్లు పగిలియే నల్లులు వచ్చు చున్నవి. అదే ప్రకారముగా పేనులకును గ్రుడ్లున్నవి. ఆ గ్రుడ్లకే "ఈపె" అని పేరు. ఆ ఈపె పగిలిన పేనులు వచ్చును. ఇది మనకందరకు తెలిసిన అనుభవ విషయమే గదా? ఇటువంటి రెండు వర్గములను మనుష్యులని అభిమానించు వారి రక్తపానము చేసి జీవించుచున్నవి. కనుకనే నల్లులు జనులు అధికముగా నివసించు స్థలములందును, పేనులు జనుల తలలయందును ఉంటున్నవి. ఇట్లుగాక చెమటనుండి ఉద్భవించునట్లయిన, అందరికిని చెమట కద్దు. అయిన అందరికని పేనులు ఉండుటలేదు. అదిగాక జనులు నివసించు అన్ని స్థలములలోను నల్లులుకనబడుట లేదు. ఇది మాత్రముకాదు. అనగా బ్రహ్మాండ కటాహమే స్వేద జోద్భవము. అనగా లోకము యావత్తు స్వేదము నుండియే ఉద్భవించునది. స్వేదము = స్వయముగా కలుగు చెమట. ఆ చెమట కలుగుటకు కారణమేమి?

శిష్యుడు : ఉష్ణ మధికమైనందువలన.

గురువు : ఉష్ణ మధిక మగుటకు కారణమేమి?

శుక్లము వృద్ధియై కామాదులు కలుగుచున్నవి. ఈ ప్రకారముగనే అన్నియు స్వేదము నుండియే ఉద్భవము.

శిష్యుడు : ఇటువంటి శుక్లము నుండి ఏవిధముగ సృష్టించు టని వివరముగా చెప్ప వేడుకొనుచున్నాను.

గురువు : ఈ స్వేదమైయుండు శుక్లము మొదట గ్రుడ్లగుచున్నది. ఆ గ్రుడ్ల నుండియే ఉద్భవము. అదేలా గనగా, నేపాళం పాలును ఒక ఆకునయుంచి, ఒక కొబ్బరిపుల్లను గుంఁడ్రముగా ఉంగరములాగున చేసి, ఆ పాలలో తడిపి, తీసి, వూదిన అదెట్లు పోవుచున్నది?

శిష్యుడు : అది గ్రుడ్ల ఆకారమున పోవుచున్నది.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : దానిని ఊదినప్పుడు, వాయువు దానిలో చేరినందున

గురువు : అట్లయిన, ఆ పాలు యొక విధమైన జిగటకలిగినది. ఆ జిగటగానున్న పాలలో వుంగరము లాగున చేసిన పుల్లను ముంచినప్పుడు, దానిలోగల జిగట పాలు గుంఁడ్రమైన ఆకారముగా అంటుకొని, దానిలో ఊదిన ప్పుడు, ఆ జిగటగలపాలు ఆ పుల్ల నుండి వేరుపడక, సాగి దానిలో వాయువునిండి గ్రుడ్డు యొక్క ఆకారము గలపుల్ల నుండి వేరై పోవుచున్నది. కాని ఒకటియో, రెండో, కొన్ని ఐదో, పదియో, మరికొన్ని చిన్న చిన్నవై, అధికముగాను, కొన్ని ఏమియులేకను పోవుచున్నవి. ఇది వూదువారి క్రమము అనుసరించి సంభవించుచుండును. ఈ

ప్రకారమే శుక్లమనునది ఒక విధమైన జిడ్డయి ఉన్నది. ఆ జిడ్డయి ఉండు శుక్లమును సంయోగ సమయమున జీవశక్తియైన వాయువు చలింపజేసి, ఆ శక్తియైన వాయువు మూత్ర ద్వారము మూలముగా త్రోసికొని బైటకు వచ్చుట. మూత్రద్వారపు కొనవరకు వచ్చిన సమయమున ఒకే విధముగనున్న శక్తితో గూడిన ఆ వాయువు యొక్క గతియనగా ఆ శుక్లము మూత్రద్వారము కొనయందు కొంచెముసాగి, దానిలో ఆ జీవశక్తియైన వాయువునిండి, అది యొక గ్రుడ్డు ఆకారముగా మూత్ర ద్వారము నుండి వేరుపడి గర్భపాత్రమున పోయి పడుచున్నది. ఆ ప్రకారముగా ఎన్ని చుక్కలు పైన జెప్పిన ప్రకారమైన శక్తితో గూడిన వాయువునిండి గ్రుడ్ల ఆకృతిగా గర్భ పాత్రమున చేరి పడుచున్నదో, అంతమంది బిడ్డలు కలుగుచున్నది. అదియునుగాకకొంత మంది పాము గ్రుడ్లను ప్రసవించు చున్నారని చెప్పుచున్నారు. ఇది పాము సంయోగము చేసినందువలన గాదు. ధాతుశక్తి యెక్కువైన సంయోగ సమయమున తీవ్రమధికమై, జీవశక్తియైయుండు వాయువు శుక్లమును బైటికి తీసికొనవచ్చునప్పుడు దాని నుండి పన్నీరు చెంబున ద్వారములుండు ప్రక్కన విదలించిన ఏలాగు దానిలోనుండు పన్నీరు అణువు అణువై చిన్న చిన్న చుక్కలుగా బైటపడుచున్నదో, ఏలాగో మూత్రద్వారము కొననుండి వాయువు శక్తివలన శుక్లము చెదిరి అదియంతయు జీవశక్తియైన వాయువుతో నిండి వేరుపడక కొబ్బరి చెట్టు పుష్పమురీతిగా గర్భపాత్రమున

పోయిపడుచున్నది. ఈ ప్రకారముగా ఉద్భవించి ప్రసవించుటకే పాము గ్రుడ్లను ప్రసవించుట అని అనేకులు చెప్పుట. ఈ ప్రకారముగనే సృష్టి యొక్క స్థితి. ఇట్లుగాక వేరు విధముగా సృష్టికలుగుటకు వీలున్నదా?

శిష్యుడు : మీరు చెప్పినది ఆలోచించినప్పుడు ఈ ప్రకారమున గాక వేరేవిధమునను సృష్టికలుగుటకు వీలులేదని తెలియుచున్నది.

గురువు : అప్పుడు మనలను సృష్టించిన దెవరు?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు.

గురువు : అప్పుడు సృష్టికర్త యెవరు?

శిష్యుడు : జీవశక్తియైయుండు వాయువే.

గురువు : మనము జీవించి ఉండవలయుననిన యేమి కావలయును.

శిష్యుడు : వాయువు కావలయును.

గురువు : అప్పుడు మనలో స్థితి చేయుట, రక్షించుట యెవరు?

శిష్యుడు : వాయువు.

గురువు : ఒకడు చనిపోయినప్పుడు వానిలో ఏమి లేక పోయినది?

శిష్యుడు : వాయువు లేక పోయినది?

గురువు : అప్పుడు సంహరించున దెవరు?

శిష్యుడు : వాయువు.

గురువు : అప్పుడు సృష్టి, స్థితి, సంహారాదులను చేయు టెవరు?

శిష్యుడు : జీవశక్తియైయుండు వాయువనియే నిశ్చయ మగుచున్నది.

గురువు : ఇటువంటి వాయువునకే ఈశ్వరుడని చెప్పుట. ఇందువలననే ఈశ్వరునకు నామరూపములు లేవనియు, బైట లోపల, ఆది, అంత్యము లేని సర్వవ్యాపి యనియు, బైటను, లోపలను నిండియుండు వస్తువనియు, చెప్పుటకు కారణము. ఎందువలననగా, వాయువునకు నామరూపములున్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : ఇందువలననే ఈశ్వరునకు నామరూపములు లేవని చెప్పుటకు కారణము. వాయువునకు లోపల బైట అను అవస్థలు ఉన్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : ఇందువలననే ఈశ్వరునకు లోపల బైట లేవని చెప్పుటకు కారణము. వాయువునకు ఆది, అంత్యము ఉన్నవా?

శిష్యుడు : లేవు.



గురువు : ఇందువలననే ఈశ్వరునకు ఆది అంత్యము లేదని చెప్పుటకు కారణము. అయిన అటువంటి వాయువు ఎట్టిదై యున్నది?

శిష్యుడు : సర్వవ్యాపిగా ఉండునది.

గురువు : దీనివలననే ఈశ్వరుని సర్వవ్యాపియనుటకు కారణము. అదిగాక ఈశ్వరుడు లోపల, బైట, నిండిన వస్తువని చెప్పుట. లోపల, బైట, లేని వస్తువునకు లోపల, బైట నిండియుండుటకు వీలగునా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన మనము లేని యెడలమనకు లోపలబైట అనునది ఉండునా?

శిష్యుడు : ఉండుట లేదు.

గురువు : ఎప్పుడు లోపల బైట కలిగినది?

శిష్యుడు : మనము పుట్టిన వెనుక.

గురువు : మనము నిద్రించుసమయమున లోపల బైట అనునవి ఉన్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : అట్లయిన ఏప్పుడు లోన, బైట అనునది కలిగినది?

శిష్యుడు : నిద్రలో నుండి లేచినప్పుడు.

గురువు : అదెచ్చట నుండి కలిగినది?



శిష్యుడు : మనలోనుండియే.

గురువు : అప్పుడు నిత్యమైయుండు తాను, అకాశమై సంభవించి లోపల, బైట అనునది కలిగినది. అది తనలో నుండి తానే కలిగినది. అప్పుడు తనలో నుండి ఉద్భవించిన లోపలను బైటను నిండియుండు వస్తువేది?

శిష్యుడు : వాయువు.

గురువ : ఇందువలననే ఈశ్వరుడు లోపలను బైటను నిండియుండు అనుటకు కారణము. అప్పుడు ఈశ్వరుడై యుండు వస్తువేది?

శిష్యుడు : మనలోనుండు జీవుడైన వాయువు.

గురువు : తెలివి యను వస్తువేది?

శిష్యుడు : ఆ వాయువే.

గురువు : కాపాడు వస్తువేది?

శిష్యుడు : అదియును వాయువే.

గురువు : ఇప్పుడు ఈశ్వరుడై, తెలివియై, కాపాడునటువంటి వస్తువు వాయువేయని తెలియవచ్చినది. అది తెలియక మనము రాళ్ళు, మ్రాను మొదలగు వాటి నుండి చేయబడిన బొమ్మలను ఈశ్వరుడని సంకల్పించి మనలోన స్థితి చేయు జీవశక్తియైయుండు వాయువు. అధోగతియై వెళ్ళినప్పుడు చనిపోవుచున్నాము. కావుననే

దానిని బైట పోనీయక తనలో తానే నిల్పి ఈశ్వరునితో



చేరుటయే మోక్షము. దీనికే ఈశ్వరసేవయని చెప్పుట. అయితే ఇప్పుడు లోకమున ఈశ్వరసేవయని చెప్పి చేయుచుండుట ఏవిధమున?

శిష్యుడు : స్నానము చేసి దేవాలయమునకు వెళ్ళి, దీపమును వెలిగించి, బింబమును కొబ్బరి నీళ్ళు, పాలు మొదలగు వాటితో అభిషేకముచేసి, వస్త్ర , పుష్పాదులచే అలంకరించి, పండ్లు, కొబ్బరికాయలనుంచి పూజ, నైవేద్య హోమము మొదలగునవి చేయుట, చేయించుట గానున్నది.

గురువు : దీనికి ఈశ్వరసేవయని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : ఈశ్వరసేవ అనగా నేమి?

శిష్యుడు : ఈశ్వరుని సేవించుట.

గురువు : ఈశ్వరుని సేవించుట అనగా నేమి?

శిష్యుడు : ఈశ్వరుని భజించుట.

గురువు : అయిన ఈశ్వరుని సేవించుట ఏవిధమనుటకు ఒక దృష్టాంతము: ఒక వైద్యుడు యొక వ్యాధికి అమృతవల్లి ఆరుకానులతూకము, కరక్కాయ తోలు నాలుగు కానుల తూకము, శొంఠి రెండుకానులతూకము - వీటిని తొమ్మిది లోటాలనీళ్ళలో కషాయము చేసి ఇగుర బెట్టి ఒక లోటా ఆగునప్పుడు దింపి వడియకట్టి, దానిలో ఒక ముక్క అచ్చు

బెల్లమును పొడిచేసి యుంచి, దానిని ఏమిచేయవల యునని వ్రాసి ఇచ్చుచున్నాడు?

శిష్యుడు : దానిని సేవించవలయునని.

గురువు : అప్పుడు సేవించుటయనగా నేమి?

శిష్యుడు : త్రాగుట.

గురువు : మనము ఈశ్వరమయమై ఈశ్వరునితో ఐక్యమగుట యేకదా కావలసినది?

శిష్యుడు : అవును.

గురువు : అప్పుడు ఈశ్వరమయ మగుటకు ఈశ్వరుని లోపలతీసికొనక బైట విడిచిన ఈశ్వరమయ మగునా?

శిష్యుడు : అగుటలేదు.

గురువు : అప్పుడు ఈశ్వరమయమగుటకుగాను, ఈశ్వరుని తెలిసి సేవించవలయును. ఈశ్వరుని తెలియనియెడల సేవించుటకు వీలగునా?

శిష్యుడు : అగుటలేదు.

గురువు : ఈశ్వరుడెవరని మనమిది వరకు గ్రహించితి మనగా, శివ, రామ, కృష్ణ, కుట్టిచేతాం, భద్రాకాళి, భగవతి, గణపతి, సుబ్రహ్మణ్యము మొదలగునవి. ఇప్పుడు ఈశ్వరు డెవరని తెలిసికొన్నాము?

శిష్యుడు : జీవశక్తియైన వాయువని.



గురువు : అటువంటి వాయువును సేవించుటకే ఈశ్వర సేవయని చెప్పుట. అది గాక మన జీవుని బ్రహ్మ రంధ్రమున చేర్చక మోక్షము దొరకునా?

శిష్యుడు : దొరకదు.

గురువు : బ్రహ్మరంధ్ర మెచ్చట నున్నది?

శిష్యుడు : అది మనలో పై భాగమున యున్నది.

గురువు : అట్లయిన మనకు జీవుడు లోపలనా, బైటనా?

శిష్యుడు : లోపల

గురువు : లోపలనున్న జీవుడు మనకు పైభాగమైయుండు మనలోనేయున్న బ్రహ్మరంధ్రములో చేరిన, మనకు మోక్షమునకు మార్గము లోపలనా? బైటనా?

శిష్యుడు : లోపలనే.

గురువు : కాబట్టి లోపలఉన్న జీవుని మనపైభాగమై తనలోనే ఉన్న బ్రహ్మరంధ్రములో చేర్చి, మోక్షము పొందుటకు గాను, బైటకు తీసికొనిపోయిన చేరునా? లేక చేర్చుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : లోపలనుండు జీవుడు బైట వెళ్ళి, ముగిసిన ఏమగును?

శిష్యుడు : చనిపోవును.



గురువు : చనిపోయిన పిదప ఏమగును?

శిష్యుడు : శవమైనది.

గురువు : ఆ శవమునకు మోక్షము కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : ఏమి కారణము?

శిష్యుడు : జీవుడు లేనందున.

గురువు : అప్పుడు ఎవరకి మోక్షము?

శిష్యుడు : జీవునకు.

గురువు : జీవునకు మోక్షమేది? జీవుని ఎవరైనను బంధించి యున్నారా? జీవుడు నిర్బంధితుడు, నిర్ముక్తుడు, నిరహంకారుడు, నిర్మోహుడు, నిస్సంగుడునై యున్నాడు. అట్లుండు జీవునికి ఏమి మోక్షము? మోక్షమనగా నేమి?

శిష్యుడు : మోక్షమనగా విమోచనము.

గురువు : విమోచనమనగా నేమి?

శిష్యుడు : విడువబడుట

గురువు : విడువబడుట అనగా నేమి?

శిష్యుడు : బంధమునుండి విడువబడుట

గురువు : జీవుని ఎవరైనను బంధించియున్నారా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన తనలో నుండు జీవుడు బైట వ్యాపించి, విషయాదులను బట్టి, బాధపడుటయే బంధనము. అదెట్లనగా ఇదిగో చూడుము. ఈ పలకను నేను ఇప్పుడేమి చేసియున్నాను?

శిష్యుడు : మీరా రెండు చేతులతో రొమ్మున అణచి పట్టుకొని యున్నారు.

గురువు : నేను నా రెండు చేతులతో పట్టుకొని, “ అయ్యో ” అయ్యో, నన్ను విడువు, నేను పోవలయునని అరచుచుండిన నన్ను ఈ పలక విడచునా?

శిష్యుడు : విడచుట లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : పలకను మీరు ఆ సమయమున రొమ్మున అణచి పట్టుకొని ఉన్నందువలన.

గురువు : పలక నన్ను పట్టుకొని యున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన నేనేమి చేయవలయుననగా ఏవరు పట్టుకొని ఉన్నారని చూచి నేను పలకను పట్టుకొని ఉన్నానా? లేక పలక నన్ను పట్టుకొనియున్నదా? అని చూడవలయును. అట్లు చూచినప్పుడు పలక నన్ను పట్టుకొనియుండలేదు. నేనే పలకను పట్టుకొని యున్నాను. ఇదిగో చూడుము నేను పట్టుకొనియున్న

చేతులను తీసిన అప్పుడైమైనది?

శిష్యుడు : పలక పడిపోయినది.

గురువు : ఈలాగే తానైన శివుడు శక్తియై బైట వ్యాపించినది. అప్పుడు శివశక్తియైనది. అటువంటి శక్తి నుండి సృష్టికలిగినది. దానినుండి కలిగిన తల్లి, తండ్రి, భార్య, భర్త, పుత్రుడు, పుత్రిక, గృహము, ధనము, స్థానము, మానము, జాతి, శుద్ధి, అశుద్ధి మొదలగువాటిని పట్టుకొని అరచుకొనుచున్నారు. కాని అది ఏదియు, మనలను పట్టుకొనియుండలేదు. మనమే వాటిని పట్టుకొని యున్నాము. అదెట్లనగా నిద్రయందు మనకు తల్లియనియు, తండ్రియనియు, వేరేదైనను ఉండుట లేదు. అదియునుగాక మన అతి ప్రియమగు పుత్రుడో, సహోదరుడో మన సమీపమున పరుండి నిద్రించు నప్పుడు, మనము నిద్రించే యున్నాము. ఆ సమయమున మన చేతులు కాళ్ళు, పై జెప్పిన పుత్రోడో, సహోదరుడో యున్నను వారిపై ఏదియు తెలియక పడుచున్నవి. ఏదొకటియు తెలియుటలేదు. మరియు రెండు కాళ్ళు గలవారై మనలో మాదిగలని చెప్పనటువంటి వారిని మన దురభిమానమువలన మనకన్న వారెంతో నీచులని మనము తలచుట సహజమైయున్నది. అయిన మనము నిద్రించు సమయమున, వారిలో నొకడు మనలను తాకిన మనకు తెలియుచున్నదా?

శిష్యుడు : తెలియుట లేదు.

గురువు : నిద్ర మేల్కొన్నప్పుడు నిద్రలో నన్ను మాదిగ తాకినాడుప నేను అశుద్ధుడనైతిని. నేను స్నానము చేయవలయునని తలచుటకద్దా?

శిష్యుడు : తలచుట లేదు.

గురువు : లేకున్న, పై జెప్పిన మాదిగలు ఒక అసహ్యమగు ఆహారమును తినుచున్నారు. అదేదనగా, చనిపోయిన ఆవు శవమును ఒక పల్లములోయుంచి, మూసి, అదిక్రుళ్ళి, పురుగులగు సమయమున, ఆ పురుగులను తీసి గంజిచేసి త్రాగుచున్నారు. అయిన పై జెప్పిన పురుగులగంజిని మన నిద్రసమయమున ఆ మాదిగ ఒక గరిటలో తీసి మననోటిని తెఱపించి పోసిన అదేమగును?

శిష్యుడు : నిద్రించుటవల్ల, లోనికి పోవును.

గురువు : అప్పుడు మనకు తెలియవచ్చుచున్నదా?

శిష్యుడు : తెలియుటలేదు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : మనము నిద్రించుటవలన.

గురువు : మన నిద్ర సమయమున శక్తి లోపలనా? బైటనా?

శిష్యుడు : ఆ సమయమున లోపల అణగియున్నది.

గురువు : కావున, తన శక్తి తన లోపలనుండి బైట వ్యాపించినందున, అటువంటి శక్తి నుండి సృష్టి

మొదలగునవి కలగినవి. ఆ ప్రకారముగా తనలోనుండి, తనచే సృష్టించబడు వస్తువులను తానేకట్టి, పట్టి, పరితపించుట. అదెట్లనగా, నేను మునుపు యొక పలకనుపట్టుకొని పరితపించుచుంటిని గదా? అలాగుననే తాను పై జెప్పిన విషయములను పట్టుకొని పరితపించు చున్నాడు. ఆ పట్టు నుండి దానిని వేర్పరచి, లయమగు నట్లు ఆ శక్తిని తనలోనే నడిపి బ్రహ్మరంధ్ర మున చేర్చుటయు మోక్షము. దీని కొరకే ఉపదేశము. ఉపదేశము ఎందుకొరకని?

శిష్యుడు : మోక్షము దొరకుటకుగాను.

గురువు : మోక్షము దొరకుటకు జీవునకు పైగతి కావలయునా? లేక క్రిందిగతి కావలయునా?

శిష్యుడు : జీవునకు ఊర్ధ్వగతి కావలయును.

గురువు : జీవునికి ఊర్ధ్వగతి దొరుకుటకు ఏదైన ఉపదేశము లోకమున ఇప్పుడున్నట్లు మీకు తెలిసినదా? లేక వినియున్నారా?

శిష్యుడు : ఉన్నది. శివరామ మొదలగు నామములను, పంచాక్షరీ మంత్రములు, మహా వాక్యములైన బ్రహ్మోపదేశములు ఇప్పుడు లోకమున అలవాటైనట్లు నేను తెలిసికొనునదిగాను, వినినదిగాను ఉన్నది.

గురువు : అట్లయిన వీటినుండి జీవునకు ఊర్ధ్వగతి దొరకుట లేదు. ఏలననగా, శివ, రామ, నారాయణాయను

మొదలగు నామములుగాక, నమ:శివాయ, ఓం, ఐంక్లీం, శం, వదవదవాగ్వాదిని, బాలపరమేశ్వరి స్వాహా యనియు, ఓం, హ్రీం, నమశ్శివాయ అనియును, ఓం నమో నారాయణాయనియు, మరియు అష్టాక్షరి, త్రయాక్షరి, ఏకాక్షరి, త్రిపుర సుందరి, స్వయంభర, యను నటువంటి మంత్రములను, అదిగాక బ్రహ్మోపదేశమన చెప్పబడు "ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్వమసి, ఆయ మాత్మాబ్రహ్మ" ఈ ప్రకారముండు వాక్యములను, గాయత్రీయని చెప్పబడు " ఓం భూ: ఓం భువ: ఓం భువర్ బువస్వ: ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహీ దీయోయోన : ప్రచోతయాత్" అను వాక్యములను, ఉపదేశమని చెప్పి లోకమున ఆచరించుటగా నున్నది. ఈలాగు మనము ఉచ్చరించుటవలన, లేక ధ్యానించుట వలన మన జీవునకు ఊర్ధ్వగతి దొరకునని తలచుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలు లేదు.

గురువు : అనగా, ఈ ప్రకారము ఉచ్చరించు చుండుట వలన మనజీవుడు, ఊర్ధ్వగతిగానా, లేక అధోగతిగానా పోవుచున్నది?

శిష్యుడు : అధోగతిగా పోవుచున్నది.

గురువు : అధోగతియన ఏలాగనా, అగ్నిస్వరూపమైయుండు శబ్దమూలమై, జీవుడై, దేహమైయుండు నాయకుడు తనలో

నుండి దహించి, అధోగతియై పోవుచున్నది. అప్పుడే మనము చనిపోవుట. అది అధోగతి కాకుండ ఊర్ధ్వగతియై పోవుటకుగాను ఉపదేశము. ఉపదేశమనునది; ఉప+దేశ, వీటిలో ఉపయనగానేమి?

శిష్యుడు : సమీపము.

గురువు : దేశమనగా నేమి?

శిష్యుడు : స్థానము.

గురువు : అప్పుడు ఉపదేశమనగా నేమి?

శిష్యుడు : సమీప స్థానము.

గురువు : ఈ సమీప స్థానమెవరికి?

శిష్యుడు : మనకు

గురువు : మనకు జీవుడు లేకున్న మనకు స్థానమున్నదా?

శిష్యుడు : స్థానము లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : జీవుడు లేనందున.

గురువు : అట్లయిన స్థానమెవరికి?

శిష్యుడు : జీవునికి.

గురువు : మనమేదైన ఒకదారిలో నడచునప్పుడు వెనుక నుండి హఠాత్తుగా తెలియక ఏదైన శబ్దమును విని వెంటనే

భయపడు సమయమునవో, లేక ఒక గుంటలో కాళ్ళు జారిపడునప్పుడో మనజీవుడు ఏ విధమై పోవుచున్నది?

శిష్యుడు : బయపడినప్పుడు జీవుడు ఒకేగతిగా పై భాగమునకు పోవుచున్నది.

గురువు : అది పై భాగమునకు పోవుట మనలో నుండియా, లేక బైటనుండియా?

శిష్యుడు : అది మనలో నుండియే.

గురువు : అప్పుడు జీవునిస్థానమేది?

శిష్యుడు : పై భాగమున.

గురువు : అయిన జీవుడు మనలో వ్యాపించి మూత్ర ద్వారముకడ వరకు ఉంటున్నది. ఆ జీవుడు లేని యెడల శుక్లము లేదు. ఆ జీవుడే శుక్లము. ఆ జీవుడు మూత్ర ద్వారము అర్థభాగము వరకు వచ్చునట్లుయిన, శుక్లమైనను, మూత్రమైనను బైటవచ్చుటలేదు. అది మూత్ర ద్వారము కడవరకు వచ్చి, శుక్లమును, మూత్రమును బైటికి త్రోయుచున్నది. అందువలననే, జీవుడు మూత్రద్వారము కడవరకు ఉన్నదని తెలియ వచ్చునది. అప్పుడు భయపడు సమయమున మన జీవుడు, అతివేగమై, ఎచ్చట నుండి పై భాగమునకు పోవుచున్నది? ఆ సమయమున జీవుడు ఏక్కడనుండి పైకి పోవుచున్నాడు?

శిష్యుడు : మూత్ర ద్వార ఉద్భవస్థానము నుండి.



గురువు : జీవుడు లోన యుంటున్నాడు. కనుక లోపలనుండు జీవుని మార్గమును సరిగా చేయవలయును. దీనికే మనజీవుని మార్గమును మంచిదిగా చేయవలయునని యు, జీవునికి ఊర్ధ్వగతి దొరకవలయునని చెప్పట. అదెట్లనగా, తనలోన వ్యాపించియుండు జీవుని, లోపలనుండు మార్గమును బాగుపరచి, అటువంటి దారిలో ఒకటే గతిగా సదా నడుపవలయును. అప్పుడే జీవునకు గతివచ్చును. వేరే ఏవిధముగను జీవునకు గతి వచ్చుట లేదు. అదిగాక, మీరు ఎవరైనను చనిపోవు సమయమున చూచియున్నారా?

శిష్యుడు : చూచియున్నాను.

గురువు : అటువంటి సమయమున శ్వాసగతి ఏ రీతిగ నుండును?

శిష్యుడు : శ్వాసగతి పై భాగము వైపై యుండును.

గురువు : ఆ సమయమున కావలసినగతియే ఇప్పుడు మనము చెప్పినగతి. అదెట్లనగా, యిదిగో చూడుము........ ఈ విధముగానుండునదే కావలసినది. ఈ గతి అప్పుడు దొరకుట కద్దా?

శిష్యుడు : దొరకుట లేదు.

గురువు : అదెందుకనగా మనము పుట్టిన చనిపోవుదుమని గ్రహించియున్నాము. అట్లు గ్రహించుట తప్పు. చనిపోక యుండుటకు ఏదైన దారియున్నదా లేదా అని

ఆలోచించక ఉండుటవలన ఆ ప్రకారము తీర్మానించినదై యున్నది. అయిన మనము మరచుటకు నేర్చుకొనవలయును. మరచుటకు నేర్చుకొనక ఉన్నందువలన, నరకమును అనుభవించుటకు సత్తువు పోవుటకు చోటైనది. మరచుటకు నేర్చుకొనినయెడల మనము నరకమును అనుభవించుటకు, సత్తువు పోవుటకు చోటులేదు. మరచుటననగా, నేను అను చెప్పబడు స్థితిని, లోకమును, ఈ ప్రకారము మరచి తన జీవుని లోపల అణచుటకే ఆ మార్గమును నేర్చుకొని జీవుని అణచిన, మనము చనిపోవుటకు చోటుండునా?

శిష్యుడు : వీలుండదు.

గురువు : అది మాత్రముగాదు మరచుటకు కావలసిన గతినే ముందుగ చూపినది. దానిని మొదటనే నేర్చుకొననందున, చనిపోవు సమయమున ఆ గతి దొరకుట లేదు. నాలుగు, ఐదు, పది, ఇరువది, ముప్పది రోజులు లేక హెచ్చు తక్కువ ఒక సంవత్సరము పరుండి, శ్వాసముపైన తీసి నిలిపి, అనగా ఊర్ధ్వశ్వాసము తీసి, జడము పుండై, పగిలి, క్రుళ్ళి, పురుగులై, ఆ పురుగులు జడమును కరచి ప్రజ్ఞ లేక పరుండి, బహుకష్టపడి, చనిపోవుటను మనము చూచుచున్నాముకదా?

శిష్యుడు : చూచుచున్నాము.

గురువు : అప్పుడు వారు అనుభవించు నరక కష్టములు



ఎటువంటివని చెప్పుటకౌనా?

శిష్యుడు : చెప్పుట సాధ్యముకాదు.

గురువు : చూచుచున్న మనకెంతో కష్టము తోచుచున్నది. ఆ కష్టము ఏవిధమని మనకు చెప్పుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : అయిన ఈ సమయమున పై జెప్పిన గతిని అభ్యాసము చేసిన అప్పుడు ఇటువంటి కష్టమును అనుభవించుటకు ఉండునా?

శిష్యుడు : ఉండదు.

గురువు : మనకు బ్రహ్మరంధ్రము ఇప్పుడు తెరచియున్నదా? మూసియున్నదా?

శిష్యుడు : మూసియున్నది.

గురువు : మూయబడియుండు బ్రహ్మరంధ్రమును తెరువక జీవుడు బ్రహ్మరంధ్రములో వెళ్ళి చేరుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : అదెట్లనగా, తనలోనుండు అటువంటి జీవ శక్తి బ్రహ్మరంధ్రమును తెరువక, దాని వద్దకు వెళ్ళి, అధోగతియై, బైటకు పోయి నశించుటయే చనిపోవుట. కాబట్టి తన జీవశక్తిని బైటకు వదలక, తనలోనే ఊర్ధ్వగతిగా

నడిపి జీవునితో బ్రహ్మరంధ్రమును తట్టి తెరవలెను. అ



ప్రకారము చేసి జీవుడు బ్రహ్మరంధ్రములో లయించి, తానై తన్మయమయి తీరునదైనది మోక్షము. వేరే ఏ విధమునను మనకు మోక్షము దొరకదు. అయితే ఇదివరకు మన జీవునకు అధోగతియా, ఊర్ధ్వగతియా?

శిష్యుడు : అధోగతియే

గురువు : ఇటువంటి జీవుడు, అధోగతియై తనలో లేకపోవునప్పుడు ఏమగుచున్నది?

శిష్యుడు : శవమగుచున్నది.

గురువు : అప్పుడు మీ జీవునిగతి ఏమైనది?

శిష్యుడు : ఊర్ధ్వగతి యైనది.

గురువు : అధోగతియై ఉండు జీవునకు ఇప్పుడు ఊర్ధ్వగతి వచ్చినది. అయితే మీలోన మీకుపైన ఉండు వస్తువేది?

శిష్యుడు : ఈశ్వరుడు.

గురువు : అప్పుడు జీవుడు ఈశ్వరునితో ఐక్యమైనది. దీనికే జీవేశ్వరైక్యము అని చెప్పుట. జీవుడు ఈశ్వరునితో ఐక్యమైనయెడల ఏమైనది?

శిష్యుడు : మోక్షమైనది.

గురువు : దీనికే ప్రాణాపానములను ఐక్యపరచుటయని చెప్పుట. మనలోపలయుండునది ప్రాణము. బైటకు పోవునది అపానము. అప్రకారము బైటపోవు అపానమును, బైట విడువక ప్రాణముతో చేర్చి లోపల ఏకగతియై

నడిపించుటకు **ప్రాణాయామమని** చెప్పుట. ప్రాణాయామ మనగా ప్రాణమును అయామము చేయుట. ఆయామ ము చేయుటనగా అణచి నిలుపుట, లేక నేరుగా నడిపించుట; లేక **దీర్ఘించుట**; అనగా తనలోపలనుండు ప్రాణమును, అపానమై బైటపోనీయక తనలోపలనుండు ప్రాణమును, అపానమై బైటపోనీయక తనలోపలనే అణచి నిలుపుట. అప్పుడు ప్రాణము నేరుగతియైనది. ఇప్పుడు ప్రాణము నేరుగపోక వంగి ఐదు ద్వారముల మూలముగా బైటకు పోయి నశించిపోవుచున్నది. ఆ ప్రకారముగా బైటకుపోక, తనలోనే పైన, క్రింద, ఒకే గతియై వచ్చునప్పుడు తిన్ననైనది. దీనికే ప్రాణమును నేరుగ తీసికొని పోవలెననుట. దీర్ఘించుట అనగా, పొడుగించుట. దేనిని పొడుగించవలెననగా మనలోపలనుండు ప్రాణము పొడుగుగా లేక వంగి అపానమై బైటకుపోయి నశించుచున్న అపానమును బైట విడువక ప్రాణముతో చేర్చి పైకి తీసికొని పోవునప్పుడు పొడుగైనది. దీనికే దీర్ఘించుట అని చెప్పుట. అప్పుడు మనము నిద్రించు సమయమున మనగతి ఏవిధముగనో అదే ప్రకారముగనే మేల్కొనియుండు సమయమునను అయితీరును. అయితే నిద్రించుసమయముననుండు గతి లోపలనా? బైటనా?

శిష్యుడు : లోపల.

గురువు : నిద్రసమయమున మనకు పలువిధములైన

శ్వాసగతు లుంటున్నవి. అదెట్లనగా కొందరు నిద్రలో గురక విడచుటకద్దు; అనగా కొందరు నిద్రించునప్పుడు లోపలగా నుండు గతిలో నుండి "గుర్" అనియు, కొందరు "క్రూ" అనియు, కొందరు ఎద్దు గురకవలె "క్రో" అనియు పలువిధములైన శబ్దములు కలుగుచున్నవి. ఇది అన్నియు సరియైనగతిగాదు. సరియైన గతి జీవశక్తియై యుండు శ్వాసము; అతి తేలికై, ఏ విధమైన గోష్టియు, శబ్దమును లేక శ్వాసమున్నదో లేదోయని తెలిసికొనుటకు సాధ్యముకాని స్థితిలో రెండు స్తనములమధ్యలో రొమ్ముగుండియలవద్దనో లేక కంఠము గుండియల వద్దనో కదలుట మాత్రము కనబడును. అదియే సరియైనగతి. అటువంటి గతి మనకు నిద్రలేని సమయమున దొరకవలయును. అదియే మనకు మోక్షమునకు కావలసిన మార్గము. అటువంటి గతి వచ్చునప్పుడు మనలో తానుగనే ప్రకాశించును. అదెట్లనగా, ఈ స్థలమునందు అగ్ని ఉంచి, అగ్నిలేని మరొకస్థలమున వూదిన ఆ అగ్ని ప్రకాశించునా?

శిష్యుడు : ప్రకాశించుటలేదు.

గురువు : అటువంటి అగ్ని ప్రకాశించవలయునన్న ఏమి చేయవలెను?

శిష్యుడు : ఆ అగ్ని మీద వూదవలయును.

గురువు : ఇదే విదమున, వానివాని అగ్ని నేత్రమైన సుషుమ్నలో

ఊదక, బైట ఊదినయెడల మనలో ప్రకాశించుటలేదు.



కావుననే జీవశక్తియైన వాయువునుండి మన భ్రూమధ్యము ఐన సుషుమ్నయైయుండు అగ్ని నేత్రములో వూది, రాగ, ద్వేష మొదలగు దుర్వృత్తులను అనగా దుస్స్వభావ ములను ఎప్పుడు ఈ స్థలములో కాల్చి, దహించు చున్నామో, అప్పుడే మనలో ప్రకాశించి జ్ఞానము కలుగును. అట్లుగాక వేరేవిధముగను మనకు జ్ఞానము కలుగుటలేదు. పై జెప్పినవిధమున చేయుటకే ప్రాణాయామమని పేరు. దీనిని, లోకమున తెలిసికొనక, ఈ పదమునకు అర్థము తప్పుగా గ్రహించియు, పలువిధములుగా అభ్యసించుచున్నారు. కొందరు ముక్కున ఒకద్వారమును మూసి , మరొక ద్వారము నుండి వాయువును పైకి తీసి అణచిపెట్టి, శిరస్సు నందుండు మెదడు కదలించి, పిచ్చి, క్షయ, నాడి దోషము మొదలగు వ్యాధులచే పీడితులై చనిపోవుచున్నారు. ఈ కారణము చేతనే లోకమున ప్రాణాయామమును అందరు నిందించు చున్నారు. అయితే సదా ప్రాణాయామము చేయువారికి వ్యాధిలేదని ఋషీశ్వరులు చెప్పియున్నారు. ప్రాణము మనలోపలయుండునది. అట్లుండు ప్రాణమును, బైటనుండు ఒక ముక్కు ద్వారమును మూసి, మరొక ద్వారము ద్వారా బైట నుండి ప్రాణమని తలచి పీల్చిన దొరకునా?

శిష్యుడు : దొరకదు.

గురువు : దానికి దృష్టాంతము; ఒక గోతము సంచియందు



ఇంకను నింపవలయునని మరొక సంచియందుండు వడ్లను వేసి త్రొక్కి అణచిన, దానిలో నింపుటకు సాధ్యపడునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : దానిని ఆలోచించక పై జెప్పిన విధమున చేసిన ఆ గోతము సంచి ఏమగుచున్నది?

శిష్యుడు : ఆ గోతము సంచి చిరిగిపోవుచున్నది.

గురువు : అదే ప్రకారముగా, మనలో నుండు జీవ శక్తియైయుండు వాయువుతో బైట నుండు వాయువును చేర్చ వలయునని తలంచి, బైటనుండు వాయువును పీల్చి చేర్చిన విపత్తులు సంభవించి చనిపోవుటకు చోటగు చున్నది. కావున ప్రాణాయామమని చెప్పుట, మనలోపల నుండు ప్రాణుని బైటవిడువక మనలోపలనే నడుపుట. అట్లు చేయువారికి ఏదొక వ్యాధి కలుగదు. అందువలననే **సదా ప్రాణాయామము చేయువారికి రోగము లేదని** చెప్పుటకు కారణము.



# ఐదవ
# అధ్యాయము

శిష్యుడు : స్వామీ! పై అధ్యాయమున చెప్పిన ప్రకారముననే సృష్టియని నాకు పూర్తిగా తెలిసినది అయినను పంచభూతములనుండియే సృష్టియని చెప్పబడుచున్నది. దానికి కారణమేమని విశదముగా చెప్పవేడుకొనుచున్నాను.

గురువు : పంచభూతములనునవి యేవి?

శిష్యుడు : పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనునవి.

గురువు : పృథ్వి, అప్పు,తేజస్సు, వాయువు, ఆకాశములను పంచభూతములని చెప్పుచున్నారు. అయిన పై అధ్యాయమున వివరించిన వాయువు పంచభూతమునందు యొకటై వచ్చుచున్నది. ఏలాగైనను పంచభూతములలో నుండి సృష్టియైన పంచభూతములు ఏవియని తెలియుటలేదు. అయిన పంచభూతముల ఉద్భవము లను చెప్పెదను. ఏలాగనగా అక్షరమునుండి ఆకాశము ఆకాశమునుండి వాయువును, వాయువునుండి అగ్నియు, అగ్ని నుండి అప్పును, అప్పు నుండి పృథ్వియు కలుగుచున్నవని చెప్పుచున్నారు. ఎప్పుడును దీనిని

మనము నమ్ముటకు చోటులేదు. ఏలననగా, భూమి



యను ఒక అవస్థలేకున్న జలము మొదలగు ఏదొకవస్తువు కలుగుటలేదు. పృథ్వియందే జలముండుటయేగాని, జలము నందు భూమియుండుటలేదు. కారణము సముద్రమనునది జలము నిండియుండు భూమియైన ఒక పెద్దభాగముగా నున్నది. అటువంటి జలముండుటకు ఆధారముగా భూమిలేనియెడల జలము నిలువదు. అదిగాక అందులో అనేక ద్వీపములున్నవి. అడుగున భూమిలేనియెడల అటువంటి ద్వీపములుండుటకు వీలులేదు. అదేలాగో ఉండనిమ్ము. మనమిప్పుడు తలచిన ప్రకారము పంచభూతములనుండి సృష్టియగుచున్నదని ఎప్పుడును నమ్ముటకువీలులేదు. ఏలననగా, పంచభూత ములలో పృథ్వియనునది భూమియు, అనగా మన్ను, అప్పుయనునది జలము అనగా నీళ్ళు, అగ్నియనునది తేజస్సు అనగా ప్రకాశము, వాయువు అనునది చలించుకొని ఉండునది అనగా గాలియు, ఆకాశమనునది చూచుటకు సాధ్యము కానిదియు, అధికముగా ప్రకాశించుకొనియుండునది అనగా ఖాళీస్థలముయైయు న్నవి. ఈ ప్రకారముగా నుండు ఐదువస్తువులను ఒకటిగా చేర్చి, సృష్టించుటకు సాధ్యమగుటలేదు. అదేలాగననగా, ఇదిగో ఈ కనబడు ఖాళీ స్థలము, ఆకాశముగా నున్నది. దీనిని పట్టి మిగిలిన నాలుగు భూతములతో చేర్చుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : వాయువని చెప్పినది చలించుచుండుగాలి. దీనిని



పట్టి మిగిలిన నాలుగు భూతములతో చేర్చుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యమగుట లేదు.

గురువు : అగ్ని అనునది తేజస్సైయుండు ప్రకాశము. దీనిని పట్టి మిగిలిన భూతములతో చేర్చుటకు వీలగునా?

శిష్యుడు : వీలుకాదు.

గురువు : అయిన పంచభూతములు, తనలో తానే ఉండు నటువంటివి. అదే విధముగానున్నవనగా, ఇదిగో ఒక బల్ల దీపము. దీనిని వెలిగించి, దాని మీాద యొక చిమినీ మూతను ఉంచిన, మంచి ప్రకాశమిచ్చుచున్నది. ఆ మూత బోలుగలేక, బొత్తిగాగట్టియై ఉండిననేమగును?

శిష్యుడు : దీపము వెలుగక ఆరిపోవును.

గురువు : అట్లయిన రగులుచుండు దీపమునకు చిమినీ మూతవేయకున్న ఎమగుచున్నది?

శిష్యుడు : సరియగు ప్రకాశము దొరకదు.

గురువు : అప్పుడు విస్తరించియుండు ప్రకాశమైన శక్తికి, చిమినీ మూతను ఉంచినప్పుడు విస్తరించుటకు చోటులేక, ఈ ప్రకారమైయుండు శక్తి ఒకటైతీరినది. అట్లు ఒకటైనప్పుడు, ఆ బోలుగానుండు చిమినీ మూత నుండి ప్రతిబింబించి, మనకు ఎక్కువ ప్రకాశముగా కనబడుచున్నది. అయిన,

చిమినీతో చేసిన మూత బోలుగా నున్నది. అటువంటి



ఖాళీస్థలము ఆకాశము. ఆ ఆకాశమైన ఖాళీ స్థలము మార్గముగా వాయువు గతాగతము చేయుచున్నది. దానిలో ఆ ప్రకారముగా గతాగతము చేయని ఎడల అది వెలుగునా?

శిష్యుడు : వెలుగదు.

గురువు : అయిన చిమినీ మూతకును, అగ్నికిని, ఏ విధమైన సంబంధమును లేదు. చిమినీ మూతలోన ఖాళీస్థల మున్నది. ఆ ఖాళీయైన ఆకాశమున వాయువు గతాగతము చేయుచున్నది. ఆ వాయువు గతాగతము వలననే ఆ అగ్ని దానిలో రగులుచున్నది. చిమినీ మూతవేయకున్న ఆ ప్రకాశము వ్యాపించుకొని ఉంటున్నది. కావున దానికి చిమినీ మూతనుండి తటస్థము వచ్చినందున వ్యాపించి యుండక ఆ ప్రకాశమొక్కటై ఒకటేశక్తి అగుచున్నది. చిమిని మూతయైన చిమిని మూలముగ అటువంటి ఏకశక్తి ప్రతిబింబించి, ఎక్కువ ప్రకాశముగా మనకు కనబడు చున్నది. చిమినీ మూతను తీసినప్పుడు అగ్ని అచ్చటనే ఉండినది. ఆకాశము, వాయువును ఉన్నవి. అయిన, పై జెప్పినరీతిగా ప్రకాశించుటలేదు. ఏలనన, ఈ ప్రకారముగా శక్తి విస్తరించినది. అప్పుడు ముందున్న ప్రకాశమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : అటువంటి ప్రకాశమైన శక్తికి చిమిని మూతవలన

నందున.

గురువు : ఈ రీతిగనే మనస్థితియును, మనయందును ఆకాశము, వాయువు, అగ్ని ఉన్నవి. వీటికి నేనను అవస్థయైన చిమిని మూత కలదు. ఎప్పుడు నేనను అవస్థయైన చిమిని మూతను ఉంచుచున్నామో ఆ సమయముననే దానినుండి ప్రతిబింబించి కనబడుయే ఈ కనబడులోకము. ఈ లోకమున అప్పుడు నేనను చిమిని మూతను తీసివేయుచున్నామో అప్పుడు లోకము కనబడదు. ఇదిగాక పంచభూతములనుండి సృష్టించుటని చెప్పుటకు ఏదొకయుక్తియులేదు. కారణమేమనగా, పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, వీటిని ఒకటిగా చేర్చి సృష్టించునట్లయిన మనకెప్పుడును చనిపోవుటకు వీలుండదు. అదియునుగాక, మనము ఒకని ముక్కును, నోరును మూసి గట్టిగాపట్టుకొని యున్న అతడు చనిపోవుచున్నాడు. దేనివలన? ఆకాశమను భూతమును చేర్చి సృష్టించినదికదా! ముక్కు, నోరు, ఈ రెండు ద్వారములను మాత్రమే మనము మూసిపట్టినది. వాయువని భూతము దానిలో కలిగియుండునది. అటువంటి వాయువునకు నోరు, ముక్కుయను ఈ రెండు ద్వారములు గాక మిగిలిన ద్వారములమూలముగా సంచరించవచ్చును గదా! అగ్నియను ప్రకాశము దానిలో ఉంటున్నది. ఆ ప్రకాశమును మూసిపట్టిన వెనుక, మూసి పట్టిన పైజెప్పిన రెండు ఖాళీ ద్వారములనుండి మాత్రము

ప్రకాశించుటకు సాధ్యముగాక, అయిన మిగతా



ద్వారములమూలముగ ప్రకాశించుటకు సాధ్యములేదా! ఇవియన్నియు చేర్చుటయేకదా సృష్టించుటయని చెప్పినది? అట్లయిన పై జెప్పిన రెండు ఖాళీ ద్వారములు అనగా నోరును, ముక్కును, మూసి పట్టిన ఎడల చనిపోవుటకు కారణమేమి? అయిన, పైజెప్పిన మేజ దీపమునందు, అగ్ని రగులుచున్నప్పుడు, దానికి చిమినీ మూతను ఉంచి దాని పై భాగమున నుండు ఖాళీరంధ్రమును ఏదైన వస్తువుచే మూసిన, ఆ దీపమునందు వెలుగుచున్న అగ్ని ఏమగుచున్నది?

శిష్యుడు : ఆరిపోవుచున్నది?

గురువు : దానికి కారణమేమనగా, దాని నుండి రగిలి జ్వలించుకొనియున్నప్పుడు, పైగ ఆవిరియై వచ్చు పొగబైటకు పోవుటకు తటస్థము కలిగినందున, దానిలో అణగినిండి, దట్టమై అగ్ని రగులుటకు సాధ్యము లేక ఆరిపోవుచున్నది. ఇదే రీతిగా మనకు దీపమైయుండు జడమునందు అగ్ని రగిలి, జ్వలించి, నేనను స్థితియైన చిమిని మూతమార్గముగా విచారాదులైన పొగ బైటపోక యుండినందున తటస్థము కలిగి ఆ ఆవిరి చేరవలసిన స్థానమునకు పోయి చేరక జడముననే తటస్థమై నిండి దట్టమై రగులక ఆరిపోవుచున్నది. అప్పుడే చనిపోవుట. అదియునుగాక అగ్నియున్నదనుటకు దృష్టాంతము;- ఇప్పుడు ఈ జడమును తాకి చూచిన లేక రుద్ధి చూచిన

ఉండుటలేదు. కారణమేమనగా, పైన వివరించనట్లు మేజదీపమున దానిలో ఉంచియుండు చిమిని మూత అడుగు భాగము నుండి, మూతకు ఏదొక బాధ్యత లేక అగ్ని రగులుచుండెను. ఆ సమయమున, ఆ చిమిని మూతయొక్క ఏ భాగముఐనను, చేతితోతాకుటకు వీలగునా?

శిష్యుడు : వీలుకాదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : దానిలో అన్ని భాగములందును వేడిమి ఉండుట వలన.

గురువు : అయిన, దానికి కారణము చిమిని మూతబోలుగ ఉండినను, దానిలో వాయువు గతాగతము చేయుటైనను, ఆ వాయువుతో అగ్ని చేరి, ఆ చిమినీ మూతబోలు స్థలమంతయు వ్యాపించుటచేతను, ఆ మూతకు వేడిమి కలుగుటచేతనే తాకుటకు సాధ్యమగుట లేదు. ఇదే ప్రకారముగనే ఈ జడమున ఒక సొరంగమున్నది. ఆ సొరంగము మార్గముగా జీవశక్తి సంచరించుచున్నది. దీనిలో ఒక భాగమున అగ్నియున్నది. అటువంటి అగ్ని జీవశక్తియైన వాయువుతో చేరి ఈ జడమున ఖాళీగా నున్న అన్ని స్థలములయందును వ్యాపించును. అప్పుడు జడమును తాకిన వేడిగయుంటున్నది. అగ్ని ఆరి పోయినప్పుడు వేడిమి కలుగుటలేదు. అదెటనగా పై

ఎప్పుడును చెప్పుటకు వీలులేదు.

అదియునుగాక, పంచభూతములు ఇటువంటివి యనియును, వాటినుండి కలిగియుండు సృష్టి ఈ విధమై ఉండుననియు, స్పష్టముగా చెప్పెదను. వినుము. పంచభూతములనునవి, ఆకాశము, వాయువు, అగ్ని, అప్పు, పృథ్వియనునవియు. వీటిలో ఆకాశమనునది, సదాశివుడుగనుండు జ్యోతియై, అది భ్రూమధ్యమునకు పై భాగమున ఉన్నది. ఆ జ్యోతికి క్రింది భాగమై, భ్రూమధ్యము వరకు శివుడై, జీవశక్తియైయుండు వాయువు; శివుడైయుండు వాయువునుండి, భ్రూమధ్యము క్రింది భాగమున ముక్కు వరకు వాయువు రుద్రుడై, ప్రకాశించుకొని తేజస్సై ఉండు అగ్నియు; ఆ తేజస్సైన అగ్ని నుండి ముక్కు కొనవరకు క్రింది భాగమై, జలాంశమై, విష్ణువైన మనస్సును; విష్ణువగు మనస్సు నుండి అధోభాగమై, పృథ్వియై ఉండు బ్రహ్మను; అంధకారమై, కఠినమై ఉండు అహంకారమును తానే అదేవిధమనగా, ఆకాశరూపమైన సదాశివుడైయుండు జ్యోతి నుండి, సర్వవ్యాపియై, జీవుడై, శివుడైయుండు వాయువు, దానినుండి ద్రవించి అనగా, ద్రావకవిధమై నశించి, రుద్రుడై అగ్నిస్వరూపమైన తేజస్సు, ఆ తేజస్సునుండి, చెమటై, జలమై, వ్యాపకస్థితి ఉండునదై, విష్ణువగు మనస్సు; దానినుండి కఠినమై, అంధకారమై, పృథ్వియైన బ్రహ్మయగు అహంకారము, ఇవే పంచభూతములు. వీటి

నుండియే సృష్టి. దీనివలననే పంచభూతములనుండి



సృష్టించుటని చెప్పుటకు కారణము. ఈ ప్రకారముగాక మన్ను, జలము, అగ్ని గాలి, ఆకాశము, వీటిని ఒకటిగా చేర్చి ఒక సృష్టి కలిగించుట లేదు. దేనివల్లననగా, తానై సదాశివుడగు జ్యోతి చలించి, వ్యాపించి, జీవశక్తియై యుండు వాయువై,తేజస్సు అగు అగ్నియై, జలమై యుండు మనస్సుయై, పృథ్వియై యుండు అహంకారమై ఉద్భవించినదై ఉన్నది. అటువంటి సమయముననే లోకము కలిగినది. లోకస్థితి ఈ విధముగా నున్నది.

దానికి దృష్టాంతము: నిద్రయందు తనలో నుండి జీవశక్తియైన, వాయువు ప్రకాశించి, బైటవ్యాపించక ఉండుటవలన లోకమును చూచుటకు తెలిసికొనుటకు సాధ్యమగుటలేదు. నిద్రమేల్కొనినప్పుడు ఆ జీవశక్తియైన వాయువు ప్రకాశమై బైట వ్యాపించినప్పుడు మనస్సు, అహంకారము కలిగినది. ఆ సమయముననే లోకము కలిగినది. అదియునుగాక ఒక శవమునకు లోకము లేదు. కారణమేమనగా, తనలో గతాగతము చేయు జీవశక్తియైన వాయువు, గతాగతము చేయుకయుండుట వలన. తనశక్తి ఏ సమయమున బైట వ్యాపించునో ఆ సమయముననే లోకము కలుగుచున్నది. ఏ సమయమున తన శక్తి తనలో లయించునో ఆ సమయమున తనలో నుండి ఉద్భవించిన లోకము తనలోచేరి, తానైతన్మయమై భవించును. ఈ ప్రకారముగనే సృష్టియు, లోకస్థితియును. ఈ ప్రకారమైయుండు శక్తి

రూపములకు పంచబ్రహ్మనునియు, పంచభూతము



లనియు, పంచయింద్రియములనియును చెప్పుట. కావుననే పంచభూతములలో ఆకాశనునది సదాశివుడగు జ్యోతియు, వాయువు అనునది శివుడైయుండు జీవుడును, అగ్ని అనునది రుద్రుడై యుండు తేజస్సును, అప్పు అనునది విష్ణువైయుండు మనస్సును, పృథ్వి యనునది బ్రహ్మమైయుండు అహంకార ముగానున్నది. కాబట్టి ఈ పంచభూతములంతయు అక్షరమునుండియే ఉద్భవించినది. ఆ అక్షరము తానై యుండు బ్రహ్మము. ఈ విషయము ముందగనే వివరింపబడియున్నది. ఆ ప్రకారముండు తాను, ఖాళీయైయుండు ఆకాశమైనది. ఆ సమయమున దానితోటి ఐదు గుణములు కలిగినవి. అటువంటి గుణములే పైజెప్పిన అవస్థలు. ఈ ఐదుగుణములైయుండు పంచభూతములు కలిగినప్పుడే సృష్టించుట కలుగును. సృష్టి కలుగుట సంయోగము నుండి. ఈ ఐదులో నొకటైనను లేనియెడల సంయోగము కలుగదు. దానికి దృష్టాంతము; నిద్రలో నుండు సమయమున అహంకారము, మనస్సు, ప్రకాశము ఉండుటలేదు. ఆ సమయమునకు, జీవుడు, అకాశము తనలోనే తానై ఉన్నది. ఏ సమయమున నిద్ర మేల్కొనెదమో, ఆ సమయమున ప్రకాశమైయుండు రుద్రుడు, మనస్సై యుండు విష్ణువు, అహంకారమై యుండు బ్రహ్మను కలిగినవి. ఆ సమయమున ఐదు భూతములు చేరి, ఒకటే గతియై, వ్యాపకత్వము లేక

యొకటై సంయోగము చేసి నందున సృష్టి కలిగినది.



దీనివలననే పంచభూతములచేత సృష్టియనుటకు కారణము. ఈ విధమైన ఏదొక తత్వమును లోకమున గ్రహించక అనుభవస్థులచే వ్రాయబడి, చెప్పబడిన శాస్త్రముల అర్థమును తప్పుగా తెలిసికొని ఏదొక వివరములేక లోకమున తమలో తాము తర్కముచేసికొని, వాదప్రతివాదులై, జగడమాడుచున్నారు. అదెట్లనగా ఒకడు ఒక అరటిచెట్టునునాటి, దానికి ఎరువునుంచి జలము పోసి పెంచుచున్నాడు. అది గెలతో ముదిరి నప్పుడు వాటిలో నొక కాయనుండి కూరను, మరొకటి నుండి పెరుగుపచ్చడిని, వేరొకటినుండి సాంబారును, వేరే రెండుకాయలను పండబెట్టి వాటిలో నొకటి పై తోలుతీసి, వుడకబెట్టి, రుబ్బి, బెల్లమును, కొబ్బరిపాలను కలిపి పాయసము చేసి వీటి నన్నిటిని బుజించి మిగిలిన మరొకపండును తినుచున్నాడు. అయిన ఇవన్నియు, ఎవరి అనుభవము?

శిష్యుడు : ఆ అరటిచెట్టును నాటి, పై జెప్పిన పదార్థములను చేసి తినినవారి అనుభవము.

గురువు : అయిన మనము ఆ అరటిచెట్టును, దాని కాయలను, ఫలములను, దానితో చేయబడిన పదార్థములను చూచినదో, వినినదో, తెలిసినదో లేదని తలంపుము. అప్పుడు పై జెప్పినవన్నియు చూచినది, వినినది, అనుభవించినది ఎవరు?

శిష్యుడు : ప్రవర్తన చేసినవారిది



గురువు : ఆ అనుభవమెవరిది?

శిష్యుడు : వాటిని తయారు చేసి అనుభవించినవారిది.

గురువు : ప్రవర్తన చేయకను, చూడకను, వినకను, అనుభవించకను ఉండువారికి, వాటిని గురించి ఏదొక వివరమైనను తెలియవచ్చునా?

శిష్యుడు : ఏదొక వివరము తెలియుటలేదు.

గురువు : అప్పుడు వాటి రుచిని తెలిసికొనినవాడెవరు?

శిష్యుడు : వాటిని భుజించినవాడు.

గురువు : అట్లయిన, పై జెప్పిన ప్రకారము అరటి చెట్టును నాటి దానిలో కలిగిన ఫలములను కోసి, అనేక విధములైన పదార్థములను చేసి, అనుభవించిన ఒకడు, తనయనుభవ వివరమును, ఒక ఆకుననో, లేక కాగితముననో వ్రాసి పెట్టిన దానిని మనము చదువుటచే పై జెప్పిన అరటి చెట్టును, దానిలో కలిగిన ఫలములను ఆ ఫలములనుండి చేయబడిన పదార్థములను చూచుటకుగాని, వాటి రుచుల అనుభవించుటగాని, వేరేదైనను తెలిసికొనుటకు చోటున్నదా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : అట్లయిన, అనుభవస్థులు వ్రాసిన దానిని చదివి, దానిలో చెప్పిన పదార్థముల రుచులను తెలియక ఈ

లోకమునుండువారు తమలో పోట్లాడుచున్నారు. ఏవిధ



మనగా, ఒకడు పాయసమున కారము ఎక్కువైన దనియు, మరొకడు మజ్జిగపులుసున చక్కెర అధిక మనియు, వేరొకడు కూరలో పులుపు ఎక్కువ మొదలగువాటిని చెప్పి పోట్లాడుచున్నారు. కావున వీరిలో నెవరును పై జెప్పిన పదార్థములను యదార్థముగా చూచియో, తినియో ఉన్నవారుకారు. తెలిసిన వారు తమతమ అనుభవ ములను వ్రాసియుండిరి. ఆ అనుభవ తాత్పర్యములను తెలియనివారు, తమలో తాము పోట్లాడుచున్నారు. అదేలాగనగా, మజ్జిగ పులుసు, కూరలు, సాంబారు, పచ్చడి, పాయసము మొదలగు పదార్థములను ఒక ఆకున ఉంచి, భుజించి, ఆ విస్తరి యందుండు రసమును తీరుగాతీసి తినిన పిదప, ఆ విస్తరిని బైటపారవేసిన ఒక కుక్క దానిని నాకుచున్నది. ఆ కుక్కకు, ఆ విస్తరియందు ఇటువంటి పదార్థములు వడ్డించబడినవనియు, ఆయా పదార్థమునకు ఆయారుచియనియును, ఆ విస్తరిని నాకు సమయమున తెలియవచ్చుచున్నదా?

శిష్యుడు : తెలియుట లేదు

గురువు : అదే సమయమున మరియొక కుక్క వచ్చి ఆ విస్తరిని నాకుటకు మొదలుపెట్టిన ఏమగును?

శిష్యుడు : అవి వాటిలోనే కరచుకొని, కన్ను, ముక్కు, పెదవి మొదలగలగువాటిని గాయపరచుకొని, రక్తమయముగా జేసికొనుచున్నవి.

గురువు : అట్లయిన, పై జెప్పిన ఏదైననొక పదార్థమునకు



రుచిని తెలిసిన తరువాతనేకదా, ఆ కుక్కలలో కలహము సంభవించినది?

శిష్యుడు : కాదు.

గురువు : అట్లయిన వాటి రుచులను తెలిసికొన్న దెవరు?

శిష్యుడు : వాటిని అనుభవించినవారు.

గురువు : ఆలాగే, అనుభవస్థులచేత వ్రాయబడినవియే గ్రంథములు. అటువంటి గ్రంథములే స్మృతులు: "స్మృతి" అనగా తెలివి. ఆ తెలివి ఎవరిదియనగా, అనుభవస్థులదే. అటువంటి అనుభవస్థుల తెలివిని గ్రంథములతో వ్రాసియుండునది. ఆ గ్రంథాదులను లోకులు చదువుట వలననే తాము అనుభవస్థులైయున్నట్లు నటించి, అనుభవస్థులచే వ్రాయబడిన తెలివియొక్క యదార్థమును ఏ రీతియని తెలియక, విపరీతమైన అర్థములను గ్రహించి పైన వివరించిన కుక్కలవలె జనులు పోట్లాడి వారలలో వారు కొట్టుకొనుచున్నారు. దానికి కారణము, లోకమున జనులు తమకు అనుభవము కావలయుననియు, అనుభవస్థితిని తెలిసికొనవలయుననియు, ఆసక్తిలేక, తమకు గొప్పపదవి, పొగడ్త, డంభము, పండితపదవి మొదలగునవి దొరకవలయునను దురభిమానములో మునిగి ఏదొక వివరమును లేకను, అక్షరాభ్యాసము చేయకను, గర్వులై అధోగతియై పోవుచున్నారు. కావుననే లోకమున తత్వజ్ఞానమో, తెలివియో లేకపోవుచున్నది.

శిష్యుడు : ఆలాగా! ప్రియగురువే! లోకమున ఏవరును అక్షరాభ్యాసము చేయలేదని చెప్పినారు గదా! లోకమున జనులు గ్రంథాదులను ఏలాగు నేర్చుకొనియున్నారు?

గురువు : అక్షరమనునది, నీవు ఏదని గ్రహించి నావు?

శిష్యుడు : అక్షరమనగా "అ" అనునది మొదలు 51 అక్షరము లైయున్నవి.

గురువు : అక్షరములు అన్ని ఉండుటలేదు. "అ" కారము అక్షరముకాదు. అక్షరమను మాటకు అర్థమేమి?

శిష్యుడు : నాశరహితమైనది.

గురువు : అటువంటి వస్తువేది?

శిష్యుడు : అది బ్రహ్మము.

గురువు : ఆ బ్రహ్మమనునదేది?

శిష్యుడు : అది తాను తానే.

గురువు : 'అ' అని చెప్పుటకు శబ్దము లెన్ని?

శిష్యుడు : ఒకే శబ్దము.

గురువు : శబ్దమునకు రూపమున్నదా?

శిష్యుడు : ఉన్నది.

గురువు : రూపముండిన చూడవచ్చునుగదా?

శిష్యుడు : అవును, చూడవచ్చును.



గురువు : ఇదిగో 'అ' అని చెప్పినాను. దాని రూపమును చూచినారా?

శిష్యుడు : చూడలేదు.

గురువు : రూపమున్న యెడల చూడవలెనుగదా?

శిష్యుడు : చూడవలెను. కాని శబ్దమునకు రూపము కనబడుట లేదు.

గురువు : అట్లయిన రూపము దేనికి?

శిష్యుడు : శబ్దము ఏదని తెలియుటకు ఏర్పరచిన గురుతులకు రూపము.

గురువు : "అ" అను, అకారమునకు ఎన్ని రూపములున్నవి?

శిష్యుడు : లోకమున ఎన్ని భాషలున్నవో, అన్ని గురుతులైన 'అ' కారము యొక్క రూపములున్నవి.

గురువు : అప్పుడు 'అ' కారమని చెప్పబడిన అక్షరములకన్నిటికి ఒకటే శబ్ధముగాక వేరే శబ్ధములు చెప్పుట ఉన్నదా?

శిష్యుడు : లేదు. 'అ' కారమగు గురుతునకు శబ్ధమొకటే. గుర్తులు మాత్రము అనేక విధములుగా నున్నవి.

గురువు : మీరు మొదట 51 అక్షరములున్నవనిచెప్పినారు గదా? అన్ని భాషలున్నవా? వాటికన్నిటికి ప్రత్యేక గుర్తులున్నవని ఇప్పుడు చెప్పుచున్నారు. ఆ రీతిగా

ఆలోచించునప్పుడు ఈ లోకమున ఏబది ఒకటికి పైబడి



భాషలున్నవి. అప్పుడు 'అ' కారమే ఏబది యొకటికి యెక్కువగాయుండును. గుర్తుల అక్షరములని చెప్పిన మీరు పై జెప్పిన దానికన్న ఎంతో ఎక్కువగు సంఖ్యలను ఉంచవలయునుగదా? అదిగాక 'అ' యను గుర్తునకు శబ్దమున్నదని మీరు చెప్పినారుగదా! ఇదిగో చూడుము. నాచేతులను నేనేమి చేసియున్నాను?

శిష్యుడు : రెండుచేతులను చేర్చి నమస్కరించు లాగున మూసిపట్టుకొని యున్నారు.

గురువు : ఇప్పుడు నేను నా చేతులను ఏమి చేసి యున్నాను?

శిష్యుడు : చేతులను తెరచి ఒకటితో నొకటి విడువని రీతిగా పట్టుకొనియున్నారు.

గురువు : ఇది ఏరీతిగానున్నది?

శిష్యుడు : అది తెరచి 'అ' కారము రీతిగా నున్నది.

గురువు : దీనికి శబ్దమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఇదిగో చూడుము - ఇప్పుడు నా నోరు ఎలాగున నున్నది?

శిష్యుడు : నోరు మూసియున్నది.

గురువు : దానికి అకారమని చెప్పుటకౌనా?

శిష్యుడు : చెప్పరాదు.



గురువు : ఇప్పుడు నేనేమి చేసితిని?

శిష్యుడు : ఇప్పుడు నోరు తెరచికొని, "అ" కారము రీతియై యున్నది.

గురువు : దానికేమని చెప్పవలెను?

శిష్యుడు : "అ" కారమని చెప్పవలెను.

గురువు : ఇప్పుడు "అ" కారమునకు శబ్దమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన శబ్దమనునది కల్పించునదియా లేక తనంతటనే కలుగునదియా?

శిష్యుడు : కల్పించబడునది.

గురువు : అట్లయిన కల్పించబడునది, నాశనమగు నదియా, నాశము లేనిదా?

శిష్యుడు : నాశనముండునది.

గురువు : అప్పుడు 'అ' అను శబ్దమును చేయు సమయమున మనలోనుండు జీవుడు లోపల అణగియున్నదా? లేక బైటకు పోవుచున్నదా?

శిష్యుడు : బైటకు పోవుచున్నది.

గురువు : అలాగే మనము యొక్కొక్క శబ్దమును చేసి మనలోనుండు జీవుడు అంతయు ప్రతిరోజున, బైటకు

వెళ్ళుచున్నది. ఆ సమయమున ఏమగుచున్నది?



శిష్యుడు : చనిపోవుచున్నాము.

గురువు : అప్పుడు మనము నాశమగుదానినా, లేనిదానినా, దేనిని అభ్యసించుచున్నాము?

శిష్యుడు : నాశమగుదానిని.

గురువు : కావున తన్ను తాను అభ్యాసము చేయుటయే అక్షరాభ్యాసము. అదేవిద్య. దానిని అభ్యాసము చేయుటయే అక్షరభ్యాసము. అదియే విద్య. దానిని అభ్యాసము చేయుటయే విద్యాభ్యాసము. మునుపటి అధ్యాయమున విద్యయనునది అక్షరమనియు, అక్షర మనునది తాను అనియు చెప్పబడియున్నది. కావుననే విద్యయై, అక్షరమై, తానైయుండు వస్తువును అభ్యాసము చేయవలయును. అప్పుడు నాశరహితమగుచున్నాము. అటువంటి క్రమమున నశించకయుండుటకే అక్షరాభ్యాస మును చేయవలసినది. నీవు ఇప్పుడు చెప్పిన అ కారము నశించునవిగా ఉన్నవి. అప్పుడు దానికి అక్షరమనుటకు వీలున్నదా?

శిష్యుడు : చెప్పుటకు వీలులేదు.

గురువు : శబ్దము కల్పించబడి, నశించిన దానికి ఏమని చెప్పుట? అక్షరమని యనవచ్చునా?

శిష్యుడు : అక్షరమని యనరాదు.

గురువు : అలాగైన మనము అక్షరమును అభ్యాసము



చేయుటకద్దా?

శిష్యుడు : చేయుటలేదు.

గురువు : అక్షరమును అభ్యాసము చేయకయుండిన అర్థము దొరకునా?

శిష్యుడు : దొరకదు.

గురువు : అర్థము గ్రహించక అర్థము తెలియునా?

శిష్యుడు : తెలియదు.

గురువు : అదిగాక, మీ లౌకిక వస్తువులైన ధనములను భద్రపరచుట లోపలనా? బైటనా?

శిష్యుడు : లోపలనే

గురువు : ఈ ప్రకారము అర్థము లోపలనేయుండును. లోపల ఏదిక్కునయుండుననగా, ధాతువుయుండు చోటున. ధాతువుయందుండు అర్థమును తెలియవలయుననగా, ధాతువు హెచ్చరికగా ఉండవలయును. దాతువు హెచ్చరికగా ఉండవలయుననగా, అక్షరభ్యాసము చేయవలయును. అక్షరభ్యాసము లేక ధాతువును హెచ్చరించుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : ధాతువు అనునది ఆకుననా, కాగితముననా, లేక

వానివాని లోపలనా? ఎచ్చటనున్నది?



శిష్యుడు : వానివాని లోపలనే.

గురువు : వానివాని లోపలనుండు ధాతువునకు హెచ్చరిక లేనియెడల అర్థము దొరకునా?

శిష్యుడు : దొరకుట లేదు.

గురువు : కావున అక్షరమై, నాశరహితమైయుండు వస్తువును అభ్యాసము చేసిన మాత్రముననే, ధాతువునకు హెచ్చరిక కలిగి అర్థము దొరుకును. 'అ' కారము మొదలైయుండు గుర్తులను అక్షరమని చెప్పి, అభ్యాసము చేసిన యెడల, అనర్థమై ధాతువునశించి హెచ్చరిక లేకపోవుచున్నది. కావుననే అర్థము దొరకుట లేదు. లోకమున ఏదేది అర్థములు మనము గ్రహించుచున్నామోయని అన్నియు తప్పుగానున్నవి. సరియైయుండునది మనకు తెలియవల యుననిన, ఇవన్నియు ఎచ్చట ఉద్భవించుచున్నవో, అచ్చట చూచి నేర్చుకొనవలయును. ఆ సమయమున మనము సరియగు తత్వమును గ్రహించుకొనవచ్చును. అది ఏవిధమనగా, ఇది ఒక కాగితము. దీనికి లోపల, బైటయుండినను, దాని పై భాగమునకు లోపలబైటయను అవస్థలున్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : అయిన, ఇప్పుడు నేను ఈ కాగితము నందు యేమి చేసినాను?

శిష్యుడు : 'ဂ' మాదిరిగా అర్ధచంద్రాకారముగా ఒక గుర్తును



వ్రాసినారు.

గురువు : ఇట్లు గుండ్రాకారముగా వ్రాసినదానికి ఏమి కలిగినది?

శిష్యుడు : దానికి లోపల, బైటయను రెండు భాగములు కలిగినవి.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : పైన జూపిన "ဂ" అను గుండ్రాకారముగా వ్రాసినందువలన.

గురువు : అట్లు వ్రాయనియెడల లోపల, బైట అనునది ఉండునా?

శిష్యుడు : ఉండుటలేదు.

గురువు : మొదటి ఉండిన దేది? లోపలనా, బైటనా?

శిష్యుడు : లోపల

గురువు : లోపల లేనియెడల బైటయనునది ఉన్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన లోపలయనునదియా, లేక బైటయను నదియా, పెద్దది?

శిష్యుడు : బైట.

గురువు : కాబట్టి లోపల ఎంతయో చిన్నదియు, బైట అనునది



ఎంతయో పెద్దదియగును. అప్పుడు చిన్నదాని నుండియే పెద్దది కలుగును. అదెట్లనగా, ఒక విత్తనమా, ఒక వృక్షమా పెద్దది?

శిష్యుడు : వృక్షమే పెద్దది.

గురువు : విత్తనములేనిదే వృక్షము కలుగునా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు ఎంతయో పెద్దదియైన వృక్షమునకు పునాది యేది?

శిష్యుడు : విత్తనము.

గురువు : ఇదే ప్రకారముగనే ఎంతయో పెద్దదై, బైటయైన లోకము, ఎంతయో చిన్నదైన తనలోనుండి కలుగుచున్నది కాబట్టి లోపలయే ముందుకలిగినది. దానికి దృష్టాంతము; కుమ్మరి మన్నును శుభ్రము చేసి, ఆ మట్టిని ముద్దగా చేయును, అప్పుడు ఆ మట్టి ముద్దకు లోపల, బైటయను అవస్థ ఉన్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : ఆ మన్నును బాగుగా కలిపి ముద్దగా చేసినందువలన.

గురువు : తరువాత, ఆ మట్టిముద్దను చక్రమునందుంచి ఏమి



చేయును?

శిష్యుడు : అతడు ఆ చక్రమును త్రిప్పి, ఆ మట్టి ముద్దతో ఒక పాత్రమును తయారు చేయును.

గురువు : అది ఎట్లు తయారు చేయును?

శిష్యుడు : ఆ చక్రము తిరుగునప్పుడు మట్టిముద్ద మీద తన బొటనవ్రేలుతో పల్లముచేసి లోపల తయారుచేయును.

గురువు : అప్పుడు మొదట కలుగునదేది?

శిష్యుడు : లోపల.

గురువు : అదియునుగాక మీకు లోపల కావలయును, మాకు బైట అవసరము అయినప్పుడు లోపల కావలసిన మీరు ఏమి చేయవలయును?

శిష్యుడు : లోపల అవసరమైనందున నేను లోపలను కలుగ జేవయవలెను?

గురువు : బైట అవశ్యమైన మేమేమి చేయవలెను?

శిష్యుడు : బైట కలుగ జేయవలెను.

గురువు : అది ఒకప్పుడును సాధ్యము కాదు. ఎందువల్లననగా, లోపల లేనిదే బైటలేదు. లోపల కలిగినప్పుడు బైటయు కలుగును. కాబట్టి, బైటకావలసిన మేము లోపలను కలుగజేయవలెను. అప్పుడు లోపలకావలసిన మీరును

బైటకావలసిన మేమును కలుగజేయునది ఒకటియే.



కాబట్టి లోపలకావలసిన మీరు లోపలను కలుగజేసి లోపల ఉందురు. బైటకావలసిన మేము లోపల కలుగజేసి దానికి బైట ఉందుము. అదియునుగాక, ఇదిగో ఒక గృహము. ఈ గృహము లేని ఎడల, లోపలయనుటకును, బైటయనుటకు, చెప్పుటకు సాధ్యపడునా?

శిష్యుడు : చెప్పుటకు వీలులేదు.

గురువు : ఈ గృహము యొక్క బైట అరుగు మీద నుండి బైటకు చూచునప్పుడు, గృహము లోపలనున్న ఏదైనను వినుటకుగాని, చూచుటకుగాని, తెలిసికొనుటకుగాని వీలగునా?

శిష్యుడు : వీలుపడదు.

గురువు : తిరిగి లోపలవైపు చూచునప్పుడు బైట నున్న ఏదైనను వినుటకు, చూచుటకు, తెలిసికొనుటకు వీలుపడునా?

శిష్యుడు : వీలుకాదు.

గురువు : అయిన లోపల ఉన్నది బైటకలదా?

శిష్యుడు : లేదు.

గురువు : అదియునుగాక బైటనున్నది. లోపలఉన్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : కాబట్టి, లోపలకు విరుద్ధముగాను, విపరీతముగాను

ఉండునది బైటను; బైటకు విరుద్ధముగాను, విపరీతము



గాను ఉండునది లోపలను ఉన్నది. లోపలయను చెప్పునది అంతర్యమా? బాహ్యామా?

శిష్యుడు : అంతర్యము

గురువు : బైటయనునదో?

శిష్యుడు : బాహ్యాము.

గురువు : అంతర్యమనునది తత్వమా? అతత్వమా?

శిష్యుడు : తత్వము.

గురువు : బాహ్యామనునదియో?

శిష్యుడు : అతత్వము.

గురువు : తత్వమనునది ఉండునదా? లేనిదా?

శిష్యుడు : ఉండునది.

గురువు : అతత్వమనునదో?

శిష్యుడు : లేనిది.

గురువు : ఉండునది సత్యమా? అసత్యమా?

శిష్యుడు : సత్యము

గురువు : లేనిదో?

శిష్యుడు : అసత్యము

గురువు : అప్పుడు అంతర్యమై, తత్వమై, ఉండునదై,



సత్యమైనది లోపలయు, దానికి విరుద్ధముగా బాహ్యమై, అతత్వమై, లేనిదై, అసత్యమైనది బైటయు, ఉన్నది. అయిన మన ఉద్భవము మాత్రమేకాక, లోకమున కనబడు సకల చరాచరములయొక్క ఉద్భవము ఎచ్చటనుండి? లోపలనుండియా, లేక బైటనుండియా?

శిష్యుడు : లోపలనుండి

గురువు : అయిన, అప్పుడు ఉద్భవస్థానము ఏది? లోపలనా? బైటనా?

శిష్యుడు : లోపల

గురువు : అదియేకదా, మన మూలస్థానము?

శిష్యుడు : అవును.

గురువు : ఆ మూలస్థానమేగదా ఉత్పత్తి స్థానము?

శిష్యుడు : అవును.

గురువు : ఆ ఉత్పత్తి స్థానమేగదా కుటుంబ స్థానము?

శిష్యుడు : అవును.

గురువు : ఆ కుటుంబ స్థానమునకేగదా. మనము పోవలసినది?

శిష్యుడు : అవును.

గురువు : అక్కడకు పోవుటకేగదా మనము నేర్చుకొనవలసినది?

శిష్యుడు : అవును

గురువు : అప్పుడు మన మెక్కడకు పోవుటకు నేర్చుకొనవలెను?

శిష్యుడు : లోపలకు పోవుటకు నేర్చుకొనవలెను.

గురువు : ఇప్పుడు మనము నేర్చుకొనునది అంతయు యెచ్చట?

శిష్యుడు : పుస్తకమునందు.

గురువు : ఆ పుస్తకమునందలి చదువు లోపలనా, బైటనా?

శిష్యుడు : బైట.

గురువు : అప్పుడు మనము నేర్చుకొనునదంతయు నెచ్చట?

శిష్యుడు : బైట.

గురువు : బైటయనునది సత్యమా, అసత్యమా?

శిష్యుడు : అసత్యము.

గురువు : కాబట్టి మనము నేర్చుకొనినది, నేర్చుకొనునది, నేర్పునది అంతయు, అసత్యమైయున్నది. సత్యమును తెలియవలెననిన లోపలనేర్చుకొనవలెను. అప్పుడు మాత్రమే సత్యమును తెలిసికొనుటకు సాధ్యపడును. అదియెట్లు? శవమునకు లోకము ఉన్నదా?

శిష్యుడు : లేదు.



గురువు : అది ఎందువలన?

శిష్యుడు : జీవుడు లేనందువలన.

గురువు : జీవుడు లేనిదే లోకమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు లోకము కలుగుట ఎచ్చట నుండి?

శిష్యుడు : జీవుని నుండి

గురువు : అయిన జీవుడున్న అన్ని సమయము లందును లోకమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అది ఎప్పుడు లేనిది?

శిష్యుడు : నిద్రించు సమయమున.

గురువు : నిద్రించుసమయమున జీవుడెక్కడున్నది?

శిష్యుడు : మనలోపలనే అణగియున్నాడు

గురువు : అప్పుడు మనకు ఆది, అంత్యము, స్థలము, వస్తువు మొదలైన ఏదైనా అవస్థలు ఉన్నవా?

శిష్యుడు : లేదు.

గురువు : ఇవి అన్నియు ఎప్పుడు కలిగినవి?

శిష్యుడు : నిద్ర నుండి మేల్కొని, మనలోపలనున్న జీవుడు



బైటకు వచ్చినప్పుడు.

గురువు : అప్పుడు జీవుడు ఎచ్చటనుండి బైటకు వచ్చినది?

శిష్యుడు : లోపలనుండి.

గురువు : కాబట్టి, మనలోపలనుండి బైటకు వచ్చిన జీవుని మరలలోపలికి తీసికొనిపోయి చూచునప్పుడు మాత్రమే సత్యమును తెలిసికొనవచ్చును. అప్పుడే జ్ఞానము కలుగును. దానినే మస్తకజ్ఞానమని చెప్పుట. ఇప్పుడు లోకమున ఆ ప్రకారముగా చేయక, కేవలము పుస్తకమును మాత్రము చదివి, పుస్తకజ్ఞానము మాత్రము ఉన్నది. అది అసత్యమై ఉన్నది. కాబట్టి మనము నేర్చుకొనునది అంతయు అసత్యమై పోయి ఉన్నది. అయిన వేద, శాస్త్ర, ఇతిహాసాదులు ఏవియు అసత్యముగాదు. అవి అన్నియు సత్యమే. అది ఎట్లనగా, పై జెప్పిన ప్రకారము, వానివాని జీవుని ఉద్భవస్థానమైన మస్తకమువద్దకుగొనిపోయి సత్యమును గ్రహించిన వారు వ్రాసియుంచినవే, వేద, శాస్త్ర, ఇతిహాసాదులు లోకవాసులు పైన జెప్పబడిన ప్రకారము ప్రవర్తించకయు, యధార్థతత్వమును గ్రహించకయు, బాహ్యమై తత్వముకానిదై, అసత్యమై యుండు అవస్థను చూచియే గొప్పవాదములను చేయుచున్నారు. అది తప్పయియున్నది. తన యదార్థమై యుండు తన తత్వమును గ్రహించవలయుననగా, తనలో

నుండు అంతర్యమైన తత్వమును చూడవలయును. అప్పుడేయదార్థమును గ్రహించుటయు, బాహ్యావస్థ



అసత్యమని తెలిసికొనుటకు సాధ్యమగును. అదియును గాక బాహ్యవృత్తులను ధరించుకొని, గ్రంథాదులను చదివి, చదివితిమని గర్వమును పొంది, తాము విద్వాంసులమని అభిమానించిన ఏదొక జ్ఞానమును కలుగుటలేదు. జ్ఞానము కలుగవలెననిన తనలో అంతర్యమైన తత్వమును చూచి అక్షరాభ్యాసము చేయవలయును. అప్పుడు మాత్రమే ధాతువులకు హెచ్చరిక కలుగును. ఆ సమయముననే సర్వజ్ఞుడగుట.



# ఆరవ
# అధ్యాయము

శిష్యుడు : స్వామి! ముందు అధ్యాయమున వివరించిన విధమున సృష్టియెట్టిదని నాకు పూర్తిగా తెలిసినది. అయినను నానావిధములైన ప్రకృతియనగా రూపభేదము కనబడుచున్నది. అది గృహవ్యత్యాసమనియు, దానిని పిమ్మట వివరించెదననియు, మూడవ అధ్యాయమున చెప్పినారుగదా! దానిని వివరించి చెప్పవలయునని ప్రార్థించుచున్నాను.

గురువు : నానా విధములైన సృష్టులేవి?

శిష్యుడు : అవి మనుష్యులు, మృగములు, పక్షులు, సర్పములు, జలజంతువులు, చీమలు, క్రిమికీటకాదులు మొదలగు జంతువులై యున్నవి.

గురువు : మనుష్యులని చెప్పునటువంటి వారెవరు?

శిష్యుడు : మనమందరము

గురువు : మనలను మనుష్యులని చెప్పుటకు కారణమేమి?

శిష్యుడు : విశేషబుద్ధి యుండుటవలన.

గురువు : ఇతర జంతువులకో?

శిష్యుడు : విశేషబుద్ధిలేదు.

గురువు : అయిన ఇలాగున గ్రహించుట తప్పు. విశేషబుద్ధి లేకుండుట మనకే. వేరే ఏన్ని విధములైన జంతువు లున్నవని మనము తలచుచున్నామో, వానికన్నిటికి విశేషబుద్ధియున్నది. ఏలనగా, ఆహార, నిద్ర, మైథున, ఇవి మూడును అన్ని జీవులకునుయుండునటువంటివే. తెలివిలేకను, విశేషబుద్ధిలేకను ఉండునవి సర్ప, మృగ, పక్షి, క్రిమి, మొదలగునవి యనియును, తెలివియు, విశేషబుద్ధియు, నుండువారు మనుష్యులనియును, అనగా ఆ మనుష్యులు మనమేయనియును, అభిమానించి వచ్చుచున్నాము అదే ప్రకారముగా సర్వజీవులును, తమకుతాము మనుష్యులని గ్రహించి యున్నవి. యదార్థముగా మనుష్యులని యొకసృష్టిలేదు. ఇప్పుడు సృష్టియనునది మృగములైయున్నది.అనగా రెండు కాళ్ళ జంతువులు, నాలుగు కాళ్ళ జంతువులు మొదలైనవి. మనము మనుష్యులనియు, మనకు విశేషబుద్ధియున్నదనియు, గ్రహించియుండు తలంపును దేనినుండియు స్థాపించుటకు సాధ్యము లేదు. కారణమేమనగా మనము ఒక చిలుకను పెంచి దానితో మనము కొన్ని రోజులు సంపర్కము చేసి దానికెదుట, అక్క, రంగరంగ, అయ్య, అయ్యయనియును, యింకను పలువిధములుగా మాట్లాడునప్పుడు, ఈ మాటలను చిలుక శ్రద్ధతో గ్రహించి, మనము చెప్పుప్రకారమే అది చెప్పుచున్నది. ఆ చిలుకకు విశేషబుద్ధి లేనియెడల

మనమాటలను గ్రహించుటకు, పలుకుటకు దానికి



సాధ్యమగుట లేదు. అయినను మన మెంతకాలము ఆ చిలుకతో ఉండినను, విశేషబుద్ధి కలవారని చెప్పబడు మనకు, ఆ చిలుక స్వంత భాషయైన శబ్దమును గ్రహించుటకును, తెలిసికొనుటకును సాధ్యము అగుట లేదు.

శిష్యుడు : స్వామి! చిలుకకు, మృగములకు స్వభాషయైన ఒక భాష లేదు గదా?

గురువు : అట్లు చెప్పరాదు. లోకమున ఎన్ని విధములైన ప్రాణులున్నచో అన్ని భాషలున్నవి. అయిన వాటిని మనము తెలిసికొనుట లేదు. అదెట్లనగా, మీకు తెలుగుభాష మాత్రమే తెలియును. అట్లుండు మీ ముందుగ హిందీభాష తెలిసినవాడు హిందీని, ఆంగ్లేయుడు ఆంగ్లమును, కన్నడపువాడు కన్నడమును, అరవవాడు అరవమును మాట్లాడిన మీకు తెలియునా?

శిష్యుడు : తెలియుట లేదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : నేను ఈ భాషలను నేర్చు కొనక యున్నందున.

గురువు : అలాగే, పక్షి , మృగములు మొదలగునవి. దానిని నేర్చుకొనకయుండుటవలన, ఆ భాషలు మనకు తెలియుటలేదు. ఇదిగాక మృగములని మనము గ్రహించి యుండు ప్రాణులు మేయుచుండు ...

వాటిలో నొకటి కనబడకపోయిన, మిగత ఉండునవి



శబ్దించి దానిని పిలుచుచున్నవి. అవి అలాగు అరచుచుండు శబ్దమును, తప్పిపోయిన ప్రాణివిని, తన్ను పిలచుచున్నారని తెలిసి ప్రతిధ్వనించి, పరుగెత్తివచ్చి, తనగుంంపుతో చేరుకొనుచున్నది. ఈ ప్రకారమే పక్షులలోను, ప్రాకుడు జంతువులలోను, నడచుదానిని మనము చూచుచున్నాము కదా?

శిష్యుడు : అవును, చూచుచున్నాము.

గురువు : అప్పుడు, వాటికి భాషలున్నవికదా? అవి తమతమ భాషలతో కూయుట, మాట్లాడుటగా నున్నవి. దానిని అవి తెలిసికొనుటయు, దానికనుసరించి ప్రవర్తించుటగా నున్నది. అయిన, అదిమనకు తెలియకయుండుటకు కారణము మనము ఈ భాషలను తెలిసికొనకయుండుట వలన. అదెట్లనగా మనుషులని అభిమానించు మనమే మునుపుజెప్పిన ప్రకారము ఇతరభాషలలో మాట్లాడు నప్పుడు ఆ భాషలను నేర్చుకొనక యుండుటవలన, వాటిని ఏలాగు తెలిసికొనుటలేదో, ఆలాగే, పక్షి, మృగాదులని చెప్పబడు వాటి భాషలను మనము నేర్చుకొనక ఉండుటవలన, అవి మనకు తెలియుటలేదు. అయిన, వాటితో మనము ఏ భాషతో మాట్లాడినను దానిని తెలిసికొని, దానిననుసరించి నడచుచు ప్రవర్తించుచున్నవి. అది ఎట్లనగా, అన్యభాషలతో మాట్లాడు దేశము నుండి మనము ఒక యెద్దును మన తెలుగు దేశములోనికి కొని

వచ్చి, దాని మెడకు మడక కట్టిను కట్టి, పొలమును దున్ను



సమయమున, కుడివైపునకు, యెడమవైపునకు, నేరుగాను పొమ్మని చెప్పుటను విని, దానికనుసరించి అది నడచు చున్నదిగదా! ఇది మాత్రము కాదు. అడవి మృగములని మనము చెప్పునటువంటి సింహము, ఏనుగు, పులి, చిరుత, ఎలుగుగొడ్డు, వీటినిపట్టి అనేక విధములగు దేహాభ్యాసములను నేర్పరచి, కొన్నిటిని సర్కసులలోనికి తీసికొని వచ్చి వాటిని పలువిధములుగా ఆటలాడించుట, ఆడుటగా ఉన్నవి. అవి యజమానుడు చెప్పులాగున ప్రవర్తించుచున్నవి. ఇది మనకు అనుభవము కదా? ఈ ప్రకారము ఆటలాడుటవలన వాటికి విశేషబుద్ధి యున్నదనియూ, లేదనియూ మనము గ్రహించవలసినది?

శిష్యుడు : వాటికి సరియైన విశేషబుద్ధియున్నది. విశేషబుద్ధి లేని యెడల పైన జెప్పిన ప్రకారము అనుసరించుటకు, నేర్చుకొనుటకు, ప్రవర్తించుటకు సాధ్యముకాదు.

గురువు : అదిగాక, మనకు విశేషబుద్ధి లేదనియు, విశేష బుద్ధియు, తెలివియు నుండునది ఇప్పుడు మనము మృగము మొదలగునవి అని అభిమానించివచ్చు వాటికే ననుటకు దృష్టాంతము: మనకు మనయొక్క మాతృ భాష తప్ప వేరొక భాషను నేర్చుకొనవలెననిన ఆ భాష యొక్క తాత్పర్యము, మనమాతృభాషయందు చెప్పి నేర్పని యెడల, ఆ భాషమాత్రము నేర్పినయెడల దానియర్థమును గ్రహించుటకు, ఆ భాష చదువుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.



గురువు : పైన జెప్పిన పక్షులు, నాలుగు కాళ్ళ జీవులు మొదలైన జీవులనుపట్టి మనము నేర్పునప్పుడు, దాని చేత ప్రవర్తింపజేయునప్పుడు, ఎవరి భాషలో మనము నేర్పుచున్నాము? మనభాషలోనా లేక వాటి భాషలోనా?

శిష్యుడు : మన మాతృభాషలో.

గురువు : అయిన మన మాతృ భాషలో చెప్పుదానిని అవి విని నేర్చుకొనుటయు, అనుసరించుటయు, చేయునప్పుడు విశేషబుద్ధి ఎవరికున్నది?

శిష్యుడు : పక్షి, నాలుగుకాళ్ళ జీవులు మొదలైన జీవులని విశదమగుచున్నది.

గురువు : అయిన విశేషబుద్ధియు, అభిమానించి వచ్చు మనకు వేరొక భాషనే నేర్చుకొనవలయుననిన, వాని వాని మాతృ భాషయందు చెప్పినమాత్రమే, నేర్చుకొన సాధ్యమగును. పక్షి, నాలుగుకాళ్ళ జీవులు మొదలైన జీవులతో మనమాతృభాషయందు చెప్పిన, దానిని అవి గ్రహించి, ఆ ప్రకారము అనుసరించి, ప్రవర్తించుచున్నవి. కాని వాటి మాతృభాషలో మనము నేర్పలేదు. అదియును గాక, ఎంతకాలము వాటితో గూడ సహచర్యముచేసి, పనిచేయించినను, వాటితో గూడి ప్రవర్తనచేసియు, మాట్లాడియు, ఎప్పుడు వాటితో కలసి యుండినను, వాటి యొక్క మాతృభాషయందు అవి మాట్లాడునది మనకు

తెలియుటలేదు. కాబట్టి, విశేషబుద్ధియు, తెలివియుపైన
జెప్పిన వాటికి మాత్రమే కలదు. అదిగాక మీ



పశువులకొట్టములో పుట్టిపెరిగినదో లేక నాలుగైదు సంవత్సరములుగా మీ సంరక్షణలో ఉన్న ఆవుగాని, ఎద్దుగాని, గేదెగాని, దున్నపోతుగాని వీటిలో ఏదైనను, ఒక దానిని అమావాస్య రాత్రియందు అతిఘోరముగా వర్షించునప్పుడు ఏప్పుడును పోకయు, తెలియనియు, దారిలేకయునుండు యొక అడవియందున్న యేటిని దాటించి, పది లేక యిరువది మైళ్ళ దూరమున, దానికి ఏదొక హింసలేని స్థలమున విడచి, మీరు వెనుక కువచ్చిన, దానిని యెవరును బంధించకయున్న, ఏలాగైనను, ఖండితముగా అది తన స్థలమునకు మరలివచ్చి చేరుచున్నదిగదా?

శిష్యుడు : వచ్చి చేరుచున్నది.

గురువు : అయినను, మనలో మనుష్యులని అభిమానించుచు వచ్చు రెండుకాళ్ళ జీవియైన ఒకనిని ఇచ్చట నుండి సుమారు పది లేక పదిహేను మైళ్ళ దూరమునుండు, ఇదివరకెన్నడును పోకయు, లేక తెలియకయుండు ఒక పెద్దపట్టణమునందు సాధారణముగా జనులు సంచరించు చుండు బహిరంగమైన బాటలో పగటి సమయమున తోడ్కొనిపోయి పట్టణము మధ్యలోవిడిచి వచ్చిన, వేరొకరి సహాయములేకను, త్రోవయడుగకయు, తనస్వంత స్థలమునకు మరలివచ్చుటకు వానికి సాధ్యపడునా?

శిష్యుడు : వేరొకరి సహాయములేకయు, మార్గమును అడుగ

శిష్యుడు : ఏ రకం సహాయము...

కను, మరలివచ్చుటకు సాధ్యమగుటలేదు.



గురువు : అది ఎందువలన? విశేషబుద్ధియు, తెలివియు, మనుష్యులకు మాత్రమే ఉన్నదనియు, ఆ మనుష్యులు మనమేయనియు నీవు మొదట చెప్పలేదా? అటువంటి యప్పుడు మరలివచ్చుట కెందుకు సాధ్యపడలేదు? విశేషబుద్ధియు, తెలివియు లేనివి మీరు మృగాదులని అభిమానించి వచ్చువారి కేయని మీరే చెప్పినారుగదా? ఆ ప్రకారముగా నున్న నాలుగుకాళ్ళ జంతువులందు ఒక దానిని రాత్రి కటిక చీకటిలో ఒక యేరుదాటించి, ఒక అడవిగుండా పదిలేక ఇరువది మైళ్ల దూరమునకు తీసికొని పోయి విడిచిన, అది స్వల్పదినములలో ముందుండిన స్థలమునకు మరలివచ్చి చేరుచున్నది. అప్పుడు అది మరలివచ్చుటకు ఎవరిదైన సహాయము ఉండియా, లేక ఎవరినైనను దారియడిగియా, లేక ఎవరైనను దారి చెప్పియుండిరా?

శిష్యుడు : లేదు అవి తనంతట తానేవచ్చి చేరినది.

గురువు : అట్లయిన విశేషబుద్ధి ఎవరికున్నది.

శిష్యుడు : మృగములని మనము అభిమానించి స్థాపించిన వాటికే యున్నది.

గురువు : విశేషబుద్ధియుండు వారెవరు?

శిష్యుడు : మనుష్యులు.

గురువు : అయిన మనుష్యులని చెప్పబడువారెవరు?

శిష్యుడు : ఇది వరకు మృగాదులని తలచినవే మనుష్యులు.



గురువు : మృగమని చెప్పబడునవి యేవి?

శిష్యుడు : ఇది వరకు మనుష్యులని అభిమానించి స్థాపించి వచ్చువారే మృగములు.

గురువు : అయిన ముందుగ జెప్పబడిన నాలుగు కాళ్ళ జీవులే మనుష్యులని ఇప్పుడు నిర్ణయించుటకు వాటికి విశేషబుద్ధి కలిగియుండుటయే కారణము. తెలివియై యుండు వస్తువు వాయువేనని మునుపటి అధ్యాయ మున వివరించబడి యున్నదిగదా! ఆ వాయువు వాటికి స్వాధీనమై యున్నది. అదెట్లనగా, మన నిద్ర సమయమున మనశ్వాస గతియే ప్రకారముగనో, ఆ ప్రకారముగనే పై జెప్పిన నాలుగుకాళ్ళ జీవులు మొదలైన జీవులకు శ్వాసగతి సదాకాలము ఉంటున్నది. అటువంటి తెలివియై జీవశక్తియై యుండు వాయువుగతి ఏకగతియై యున్నది. ఆ తెలివియైయియుండు వాయువు ఏకగతియై వచ్చినప్పుడు అన్ని అవస్థలును స్వాధీనమై వచ్చుచున్నవి. కావుననే ఆ వాయువుయొక్క స్వాధీనము వలన, ఈ స్థలమున బైలుదేరినదనియు, ఈ మార్గమై వచ్చిన దనియు, వాసనవలన తెలిసికొని, అవి బయలుదేరిన స్థలమునకు మరలివచ్చి చేరుచున్నవి. దానికి కారణము వాటికి ఇటువంటి తెలివియైన వాయువేకగతియై యుండుటయే. మనకు ఆ వాయువు ఏకగతిగాలేక భిన్నగతియై ఎల్లప్పుడు తలంపులైన రాగ ద్వేషాదులతో గూడి, "వీడు నా పుత్రుడు,

వీనికే నాఆస్తి అంతయునిచ్చి రక్షించవలయును అనియు,



అతడు వేరొకడు, అతనిపై వ్యాజ్యమాడవలయును మరేవిధముననైనను అతనిని చెడుపవలయును; మొదలగు దుర్విచారములచేత, శుద్ధమృగములై నడచుటవలన, వాసనశక్తిలేక మనము బయలుదేరి వచ్చిన స్థలమునకు మరలివెళ్ళుటకు సాధ్యము లేకపోవుచున్నది. ఎప్పుడు మనకు భిన్నగతి పోయి యేకగతి లభించునో అప్పుడు తెలివియై, జీవ శక్తియై, వాయువై యుండు వస్తువు మనలో అణగు చున్నది. అప్పుడు మనకు తెలివికలుగును. అప్పుడే మనము మనుష్యు లమగుచున్నాము. మనుష్యులను ఒక ప్రత్యేకసృష్టిలేదు. వానివాని ప్రవర్తన చేతనే మనుష్యుడు కావలసినది. మనుష్యులకే మోక్షము దొరకును. అదిగాక, లేని వస్తువును ఉన్నదని తలచు చున్నాము. ఆ తలంపు నాశనమైననే మనము మనుష్యులగుట. అదెట్లనగా, మధ్యాహ్నమున అతి తీక్షణమై సూర్యుడు ప్రకాశించు నప్పుడు, మనము ఒక బయలైన స్థలమందు సంచరించునప్పుడు ఆ స్థలము నందు ఏ భాగమున చూచినను, ఏలాగు కనబడు చున్నది?

శిష్యుడు : జలముండులాగున కనబడుచున్నది.

గురువు : అయిన, జలముండు లాగున కనబడిన స్థలమునకు పోయిచూచినచో?

శిష్యుడు : జలము కనడుట లేదు.

గురువు : అప్పుడు, ఈ విధముగా కనబడునట్లు గ్రహించుట



సరియైయున్నదా?

శిష్యుడు : సరికాదు.

గురువు : జలముండు లాగున కనబడుటకు కారణము ఏమనగా ఆ పెద్ద బయలైన సమభూమియందు ఏదొక చెట్టునీడ లేక విశాలమై, ఖాళీయైయుండు స్థలము, ఆ ఖాళీయైయుండు స్థలమున అతితీవ్ర మైన సూర్యరశ్మి వ్యాపించియుండి, ఆ రశ్మి నుండి తళతళయని ప్రకాశించియుండుట వలన, ఆ ప్రకాశము అగు తళతళజ్వాలను జలమని తప్పుగా గ్రహించు చున్నాము. కాని అది నిజముగా జలముకాదని మనము వెళ్ళి చూచినప్పుడు తెలియవచ్చుచున్నదిగదా! ఆలాగే తన జీవశక్తి బైటవ్యాపించి ప్రకాశించుకొనియుండు ఈ జ్వాలయందు తానే ప్రతిబింభించి కనబడునప్పుడు, ఈ విధమైన ఒక వస్తువుయున్నట్లు తోచుచున్నది. అదియే మృగబుద్ధి. ఎవరికి ఈలాగు కనబడుచున్నదో వారు మృగములు. ఈ విధముగా కలిగి నది తనశక్తి యందుండి కలిగినదనియు, ఆ శక్తి బైట వ్యాపించిన సమయమున ప్రతిబింబించనదనియు, తెలిసి కొని, ఆ శక్తిని బైటవ్యాపించుటకు విడువక దాని ఉద్భవ స్థానమైన తనలోపలచేర్చి, దానిలో లయించి మన తలంపు నశించునప్పుడు మాత్రమే మనుష్యులగుట. అదిగాక

మనుష్యులనగా మననము చేయువారు. మననము చేయుటనగా, నిత్యానిత్య వస్తువివేకము చేయుట.



అనగా, నిత్యము అటువంటి దనియు, అనిత్యమయి నటువంటి దనియు, తెలిసికొనిన వానికి శబ్దములేదు. అదేలననగా, శబ్దము నిత్యముకాదు అనిత్యమైనది. అప్పుడు శబ్దము తనలో తానే లయముచేసి తానైయుండుట. అది మాత్రముగాదు. మనము ఆలోచించు సమయమున శబ్దించుటకు సాధ్యమగు చున్నదా?

శిష్యుడు : సాధ్యమగుటలేదు.

గురువు : శబ్దము చేయునప్పుడు ఆలోచించుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు

గురువు : అట్లయిన, మనము ఆలోచించు సమయమున మనప్రక్కనుండు వేరొకడు శబ్దించిన అతనితో మనమేమని చెప్పుదుము.

శిష్యుడు : శబ్దము చేయకము; నేనొక కార్యమును గురించి ఆలోచన చేయుచున్నాననియు, నన్ను ఉపద్రవము చేయవద్దనియు, చెప్పుదుము.

గురువు : అప్పుడు, ఆలోచన సమయమున ఏవిధముననను శబ్దించుటకు మనకు వీలుపడదు. ఎవరైనను శబ్దించిన మనకు ఉపద్రవముగా నుండును. అలాగే మన మనన

శబ్దమును చేయుటకు వీలులేదు.
అప్పుడు శబ్దము తనలో అణగియున్నది. ఎప్పుడు శబ్దము



తనలోపలనే అణగునో అప్పుడే మనుష్యుడగుట. అప్పుడు మన మనస్సు మనస్సులోపలనే లయించుట. మనస్సు తనలో లయించినప్పుడు తానై, తన్మయమై తీరుచున్నది. అప్పుడు మోక్షమైనది. దీనివలననే మనుష్యులకే మోక్షము సిద్ధించుటని చెప్పుటకు కారణము. ఈ విధమునగాక శబ్దరూపమై రాగ, ద్వేష, మద, మాత్సర్యాదులైన వృత్తులతో కూడిన శుద్ధ మృగములైన మనము, మనుష్యులని అభిమానించి వచ్చుటయేతప్ప, మనము నిజమగు ముష్యులముకాము. మనుష్యులము గావలయుననిన రాగద్వేషాదులను విడిచి పై జెప్పిన స్థితియందు మనస్సు తనలోనే అణగవలయును. దానికి ముందుగ ఎప్పుడును మనుషులగుట లేదు. మృగములై యున్నారు.

శిష్యుడు : స్వామి! ఇది వరకు చెప్పినవన్నియు సరియై యున్నవి. అయిన లోకమున ప్రకృతి అనేకరూపభేదములై కనబడుచున్నది. అనగా మనుష్యులని అభిమానించు చువచ్చు రెండుకాళ్ళ జీవులు మృగములనియు, మనము తలచుచున్న ఏనుగు, గుఱ్ఱము, ఆవు, మేక, సింహము, పులి మొదలగు నాలుగుకాళ్ళ జీవులు, ఆకాశమునందు ఎగురు గరుడు, చిలుక, కాకి, పావురము, నెమలి మొదలగు పక్షులు, పాము, చీమ మొదలగు ప్రాకుడు జంతువులు, కప్ప, చేప మొదలగు జలజంతువుల, మాతమేగాక క్రిమికీటకాదులు ఇవన్నియు ఒకే విధమైన

సృష్టియని చెప్పినారుగాదా! నానావిధములుగా కన బడునవి ఒకటే విధమైన సృష్టియని చెప్పవచ్చునా? వాటిని



గురించి వివరింపవలయునని కోరుచున్నాను.

గురువు : మీరు చెప్పిన విధముగా ప్రకృతిభేదముగా కనబడుట ఎట్లనగా, యెనిమిది మేడలుగల గృహము, నాలుగు మేడలుగల గృహము, మూడు మేడలు గలగృహము, రెండు మేడలుగల గృహము, ఒక మేడ గలగృహము, మేడలేని గృహము, పెంకులులేని ఒక గృహము ఈలాగు ఇటిక రాళ్ళతోను, మన్నుతోను, గోడలను కట్టిన గృహమును పై జెప్పిన రీతిగా కట్టుటకు సాధ్యము లేక వెదురులతోను, కొబ్బరి మట్టలతోను, తాటియాకులతోను, టేకు మ్రానులతోను కట్టి పర్ణశాల గృహములుగాజేసి వాటిలో నివసించుచున్నారు. ఈ ప్రకారముగా నివసించువారిని ఎవరిని చెప్పు చున్నారు?

శిష్యుడు : మనుష్యునియే చెప్పుచున్నారు.

గురువు : పై జెప్పిన యెనిమిది, నాలుగు మేడలు గలగృహము మొదలుకొని, అకులతో కట్టిన గుడిసె వరకున్న గృహములన్నియు మనము పలుజీవులని అభిమానించ వచ్చు. మనము మొదలు సర్వజీవులకు ఉండుటకైన ఒక గూడే. ఈ ప్రకృతి భేధమై కనబడు శరీరమని అభిమానించవచ్చు జడములు ఈ విధమైన ప్రకృతి భేధమగు గూడులలో నుండు టెవరు?

శిష్యుడు : జీవుడు.

గురువు : ఎన్ని జీవులున్నారు?



శిష్యుడు : జీవుడొక్కడే.

గురువు : అప్పుడు, వీటిని రూపభేధముగా భిన్నభిన్నముగా ఉత్కృష్టమనియు, నికృష్టమనియు చెప్పుటకున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన, ఎనిమిది మేడలుగలగృహమున ఉండు వారు లాగుననే, అడవియందు ఆకులచే ఇల్లుకట్టి, దానియందు నివసించువారికిని బుద్ధి శక్తి ఉండుటలేదా?

శిష్యుడు : ఉంటున్నది.

గురువు : ఉండుట నిజమే! అయిన దానికిని కారణము ఏదైనను చెప్పుటకున్నదా?

శిస్యుడు : పలువిధములైన కారణములు చెప్పవచ్చును. అవేవనగా, అనేక రాజులు, ప్రభువులు, వారి చేత నీచులని చెప్పబడు నటువంటి మాదిగలతో, నేను సహవాసము చేసియున్నాను. అయిన రాజులకంటెను ప్రభువులకంటెను యోగ్యులుగను, కార్య బోధముగల వారలుగాను, బుద్ధియు, తెలివియుగల అనేక మాదిగలను, మాలవారిని నేను చూచియున్నాను. అదియునుగాక, తిరువళ్ళువర్ నయనార్, పాప్నారు, నందనారు మొదలగు వారు మహాయోగ్యులుగను, మహాజ్ఞానులుగాను, ఉండి నారనియు, వారిని ఇప్పుడు గూడ పొగడుచున్నారు. అదియునుగాక, వారి స్థాపనలను శాస్త్ర ప్రమాణములను.

సత్యమని తలచి, అనేకులు అనుసరించి వచ్చుట



కనబడుచును తెలియుచున్నది. కావుననే, వారి యోగ్యతపైన మునుపు జెప్పిన రాజులు, ప్రభువులు, వీరియోగ్యతకన్న యెంతో మేలైనదనియే నా నమ్మిక.

గురువు : అప్పుడు అట్టివారికి బుద్ధి శక్తి కలుగదని చెప్పుటకు వీలున్నదా?

శిష్యుడు : అట్లుకాదు.

గురువు : అట్లయిన, మీరు చెప్పిన మాదిగ, మాల మొదలగువారు, మహాజ్ఞానులైన తిరువళ్ళూరు, పాక్కనారు, నందనారు మొదలగువారు ఏలాగున నివసించి ఉండిరి?

శిష్యుడు : నాకు పరిచయమైన మాలమాదిగలను వారు ఆకులతో కట్టిన గుడిసెలని చెప్పబడు గృహము లందు నివసించినట్లును, ఇప్పుడు చూచుటయు, తిరవళ్ళూరు, పాప్నారు, నందనారు మొదలగువారు అడవి యందు ఆకులు మొదలగువాటితో కట్టబడిన గుడిసెలయందు నివసించినారనిన చూచియు, వినియు, తెలిసికొని యున్నాను.

గురువు : అయిన, అప్పుడు ఇటువంటి గృహము లందు నివసించు వారికి మాత్రమే వివేషబుద్ధియు, తెలివియు ఉన్నదని చెప్పవచ్చునా?

శిష్యుడు : అట్లెప్పుడును చెప్పుటకు వీలులేదు.

గురువు : ఈ ప్రకారమే

వచ్చుచున్న వారికి నివసించుటకున్న గృహమే ఈ జడము.



ఇదియే ఎనిమిది మేడలుగలగృహము . నాలుగు కాళ్ళు గలజడములు, మృగములని యెంచి వచ్చువాటికి నివసించుటకు ఉండునటువంటివే నాలుగు మేడల గృహములు. మఱియు, ఆకులతో కట్టబడిన గుడిసెలు చీమ మొదలగునవి అని చెప్పిన వాటికి నివసించుటకు కావలసిన జడమైయున్నది. అయిన చీమయని చెప్పబడు జడము నందు నివసించు జీవునకును, యెనిమిది మేడలగృహము అయిన మనుష్యుడని అభిమానించి యున్న గృహము నందుండు జీవునకు తమలో ఏవిధమైన బేధమున్నదా?

శిష్యుడు : ఏదొక భేధమును లేదు.

గురువు : అట్లయిన దేనికి భేధమున్నది?

శిష్యుడు : గృహమగు జడమునకు మాత్రమే.

గురువు : గృహవ్యత్యాసమనునది జడము వ్యత్యాసముగా యుండుటవలన బుద్ధియు, శక్తియు, తెలివియు, లేక పోవుట.

శిష్యుడు : లేదు

గురువు : గుడిసె, పర్ణశాలమొదలగు నవియును, చీమ , ఈగ మొదలగు వాటిలో నుండు జీవనకున్న శక్తియు, బుద్ధియు

శిష్యుడు : చీమలకే

గురువు : అదియునుగాక, అనేక జీవులు ఎక్కువ సామర్థ్య ముగా యొక్కొక్క ప్రవర్తన చేయుచున్నవి. అదే ప్రకారమనగా మనము ఒకజీవి. మనము యుక్తితో ప్రవర్తనలు చేయుచున్నాము. కాని మనము ఎప్పుడును చేయవీలుకానటువంటి ప్రవర్తనలు, కొన్ని పక్షులు, తేనెటీగలు, సాలెపురుగులు మొదలగు జీవులు చేయు చున్నవి. ఎట్లనగా, పై జెప్పిన జీవులయందు ప్రత్యేకముగా తేనెటీగలు చెట్టు కొమ్మ యొక్క అడుగుభాగమున ఎంతో పెద్దదైన పట్టును కట్టి, అందు అయిదారుపడులో లేక అంతకన్న ఎక్కువయో, తేనెను సేకరించి, జాగ్రతపరచి నివసించు చున్నవి. అయిన మనుష్యులని అభిమానించి వచ్చువారు తప్ప తక్కిన అన్ని జీవులునుస్వయంశక్తి వలన ఏదైన సామానులను తెచ్చి గూళ్ళను కట్టునేగాని వేరొకరి సహాయము వలన అట్లు చేయుటలేదు. ఆ ప్రకారము కట్టుకొనునప్పుడు, తక్కినయే జీవికిని ఏవిధమైన ఉపద్రవముగాని, కష్టనష్టములను గాని అది కలుగ జేయుటలేదు. మనమొక ఇంటిని కట్టవలయుననిన, ఎన్నియో జీవులను నశింప జేయవలెను. ఎంతమందియో వడ్రంగులు మొదలగువారు కావలసిఉండును. అయి నను, వాని వాని స్వయంశక్తివలన ఒక ఇంటిని కట్టుటకో ఏదైనను చేయుటకో ఇతరులసహాయమును లేకుండ

సాధ్యపడుటలేదు. అంతవరకు ఎందుకు? మనము



పండ్లు తోముకొనుటకు, కానుగపుల్ల, వేపపుల్ల, మఱ్ఱిపుల్ల మొదలగువాటిని విరచి తెచ్చుటకు ఏదైన ఒక అయుధము సహాయము లేకుండ సాధ్యపడుటలేదు. అయినను పై జెప్పిన జీవులన్నిటికి అన్య సహాయము లేకయే తమస్వయం శక్తివలన అత్యావసరమైన వస్తువులను సేకరించి, వాటికి నివాసయోగ్యమైన ఇల్లు కట్టుకొనుటకు సాధ్యమగుచున్నది. ఆ ప్రకారము కట్టిన తమకు కావలసిన, అదియునుగాక ఆ భవనము ఎటువంటి పెనుగాలికిగాని, అతి ఘోరమైన వర్షమున కుగాని, పడిపోయి నశించుటగాని, మరియే ఉపద్రవ ములకు గురియగుట కాని లేదు. మనుష్యులని అభిమానించి వచ్చుచున్న మనము మనకు నివసించుటకు గాను, కోటి రూపాయిలను ఖర్చు చేసి కొండరాతితో మిగులగట్టిగాను, బలముగాను, పునాదులుకట్టి, దానిపై ఒక ఇంటిని కట్టిన, ఆ ఇల్లు పెనగాలికిగాని, లేక అతి ఘోరమైన వర్షమునకుగాని పడిపోయి నశించుచున్నది. అయినను, పై జెప్పిన తేనెటీగలగూడు, ఆ ప్రకారము పడినశించుట లేదు. కారణమున అవి గూడుగట్టు స్థలమును ఆలోచించి, ఈ స్థలమున గూడుకట్టిన ఏ విధమైన గాలివచ్చినను, ఇక్కడ ఉపద్రవము కలుగదని బోధపడి కట్టినది. మనకు ఆ విధమైన బోధము లేకుండుటచే మనము కట్టినది నశించిపోవుటకు

కారణము, కాబట్టి పైన జెప్పిన జీవులకు జ్ఞానము ఎంతయో శ్రేష్ఠతరమైనదిగాను, అద్భుతకరమైనదనియు



మనము తెలిసికొనవలయును.

అదిగాక, ఒక పక్షికి గర్భము కలిగిన, అది దాని జత పక్షితోగూడి, గూడు కట్టుటకు కావలసిన సన్నసన్న పుల్లలు, పచ్చిక, గడ్డి మొదలగు వాటిని తీసికొనవచ్చి విచిత్రమగు గూటిని, కట్టుచున్నది. ఆడపక్షి గూటిలో గ్రుడ్లు పెట్టి వానిని కాపాడు కొని యుండును. మగపక్షి ఆహారమును వెదకి తీసికొని వచ్చి దానికిచ్చి సహాయముగా నుండును. ఆ గ్రుడ్ల మీద రెండు పక్షులును ఒకటి తరువాత మరొకటి కూర్చుండి వాటికి వేడిమికలిగించి, అది పిండమై, పిల్లలైనవని తెలిసినప్పుడు వాటిని పొడిచి, విరచి, దాని నుండి కలిగిన పిల్లలను అతి ప్రేమతో రక్షించుచున్నవి. ఆ సమయమున ఆ పిల్లలకు స్వశక్తి లేనందున, అవి తమ్ముతామే కాపాడుకొనుటకు అసాధ్యమని తెలిసి, తల్లిదండ్రియగు రెండుపక్షులును వాటి కొరకు మిగులకష్టపడి, ఆహారాదులను ఏర్పరచి తెచ్చి, ఆ పిల్లలనోళ్ళలోనుంచి తినిపించి రక్షించుచున్నవి. రెక్కలు మొదలగునవి వచ్చునప్పుడు ఆ పిల్లలను ముక్కుతో పొడిచి ఎగురుటకును, ఆహారమును వెదకి తెచ్చుటకు నేర్పించుచున్నవి. వాటికి తమంతట తామే ఎగిరిపోయి, జీవించుటకు శక్తి కలుగునప్పుడు, తల్లిదండ్రులైన పక్షులు తమకు వాటిపైన ఇదివరకుండిన ప్రేమను, వాటికి సంబంధమైన ప్రవర్తనలను విడచి వాటిని

తమకు సమానముగా తలచి, తమ సంఘమునందు చేర్చుకొనుచున్నవి. అటు వెనుక తల్లి , తండ్రియనియో,



పుత్రుడు పుత్రికయనిగాని, చెప్పబడు ఏదొక బంధమును వాటిలో యుండుట లేదు. తల్లియనగా అన్నియు తల్లిగను, తండ్రియనగా అన్నియు తండ్రిగను, పుత్రుడనగా అన్నియు పుత్రుడగును, పుత్రిక యనగా అన్నియు పుత్రికగను, ఆ ప్రకారముగా అన్నియు సమభావముగా ఉంటున్నవి. ఎట్లనగా, పిల్లలకు స్వశక్తి లేకయు, ఏదొకవివరము తెలిసికొనుటకు సాధ్యములేకను యుండుసమయమున వాటికి తమలాగు అన్నిశక్తులు నేర్చుకొనుటకు తామేబాధ్యులు అను ఒక విశేషబుద్ధి కనినవారైన (తల్లి, దండ్రి) వాటికియుండుట వలన పై జెప్పబడిన ప్రకృతియందుండు కష్టములను అనుభవించి, ఆ పిల్లలను రక్షించుటయు, వాటికి పూర్ణశక్తి వచ్చియున్నదని తమకు తెలిసిన సమయమున వాటితో పుత్రమిత్రులను స్నేహమును విడిచి, సరిసమానముగా తలచి తమ సంఘము నందు చేర్చుకొనుటగా నున్నది. ఆ ప్రకారమే, ఆ పిల్లలును వీటితో తల్లిదండ్రులను స్నేహమును విడిచి, తమ సంఘములో చేరి, ఏకీభవించి, సమభావముగా నడచుచున్నవి. ఇవన్నియు మన అనుభవ దృష్టాంత మేగదా?

శిష్యుడు : అవును. అనుభవ దృష్టాంతమే.

గురువు : మనుష్యులనియు, విశేషబుద్ధి కలవారనియు,

అభిమానించు వారైన మనకు ఒక బిడ్డ పుట్టిన, ఆ బిడ్డకు
మనము పై జెప్పిన పక్షులు కష్టపడి చేసిన విధమున ఏదొక



సంరక్షణము చేయుటలేదు. ఆ బిడ్డను ఏదైన ఒక చాపమీదగాని, పరపుమీదగాని పరుండబెట్టి, తల్లి ఆమె కార్యము కొరకు అనేక చోటులకు పోవుచుండును. ఆమె తన కార్యములు తీరి మరలి గృహమునకు వచ్చి ఎప్పుడో బిడ్డకు ఆహారములను ఇచ్చుచున్నది. ఆ సమయమున, బిడ్డ కడుపువాడి, ఖాళీయై, ఉండవచ్చును. అదిగాక దానికి ఆహారమైన తల్లిపాలు హెచ్చై, నిండి, యెండి, చెడుపైన పలువిధములగు చెడ్డనీరు చేరి యుండును. లేక కొన్ని వ్యాధులుగల స్త్రీలపాలును, లేక పలువిధములైన ఫలములను, ఏదొక బుద్ధివివేకమును ఆలోచనము లేక తల్లులు ఇచ్చుచున్నారు. కావున ఆ బిడ్డకు పలువిధ ములైన వ్యాధులు కలిగి కష్టపడుటకు కారణమగు చున్నది. కావున పక్షిదంపతులలో ఒకటి ఆహారాదులను తెచ్చుటకు బైటకు వెళ్లు సమయమున మరొక పక్షి పిల్లల ప్రక్కననేయుండి వాటికి కావలసిన సంరక్షణములను చేయుచున్నది. ఈ ప్రకారముగా మనము చేయుట లేదు. అదియును గాక, మనుష్యులనియు, విశేషబుద్ధియున్న వారని అభిమానించు వచ్చువారి బిడ్డలను నూరు సంవత్సరముల ప్రాయముగలవారైనను, వారి తల్లిగాని, తండ్రిగానియుండిన వారు "నా పుత్రుడు, నా పుత్రిక, నా పుత్రునకే ఇవ్వవలెను, నా పుత్రికకే ఇవ్వవలెను; అతడు వేరొకడు; అతనికి ఇవ్వవద్దు అతనికి చూపరాదు; అతడు

వచ్చుచున్నాడు; దాచి పెట్టవలయును; అని ఈ విధముగా చెప్పి ఆ ప్రకారముగా చేయుచున్నారు. అదే ప్రకారముగా



ఆ పుత్రులు, పుత్రికలు, నాతల్లి, నా తండ్రి, నా తల్లిది, నా తండ్రిది, నా తల్లికి, తండ్రికి ఇవ్వవలయును; ఇది మనస్వంతము, వేరొకరు అన్యులు, వారికి ఇవ్వరాదు. వారికి చూపరాదు" అని చెప్పుచున్నారు. ఈ, ప్రకారముగా నుండు దుర్విచారాదులైన రాగద్వేషాది కఠోర అంధకారమునందు ఏ విధమైన వివేషబుద్ధియు, తెలివియు, లేక శుద్ధమృగములవలె లోకమునందు మనుష్యులని అభిమానించివచ్చు రెండుకాళ్ల జీవులస్థితి కనబడుచున్నది. ఇది మనకు అనుభవమైన సంగతి యేకదా?

శిష్యుడు : అవును. అనుభవ దృష్టాంతమే.

గురువు : అట్లయిన, ఇట్టి అవస్థలనన్నిటిని మనము ఆలోచించనియెడల మనకు జ్ఞానము కలుగదు. ఏలననగా, తాము మనుష్యులు, వేరెన్ని జీవులకన్న మనము శ్రేష్ఠులము, మనము చేయునది మాత్రమే బుద్ధిశక్తి ఉండియు, యుక్తా యుక్తమైన తెలివితో యుండునదియు, ఇతరజీవులకు శ్రేష్ఠత లేదు; అవి మనకన్న తక్కువగా నుండనవి యనియు, ఈ విధముగా నుండు దురభిమానము కారణమువల్ల ఒకటే అంధవిశ్వాసము. అనగా గ్రుడ్డి నమ్మికను లోకమున ప్రతియొకరు, రూఢిగా స్థాపించుకొని యున్నారు. ఎట్లనగా మనుష్యులని అభిమానించువారు ఏదొక వివేకము

అయినను, ఏదొక వస్తువును
చూచునప్పుడు, వినునప్పుడు, తెలిసికొనునప్పుడు దానిని



గురించి చక్కగా దానిపై మనస్సునుయుంచి కారణ కార్యములను ఆలోచించిన దాని యదార్థమును తెలిసి కొనవచ్చును. ఆ విధముగ ఆలోచించక మనమందరము శ్రేష్ఠులు, మిగిలిన వారందరు నికృష్టులు అనియు, అనగా తక్కువస్థితియైన వారను యొక మూఢనమ్మకవలన కలిగిన దురభిమానముచేత జనులు ఏదొకదాని వివరమును తెలియని వారగుచున్నారు. ఇది మాత్రము కాదు. ఈశ్వరుడే జీవుడు. అటువంటి జీవుడైయుండు ఈశ్వరుడు తన హృదయమున స్థితిచేసికొని మాయై యుండు యంత్రము నిమిత్తముగా సర్వభూతము లందును చలించుకొని యుంటున్నాడు. సర్వభూత ములయందుండు వస్తువు ఈశ్వరుడే. అటువంటి ఈశ్వర చైతన్యమునకు ఒకటేశక్తిగాక రెండు శక్తులు లేవు. మనము దాని యదార్థమును గ్రహించకయుండుట వలననే మనశక్తి వేరనియు, మిగిలిన వాటిశక్తి అన్యవిధమనియు, గ్రహించుచున్నాము. ఏ సమయ మున యదార్థమును తెలిసికొనెదమో ఆ సమయమున మాత్రమే రెండు శక్తులు లేవనియు, ఒకటే శక్తి ఉన్న దనియు, అది తన శక్తియే అనియు తెలియును. అప్పుడు దురభిమానమును విడిచి రాగద్వేషాది వృత్తులు నశించి తాను, తానగును.

శిష్యుడు : స్వామి! ఈ ప్రకారము తాము చెప్పిన స్థితి యందు నాకొక సందేహము కలిగినది. అదేమనగా, లోకమున



అన్నిజీవులకు వ్యత్యాసము లేదని కదా ఇది వరకు చెప్పియున్నారు. అట్లయిన, లోకమున స్త్రీ, పురుష వ్యత్యాసము ప్రత్యక్షముగా కనబడుచున్నది గదా! అది లేదని చెప్పుటకు చోటున్నదా?

గురువు : ఇదివరకు చెప్పినదానిలో మీ కేమని తెలిసినది?

శిష్యుడు : అన్నియు ఒకటే శక్తియైయున్నదని చెప్పిన పిమ్మట మరొకటి ప్రత్యేకమై యుండుటకు సాధ్యము లేదు.

గురువు : అయిన దానిని వివరించి చెప్పదను వినుము. స్త్రీ, పురుషులలో స్త్రీ యెవరు? పురుషుడెవరని చెప్పుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యమున్నది. మనము పురుషులము, మనలను ప్రసవించిన తల్లులు స్త్రీలు.

గురువు : అయిన ఆది మొదలుకొని చివరకు లోకము నందు పురుషులైన మనలను స్త్రీ లనియు, స్త్రీలను పురుషులనియు చెప్పుచుండిన, ఇప్పుడు మనలను ఏవరని చెప్పుదురు?

శిష్యుడు : అట్లయిన మనలను స్త్రీలనియే చెప్పుదురు.

గురువు : అప్పుడు మనము స్త్రీయనియో, పురుషుడనియో మనకు తెలియుటలేదు. లోకమున నడచివచ్చు, మరియు

చెప్పవచ్చురీతిని మనము గ్రహించి యున్నాము. దానియదార్థము ఏవిధమని ఆలోచించుటలేదు. అయిన



పురుషుడని చెప్పుటకు అర్థమేమి?

శిష్యుడు : పురము నందు నివసించువాడు పురుషుడు.

గురువు : అప్పుడు ఏనుగు మొదలు చీమవరకు యుండు జీవులు ఎచ్చటనున్నవి?

శిష్యుడు : అవి తమతమ పురము (గృహము) లందు ఉంటున్నవి.

గురువు : వారి వారి పురములు (గృహములు) అనునవి దేనికి సంబంధించినవి?

శిష్యుడు : మనకందరికి మనకుగాను ఉండుటకు కట్టిన గృహములు, వేరేజీవులకు నివసించుటకుయని ఏ ఏ విధములగు స్థలములను అవి ఏర్పాటు చేసియున్నవో ఆలాటి స్థలములే.

గురువు : అయిన జీవుడు లేనియెడల మీరు చెప్పిన ప్రకారముండు గృహములను స్థలములవలన ప్రయోజన మున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు పురము (గృహము) దేనికిగాను?

శిష్యుడు : వారువారు సుఖముగా నివసించుటకు.

గురువు : జీవుడు లేనియెడల సుఖముగా నివసించుటకు వీలగునా?



శిష్యుడు : వీలుకాదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : దానిలో జీవుడు లేనందున.

గురువు : అప్పుడు ఎవరికి సుఖముగా నివసించుటకు గృహము కావలసినది?

శిష్యుడు : జీవునకు.

గురువు : జీవుడు నివసించుటకు గృహమేది?

శిష్యుడు : ఈ కనబడు జడము

గురువు : అప్పుడీ జడమునకు ఏమని పేరు చెప్పవలెను?

శిష్యుడు : పురము లేక గృహమని చెప్పవలెను.

గురువు : అట్లయిన, ఈ గృహమున జీవుడెప్పుడణగి బైట చలించకయున్నదో, అప్పుడు పురుషుడైయుండుట. అటువంటి పురుషుడే శివుడు. అదెట్లనగా, ఒకడు ఈ కనబడు గృహము లోపలకు వెళ్ళి తలుపులను మూసిన, వానికి బైటయుండు వాటిని చూచుటకు,వినుటకు తెలిసికొనుటకు వీలగునా?

శిష్యుడు : వీలుకాదు.

గురువు : అయిన అతడు గృహము లోపలనుండి లేచి, తలుపులను తెరచి బైటకువచ్చి, అరుగుపై కూర్చుండి

నప్పుడు బైట నుండు అవస్థలను చూచుటకు, వినుటకు



వీలగును కదా?

శిష్యుడు : వీలగును.

గురువు : అయిన మొదట లోపల కూర్చుండినప్పుడుబైట నుండు విషయములను చూడకయు, వినకయు, తెలియక ఉండుటకు కారణమేమి?

శిష్యుడు : అతడు బైటనుండు అన్ని పనులను విడిచి లోపలకు పోయి, తలుపులను మూసి స్వస్థుడై యున్నందున.

గురువు : బైట వచ్చినప్పుడో?

శిష్యుడు : బైట నుండు అన్ని అవస్థలను చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు సాధ్యమైనది.

గురువు : అయిన, బైట నుండు సంగతులను చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు సాధ్యమున్న సమయమున అతడు గృహము లోపలనా? బైటనా ఉన్నది?

శిష్యుడు : బైటనే.

గురువు : అదెట్లగును? అతడు గృహము బైటయుండిన, ఈ గృహము విడిచి బైటకు పోవలయును. ఆ ప్రకారముగా గృహమును విడిచిపోయిన, ఈ గృహమున యేదొక అవస్థలను చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు

సాధ్యముకాదు. అదిగాక, అతడు ఈ గృహము అరుగుపై నుండి బైటకు వెళ్ళుట లేదు. అరుగుపై నుండి బైట వెళ్ళుటకు దిగనున్న, ఈ గృహమువిడిచి బైటకు వెళ్ళి



యన్నాడని చెప్పుటకు చోటున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఇంటికి లోపలుండెనని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : ఆ సమయమున అతడు గృహము లోపలను బైటనుగాక, బైట అరుగుపై యున్నాడు. అప్పుడీ గృహము బైటనుండు అన్ని స్థితులను చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు సాధ్యము అయినది. గృహము విడిచి బైటపోయినను, గృహము లోపలయుండినను, బైట నుండు ఏదొకస్థితిని తెలిసికొనుటకు సాధ్యము లేదు. ఇదే ప్రకారము మన నిద్రసమయమున జీవుడెచ్చటయు న్నాడు?

శిష్యుడు : ఆ సమయమున అటువంటి జీవుడు మన లోపలనే అణగియుంటున్నాడు.

గురువు : నిద్రమేల్కొని వీటిని చూచుట, మరియు, విని, తెలిసికొను సమయమున జీవుడెచ్చట యుంటున్నాడు?

శిష్యుడు : బైట

గురువు : మనజీవుడు ఎప్పుడు బైటకు వెళ్ళిన మనకు వీటిని చూచుటకు , వినుటకు, తెలిసికొనుటకు వీలగునా?

శిష్యుడు : వీలుకాదు.



గురువు : నిజము. అదెందుకనగా జీవుడు బైటవెళ్ళిన ఏమైనది?

శిష్యుడు : శవమైనది.

గురువు : లోపలనేయుండిన బైటనుండు వాటిని తెలుసుకొనుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : జీవుడు బైట వ్యాపించక లోపల స్వస్థుడైయుండినందువలన.

గురువు : అదెచ్చట?

శిష్యుడు : జీవుని గృహమైన పురము నందు.

గురువు : అయిన జీవుడు గృహము నందు ఏదొకటితో చలించక స్వస్థుడైయున్నప్పుడు ఎవరైయున్నాడు?

శిష్యుడు : పురుషుడై యున్నాడు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : జీవశక్తియైనది బైటవ్యాపించక పురము నందే అణగియున్నందున.

గురువు : ఆ విధముగా పురమున స్వస్థముగాయున్న వారెవరు?



శిష్యుడు : వారందరు పురుషులు.

గురువు : ఆ విధముగ గృహమందు అణగనివారెవరు?

శిష్యుడు : వారివారి జీవునిలోపల, బైటకాకుండ ఉన్నస్థితిలో నున్నవారు.

గురువు : ఏసమయమున బైటనుండు స్థితులను వినుట, చూచుట, తెలియుట?

శిష్యుడు : నిద్ర మేల్కొని హెచ్చరికయైన వెనుక, జీవుడు లోపలను బైటను లేక యుండు సమయమున.

గురువు : అయిన లోకమునయున్న వారందరు ఎవరు?

శిష్యుడు : ఈ విధముగా స్వస్థముగా పురమునయుండు వారందరు పురుషులు.

గురువు : అయిన జీవుడేసమయమున పురమందు అణగు చున్నాడో ఆ సమయమున, పురుషుడుగాను, ఏ సమయమున నిద్ర నుండి హెచ్చరికయై లోపలనుండు జీవశక్తి బైట వ్యాపించుచున్నదో ఆ సమయమున శివశక్తిగాను అగుచున్నాడు. అదియే పురుషప్రకృతి. పురుష ప్రకృతియని చెప్పబడునది పురుషుడు పురము నుండి శక్తియై బైట చలించుటకు; పురుషుడనునది జీవుడైన శివుడు. శక్తియనునది స్త్రీయైన ప్రకృతి అదియే మాయ అటువంటి

చెప్పై, శివుడై యుండు పురుషునకు బైట
చలనము కలిగిన సమయమున పురుష ప్రకృతియని



చెప్పుట ఆ ప్రకృతియే శక్తి. అదియే తల్లి. ఆ తల్లి నుండియే జననమైనది. అప్పుడు మనకు తల్లి యెవరు?

శిష్యుడు : మాయయగు శక్తి.

గురువు : జీవుడెవరు?

శిష్యుడు : శివుడు.

గురువు : శక్తి మనకు తల్లియైనప్పుడు శివుడు మనకెవరు?

శిష్యుడు : తండ్రి

గురువు : అప్పుడు, శివుడు తండ్రియు, అనగా పురుషుడు - శక్తి తల్లియు, అనగా స్త్రీగా నున్నారు. అట్లున్నప్పుడు మనలను పురుషుడనియు, స్త్రీయనియు చెప్పుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : పురుషుడు, స్త్రీయు తండ్రియు, తల్లియునై యున్నారు; కావున మనము పురుషులముకాము; స్త్రీలముకాము,అప్పుడు మనమెవరని చెప్పవలెను?

శిష్యుడు : పురుషులుకాము, స్త్రీలుకాము.

గురువు : పురుషులు, స్త్రీలుకానివారి నేమని చెప్పవలెను?

శిష్యుడు : నపుంసకులై యున్నారు.

గురువు : అయిన మనలో పురుషుడై శివుడై యుండు జీవుడు బైట వ్యాపించి చలనమగు సమయమున శక్తియె

యున్నది. ఆశక్తియే మనస్సు అటువంటి మనస్సైన శక్తి నుండియే నేనుయని అభిమానించు అహంకారమైన



నపుంసకము ఉద్భవించినది. దానికి దృష్టాంతము. మనకెక్కువగా అనుభవముండు ఒకగది తలుపులను మూసి గడియ వేసికొని పరుండి నిద్రించునప్పుడు, తత్క్షణము నిద్రమేల్కొని లేచిన తలుపుఉండు చోటు తెలియక, అచ్చట, ఇచ్చట తిరిగి, తిరిగి, నడచి, తలను, ముఖమును గోడలకు కొట్టు కొని గాయము చేసికొనుచున్నాము. కారణ మేమనగా, మేల్కోన్నప్పుడు పైన పురుషుడగు శివుడు శక్తియై బైట వ్యాపించినది. ఆ శక్తియే మనస్సు. అప్పుడు మనస్సు మాత్రముండినది. కావుననే తలుపుండుచోటు తెలియక పోయనది. తలుపుండుచోటు తెలియవలయుననిన 'నే' నను అహంకారమైన నపుంసకము కావలయును. ఆ నపుంసకమునకే పలువిధములైన బేదములున్నవి. నేనను అహంకారము ఐన నపుంసకము నందు కూడియే మనస్సైన శక్తి భిన్నమై ప్రకాశించుచున్నది. అటువంటి అహంకారమైన నేనను స్థితి లేనియెడల ఏదొకటియు లేదు. బైట మనము ఏదొకటిని తెలిసికొనెదమో, వినెదమో, చేసెదమో, అవన్నియు, అహంకారమైయున్నవి అటువంటి అహంకారమే బ్రహ్మ.

ఆ ప్రకారముండు బ్రహ్మ మనస్సై యుండు శక్తి నుండి తానే సృష్టించుట. దానికే బ్రహ్మసృష్టించుటయని చెప్పుట. అటువంటి బ్రహ్మ లేకున్న ఏదొక సృష్టిలేదు. ఆ బ్రహ్మ

ఎప్పుడు యజ్ఞమునందుండును. యజ్ఞమనునది యాగము. అటువంటి యజ్ఞగుండము భ్రూమధ్యమున,



ఆ భ్రూమధ్యము సుషుమ్నయను అగ్ని నేత్రము. ఆ ప్రకారము అగ్నిగుండ సమీపమున 'నే' నను అహంకారమైన బ్రహ్మ కూర్చుండి, విచారాదులైన వస్తువులను ఆ అగ్నిగుండమునందు హోమము చేయుచున్నాడు. ఆ హోమము నుండి ఉద్భవించిన ధూమము అనగా పొగయైయుండునదే కనబడు లోకము లోకమని చెప్పబడునది ఒక పొగయే. ఆ పొగలోన మనము ఉండుటవలన, మనకు స్త్రీ, పురుషులు ఇట్టివారని వివరించి తెలిసికొనుటకు సాధ్యము లేక యున్నది. ఎప్పుడు లోకమైయుండు అటువంటి పొగవిడిచి పోవుచున్నదో, అప్పుడు మనకు స్పష్టముగా తెలియక వచ్చుచున్నది. పొగవిడిచి పోవలయుననిన హోమము చేసిన వస్తువులు రగులవలయును. రగిలిననే ప్రకాశించును. ప్రకాశించునప్పుడు సర్వము ఆ జీవశక్తియైన మనస్సేయని తెలియవచ్చును. ఆ సమయమున ఆ జీవశక్తియైన మనస్సు, తమలో తానే అణగి తానై యుండును. ఇదియే యదార్థము. ఇటువంటి యదార్థమును గ్రహించుసమయమున మాత్రమే నపుంసకత్వము విడిచి పురుషుడగుట.

శిష్యుడు : గురువే! మనకు తల్లి మాయయనియు, ఆదిశక్తియనియుపైన చెప్పినారు కదా! అయిన లోకమున స్త్రీలకు గర్భము కలుగుచున్నది. బిడ్డను కనుటగా

యున్నదిగాదా! అట్లు కనినవారిని తల్లియని చెప్పు
చున్నాము. ఇది వివరముగా చెప్పవలయునని అపేక్షించు



చున్నాను.

గురువు : ఎవరు ప్రసవించుచున్నారు?

శిష్యుడు : స్త్రీలు.

గురువు : స్త్రీలు ప్రసవించుటకు కారణమేమి?

శిష్యుడు : గర్భము కలిగినందున.

గురువు : గర్భ మేప్రకారముగా కలిగినది!

శిష్యుడు : సంయోగమునుండి.

గురువు : సంయోగము లేనియెడల గర్భము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : సంయోగము చేసిన, గర్భము కలుగుటకు కారణమేమి?

శిష్యుడు : శుక్లముపోయిపడుటవలననే.

గురువు : శుక్లము లేనియెడలగర్భము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : అప్పుడు గర్భమునకు శుక్లము ఎటువంటి వస్తువైనది?

శిష్యుడు : బీజమైనది.

గురువు : బీజమనగా నేమి?



శిష్యుడు : విత్తనము

గురువు : విత్తులేని యెడల, ఏదొక వస్తువు కలుగునా?

శిష్యుడు : కలుగుట లేదు.

గురువు : మనచేతులలో కొద్దిగా వడ్ల బీజమున్నది. దానిని పైరు చేయవలయును. (కృషి చేయవలయును) దానిని యెట్లు పైరు చేయుట?

శిష్యుడు : పొలమును దున్ని, జలమును పారించి, సమముగా చేసి, దానిలో విత్తును నాటవలయును.

గురువు : ఆ బీజమును నాటవలసిన స్థలము నందు గాక వేరు చోటున దానిని నాటిన మొలచునా?

శిష్యుడు : మొలచును.

గురువు : ఎన్నిటికిని మొలచుట లేదు. బీజము నాటవలసిన స్థలమునగాక ఇతర స్థలమందు బీజమును నాటిన ఎప్పుడును మొలకరాదు. ఆ బీజమును రాతిస్థలమున లేక గదిలో వేసిన దానినుండి మొలకవచ్చునా?

శిష్యుడు : రాదు.

గురువు : ఆ బీజము ఒక బండరాతిమీద లేక నీరుగల బావి, గుంట, నది, సముద్రము మొదలగువాటిలో వేసిన అది మొలచునా?

శిష్యుడు : మొలచుట లేదు.



గురువు : కారణమేమి?

శిష్యుడు : నాటుటకు ఏర్పరచిన స్థలమును విడిచి, వేరు స్థలమును నాటినందున.

గురువు : అప్పుడు, నాటవలసిన స్థలమునగాక వేరు స్థలము నందు బీజమును వేసిన అది మొలచుట లేదు. నాటవలసిన స్థలమునందు బీజమును నాటిన అది మొలచి పెద్దదగుచున్నది. దానినుండి వడ్ల గుత్తి కలుగును. అయిన ఆ కదురును వడ్ల కదరునియా, లేక పొలము కదురనియా మీరు చెప్పుట?

శిష్యుడు : వడ్ల కదురునియే చెప్పుట.

గురువు : ఆ కదురు పొలము నుండియే కదా కలిగినది? వడ్ల కదురని చెప్పుటకు కారణమేమి?

శిష్యుడు : ఆ పొలమునందు వడ్ల బీజమును నాటని యెడల ఈ వడ్ల కదురు కలుగుటలేదు. అప్పుడు ఆ వడ్ల బీజము నుండియే కదురు కలిగినది. కావుననే వడ్ల కదురని చెప్పుటకు కారణము.

గురువు : అట్లయిన పొలమువలన ప్రయోజనమేమి?

శిష్యుడు : విత్తునుంచికృషి చేయుటకే.

గురువు : ...

అప్పుడు ఆ విత్తును పొలములోనాటి కృషి చేసి, కదురు వచ్చినప్పుడు, ఆ కదురు పొలము నుండి కలిగిన దని చెప్పుటకు వీలున్నదా?



గురువు : అయిన ఆ కదురు ఎక్కడ నుండి కలిగిన దని చెప్పవలెను?

శిష్యుడు : విత్తనము నుండి.

గురువు : అప్పుడు ఆ కదురును ప్రసవించిన దెవరు? పొలమా? విత్తా?

శిష్యుడు : విత్తుయే ప్రసవించినది.

గురువు : అయిన ఆ విత్తును నాటుటకు యోగ్యత గలస్థలమునగాక, ఇతర స్థలమున నాటిన అది మొలచుట లేదు. అదిగాక, ఆ పొలమునుదున్ని, సమముగా జేసి, దానిలో బీజమును నాటిన సరియైన మృదువుగనుండు మట్టిలో ఆ బీజముపడి, మట్టితో చేరి మృదువగుట చేత ఉబ్బి, మొలచి, వేరుదిగి, పైకి వచ్చుటకు సాధ్యమగుచున్నది. అప్పుడది ఏ అడ్డంకులేక, పెరిగి వచ్చుచున్నది. ఆ స్థలము మృదువుగ లేనియెడల మన్నుగట్టియై, బీజము అణచబడి కృశించి, వేరుదిగుటకు, మొలక వచ్చుటకు సాద్యములేక నాశమై పోవుచున్నది. కావుననే బీజమును నాటవలసిన స్థలమును దున్ని, సమముచేసి మృదువుగా ఉంచవలెను. ఈ ప్రకారముగనే గర్భము కలుగుచున్నదనియు, బిడ్డలను ప్రసవించుచున్నారనియు చెప్పవచ్చు. స్త్రీలకు సంభోగ స్థలముపై జెప్పిన ప్రకారము శుక్లమను బీజమును

నాటవలసినదిగను, మరియు దానిని మొలచునట్లు చేయుస్థలముగను యున్నది. ఇతర స్థలమున శుక్లమైన



బీజమును వేసిన గర్భము కలుగునా?

శిష్యుడు : గర్భము కలుగుట లేదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : శుక్లమైన బీజమును నాటవలసిన చోటు తప్పి నాటినందువలన.

గురువు : శుక్లమైన బీజమును నాటవలసిన స్థలమైన పొలమును మృదువుగా జేయుటయే సంయోగము. ఆ సంయోగము వలన ఆ స్థలము మృదువగుచున్నది. ఆ సమయమున నాలుగవ అధ్యాయమునందు చెప్పబడిన ప్రకారము గ్రుడ్లాకారముగా శుక్లముపోయి పడుచున్నది. అటువంటి మృదువైన స్థలమునందు శుక్లముపోయి చేరి నిలచుచున్నది. గ్రుడ్లాకారముగాయుండు బీజము మొలక వచ్చుటకై అటువంటి స్థలము మృదువుగాయుండుట వలననే పై జెప్పిన బీజము ఉబ్బి, మొలచుట అవకాశము కలిగినది. అప్పుడు గ్రుడ్డ ఉబ్బి, మొలచి దినదినమును పెద్దదై పెరిగినప్పుడు అది బైటకువచ్చుచున్నది. అదియే సంతతి. ఇట్లుండునప్పుడు స్త్రీ ప్రసవించినదనుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : ఎందువలన.

శిష్యుడు : శుక్లము నందుండియే ఉద్భవించినది. శుక్లము లేనియెడల ప్రసవించుటలేదు.



గురువు : కావున పురుషుడు శుక్లమును ధరించుటయే గర్భము. అదెట్లనగా, ఈ జడమగు పురమునందు శుక్లము నిలుచుచున్నది. అనగా బైటవిడువక భద్రపరచి అభివృద్ధి అగుట. దానికే గర్భమును ధరించినదని చెప్పుట అట్లు చేయనియెడల శుక్లముకలిగి సంతానము కలుగుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : అప్పుడు గర్భమును దరించు టెవరు?

శిష్యుడు : పురుషుడు

గురువు : అయిన ప్రసవించున దెవరు?

శిష్యుడు : పురుషుడు

గురువు : ఆ విధముగా చెప్పబడు పురుషుడు ధరించి యుండు గర్భమును, స్త్రీయని చెప్పబడు వారి సంయోగస్థలమందు బీజము నాటుటకై సంయోగ ముచేసి, ఆ స్థలమును మృదువుగచేసి, అటువంటి మృదువగు స్థలమందు బీజమైన శుక్లమును, పురుషుడు ప్రసివించుచున్నాడు. ఆ శుక్లము నుండి మనుష్యులని అభిమానించివచ్చువారు ప్రకృతియైయుండు రూపము గలవారు ఉద్భవించినట్లయిన పురుషరూపము, స్త్రీలని అభిమానించి చెప్పబడు వారలయందు అణగియుండు

శిష్యుడు : స్వామి! స్త్రీలకు శుక్లమున్నదా? ఉండినయెడల అది



ఏలాగున గర్భపాత్రమున పడుట?

గురువు : స్త్రీలకు శుక్లమున్నది. స్త్రీలకు శుక్లము ఉద్భవించి వచ్చునదైన ఒక అవయవము అనగా పురుషులని అభిమానించి వచ్చువారికుండు మూత్రద్వారమునకు సరియగు ఒక మూత్ర ద్వారము వారికని ఉన్నది. దాని గుండానే వారి మూత్రము, శుక్లము వచ్చును. ఆ ప్రకారముగనే మనకును మూత్ర ద్వారముగుండానే మూత్రమును, శుక్లమును వచ్చుచున్నవి. కాని, స్త్రీలకు గలద్వారమునకు క్రిందుగ గర్భ పాత్రమైన ఒక సంచివలె చుట్టుకొని మూయుబడియున్నది. అది సంయోగ సమయమున వాయువు శక్తి వలన తెరువబడుచున్నది. అదెట్లనగా, ఒక రబ్బరుబంతిలోనికి పంపుతో, అనగా కొళాయితో గాలిని నింపునట్లు సంయోగసమయ మునందు గర్భకోశము తెరచును. అటువంటి సమయమున దానిలో రక్తము, జలము మొదలగునవి పోయిపడి మృదువగుచున్నది. దానిలో పురుషులని చెప్పబడువారలశుక్లముగాని స్త్రీలని చెప్పబడువారల శుక్లముగాని, గ్రుడ్లాకారముగాపోయి, ఆ మృదువగు చోటున పడి, పెద్దదై, పెరిగి, పగిలి, బైటకు వచ్చుచున్నది. దానిలో స్త్రీయను రూపమో, పురుషుడను రూపమో కలుగుచున్నది.

శిష్యుడు : స్త్రీ శుక్లము స్త్రీ రూపమనియు, పురుష శుక్లము పురుషరూపమనియు చెప్పినారు కదా! అటువంటి స్త్రీ



రూపము కొన్ని తండ్రి వర్ణముగను, పురుషరూపము కొన్ని తల్లి వర్ణముగను, పురుషరూపముకొన్ని తల్లి వర్ణముగను కనబడుచున్నది. అదే కారణము వలన?

గురువు : సంయోగసమయమునందు, పురుషుడు స్త్రీ పైగల అతి మోహమున ఏక విచారమై యుండు సమయమున శుక్ల స్ఖలితమైన ఆ స్త్రీరూపము ఆ శుక్లమున ప్రతిబింబించుచున్నది. ఇదే రీతిగనే స్త్రీకి పురుషునిపై అతిమోహముండి ఏకవిచారముగనుండు సంయోగ సమయమున శుక్లము స్ఖలితమైన ఆ పురుషరూపము స్త్రీ శుక్లమున ప్రతిబింబించును. అప్పుడు అన్యోన్య ప్రతిబింబించు రూపములై యున్నవి. కారణమేనగా విచారమే రూపము. విచారములేనియెడల రూపములేదు. అటువంటి విచారము మనస్సునుండి ఉద్భవించు చున్నది. ఆ మనస్సే శుక్లము. ఆ శుక్లమునుండియే సృష్టి. ఆ సృష్టియే రూపము. ఆ రూపమే విచారము. దీనినుండియే వర్ణభేదము కనబడుటు. దీనికి దృష్టాంతము ఏమనగా, గుఱ్ఱము జతచేయుట ఏట్లనగా, ఒక అందమైన మగగుఱ్ఱమును, ఆడు గుఱ్ఱమునకు ఎదుట నిలిపి పిమ్మట, ఆడుగుఱ్ఱము కండ్లకు గంతలు కట్టి, కంచరగాడిదను, పై జెప్పిన ఆడుగుఱ్ఱమునకు తెలియనట్లు సంయోగము చేయుసమయమున (జత

చేయు సమయమున) తనముందు నిలిపిఉన్న మగ
గుఱ్ఱమే తనతో జతచేయుచున్నదని అది గ్రహించి



యున్నది. అప్పుడా గాడిద యొక్క బీజము అగు శుక్లము చలించవచ్చు సమయమున ఆ శుక్లమున, ఆడగుఱ్ఱము యొక్క విచారము ప్రతిబింబించి గర్భపాత్రమున పోయి పడుచున్నది. అటుపిమ్మట, ఆ కంచర గాడిదను వెళ్ళగొట్టి, ఆడుగుఱ్ఱమునకు కట్టిన కన్నులమూతను తీయుచున్నారు. అప్పుడు తాను మొదట చూచి, తన మనస్సుతో స్థిరపరచిన మొగగుఱ్ఱమును ఎదుట చూచుచున్నది. నిజముగానే ఇప్పుడు ఎదుట నున్న మగగుఱ్ఱము చూడబడినది. అయిన, అప్పుడు పై జెప్పిన సంయోగ సమయమున ఉండునటువంటి విచారమును అనుసరించి పై జెప్పిన మగ గుఱ్ఱమునకు సమానమైన పిల్లయే పుట్టుచున్నది. అయిన నిజముగా ఆ ఆడ గుఱ్ఱముతో జతచేసినది కంచరగాడిద. దానిని తెలియక ఎదుట నిలిపిఉన్న మగ గుఱ్ఱమే తనలో సంయోగము చేయుచున్నదను విచారము నుండి ఆ విచారమును అనుసరించి పిల్ల కలుగుచున్నది. కావుననే విచారమై యుండునదే రూపమని చెప్పుట. ఇట్లుండుట వలన అటువంటి శుక్లము బైటకు వచ్చునప్పుడు ఏవిచారము ఉండినదో, దానికనుసరించియే ఉద్భవమగుటయని దీని నుండి మనకు స్పష్టమగుచున్నది.

శిష్యుడు : అవును, పై జెప్పిన ప్రకారమేనని స్పష్టమగుచున్నది.

కాని, స్వామి! పురుష శుక్లము వలన మాత్రమేగాని, లేక స్త్రీ శుక్లమువలన మాత్రమేగాని, సంతానము కలుగుటకు



వీలుండునా?

గురువు : అట్లు కలుగుటకు వీలులేదు. స్త్రీలకు సురదమును, రక్తమును, శుక్లము ఉండును. సంయెగసమయము నందు వారికి మొదట సురదము. రక్తము కలుగును. గర్భకోశము తెరువబడియున్నయెడల సురదమును, రక్తమును దానిలో పోయిపడును. అప్పుడు స్త్రీ యొక్కగాని, పురుషునియొక్కగాని, ఎవరి యొక్క శుక్లము మొదట చలించు చున్నదో అది నాలుగవ అధ్యాయమున వివరించిన ప్రకారము గ్రుడ్డాకారముగా పోయిపడును. గ్రుడ్డాకారముగా పోయిపడిన ఎడల అది ఒక బిడ్డయైతీరును. గ్రుడ్డాకారముగా పోయిపడినయెడల అదిరక్తములోపడి దానిలో కలిసిపోవుచున్నది. అందు వలననే, పురుష ప్రజలయొక్క చర్మమునకు మృదుత్వము లేకపోవుటకు కారణము. అదే ప్రకారముగనే గ్రుడ్డాకారముగా స్త్రీ యొక్క శుక్లము గర్భ పాత్రమున పడిన తరువాత పురుషుని శుక్లమును గ్రుడ్డాకారముగా పడినయెడల అదియొక సంతతియగును. అట్లు గ్రుడ్డాకారముగా కాక ఆ పురుషుని శుక్లము రక్తమందు పడిన అది రక్తమందు చేరును. ఆ ప్రకారముగా ఉద్భవించినదే స్త్రీలు. అందువలననే స్త్రీలజడమందు మృదుత్వముండుటకు కారణము.

శిష్యుడు : గురువే! స్త్రీ పురుషులయొక్క శుక్లములు రెండును ఒకే మాదిరిగనేగదా? అట్లుండునప్పుడు పురుషుని యొక్క



శుక్లమురక్తముతో చేరినప్పుడు కలిగిన స్త్రీ సంతానము యొక్క జడము మృదువుగయుండుటకు, స్త్రీ యొక్క శుక్లము రక్తముతో చేరినప్పుడు కలిగిన పురుష సంతానము యొక్క జడమునకు మృదుత్వములేక ఉండుటకు కారణమేమని చెప్పగోరెదను?

గురువు : పురుషుని యొక్క శుక్లము పలుచగను, స్త్రీలయొక్క శుక్లము గట్టిగనుయుండును. అందువలననే ఆ భేదములు కలుగుటకు కారణము.

శిష్యుడు : స్వామి! స్త్రీ శుక్లము గట్టిగను, పురుషుల శుక్లము మృదువుగను, పలచగను ఉండుటకు కారణమేమి?

గురువు : స్త్రీలకు సంయోగసమయమునందు మూడు విధములుగా, అనగా, మొట్టమొదట సురదము అను నీరును, రెండవసారి శ్రోణిదమను రక్తమును, మూడవసారిగ వీర్యమైన శుక్లమును చలించివచ్చును. ఇవి మూడు విధములుగ చలించుట వలన శుక్లము గట్టిగ వచ్చుటకు కారణము. పురుషులకు పై జెప్పిన సురదము, శ్రోణిదము, శుక్లము, ఇవి మూడును ఒకటిగా చేరుట వలన అది గట్టిగ లేక పలుచనగను, మృదువుగను వచ్చుటకు కారణము. కాని స్త్రీ పురుషులయొక్క శుక్లమును వూది,కట్టి, స్థిరము చేయునప్పుడు మాత్రమే జ్ఞానముకలుగుట. వూది, కట్టి, నిలుపునప్పుడు అది

మణియగును. దానినే రసమణియందురు. రసమనగా శుక్లము. ఆ శుక్లమును పూది, కట్టి, నిలుపుటకే



రసవాతమని చెప్పుట. రసము = శుక్లము. వాతము = వాయువు. అందువలననే మనజీవశక్తి వాయురూపమై, బైటకు పోయి నశించు దానిని, ఆ ప్రకారముగా నశించుటకు వదలక మనలోపలనే పైన, క్రిందుగను పూది, శుక్లమును బంధించి, నిలుపవలెను. అప్పుడే మనకు జన్మసాఫల్యము కలుగుట.



# ఏడవ అధ్యాయము

శిష్యుడు : స్వామీ! విచారము రూపమనియు, రూపము విచారమనియు చెప్పినారు. ఆ ప్రకారముగా కనబడుచున్నది. కాని దాని తాత్పర్యమెట్లని స్పష్టముగా నాకు తెలియలేదు.

గురువు : ఆ ప్రకారముగా చూడబడుటయు, వినబడుటయు, తెలియబడుటయు మొదలగునవి అన్నియులేనివిగా యున్నవి. ఇవి అన్నియు తనలోనుండి కలిగినవి అనియు, తనలోనే లయించబడుచున్నవనియు, పలు మారులు చెప్పితిమి కదా! కాబట్టి చూచుట, వినుట, తెలిసికొనుట అన్ని సంగతులు స్వప్నముగ నున్నవి.

శిష్యుడు : గురువే! ఇవియన్నియు స్వప్నమా? నేను ఇప్పుడు నిద్రించుటలేదుగదా? నిద్రించునప్పుడు మాత్రము కదా స్వప్నము? ఇప్పుడెట్లు స్వప్నమని చెప్పుట?

గురువు : ఓహో! మీరిప్పుడు హెచ్చరికలో ఉన్నారా? ఎప్పుడునులేదు. మీకిప్పుడు నిద్ర. మీరు చూచునది,

వినునది, తెలిసికొనునది ఇవన్నియు నిద్రలోనే.

శిష్యుడు : స్వామీ! ఇలాగెందుకు చెప్పుచున్నారు? నిద్రలో నుండునప్పుడు నాకు ఏదొకటియు తెలియదు. ఇప్పుడు



నేను హెచ్చరికలో నున్నాను.వీటినన్నిటిని చూచుటకు, వినుటకు, మరియు తెలిసికొనుటకు వీలైయున్నది. ఇట్లున్నప్పుడు ఇది నిద్రయనియు, ఈ కనబడుట అన్నియు స్వప్నమని చెప్పినదానిని ఎట్లునమ్ముట?

గురువు : అయిన ఇప్పుడు మీకు నిద్రనుండి హెచ్చరికయై యున్నదిగా? ఈ స్థితికి ఏమని చెప్పవలయును?

శిష్యుడు : జాగ్రతావస్థయని.

గురువు : అవస్థలు ఎన్ని?

శిష్యుడు : మూడు.

గురువు : అవేవి!

శిష్యుడు : జాగ్రత్త, స్వప్న, సుషుప్తి.

గురువు : ఇప్పుడే అవస్థ?

శిష్యుడు : జాగ్రత్త.

గురువు : జాగ్రతయను స్థితి ఏది?

శిష్యుడు : బోధముగా యుండుట.

గురువు : ఇప్పుడు మీకు బోధమున్నదా?

శిష్యుడు : బోధమున్నది.

గురువు : ఉండిన, మిమ్ము మీరు తెలియవలయును గదా?

శిష్యుడు : అవును; తెలియవలయును.



గురువు : అయిన, మిమ్ము మీ రెవరని తెలిసికొని యున్నారా?

శిష్యుడు : లేదు, నన్ను నేనెవరని తెలిసికొనలేదు.

గురువు : మిమ్ము మీరు తెలిసికొనలేదని మీరే చెప్పుచున్నారు. అట్లు మిమ్ము మీరు తెలిసికొనలేదనగా, మీకు హెచ్చరిక ఉన్నదని చెప్పుటకు చోటున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : హెచ్చరికలేని అవస్థను జాగ్రత్త యనవచ్చునా?

శిష్యుడు : అనరాదు.

గురువు : జాగ్రత లేనియెడల ఏమైనది?

శిష్యుడు : సుషుప్తి.

గురువు : సుషుప్తి యనగా నేమి?

శిష్యుడు : నిద్రగా నున్నది.

గురువు : అయిన, ఇప్పుడు మీకు మంచినిద్రగా నున్నది. దానికి దృష్టాంతము: ఎట్లనగా, మీకు నిద్ర సమయమున నేనిప్పుడు నిద్రలోనున్నానను విచారము కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : ఆ ప్రకారమే మీరు ఇప్పుడు నిద్రలో యుండుట.

అట్లు నిద్రలో నుండుటవలన, "నేను ఇప్పుడు నిద్రలో నున్నాననే విచారము మీకు లేకున్నది.



శిష్యుడు : నేను నిద్రసమయమున ఇట్లు ఏదొక అవస్థ చూచుటలేదుగదా! ఈ సమయమున వీటిని చూచుట లేదుకదా? ఈ సమయమున వీటిని చూచుటకు కారణమేమి?

గురువు : మీరు నిద్ర సమయమున స్వప్నము చూచుటలేదా?

శిష్యుడు : చూచుట కద్దు.

గురువు : ఆ సమయమున "నేను ఇప్పుడు నిద్రలో నున్నాననియు, ఇప్పుడు చూచునది స్వప్న" మనే విచారము మీకున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లు స్వప్నమును అనుభవించు సమయమున మీకు విచారము ఏవిధముగా నున్నది?

శిష్యుడు : ఇది జాగ్రదావస్థయనియు, యదార్థముగానేను అనుభవించుచున్నాననియు కనబడుచున్నది.

గురువు : నిద్రలో నుండి హెచ్చరిక యైనప్పుడు?

శిష్యుడు : నేనిదివరకు నిద్రలో నుండినాననియు, ఆ సమయమున కనబడినవన్నియు, నిద్రలో స్వప్నమున చూచినవనియు తెలియవచ్చుచున్నది.

గురువు : అలాగే మనమిప్పుడు నిద్రలో నున్నాము. కావున ఈ

కనబడునది, వినునది, తెలియునది అన్నియు స్వప్నమే. అదెట్లనగా, నిద్రలోనున్నప్పుడు కలిగిన స్వప్నము



యదార్థముగా మనము అనుభవించునట్లు కనబడు చున్నది. అయిన,నిద్ర నుండి హెచ్చరికయైన వెనుకనే, అది నిజమైనది కాదనియు, నిద్రలో కలిగిన స్వప్నమనియు తెలియవచ్చుచున్నది. ఇదే ప్రకారమే ఇది నిద్ర, దీనిలో కనబడునవన్నియు స్వప్నము. ఈ నిద్రయందుండి ఎప్పుడు హెచ్చరికయగునో, అప్పుడే మనమిది వరకు నిద్రలో నుండిమనియు ఆ సమయమున చూచినవన్నియు స్వప్నమని తెలియ వచ్చును.

శిష్యుడు : స్వామీ! ఈ అవస్థ నిద్రయనియు, చూచినవన్నియు స్వప్న మనియు స్పష్టమగుచున్నది. అయిన సాధారణముగా నిద్రలో నుండుటయు, స్వప్నముచూచు నదియు ఉన్నదిగదా?

గురువు : మీకు ఈ నిద్ర స్వప్నముగాక, వేరు మీరు నిద్రించుటయు స్వప్నము చూచుటయులేదు.

శిష్యుడు : స్వామీ! ఆలాగేలయనెదరు? మనము సాధారణ ముగా నిద్రించుటయు, స్వప్నము చూచుటయు కద్దు. అది నాకు అనుభవమైయుండునప్పుడు మీరు లేదని చెప్పిన నేనెట్లు నమ్ముట?

గురువు : అయిన మీరు నిద్రించుటయు, స్వప్నము చూచుటయు, ఏలాగననగా, మీకు సుమారు ఒకమెలు

దూరమునకు పైన ఒక ప్రవర్తన స్థలముకలదు. ఆ స్థలమున మీరుండు సమయమున, మీరు చూచునంత



దూరము వరకు, శబ్దము వినునంతవరకు ఏమేమి సంగతులు నడచుచున్నవి, అవి ఏవియని చూచు నదియు, వినునదియు, తెలియునదియు కద్దు. ఆ స్థలమును విడిచి స్వంత గృహము నకు వచ్చిన ప్రవర్తన స్థలమునందు నడచు ఏదొక సంగతులను మీరు చూచుటయు, వినుటయు, తెలియుటకు సాధ్యమగు చున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : ప్రవర్తన స్థలమందుండు ఏదొక సంగతియు కనబడకుండుట చేత.

గురువు : ఎందువలన కనబడుటలేదు?

శిష్యుడు : ప్రవర్తన స్థలమునువిడిచి, స్వంతగృహమునకు వచ్చినందువలన.

గురువు : ప్రవర్తన స్థలము విడిచి, స్వంత గృహమునకు వచ్చునప్పుడు ప్రవర్తన స్థలమందు నడచు ఏదొక విషయములను గురించి ఏదొక సమాచారములను తెలియుటయు, వినుటయు, చూచుటయు లేదు. అప్పుడు మీరు నిద్రలో యుండినారనుటకు చోటున్నదా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : అదెట్లనగా, ఈలాగు కనబడుపై జెప్పిన జడము,



లోకమై దానికి అడుగుభాగము ప్రవర్తన స్థలము, పై భాగముస్వంత గృహముగాయున్నది. ఈ ప్రకారమైన లోకము, మనకు ఒక ప్రవర్తన స్థలమైయున్నది. అయిన ప్రవర్తన స్థలముండు భూమివేరు, స్వంత గృహముండు భూమివేరు. ఈ లాగు రెండు భూములున్నవా?

శిష్యుడు : లేదు ఒకటే భూమియైయున్నది. అయిన యొక భాగమున స్వంతగృహమనియు, మరొక భాగమున ప్రవర్తన స్థలముగా నున్నది.

గురువు : ఇట్లే ఈ కనబడు లోకము, సాధారణముగా మీరు నిద్రలోనుండుటయని చెప్పు సమయము, ఈ ప్రవర్తన స్థలమును విడిచి స్వంత గృహమునందుండు సమయముగా నున్నది అయిన ఆ ప్రవర్తన స్థలము నందుండు ఏదొకటియును చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు కాకున్న స్థితియే సాధారణముగా నిద్రయని చెప్పు అవస్థగానున్నది. అయిన అది నిద్రకాదు. ప్రవర్తన విడిచిన సమయమైయున్నది.

శిష్యుడు : ఆ ప్రవర్తన స్థలము విడిచివచ్చిన వారెవరని, నాకు తెలియుటలేదు.

గురువు : చూచుటయు, వినుటయు, తెలిసికొనుటయు, అవన్నియు మీలో యెవరు?

గురువు : నా మనస్సు.

శిష్యుడు : మనస్సు లేకున్న ఏదైనను చూచుటకు, వినుటకు,



తెలిసికొనుటకు చేయుటకు మీకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : అప్పుడు ప్రవర్తన స్థలముందుండినది ఎవరని తెలిసినదా?

శిష్యుడు : మనస్సే.

గురువు : అయిన మీరు నిద్రలోనున్నారని చెప్పు సమయమే మీ మనస్సు ప్రవర్తన స్థలమును విడిచి, స్వంత గృహమునకు వచ్చిన సమయముగానున్నది. దానికి నిద్రయని చెప్పుట కగునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : అట్లయిన ఏమని చెప్పవలెను?

శిష్యుడు : మనస్సు ప్రవర్తన విడిచిన సమయమని చెప్పవలెను.

గురువు : అదిగాక ఒక అంగడిలో స్వంతగాడు అనేక సామానులను తెచ్చిపెట్టి పగలంతయు వ్యాపారము చేసికొనియుంటున్నాడు. వ్యాపారము ముగిసి, సామానులను తీసి లోపలపెట్టి తలుపులను మూసి తాళము వేసి లోపలనుండు సమయమున వ్యాపారముండెనా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన అతనికి అది ఏ సమయము?

శిష్యుడు : వ్యాపారము నిలిపిన సమయము.



గురువు : అలాగే మనస్సు ఒక వ్యాపారి. మనస్సు విచారాదులైన సామాన్యులనుండి వ్యాపారము చేసికొనుచున్నది. దానిని నిలిపి విచారాదులైన సామానులతో తాను లోపలప్రవేశించి తలుపులను మూసియున్నది. ఈ అవస్థకే మనము నిద్రించుటనుట. అయిన అది నిద్రకాదు. అది మనస్సు వ్యాపారము నిలిపిన సమయము. నిద్రయని చెప్పుట ఏ సమయమునకు?

శిష్యుడు : గురువే! నిద్ర ఈ విధమైన స్వప్నము ఎట్లు కలుగుట?

గురువు : మీరు నిద్రలోలేక స్వప్నము కనబడు చున్నదని చెప్పినది సరికాదు. నిద్రలోనున్నప్పుడు ఎప్పుడును స్వప్నము కనబడుటలేదు. అయిన నిద్రయనుటకు కారణములేదు. ఎందుకనగా ప్రవర్తన స్థలమునువిడిచి స్వంతగృహమునకు వచ్చినప్పుడు ప్రవర్తన స్థలమందుచూచిన, వినిన, అన్ని కార్యములను మీరు ఆలోచించుట లేదా?

శిష్యుడు : అవును, ఆలోచించుచున్నాము.

గురువు : నిద్రలోయున్నప్పుడు ఆలోచించుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లు ఆలోచించుటకు స్వప్నమని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.



గురువు : అట్లయిన దానికేమని చెప్పవచ్చును?

శిష్యుడు : మనము చేసిన, మరియు చేయుటకున్న పనులను గురించి అలోచించు సమయమని చెప్పవచ్చును.

గురువు : అట్లు అలోచించుట, ఎప్పుడు? ఎచ్చట నుండి?

శిష్యుడు : ప్రవర్తన విడిచి, స్వంత గృహమునకువచ్చి యున్నప్పుడు.

గురువు : అయిన, మీరు నిద్రలోయున్నారని చెప్పు సమయమున, మనస్సు ప్రవర్తనలను విడిచిస్వంత గృహమునయుండు సమయముగదా? అట్లుండు నప్పుడు, మనస్సు తనపనులను గురించి ఆలోచించుటకే స్వప్నమని చెప్పుట . అదెట్లనగా, మీరు ప్రవర్తనలను విడిచి, స్వంత గృహమునకు వచ్చి కూర్చుండి మీకు తెలిసిన పిమ్మట నడచిన సంభవములను కొన్నింటిని మీకు జ్ఞాపక మున్నంతవరకు ఆలోచించినది, ఆలోచింప వలసినది, అదియునుగాక, తరువాత దీనిని చేయవల యుననియు, చేయించవలయుననియు, ఆలోచించుట సహజమేగదా! ఆలాగే మనస్సు తన ప్రవర్తనలను విడిచి, స్వంత గృమునకు వచ్చి కూర్చుండి తనకు తెలిసియున్నదానిని, వినబడిన దానిని, చూడబడిన దానిన గురించి, ఆలోచించుటయు, మీరు సాధారణముగా

స్వప్నము చూచుటని చెప్పుట. అయిన అది స్వప్నముకాదు. మనస్సు తన ప్రవర్తన స్థలమును విడిచి, స్వంత స్థలముననుండి, పై జెప్పిన సంగతులను గురించి



ఆలోచించుటయే. ఈ ఆలోచనమునకు, స్వప్నమని చెప్పవచ్చునా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : అదియునుగాక, నీవు పుట్టిన వెనుక తెలియక, వినక, చూడకుండు ఏదొక సంగతిని స్వప్నమున చూచుట కద్దా?

శిష్యుడు : చూచుటకద్దు.

గురువు : మీరు పుట్టినవెనుక చూడక, వినక, తెలియక యుండు ఏదొకటిని గురించియు స్వప్నము చూచుట లేదు. అయిన స్వప్నమున ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఫ్రాన్సు, కాశీ, రామేశ్వరము, కిష్కింధ, అయోధ్య, హరిద్వార, సత్యలోక, పాతాళ, నరక, స్వర్గము మొదలగు వాటిని చూచినదిగాను, ఆకాశమున పారి, సముద్రము నపడి, నిప్పులోదూకి, చిఱుతపట్టి, పులి కరచి, ఏనుగు చుట్టపట్టి, చీల్చి, పాముకరచి, చెట్టునుండి పడి, పడవనెక్కిపడి, తల్లిచని, తండ్రిచని, బిడ్డబావియందుపడి, బండియందుపోయి, యుద్ధమాడి, ఖడ్గము చేత గాయమై, కలహమై, కాళ్ళు విరిగి, కండకు దెబ్బతగిలి, గొంతునకు త్రాడుకట్టి ఉరివేసికొని చని, ఉద్యోగము వహించి, నదిలోపడి, వ్యాపారముచేసి, ఈ విధమగు అనేక చతుర్యుగములలో నడచిన వాటిని చూచినది కద్దని, స్వప్నమున తెలియుచున్నదని మీరు చెప్పవచ్చును.

వీటిలో ఏదొకసంగతియు, మీరు పుట్టిన పిమ్మట వినక, తెలియకయున్నదా?



శిష్యుడు : ఉండదు.

గురువు : కావుననే, మనస్సు ప్రవర్తనలను విడిచి స్వంత గృహమున కూర్చుండి, తనకు తెలిసిన, చూడబడిన, వినబడిన వాటిని గురించి, ఆలోచించుటయు ఆ అవస్థ. అది స్వప్నముకాదు. స్వప్న మనునది ఇప్పుడు మనము అనుభవించునది.

శిష్యుడు : స్వామీ! ఇది స్వప్నమని చెప్పితిరి గదా? అయిన ఇంత ఎక్కువగా స్వప్నము అనుభవించుటలేదుగదా?

గురువు : మీరు సాధారణముగా, నిద్రలోనున్నారని చెప్పు సమయమున అనుభవించు స్వప్నమా లేక ఇప్పుడు అనుభవించు స్వప్నమా, ఏది ఎక్కువైనది?

శిష్యుడు : ఇప్పుడు అనుభవించునదే.

గురువ : అయిన, మీరు పరుండి నిద్రలోయున్నారను చెప్పుసమయమున, ఒక నిముష సమయమున అనుభవించు స్వప్నముకన్న ఎక్కువ ఇప్పుడు అనుభవించుటలేదు. అదెట్లనగా, ఈ అనుభవము, నిమిషస్వప్నము. నిద్రలో అనుభవించుటయని చెప్పబడు స్వప్నము. దీర్ఘస్వప్నమైయున్నది. మీరు సాధారణముగా పరుండి నిద్రలోయుండు సమయమున అనుభవించు స్వప్నము ఎంతసేపుండును?

శిష్యుడు : అతి స్వల్పసమయమే. అదియు ఒకటి లేక రెండు నిముషములే యుండవచ్చును.



గురువు : అటువంటి సమయములో మీరు ఎంతో దీర్ఘ కాలములో ఉండునటువంటి స్థితులను అనుభవించు చున్నారు. ఎట్లనగా, తల్లిచనిపోయి, తండ్రిచనిపోయి, కాశీకి, రామేశ్వరమునకుపోయి, పితృక్రియలనుచేసి, ఈ సంవత్సరము, ఈ నెల, ఈ తిథియందు, ఈ నక్షత్రము నందు పుట్టి, ఇప్పటికి అరువది సంవత్సరముల ప్రాయమైనది; షష్టిపూర్తియై నాకు కీళ్ళవ్యాధి సంభవించి పరుండి కష్టపడిపోతిని; కరచినందువల్ల గాయమైనది; పట్టి నరకినారు; చెరసాలకు పోయినాను, రాజైనాను, ఒక చోటున చనిపోయినాను, ఒక చోటున పుట్టినాను, ఒక మనుష్యుని నిద్రలోనున్నప్పుడు పోయి పిలచి, మేమిద్దరము ఒక చోటున పరుండినాము, అను ఈ ప్రకారము అనేక చతుర్యుగములు అనుభవించినదిగా స్వప్నమునుచూచి, భీతిపొంది అరచి ఆ సమయమున మీరు చెప్పిన నిద్రలో నుండి హెచ్చరికయైన, పైన జెప్పిన ఏదొకటైనను కలిగియో, అనుభవించియో ఉంటున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన వాటిని అనుభవించినదంతయు ఎంత సమయము?

శిష్యుడు : ఒక్క నిముష సమయమునందు

గురువు : ఒక నిమిష సమయమందు ఎన్ని చతుర్యుగముల వృత్తాంతములు మనకు అనుభవమై కనబడుచున్నవి?



శిష్యుడు : అది అనేక చతుర్యగములవృత్తాంతములు అనుభవించినదై కనబడుచున్నది.

గురువు : అప్పుడు దీర్ఘ స్వప్నమేది?

శిష్యుడు : నిద్రయను తలచు సమయమున కనబడు స్వప్నము.

గురువు : అయిన మనకు మంచినిద్ర, ఇట్లు నిద్రలో యుండుట వలన మనము లోకమున్నదనియు, తల్లి తండ్రి ఉన్నారనియు, జన్మించినాను, చనిపోయినాను అనియు, ఐదు సంవత్సరములుండి, నూరు, నూటయిరవై సంవత్సరములవరకు జీవించినదనియు, పుట్టిన వెంటనే చనిపోయినదనియు, ఇంకను ఈ కనబడు అన్నియవస్థలు చూడబడు ఇది మనకు నిమిష స్వప్నమైయున్నది. ఏ సమయమున మనకు ఈ నిద్రనుండి హెచ్చరికయగునో ఆ సమయమున మాత్రమే ఇదివరకు నిద్రలో నుండినా మనియు, మన మిదివరకు చూచినవన్నియు, స్వప్నమై యుండినదనియు తెలియును. కావున ఇప్పుడిది మనకు నిద్రయు, ఈ చూచుట, వినుట, తెలిసికొనుట, అనుభవించుట ఇవన్నియు స్వప్నమైనదేకాని యదార్థము కాదు. అదిగాక నిద్రయని చెప్పుట తెలివిలేకయుండు నటువంటిదే. అదే మనగా, తెలియవలసిన దానిని

శిష్యుడు : స్వామీ! మనము సుఖముగా నిద్రించి నామనియు,



ఏదొకటియు తెలియులేదనియు, నిద్రలోనుండి హెచ్చరికయైన వెనుక చెప్పుచున్నాము. ఇట్లు చెప్పుటలో ఏదొకటియు తెలియుటలేదు. నిద్రించుచున్నాను అని తెలియవచ్చు ఒకతెలివి బాకీయున్నదికదా! అదేమి?

గురువు : ఈమాట బహుతప్పు. ఏలననగా నిద్రించుటకుగాను మీరు పరుండి నిద్రవచ్చువరకు, నేను నిద్ర వచ్చుటకై పరుండియున్నాననియు, హెచ్చరికయైన పిమ్మటనే ఇదివరకు నిద్రించియుంటిననియు, విచారముయుండ వచ్చును. నిద్రలోనుండినప్పుడు నేను నిద్రలోనున్నానను విచార ముండినదా?

శిష్యుడు : లేదు.

గురువు : నిద్ర నుండి హెచ్చరికయైన వెనుక నిద్రలో నుంటినని మీరు అనుమానించినదిగాక, నిద్రలో నున్నప్పుడుండిన అవస్థ ఇటువంటిదని చెప్పుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : అయిన లోకమున సాధారణముగదా పరుండి నిద్రించునప్పుడును, బోధముతప్పి పరుండియుండు నప్పుడును, కాకవలి (మూర్ఛ) వచ్చి పరుండి యుండునప్పుడును, టైఫాయిడ్ రోగము తలకెక్కి

పరుండియున్నప్పుడును, లేకపోయిన ఆసుపత్రిలో క్లోరోఫారమునిచ్చి బోధము తప్పించి, స్మృతితప్పి,



పరుండియున్నప్పుడును, లోకమును గురించి ఏదొకటి తెలివియు, జ్ఞాపకముయున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన వీటి నేమని తలచవలయును?

శిష్యుడు : నిద్రయనియే తలచవలయును.

గురువు : కావున తెలివి తెలిసికొనకయుండుటయే నిద్ర. అట్లయిన తెలివియైయుండు ఆ వస్తువేది?

శిష్యుడు : అది తానై యుండు జీవుడు.

గురువు : తెలియకయుండు వస్తువేది?

శిష్యుడు : మాయ.

గురువు : అట్లయిన మనము ఏస్థితియందు ఇప్పుడున్నాము?

శిష్యుడు : మాయలో నున్నాము.

గురువు : అప్పుడు మాయ యనునదేది?

శిష్యుడు : నిద్రయనునది.

గురువు : కావున, మాయయైయుండు నిద్రయందు చూడబడి అనుభవించు స్వప్నములే ఇదిగో ఈ చూడబడు అవస్థలు

ఎప్పుడు మాయయైయుండు నిద్ర నుండి హెచ్చరిక కలుగునో, అప్పుడు బోధము కలుగు చున్నది.ఆ బోధమే జాగ్రతయని చెప్పుట. ఏదనగా, అనిత్యమైన దానిని



తనదనియు, వారిదనియు మొదలగు రాగద్వేషాదులైన వృత్తులను విడిచి నిత్యమైన తన్నుతాను తెలిసికొను అవస్థయైయున్నది. అప్పుడే జాగ్రత అను అవస్థయని చెప్పుటకు వీలగుచున్నది. ఇప్పుడు జాగ్రత కాదు.



శిష్యుడు : కలుగుట లేదు.

గురువు : అట్లయిన ఈ మూడునకు అర్థమేమి?

శిష్యుడు : కర్తయనగా ప్రవర్తన చేయువాడు, కర్మ మనగా ప్రవర్తన. క్రియయనగా, దేనిని చేయుచున్నామోయది.

గురువు : చేయుట అనుటకు అర్థమేమి?

శిష్యుడు : ప్రవర్తనమే.

గురువు : అప్పుడు ప్రవర్తనయనునదేమైనది?

శిష్యుడు : క్రియమైనది.

గురువు : అప్పుడు క్రియకు ప్రవర్తనయని అర్థమగుచున్నది. కర్త, కర్మ క్రియ, ఈ ప్రకారమైన మూడు అవస్థలలో కర్తయనునది ప్రవర్తన చేయువాడనియు, కర్మయు, క్రియము అనునవి ప్రవర్తనయైయున్నవి. అట్లు వచ్చుటకు వీలులేదు. ఎందుకనగా, "కణ్ణుడు కుందేలును చంపినాడు" అనువాక్యమున కర్త, కర్మ క్రియ అనునవి యున్నవా? ఉండిన అవి ఏవి?

శిష్యుడు : ఉన్నవి. కణ్ణుడు యనగా కర్త, కుందేలు అనునది కర్మ చంపినాడు అనునది క్రియమైయున్నది.

గురువు : అప్పుడు కర్మమునకు ప్రవర్తనయను అర్థము

పోయినదిగదా? "కణ్ణుడు కుందేలును చంపినాడు" అనువాక్యమున ఈ ప్రకారము లేక వేరే విధముగ అర్థమున్నదా?



శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన కర్మమనునదేది?

శిష్యుడు : నామమాత్రమైయుండు ఒక వస్తువైయున్నది.

గురువు : అయిన లోకమున కర్మమనగా, అటువంటిదని వివరముగా తెలిసికొనక, దానిని ప్రవర్తనయని తలచియున్నారు. అది ఆ ప్రకారముగాదు. ఒక వస్తువు లేకున్న ప్రవర్తనచేయుటకు సాధ్యములేదు. అదియును గాక లోకమున ఎట్లు చూచినను కర్మమనునది వస్తువుగా లేక ప్రవర్తనయై వచ్చుటలేదు. ఎందుకనగా, కర్త, కర్మ, క్రియ ఇవి మూడును అణగియుండు వాక్యమును, కర్మము, క్రియ, అణగియుండు వాక్యమును మనము చెప్పుదుము. వీటిని గురించి ఆలోచించి చూచిన, కర్మమనునది ఒక వస్తువని తెలియుచున్నది. దానికి దృష్టాంతము ఏమననగా, "కృష్ణుడు భోజనము చేసినాడు" ఈ వాక్యమున ఏమేమియున్నది?

శిష్యుడు : కర్త, క్రియ మాత్రమున్నది.

గురువు : కర్తయేది? క్రియయేది?

శిష్యుడు : కృష్ణుడు అనునది కర్త, భోజనము చేసినాడు అనునది క్రియ.

గురువు : భోజనము చేసినాడనునది క్రియ అనుటకు కారణమేమి?



శిష్యుడు : భుజించుట అనునది ప్రవర్తనము, అటువంటి ప్రవర్తనమునకు క్రియయని చెప్పుట.

గురువు : మీరేకదా మొదట, కర్మము ప్రవర్తనయని చెప్పినది? కాని ఇప్పుడు ప్రవర్తనము క్రియయనుచున్నారు. అయిన " కృష్ణుడు భుజించినాడు " అను వాక్యమున కర్మమేదియని తెలియుచున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన, అటువంటి కర్మమును కనుగొనవచ్చును. కృష్ణుడు దేనిని భుజించినాడను ప్రశ్నకు ఫలమును భుజించినాడను ఉత్తరము దొరకుచున్నది. అటువంటి వాక్యమున కర్మమేది?

శిష్యుడు : ఒక వస్తువు.

గురువు : దీనివలన కర్మమనునది వస్తువని స్పష్టమగుచున్నది. అదియునుగాక, మీ గృహమున ఒక మామిడి పండును ఒకడు ఉంచుకొనుమని ఇచ్చినాడు. కొంతసేపటికి ఈ మామిడిపండును భుజించినానని చెప్పుచున్నారు. ఈ మాటయందు ఏవేవి యున్నవి?

శిష్యుడు : కర్మము, క్రియము యున్నవి.

గురువు : ఏదిలో కర్మమేది? క్రియ ఏది?

శిష్యుడు : మామిడి పండనునది కర్మ, భుజించి నాను అనునది క్రియ.



గురువు : ఈ మాటయందును, కర్మము వస్తువని స్పష్టమగు చున్నది. కావున, ఈ రీతిగా లోకమున నడచు సంగతులను చూచిన, కర్మమనుటకు వస్తువుగాక, ప్రవర్తనయను అర్థము లేనేలేదు. దీనివలననే కర్మములేనియెడల ఒకటి లేదనియు, అన్నియు కర్మమై యున్నదనియు చెప్పుటకు కారణము. కావుననే కర్మవస్తువని స్పష్టమగుచున్నది. అప్పుడు వస్తువులేకున్న ఒకటియు లేదనియు, అన్నివస్తువనియు అగుచున్నది. కావుననే అటువంటి వస్తువునే మనము తెలిసి కొనవలసినది. ఆ వస్తువు ఏదని చెప్పుటకౌనా?

శిష్యుడు : చెప్పుటకౌను. అవి ఏవేవి కనబడుచున్నవో, అవన్నియునైయున్నవి. కావున ఈ కనబడు ఇవన్నియు వస్తువులే.

గురువు : ఈ కనబడున దంతయు వస్తువులైన, మీరు లేని ఎడల మీకు ఈ వస్తువులను చూచుటకౌనా?

శిష్యుడు : కాదు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : నేను లేనందువలన?

గురువు : అప్పుడు మీరుండిన వీటిని చూచుటకు సాధ్యము

న్నదా?

శిష్యుడు : సాధ్యమున్నది.



గురువు : మీరు నిద్రలోనున్నప్పుడు చూచుటకద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అదెందుకు? మీరు లేకపోయినారా?

శిష్యుడు : ఆ సమయమున నేను ఉండినను, నాలో నుండి ఉద్భవించిన శక్తి నాలోనే అణగియుండినందున చూచుటలేదు.

గురువు : అటువంటి శక్తియేది? ఒక శవమునకు ఆ శక్తికద్దా?

శిష్యుడు : లేదు. ఆశక్తి నా జీవశక్తియై యున్నది. శవమునకు జీవడు లేనందున ఆ శక్తిలేదు.

గురువు : అట్లయిన ఆ జీవశక్తియనునదేది?

శిష్యుడు : వాయువు.

గురువు : ఆ జీవశక్తి బైటవాయువై చలించనియెడల ఈ విధమగు ఏదొక అవస్థ కనబడుచున్నదా?

శిష్యుడు : కనబడుట లేదు.

గురువు : అటువంటి జీవశక్తియే ఈ కనబడు అవస్థ. అప్పుడు చూచుటకు కారణముగానుండునది, జీవశక్తియైయుండు వాయువు. ఆ వాయువే వస్తువుగాయుండు నటువంటిది.

అటువంటి వాయువైయుండు వస్తువు లేనియెడల, ఏదొకటియులేదు. ఆ వాయువునుండి బంధింపబడినది లోకము. ఆ వాయువే కర్మము. ఇందువలననే లోకము



కర్మబంధమనుటకు కారణము. కర్మమును చేసిననే మోక్షము దొరుకును. అటువంటి కర్మమైయుండు వాయువునకు నానావిధములగు విచారములు కలుగుట వలన బంధము కలుగుచున్నది. కర్మమైయుండు వాయువు పై జెప్పిన విచారములనువిడిచి, తనలోతానే లయించునప్పుడే మోక్షము. ఇందువలననే కర్మమును చేసిన మాత్రమే మోక్షము దొరుకుచున్నదని చెప్పుటకు కారణము. కర్మము = వాయువు; చేయు = ప్రవర్తన. కావున కర్మమైయుండు వాయువునుండి చేయవలయును. అప్పుడు మోక్షమైనది. అయిన, కర్మమైయుండు వాయువుచేత ఏవిధముగ లోకము బంధింపబడి యున్నదనిన చెప్పెదను వినుము. సాలెపురుగు (అది ఎనిమిదికాళ్ళుగలప్రాణియని చెప్ప బడు జీవి) ఒక వలను కట్టుచున్నది. ఆ వలదానికుండుటకు దాని ఆహారాదులను సంపాదించుటకు ఉపయోగకరమైయున్నది. ఇటువంటి వలకట్టుట దేనినుండియని మనకు తెలియునుగాదా! అయిన ఆనూలు ఎచ్చటనుండి దొరకుటనటువంటిది?

శిష్యుడు : ఆ పురుగు లోపలనుండే.

గురువు : అటువంటి నూలు, ఆ సాలెపురుగు లోపలనుండు ఒక శక్తి. ఆ శక్తి ఒక విధమైన జిగట గలది. ఆ

గలవాడను, ప్రభువును, శ్రేష్ఠుడను, పండితుడను, జ్ఞానియనియు, మిగిలిన వారందరను నికృష్టులనియు" అభిమానించి, రాగ, ద్వేషము మొదలగు దురభిమానములందుంటున్నారు. అయిన పై జెప్పిన ప్రకారమే, పైన జెప్పిన సాలెపురుగువలె మనము కట్టిన లోకమును మనమే విప్పి, మనలోనచేర్చి, స్వస్థముగా ఉంటున్నాము. అటువంటి సందర్భమునకే, నిద్రయని చెప్పు అవస్థ. ఆ అవస్థయందు మనకు లోకముకద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : మనశక్తి మనలో అణగి స్వస్థముగాయుండుట వలన.

గురువు : తరువాత ఎప్పుడు లోకమును చూచుట?

శిష్యుడు : తనశక్తి తనలోనుండి బైటకు వ్యాపించిన సమయమునందు.

గురువు : అదేలాగనగా, మొదట చెప్పిన సాలెపురుగు తనలోనుండు శక్తియైన జిగటను నూలుగా బైటకు తెచ్చి కట్టుటయు, విప్పుటయు, కడపటయే విధమున సాలెపురుగు తనశక్తియైన నూలు, దాని ఉద్భవ

స్థానమునుండి తెగి చనిపోవుచున్నది, ఆ ప్రకారమే మనజీవశక్తయై, కర్మమై, వాయువైయుండు నూలు, దాని ఉద్భవస్థానమైన భ్రూమధ్యమునకు క్రిందుగను,



ముక్కునకు పైగనుయుండు స్థలము నుండి తెగిపోయిన, చనిపోవుచున్నాము. దీనికే ఒకడు చనిపోయిన సమయమున వాని కర్మము తెగిపోయినదని చెప్పుటకు కారణము. అటువంటి కర్మమై. వాయువైయుండు నూలునుండే లోకమును బంధించియుండుట. కావుననే కర్మబంధమని చెప్పుట. అదిగాక ఒకడు చనిపోయిన వానికర్మము ఎట్లుపోయినదని చెప్పుచున్నాము?

శిష్యుడు : వాన కర్మము తీరిపోయినదని.

గురువు : నిద్రలోనుండునప్పుడు వాని కర్మము తీరిపోయి నదని చెప్పవచ్చునా?

శిష్యుడు : చెప్పరాదు.

గురువు : చనిపోయిన, కర్మము తీరిపోయినదని చెప్పుటకు, నిద్రలోనున్నప్పుడు కర్మము తీరిపోయివదని చెప్పకుండు టకు కారణమేమి?

శిష్యుడు : చనిపోయినప్పుడు వాయువు వానిలోపలచలించుట లేదు. నిద్రలోనున్నప్పుడు వానిలోపలవాయువు గతాగతము చేయుచున్నది.

గురువు : అదిగాక, ఒక నిమిషకాలమైనను కర్మము లేనియెడలయేదొకటియు జీవించదనియు చెప్పుచు

న్నారు. లోకమున కర్మమనుదానిని ప్రవర్తనయని చెప్పుచున్నారు. కర్మమనునది ప్రవర్తనయైన, నిద్రలో నున్నప్పుడు ఏదైన ప్రవర్తనము కద్దా?



శిష్యుడు : కద్దు.

గురువు : అదేదీ?

శిష్యుడు : నిద్రించుట.

గురువు : అదెట్లు? నిద్రయని చెప్పుసమయమున నేను నిద్రలోనున్నాననే విచారము మీకున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : మనస్సై యుండుశక్తి జీవునిలోపోయి చేరినందున.

గురువు : అప్పుడు విచారము, ప్రవర్తనము, ఎప్పుడు నుండి కలుగుట?

శిష్యుడు : నిద్ర నుండి మేల్కొనిన పిమ్మట.

గురువు : ఎక్కడ నుండి.

శిష్యుడు : మనస్సు నుండి.

గురువు : మనస్సులేకున్న ఏదైనను చేయుటకు, తెలిసి కొనుటకు, వినుటకు, సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : అటులైన నిద్రలోనున్నపుడు ప్రవర్తన కద్దా?

గురువు : అట్లయిన నిద్రలో సుస్వప్నము ప్రవర్తన లేదు?

శిష్యుడు : లేదు.



గురువు : ఆ సమయమున కర్మము లేదా? ప్రవర్తన అనునది, ఏకర్మమైన తెలియవలయునుగదా?

శిష్యుడు : కర్మము ఉన్నది. కర్మమనునది ప్రవర్తన కాదు. దానికొనసరము తెలియలేదు.

గురువు : కర్మములేకున్న ఒక నిమిషమైనను జీవించి యుండుటకు సాధ్యముకాదని చెప్పాచున్నారు. నిద్రయని చెప్పసమయమునను కర్మమున్నదని తెలియుచున్నది. కర్మము ప్రవర్తనకాదనియు, వాయువైయున్నదనియు తెలియుచున్నది. ఆ కర్మము జీవశక్తియైయుండు వాయువు. అటువంటి వాయువు బైట వ్యాపించి, లోకమున సృష్టించి, ఆ లోకమును బంధించి కొనయున్నది. అప్పుడు లోకము కర్మసంబంధ మగుచున్నది. ఎప్పుడు చనిపోవునో అప్పుడు అటువంటి వాయువైయుండు కర్మము తీరిపోవుచున్నది. దీనివలననే కర్మము ముగిసినదని లోకమున చెప్పుట. కావుననే లోకమును విషయమును బంధించియుండు కర్మమై, వాయువైయుండు శక్తిని అటువంటి బంధమునుండి వేరు పరచి తనలోపలనడిపించి, దాని ఉద్భవస్థానమైన అకాశమునందు బ్రహ్మరంధ్రములోచేర్చి, లయించు టయే మోక్షమని చెప్పుట. ఇదియే కర్మయోగము. కర్మమనునది వాయువు ...

... యోగమనగా చేర్చుట. కర్మయోగమనునది వాయువును చేర్చుట. అనగా వాయువు యొక్క ఊర్ధ్వస్థానమైన ఆకాశమైయుండు



బ్రహ్మరంధ్రమునందు అదిచేరుట. ఆ ప్రకారముచేయక నానావిధములుగా ఈశ్వరులని సంకల్పించి పూజించుటయు, భజించుటయు, నమస్కరించుటయు, మంత్రములను జపించుటయు, దానమిచ్చుటయు, వ్రతములను ఆచరించుటయు మొదలగు వాటిని చేసి, జనులు ఉపవాసముతో పరుండి, కష్టపడి, ఏదొకబుద్ధియు, తెలివియు లేక అధోగతియై నశించి పోవుటయేగాక ఏదొక జ్ఞానము కలుగుటలేదు. జ్ఞానము కలుగవలయుననిన పైన వివరించిన మార్గమును అనుసరించవలయును. అప్పుడు జ్ఞానము కలుగును అదే కర్మ యోగము.



# తొమ్మిదవ అధ్యాయము

శిష్యుడు : గురూ! లోకమున ఇదివరకు గ్రహించి యుండుటకు నేడు విరుద్ధముగా ఇప్పుడు చెప్పుచున్నారు. పంచభూతములను గురించి, అహంకారము, మనస్సు. జీవుడు, ఈవే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనీ మీరు చెప్పినారుగదా! అయిన లోకమున పరంపరగా పైజెప్పిన ముగ్గురును, సృష్టి, స్థితి, సంహారదులు చేయువారనియు, వారిలో బ్రహ్మ రజోగుణము, విష్ణుసత్వగుణము, శివుడు తమోగుణము గలవారని చెప్పుట. కావున ఈ విషయమును చక్కగా వివరించి చెప్పవలయునని వేడుకొనుచున్నాను.

గురువు : లోకమనునది యదార్థ తత్వమునకు విపరీతముగా ఉండునది. కావున, విపరీతముగా కనబడుటను గురించియు, బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు ఎవరని, వారిని గురించి చెప్పెదను. బ్రహ్మయనునది అహంకారము;

విష్ణువనునది మనస్సు; శివుడనునది జీవుడు ఉన్నాడను
విషయమును, ఐదవ అధ్యాయమునందు వివరించి
యున్నది గదా? దానిలోనే పై జెప్పబడిన త్రిమూర్తులు,
మూడు విధములైన గుణములనియు, అనగా తామస,



రాజస, సాత్విక యనియు, చెప్పియున్నదిగదా అవున మీరిప్పుడు శివుడు తామస గుణము, విష్ణువు సాత్వికగుణము, బ్రహ్మ రాజసగుణము, అని చెప్పినట్లు ఎప్పుడును చెప్పుటకులేదు. ఏలననగా, బ్రహ్మ సృష్టికర్తగాదు; బ్రహ్మయనునది అహంకారము. ఆ అహంకారమైన బ్రహ్మ మనస్సునుండియే ఉద్భవించినది. ఆ మనస్సే విష్ణువు. అదెట్లనగా విష్ణువు నాభినుండియే గదా బ్రహ్మ ఉద్భవించినదని చెప్పుట? అప్పుడు విష్ణువు లేనియెడల బ్రహ్మయులేదు. సృష్టియు లేదు. బ్రహ్మయే సృష్టించుననని మీరే చెప్పుచున్నారు. సృష్టికర్తయైన బ్రహ్మ విష్ణువు నుండి ఉద్భవించినదనియు, ఆ బ్రహ్మయే సృష్టించుననియనన, ఆ బ్రహ్మను సృష్టించినది విష్ణువైయున్నది. కాబట్టి విష్ణువు లేనియెడల బ్రహ్మయు, సృష్టియు లేదు. అదియునుగాక, బ్రహ్మకు అండజుడని ఒక నామము గలదు. అండజు డనగా గ్రుడ్డు నుండి కలిగినవాడని యర్థము. ఆ గ్రుడ్డు యేదనగా ఈ కనబడు లోకము. అ లోకమని చెప్పునది మనలోనుండి ఒక గ్రుడ్డాకారముగా ప్రతిబింబించినది. దానికి దృష్టాంత మేమనగా, భూమియందెచ్చట నిలిచి చూచినను, మనము చూచు ఆకాశము, నాలుగు భాగములయందు,

కారముగను కనబడుచున్నది. దాని ఉద్భవము తన మనస్సునుండే. అదెట్లనగా, మనస్సేశక్తి. అదియే విష్ణువు. అప్పుడు శక్తియై, మనస్సైయుండు విష్ణువే శుక్లము.



అటువంటి శుక్లము శిరస్సైన ఆకాశమునయుండుట వలన, ఆ ఆకాశమునందుండు శుక్లమే విష్ణువు. ఆ విష్ణువగు శుక్లము మనలోనుండి వేరుపడక, మనలోనే ఒక గ్రుడ్డాకారముగ నీటి బుగ్గలవలె బైటత్రోసి నిల బడుచున్నది. దానిని మోసికొనియే మనముండుట. అదేలాగనగా, నాలుగవ అధ్యాయమున చెప్పినట్లు నేపాళంపాలునందు ఒక కొబ్బరిపుల్ల కొనయందు ఉంగరములాగున కట్టి, దానిలో ముంచి ఆ పాలు విడిచిపోకుండ నట్లు ఉదిన, దానిలోనుండి ఒక గ్రుడ్డాకరాముగా బైటవచ్చి నిలబడు చున్నది. స్వల్ప సమయమునకు అది విరిగిపోవును. ఈ ప్రకారముగనే జీవుడు మనస్సైన శుక్లమును త్రోసికొనితనలో నుండి వేరై, విడిచిపోక గ్రుడ్డాకారముగ నీటిబుగ్గ లాగున బైట త్రోసి ఉబ్బుకొని నిలుచుచున్నది. ఇదియే బ్రహ్మాండము అని లోకమున చెప్పుట. కాని అది సరికాదు. మనలోనుండి బైటకు వచ్చి కనబడు ఈ లోకము పిండాండము అయిఉన్నది. ఇది బ్రహ్మాండము కాదు. బ్రహ్మాండమని చెప్పునది బ్రహ్మస్వరూపమైన శుక్లముండు శిరస్సు. ఆ శిరస్సు నుండి పై జెప్పిన లోకమును జీవశక్తియై, పరమాత్మయైన వాయువు, ప్రకృతియై, మాయ స్వరూపమై, బైటకు త్రోసికొనివచ్చినదే ఈ కనబడు

లోకము. అందువలన మనము ఇప్పుడు లోకమని చెప్పబడుచున్నదైన ఈ కనబడు పిండాండమై ఉన్నది.ఈ పిండాండమైయుండు లోకము బ్రహ్మాండమునుండి



గ్రుడ్డాకారముగ ఉద్భవించిన సమయమున నేనను అహంకారము కలిగినది. ఇందువలననే బ్రహ్మకు అండజుడని పేరు కలిగినది. ఆ అహంకారమునకే బ్రహ్మయని పేరు. బ్రహ్మయొక్క ఉద్భవము ఈ ప్రకారమై యున్నది.

శిష్యుడు : స్వామీ! బ్రహ్మ ఉద్భవము పై జెప్పినట్లని పూర్ణముగా నమ్మియున్నాను.అయిన తాముచెప్పుదానిని వినునప్పుడు, తనకు తానే బ్రహ్మయని స్పష్టమగు చున్నది. కాని వేదశాస్త్రాదులలో బ్రహ్మకు నాలుగు ముఖము లున్నవనియు, అ ప్రకారము నాలుగు ముఖములతో యుండు బ్రహ్మ సృష్టించువాడనియు కనబడుచున్నది. అలాగే లోకమున గ్రహించి చెప్పుచు వచ్చుచున్నారు. దీని తాత్పర్యమును వివరించి చెప్పవలయునని అపేక్షించు చున్నాను.

గురువు : అది సరి. అయిన ముఖమనగా ఏమని మీరు గ్రహించియున్నారు?

శిష్యుడు : ముఖమనునది ఇదిగో - ఈ కనబడు శిరస్సునందు చెవి, ముక్కు, కన్ను, నోరు - ఇవి అణగియుండు స్థలమై యున్నది.

గురువు : ఈ ముఖములేకున్న యేదొక తెలివియుకలుగునా?

శిష్యుడు : కలుగుటలేదు.

గురువు : అట్లయిన, ముఖమనగా యేమని తెలిసికొ



నవలయును?

శిష్యుడు : తెలివియని.

గురువు : అయిన మీరు చెప్పుస్థలము ముఖమయిన, ఒక శవమునకు ఈ ముఖము లేదా?

శిష్యుడు : ఉన్నది.

గురువు : దాని కేమైనను తెలివికద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : దానిలో జీవుడు లేకపోవుటవలన.

గురువు : అట్లయిన జీవుడు లేకున్న తెలివికద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు తెలివి అనునదేమి?

శిష్యుడు : జీవుడు.

గురువు : అప్పుడు తెలివియై ముఖమైయుండు వస్తువు జీవుడై యున్నాడు. ఆ ముఖమైయుండు జీవుని నుండి లోక ఉద్భవము. అదెట్లనగా, ఒక బీజమున ఏ భాగమునుండి మొలక ఉద్భవించుట?

శిష్యుడు : దాని ముఖము నుండి.

గురువు : అప్పుడు దాని ఉద్భవము ఎచ్చటనుండి?



శిష్యుడు : ముఖము నుండి.

గురువు : ఒక వస్తువు లేకున్న ముఖముకద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : ఆ వస్తువైయుండు బీజమునందు మొదట ఏభాగము ఉద్భవించుట?

శిష్యుడు : దాని ముఖము.

గురువు : అట్లయిన మొదట ఉద్భవించునది ముఖము. ముఖము నుండియే అన్ని ఉద్భవించుట. అది మాత్రము కాదు. ఆ ముఖము బీజమున పై భాగమా? క్రింది భాగమా?

శిష్యుడు : పై భాగము.

గురువు : అట్లయిన, ముఖము అని చెప్పునది తెలివియై, పై భాగమై, మొదట ఉద్భవమై, ఉద్భవస్థానమై ఉండునటు వంటివి ఆలాగు ఉండు వస్తువు మనకు లోకమై యున్నది. లోకము లేని ఎడలమనకు ఇలాగు ఏదైనను కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : ఒక శవమునకు లోకముకద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : కారణమేమి?



శిష్యుడు : జీవుడు లేనందున.

గురువు : జీవుడు లేనియెడల లోకముకద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు లోకము ఎచ్చట నుండి కలిగినది?

శిష్యుడు : జీవుని నుండి.

గురువు : అప్పుడు జీవుడు లోకమునకు ఎటువంటి సంబంధమైనది.

శిష్యుడు : జీవుడు లోకమునకు ముఖమైనది.

గురువు : కావున ముఖమనునది జీవుడైయున్నది. అదియే తెలివి. అప్పుడు జీవుడై , తెలివియైయుండు ముఖము నాలుగువిధములైన ముఖములైయున్నది. అదేదనగా మనస్సు, చిత్తము, బుద్ధి అహంకారము. ఈ నాలుగు ముఖములు లేనియెడలసృష్టి కలుగుటలేదు. ఈ నాలుగు ముఖములతో కూడుకొని బ్రహ్మయైయుండు అహంకారము సృష్టించుట. నేనను అవస్థ లేని యెడలమీాకు ఏదైన కల్పించుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్టయిన కల్పించు టెవరు?

శిష్యుడు : తానే.

గురువు : మీరు ఏదిచేసినను ఎవరు చేసినదని చెప్పుట?



శిష్యుడు : నేను చేసినానని చెప్పుట.

గురువు : ఇది మాత్రము కాదు. మీకు ఒక పుత్రుడున్నాడు. వానిని వేరొకడు పట్టి కొట్టినాడు. అప్పుడు కోపముతో మీరు అతనితో ఎవరుకల్పించిన బిడ్డను కొట్టు చున్నారని యడుగుట?

శిష్యుడు : నేను కల్పించిన బిడ్డను మీరా కొట్టుటని అడుగుచున్నాను.

గురువు : ఆ సమయముతో బ్రహ్మకల్పించిన బిడ్డను మీరా కొట్టుటని అడుగుట కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు ఎవరు కల్పించినది?

శిష్యుడు : తానే.

గురువు : కావున బ్రహ్మకు నాలుగు ముఖములున్న వని చెప్పునది పై చెప్పబడిన - మనస్సు, చిత్త, బుద్ధి, అహంకారములైయున్నవి. ఇవి నాలుగును చేరక ఏదొకటిని కల్పించుటకు సాధ్యము లేదు. దానికి దృష్టాంత మేమునగా, ఏదొకటిని కల్పించుటకు బిడ్డలకు

కొంత పెద్దదైన తరువాత వారికి బుద్ధి కలుగుచున్నది. అప్పుడు అది శ్రద్ధయుంచుటయు, వినుటయు, ఆలోచించుటయు కద్దు. నేనను అవస్థలేనందున



ఏదొకటిని కల్పించుటకు సాధ్యము కాదు. వాటికి నేనను అహంకారము పూర్ణమైనప్పుడు అవి కల్పించుచున్నవి. దానికి మరొక దృష్టాంత మేమనగా, ప్రాయమునకు వచ్చినవారు లేచుటకు వీలులేని ఒక విధముగు వ్యాధి వల్ల పరుండియున్నపుడు వారికి మనస్సు, చిత్తము, బుద్ధియివి లేవా?

శిష్యుడు : కద్దు.

గురువు : ఆ సమయమున వారికీ నేనను అహంకారము కద్దా?

శిష్యుడు : అహంకారము ఉన్నది. కాని ఆ అహంకారమునకు ఏదొకటిని కల్పించుటకు సాధ్యము కాదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : నేనను యహంకారము ఒక్క శక్తి తగ్గిపోయినందున.

గురువు : అట్లయిన, ఇప్పుడు ఏదైన ఒకటిని కల్పించుటకు ఏవేవి కావలయును?

శిష్యుడు : మనస్సు, చిత్తము, బుద్ధి, అహంకారము - ఇవి నాల్గును కావలయును.

గురువు : ఈ నాలుగు అవస్థలు లేనియెడల ఏదొకటిని

కల్పించుటకు సాధ్యమగునా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన, ఈ నాలుగు అవస్థలకే నాలుగు



ముఖములని చెప్పుట. ఇందువలననే బ్రహ్మకు నాలుగు ముఖములని చెప్పుట. ఈ నాలుగు ముఖములు లేని యెడల ఏదొక సృష్టియు లేదు. ఇందువలననే బ్రహ్మకు చతుర్ముఖుడనియు, ఆ చతుర్ముఖుడే సృష్టించుట యని చెప్పుట.

శిష్యుడు : స్వామి, మనస్సు, చిత్తము, బుద్ధి, అహంకార ములైన నాలుగు ముఖములతో కూడిన మనమే బ్రహ్మయని స్పష్టమైనది. అయిన బ్రహ్మకు భార్య కలదియు, అమెయే తనకు పుత్రికయై యున్నదనియు, అమెకు సరస్వతి యను నామమున్నదనియు, సరస్వతి బ్రహ్మకు తల్లియనియు, సోదరిమనియు, భార్య యనియు, పుత్రికయనియు, వేదశాస్త్రాదులు అన్నియు చెప్పియున్నవి. ఆప్రకారముందు బ్రహ్మ నేనని స్పష్టమై ఉండునప్పుడు, దీని తాత్పర్యమేమి?

గురువు : సరస్వతి బ్రహ్మకు పుత్రిక యనగా, మొదట ఒకతెను వివాహమాడి, అమెవలన ఒక పుత్రికను గాంచి అమెకు సరస్వతియని నామమిచ్చి, అమెను వివాహము చేసికొనినాడని ఏదైన వేదశాస్త్రములందు చెప్పియున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : లేకున్న బ్రహ్మవ్యభిచారము చేయుటకు వెళ్ళి, అమెవలన ఒక పుత్రికనుగని ఆ పుత్రికకు సరస్వతియని నామమిచ్చి, ఆమెను వివాహము చేసినాడని వేదశాస్త్ర ములందు చెప్పియున్నదా?



శిష్యుడు : లేదు.

గురువు : ఇదిగాక స్త్రీయొకతె తల్లి, సోదరి, భార్య, పుత్రిక, ఈ నాలుగు స్థితులలో ఉండునది యెట్లు? ఏవిధముగా చూచినను యుక్తముగా తెలియుటలేదు. ఎందుకనగా, బ్రహ్మ తల్లిని తాను వివాహమాడి భార్యగా ఉంచుకొని నాడని గ్రహించుదము. అప్పుడు సోదరిగాను, పుత్రికగాను, ఉండుటకు చోటుండునా?

శిష్యుడు : చోటుండదు.

గురువు : లేకున్న, తాను సాదరిని వివాహమాడి భార్యగా యుంచుకొన్నాడని గ్రహించుదము. అప్పుడు ఆమె తల్లిగాను, పుత్రికగాను యుండుటకు వీలుండునా?

శిష్యుడు : ఉండదు.

గురువు : అట్లయిన , ఏవిధముగా చూచినను, స్త్రీ యొకతె పై జెప్పిన నాల్గువిధములుగాయుండిన దనిన యుక్తముగా లేదు. ఏ మాత్రము అట్లగుటకు ఎప్పుడును కారణము లేదు. ఇట్లుండిన వేదశాస్త్రములను నమ్ముటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యము లేదు.

గురువు : అదెప్పుడును అసలు లేదు. వేద శాస్త్రములు ఎప్పుడును అసత్యము కాదు. ఏలననగా, వేద శాస్త్రములను రచించినది ఎవరని మీా నమ్మకము?



శిష్యుడు : మహాత్ములై అనుభవస్థులైన ఋషీశ్వరులై యున్నారు.

గురువు : ఆ ప్రకారముండు అనుభస్థులైన ఋషీశ్వరులు అసత్యము వ్రాసియున్నారని చెప్పుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : అహా! అట్లెప్పుడును చెప్పరాదు.

గురువు : కాబట్టి అనుభవస్థులు వ్రాసి పెట్టియుండు అనుభవములను మనము తెలిసికొనక, తప్పుగా గ్రహించినదిగా యున్నది. అనుభవస్థులు బ్రహ్మను సరస్వతిని తెలిసి, ఈ సంగతులనుండి సరస్వతి బ్రహ్మకు పుత్రిక యనియు, భార్యయనియు, సోదరియనియు, తల్లియనియు తెలిసి, అనుభవించి, అయనుభవమును వేదశాస్త్రములలో వ్రాసినదై యున్నది. కావున బ్రహ్మ యెవరు? సరస్వతి ఎవరను దానిని గురించి మనము ఆలోచించ వలయును. బ్రహ్మయనగా దేహము లేక యుండు ఈ జడమునే దేహమని, ఆ అభిమానమే అహంకారమైన బ్రహ్మయని నాలుగవ అధ్యాయమున వివరింపబడియున్నది. ఆ ప్రకారము అభిమానించుకొని యుండునది ఈ జడముగానున్నది అప్పుడు ఈ జడమే బ్రహ్మ. సరస్వతి అనగా, ఎవరని ఆలోచించి నట్లయిన ఈ

నాలుకయని చెప్పవలసినదిగా యున్నది. ఎందుకనగా, సరస్వతికి అనేక నామములు గలవు. ఏవనగా బ్రాహ్మి భారతి, భాష, గీర్, వాక్, వాణి, సరస్వతి, వ్యాహార, ఉక్తిర్, లపితం, భాషితం, వచనం, వచః ఇవియన్నియు, సరస్వతి



నామములై యున్నవి. ఇవి యొక్కొక్క కారణముచేత వచ్చి యుండు నామములు. ఇదిగాక పంచేంద్రియములందు ఒకటి సరస్వతియైయున్నది. (అనగా వాక్ యను ఇంద్రియము) అనగా వాక్ యను ఇంద్రియమును నాలుక అని చెప్పుచున్నారు. సరస్వతి యను నామము నాలుకకు యైయున్నది. ఇది మాత్రము కాదు. లోకులు ఒకని విషయమును చెప్పునప్పుడు అతడు చెడ్డవాణి. చెడ్డ సరస్వతి. చెడ్డనాలుకయని చెప్పుచున్నారు. ఇవన్నియు నాలుకకు సంబంధించి చెప్పు మాటలు. ఈ నాలుకయే సరస్వతి. ఈమెను బ్రహ్మకు పుత్రికయని చెప్పుటకు కారణమేమనగా, ఈ జడమే అంధకారమైయుండు బ్రహ్మయని ముందుగ చెప్పబడియున్నదిగదా! ఈ అహంకారమైయుండు జడము లేనియెడల నాలుక ఉండునా?

శిష్యుడు : ఉండదు.

గురువు : ఇప్పుడు నాలుక ఎచ్చట నుండి కలిగినది?

శిష్యుడు : ఈ జడము నుండి.

గురువు : ఈ జడము నుండి నాలుక ఉద్భవించి ఉండు నప్పుడు ఈ జడమునకు నాలుక ఏమైనది?

శిష్యుడు : పుత్రికయైనది.

గురువు : దీని వలననే బ్రహ్మ యొక్క పుత్రిక సరస్వతియని చెప్పుటకు కారణము. అదేమనగా, దేహముగాక యుండు



జడమును దేహమని అభిమానించియుండు ఆ అభిమానమే నేనని చెప్పు అహంకారమైన బ్రహ్మ, ఆ బ్రహ్మయే జడము. ఆ జడము నుండి నాలుక ఉద్భవించుట వలన తనకు పుత్రికయైనది.

శిష్యుడు : గురూ! పుత్రికయని చెప్పునది స్త్రీకదా! అప్పుడు ఈ నాలుక స్త్రీయనియా, పురుషుడనియా ఏ విధముగ నిర్ణయించ వలయును?

గురువు : స్త్రీ అనగా శక్తియైయున్నది. శక్తిలేనియెడల లోకములేదు. ఈ లోకము శక్తియందుద్భవించి యున్నది. ఆశక్తియే శబ్దము. శబ్దము లేనియెడల శక్తిలేదు. శక్తిలేని యెడలశబ్దము లేదు. అప్పుడు శబ్దము, శక్తియు, ఒకటి యై ఉన్నది, రెండుకాదు. శబ్దము లేనియెడల నోరు పలుకుట లేదని చెప్పుచున్నారు. అప్పటి స్థితియే సమీారణన్ అని చెప్పునది. అది మనము నిద్రపోవు సమయముననుండు అవస్థ. అనగా శక్తి వాయురూపమై బైటకు చలించక తనలోపలనే పైకి క్రిందకు మాత్రము గతాగతము చేయుచుండు అవస్థ. అదెట్లనగా, తన శక్తి వాయురూపమై, బైటకు చలించనందున తానైయుండు శివుడు మాత్రమే అగును. అదే ప్రకారమనగా తనశక్తియైన

శబ్దము తనలోపలనే అణగి, తానుమాత్రముగా ఉంటున్నది. దాని కొక దృష్టాంతము మీరు శాండో రామమూర్తిగారి విషయమై వినియున్నారుగదా? వారు తనచేతిని నేరుగా నిలిపిన ఆచేతిని వంచుటకు ఐదు లేక



పదుగురు ప్రయత్నపడినను సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యమగుటలేదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : వారు బలిష్ఠులైనందున.

గురువు : అయిన అతడు పరుండి నిద్రించుసమయమున నాలుగైదేండ్ల ప్రాయముగలఒక బాలుడు వారి చేతిని ఎత్తి వంచుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యమగును.

గురువు : అదెందువలన? అతడు బలిష్ఠుడుగదా? రామమూర్తి తనచేతిని నిడుపుగా ఉంచినప్పుడు సుమారు ఎనిమిది లేక పదిమంది బలిష్ఠులు వంచుటకు వీలులేక పోవుటయు, అతడు నిద్రలోనుండు సమయమున నాలుగైదు సంవత్సరములప్రాయముగల బాలునకు ఆ చేతిని వంచుటకు సాధ్యమగుటకు కారణమేమి?

శిష్యుడు : అతడు నిద్రలో నుండి శక్తిలేక యుండి నందున.

గురువు : అప్పుడతని శక్తి యేమైనది?

శిష్యుడు : తనలోనే లయించినది.

గురువు : అప్పుడు శక్తి యెచ్చట నుండి కలుగుట?

శిష్యుడు : తనలోనుండియే కలుగుట.



గురువు : అప్పుడు తనలో నుండి ఉద్భవించిన శక్తి తన లోపలనే లయించి తానై ఉండునప్పుడు ఏదైనను కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు శబ్దమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అట్లయిన, శబ్దములేనియెడల ఈ కనబడు ఏదొక అవస్థను, వినుటకు, తెలియుటకు, చూచుటకు సాధ్యముకలదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఆలాగైన దీనికి కారణమేమి?

శిష్యుడు : శబ్దము.

గురువు : అప్పుడు ఆ శబ్దము ఏమైనది?

శిష్యుడు : శక్తియైనది.

గురువు : అటువంటి శబ్ద స్వరూపమైనశక్తినుండియే ఈ కనబడు అన్ని అవస్థలు కలిగినవి. కావున ఈ శబ్దస్వరూపమైన శక్తి స్త్రీయా లేక పురుషుడా?

శిష్యుడు : స్త్రీయే.

శిష్యుడు : స్త్రీయే.

గురువు : అప్పుడు శబ్దము ఏమైనది?

శిష్యుడు : స్త్రీయైనది.



గురువు : అప్పుడు అటువంటి శబ్దమును కల్పించుటకు కావలసిన రూపమేది?

శిష్యుడు : నాలుక.

గురువు : స్త్రీయగు శబ్దమును కల్పించుటకు కారణమై యుండు రూపము నాలుకయైనందున దానికి స్త్రీయని పేరు వచ్చినది. ఆ శబ్దమునకే సరస్వతియను నామము. కావున నాలుకకు సరస్వతియను నామము వచ్చినది. ఈ నాలుక బ్రహ్మయగు ఈ జడము నుండి ఉద్భవించి యుండుటవలన. బ్రహ్మకు నాలుక పుత్రికయైనది. ఇందువలననే బ్రహ్మ పుత్రిక సరస్వతియని చెప్పుటకు కారణమైనది. బ్రహ్మ భార్య సరస్వతి యెట్లనగా, తాను తన పుత్రికయగు సరస్వతితో కార్యములను చేయించుటవలన తనకు భార్యయైనది.

శిష్యుడు : మనకందరు ఆడపిల్లలున్నారు కదా! మనము ఆ బిడ్డలచే కార్యములు చేయించిన, వారు మనకు భార్యలగుచున్నారా?

గురువు : మనము బిడ్డలచే కార్యములు చేయించు లాగున, బ్రహ్మ తన పుత్రికతో చేయించుటలేదు. బ్రహ్మ తన పుత్రికను సంయోగముచేసి కార్యములను చేయించును.

అదెట్లనగా, మనము నిద్రలో నుండు సమయమున, మనకు యేదైన యొక శబ్దము కల్పించుటకు వినుటకు సాధ్యమున్నదా?



శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : నేనను అవస్థ లేనందువలన.

గురువు : ఇదిగాక, ఒకచేతిని వీచిన శబ్దము కలుగునా?

శిష్యుడు : కలుగదు.

గురువు : ఈలాగే మనము నిద్రలోయున్నప్పుడు నేనను ఒక అవస్థ లేదు. అప్పుడు ఏదొక శబ్దమును కల్పించుటకు సాధ్యము కాదు. నిద్ర నుండి హెచ్చరిక యైనప్పుడు నేనను అవస్థ కలిగినది. అటువంటి నేనను అవస్థయే అహంకారమైయుండు బ్రహ్మ. ఆ అహంకారమైయుండు అవస్థయే., అహంకారమైయుంఉడు బ్రహ్మ. ఆ అహంకారమైయుండు బ్రహ్మ, తనలోనుండి ఉద్భవించిన పుత్రికయైన నాలుకతో సంయోగము వలన, శబ్దము కల్పించి మాట్లాడి, కార్యమునకు ఉపయోగించినాడు. దీనివలననే. బ్రహ్మకు సరస్వతి భార్యయని చెప్పుట. సంయోగము ఎలాగనగా, నేనను అహంకారము లేని ఎడల నాలుకకు ఏదొక శబ్దమును కల్పించుటకు సాధ్యము లేదు. నేనను అహంకారము కలిగినప్పుడు తన పుత్రికయగు నాలుకతో చేరినది. ఆచేరికకే సంయోగము

అని చెప్పుట. సంయోగమనగా సం+యోగ; సం=అది లేక ఆమె: యోగము = చేరిక; అనగా ఆమెలో చేరుట. అప్పుడు అహంకారమై యుండు నేననునది నాలుకతో చేరి, ఆ



నాలుకను పైన, క్రింద తాకించి, శబ్దమును కల్పించి, మాట్లాడు కార్యమును చేయించుట; దీనివలననే బ్రహ్మకు సరస్వతి భార్యయని చెప్పుట. తల్లియని చెప్పుటకు కారణమేమనగా, శబ్దము లేకున్న ఏదొకటియు లేదు. శబ్దము లేకున్న నేనను అవస్థయు లేదు. అదెట్లనగా, మనము నిద్ర సమయమున శబ్దము వినుటకు, కల్పించుటకు సాధ్యము లేదు. ఎప్పుడు మరొక శబ్దము మనకు వినబడునో, అప్పుడు మనకు నిద్రనుండి హెచ్చరికయగుచున్నది. అప్పుడు నేనను అవస్థ కలిగినది. అటువంటి నేనను అవస్థ ఎచ్చటనుండి కలిగినది?

శిష్యుడు : శబ్దము నుండి కలిగినది.

గురువు : శబ్దము నుండి నేనను అవస్థ కలుగునప్పుడు అటువంటి నేనను అవస్థకు కారణము యేమైనది?

శిష్యుడు : తల్లియైనది.

గురువు : దీనివలననే సరస్వతి బ్రహ్మకు తల్లియని చెప్పుటకు కారణము. సరస్వతి బ్రహ్మకు సహోదరి అని చెప్పుటకు కారణము, శబ్దము నుండి నేనను అవస్థ మొదట కలిగినది. అటు వెనుక శబ్దమును కల్పించినది. అప్పుడు శబ్దమును కల్పించుటకు పూర్వము, నేనను అవస్థ

కలిగినది. దానికి పిమ్మట స్త్రీయైన శబ్దము తనలోనుండీ కలిగినది. అట్లుండుటవలన, మొదట తాను, అటుపిమ్మట తనలో నుండి శబ్దమైన స్త్రీయు, కలిగినది కావున ఆ స్త్రీ తనకు ఏమైనది?



శిష్యుడు : చెల్లెలైనది.

గురువు : అట్లయిన, నేనను అవస్థ మొదట ఉద్భవించి అటుపిమ్మట శబ్దమగు స్త్రీ ఉద్భవించినందున తనతో బుట్టిన ఆమె చెల్లెలైనది. దీనివలననే బ్రహ్మకు చెల్లెలు సరస్వతియని చెప్పుట. కావున పై జెప్పిన రీతిగ బ్రహ్మ యొక్కయు, సరస్వతి యొక్కయు స్థితులు, ఇదియే వేద శాస్త్రాదులందు చెప్పియుండు నటువంటిది. వాటి యదార్థ తత్వములను గ్రహించక లోకమున జనులు అటువంటివి అసత్యము కాదని తలచకయు, న్యాయ అన్యాయములను ఆలోచించకయు, యేదొక లజ్జయు లేక తాము పండితులని, తమకే పండితపట్టము దొరకలవలయునను అభిమానము ఏదైన తర్కము చేసి చెప్పుచున్నారు పై జెప్పిన ప్రకారమే బ్రహ్మయొక్కయు, సరస్వతియొక్కయు ఉద్భవము. అది మనస్సులో నుండి ఉద్భవించినదై యున్నది. ఆ విష్ణువైన మనస్సే విశ్వంభరమును భరించియుండుట. విష్ణువునకు విశ్వంభరయని పేరు కలిగినది. విశ్వమనునది లోకము. మనస్సగు విష్ణువు లేనియడల విశ్వమును లేదు. అదేలాగనగా ఒకడు నిద్రలోనున్నప్పుడు అతనికి

విశ్వములేదు. అతడు నిద్ర నుండి హెచ్చరికయైన తోడనే మనస్సగు విష్ణువు గ్రుడ్డాకారముగా బైటవచ్చును. అప్పుడు విశ్వమగు లోకము కలుగును. అప్పుడు మునుపు జెప్పిన ప్రకారము పిండాండమై గ్రుడ్డాకారమై బైటకు



త్రోసికొనివచ్చిన లోకమున తనలోనున్న జీవశక్తి తనలోనుండి వేరువడక బైట నిలిచియున్న పిండాండమైయున్న లోకమై బైటకు కనబడునదే మనము వినునది, చూచునది, తెలిసకొనుట అను అవస్థలు. వీటికన్నిటికి కారణము మనస్సైయున్నది. ఆ మనస్సే విశ్వంభరయైన విష్ణువు. అటువంటి విశ్వంభరయై యుండు విష్ణువే రజోగుణము. ఏలననగా, రాజ్యమును పాలించువారికి రాజని చెప్పుచున్నారు. ఎందుకనగా ఆ రాజ్యభరణకర్తృత్వము రాజునకు యుండినదై యున్నది. ఇదే ప్రకారమే విశ్వమును భరించుకొని ఉండుటవలన మనస్సగు విష్ణువునకు విశ్వంభరయని నామము కలిగినది. అప్పుడు విశ్వమగు లోకమునకు రాజు మనస్సైయుండు విష్ణువుగా యున్నాడు కావున భరణకర్తృత్వము ఎవరికున్నదో వారు రాజగును. లెకున్న విష్ణువనియు, శివుడనియు, సంకల్పించి వ్రాసిన చిత్రపటములను చూచిన, వాటిలో విష్ణువనునది, అనంతశయనుడై, కిరీటదారియై, మరియు హారములు, కంకణములు మొదలగు ఆభరణములు, పీతాంబరము మొదలగు పట్టు వస్త్రములు ధరించి, సర్వాలంకార భూషితుడై, లక్ష్మీ, క్షమయను పత్నులతో, పరిచారకులైన తుంబుర, నారద, వీణానారద, గరుడ మొదలగువారితో

మహా రజోగుణమూర్తియై కనబడును అదియునుగాక, కిరీటము రాజులకే ఉండునటువంటిది. కావుననే రజోగుణము విష్ణువైయున్నది.



అదిగాక నీవు రజోగుణమునుండి సృష్టికర్త బ్రహ్మయని చెప్పుచున్నావు. అదిసరి. అదేలాగననగా రజోగుణమై మనస్సైయుండు విష్ణువు శుక్లమైయున్నది. ఆ శుక్లము నుండియే అహంకారమైయుండు బహ్మ సృష్టించుట. దానికి దృష్టాంతమేమనగా, కత్తిచేరాముడు అరటిచెట్టును నరకినాడు అనుటలో కత్తి అప్పుడును రాముడగుట లేదు. కత్తి అని చెప్పునది ఒక వస్తువై యున్నది. కత్తియను ఒకసాధనముతో రాముడు చెట్టును నరికినాడు. కత్తి, చెట్టుయను వస్తువులు. లేనియెడల నఱకుటయను ప్రవర్తనలేదు. ఈ ప్రకారమే రజోగుణమని చెప్పు విష్ణువు అనుశుక్లము ఒక వస్తువు. అటువంటి శుక్లమైయుండు వష్ణువు నుండియే సృష్టి యగుట. ఆ వస్తువులేకున్న సృష్టి లేదు. సృష్టించుట అహంకారమగు బ్రహ్మ. అహంకారము లేనియెడల సంయోగమను అవస్థ లేదు. అహంకారము నుండి మనస్సు లేనియెడల సంయోగము కలుగుటలేదు. మనస్సగు శుక్లము నిమిత్తము అహంకారమగు బ్రహ్మసంయోగమైన ప్రవర్తన నుండి పైన చెప్పిన రజోగుణమైన శుక్లము నుండి సృష్టించుట. కావుననే రజోగుణము నుండి బ్రహ్మ సృష్టించుట యని చెప్పుట కావున బ్రహ్మ రజోగుణముకాదు. తమోగుణమై

యున్నాడు.

శివుడనుట తామస, రాజసగుణములనుండి వేరై ఒకటే శుద్ధసాత్విక గుణము మాత్రమై జటావల్కలములు విభూతి, రుద్రాక్ష మొదలగువాటిని ధరించి, మౌనియై



ఎప్పుడును తపోనిష్టుడై ఏదొక అలంకారము లేక కనబడును. అది సాత్వీక గుణమైనది. అయిన శివుడే జీవుడై యున్నాడు. అటువంటి జీవుడే రక్షించుట. దీని వలననే సత్వగుణమునుండి రక్షణకర్త విష్ణువని చెప్పుట. కావున మనస్సగువిష్ణువు రక్షించవలయునన్న జీవుడు కావలయును. జీవునినుండే మనస్సగు విష్ణువు రక్షించుట. జీవుడు లేకున్న ఏదియులేదు. రజోగుణమైయుండు మనస్సు నుండి భూతమైయుండు అహంకారము ఉద్భవించుట. ఆ భూతమైయుండు అహంకారమును సాత్వీకమై యుండు జీవుడు రక్షించుట. అదేలాగనగా, మనస్సగు రజోగుణము నుండి సంభోగనిమిత్తమై అహంకారమైయుండు ఈ కనబడుజడము సృష్టించ బడినది. ఈ జడమును సాత్వీకమైయుండు రజోగుణము శుక్లము నుండి అహంకారమైయుండు ఒక రూపమును సృష్టించుచున్నది. అదే పుట్టిపడిన శిశువు. ఆ బిడ్డయందు జీవుడైయుండు సాత్విక గుణము లేనియెడల అది శవముగా నుండును. దానిలో జీవశక్తియగు వాయు వుండుటవలననే జీవుడున్నదని చెప్పుట. ఆ జీవుడు శక్తియై వాయువై సాత్వీకమైయుండు శివుని నుండి రజోగుణమై యుండు మనస్సు ఉద్భవించినది. దాని వలననే

రాజసమే సాత్వికమైన జీవునిశక్తియైన వాయువనే వస్తువు నుండి రక్షింపబడుట. దీనివలననే సత్వగుణమునుండి రక్షణ కర్త విష్ణువని చెప్పుట.



తమోగుణమునుండి సంహార రుద్రుడగు చున్నాడని శివుడు సంహారరుద్రుడై తీరుచున్నాడు. అదెట్లనగా, ఆత్మయై, జీవుడై, శక్తియై, వాయువై, తేజస్సైయుండు వస్తువు జీవుడు. రుద్రుడనుటలో "రుకార" మనునది తేజస్సు. ఆ అగ్ని ద్రవించి నశించుచుండుట వలన దానికే రుద్రుడనిచెప్పుట. దానికి కారణము తమోగుణమై యుండు అంధకారము. ఆ అంధకారము అహంకారము. ఆ అహంకారము నిమిత్తము తన్నుతాను తెలియక, ఇది కావలయును, ఇది కావలెను, నేను శ్రేష్టుడు, స్థాని, మానియనె ఈ విధమైన దురభిమానము నుండి మోహారూఢులై, జీవుడై, తేజస్సైయుండు వస్తువు ద్రవించి అధోగతియై, జనులు నశించి పోవుచున్నారు. దీనివలననే, శివుడురుద్రుడై, సంహారము చేయుచున్నాడని చెప్పుట. ఈ ప్రకారముగాక, మనలోనుండి వైరై యుండు ఒక శివుడు రుద్రుడై జనించివచ్చి మనలచంపుటలేదు. మనలోనుండు జీవుడై, శక్తియై, వాయువై, ప్రకాశమైయుండు వస్తువు అహంకారము నిమిత్తము తన్నుతాను తెలియక, పై జెప్పిన దురభిమానమై విచారములచే నశించిపోవుట.

అదియునుగాక, లోకమున ప్రతిష్ఠలను చేసి పూజించుచు వచ్చుచున్నారు. ఇది చూచునప్పుడు తమో

గుణము బ్రహ్మ. రజోగుణము విష్ణువు, సత్వగుణము శివుడై కనబడుచున్నది ఎందుకనగా బ్రహ్మను లోకమున పూజించుట కనబడుటలేదు. విష్ణువును శివుని మాత్రమే పూజించుచున్నారు. రజోగుణము బ్రహ్మయైయుండిన



నిశ్చయముగా బ్రహ్మనుగూడ పూజించవలసినదిగా యున్నది. అదెందుకనగా, లోకమున తమోగుణమును మాత్రమే సూజించుటలేదు. రజోగుణ, సత్వగుణములను మాత్రమే పూజించుటయైయున్నది ఎందుకనగా, రజో గుణము రాజైయుండుటవలన రాజును పూజించ వలయును. అదెందుకనగా, రాజు రక్షణకర్త, కావుననే రక్షించు రాజును సాధారణముగా పూజించుట. అట్లుండు రాజును, సాత్వీకమును ప్రజలు పూజించుచున్నారు. సాత్వీకము సన్యాసియైయున్నది. అదెందుకనగా, అతడు రజతమోగుణములను విడచి శుద్ధ సాత్వీకగుణములను మాత్రము అనుసరించి నడుచువాడై యున్నాడు. ఆ ప్రకారముండు సన్యాసిని లోకమున రాజు మొదలగు జనులందరు పూజించుచువచ్చుచున్నారు. అప్పుడు లోకమున సాధారణముగా సాత్వికము, రాజసము మాత్రమే పూజింపబడుచున్నవి. తమోగుణవారై, రాగద్వేషులై, నడచువారిని ఎవరును పూజించుట లేదు. దీని ననుసరించియే లోకమున పూజా క్రమములు వెలయుచున్నవి. అదేలాగన, ఒక విష్ణుక్షేత్రము నందు విష్ణువని సంకల్పించివచ్చిన బింబమును ఎ ప్రకారముగా పూజించుచున్నారు?

శిష్యుడు : దానిని స్నానము చేయించి పరిమళ ద్రవ్యములను పూసి ఆభరణములు వేసి, పలువిధములైన పుష్పములను అర్పించి, పీతాంబరము మొదలగు పట్టు వస్త్రములను



కట్టి కిరీటమునుయుంచి బహు ఆడంబరముతో నిలిపి పూజించుటై యున్నది.

గురువు : ఈ పైజెప్పిన అవస్థలన్నియు యేమై యున్నవి?

శిష్యుడు : అలంకారమై యున్నది.

గురువు : అలంకారమనునది ఏ గుణమునకు?

శిష్యుడు : రజోగుణమునకు.

గురువు : అయిన విష్ణువును ఏ విధముగ పూజించుట?

శిష్యుడు : శుద్ధ రజోగుణమై.

గురువు : కావున రజోగుణమనునది యేది?

శిష్యుడు : విష్ణువు.

గురువు : శివక్షేత్రమున శివుని పూజించుట ఏవిధముగా?

శిష్యుడు : శివలింగమునకు అభిషేకము ప్రధానమై యున్నది. కాశీ, గోకర్ణము మొదలగు క్షేత్రములనుండు శివలింగములకు సదాకాలము అభిషేకము ముఖ్యమై యున్నది. అది మాత్రముగాక గోకర్ణమున శివలింగము పై భాగమున యొక పడవను వ్రేలాడగట్టి, దానినిండుగ నీళ్లు

నింపి, ఆ నీళ్లు సదాకాలము శివలింగముపైన ధారగా పడుచునేయున్నది. ఇదిగాక అనేక క్షేత్రములలో నుండు శివలింగము పై భాగమున సన్నని ద్వారముచేసి, ఆ పాత్రమున జలము నింపుచున్నారు. ఆ జలము



ఎప్పుడును శివలింగముపైన పడుచున్నది.

గురువు : అట్లయిన, శివలింగమునకు ప్రధానమేది?

శిష్యుడు : అభిషేకము.

గురువు : పై జెప్పిన ప్రకారము దాని మీద సదాకాలము జలము పడునప్పుడు దానిని అలంకరించుటకు సాధ్యపడునా?

శిష్యుడు : కాదు.

గురువు : పై జెప్పిన ప్రకారము సదాకాలము అభిషేకము చేయునప్పుడు దానిపైన ఏదైన కళంకము, మైల కలిగియుండునా?

శిష్యుడు : ఉండదు.

గురువు : కళంకము లేనిది, మైలలేనిది మరియు అలంకారములేనిది, ఏ గుణమై యుండును?

శిష్యుడు : శుద్ధ సాత్వికగుణమై యుండును.

గురువు : అప్పుడు శివునకు ఏ గుణమని చెప్పవలసినది?

శిష్యుడు : శుద్ధ సాత్విక గుణమనియే.

గురువు : కావున సత్వగుణము శివుడనియు, రజోగుణము విష్ణువనియు స్పష్టమగుచున్నది. ఆ రజోగుణము నుండి కలిగిన అహంకారమైయుండు తమోగుణమే బ్రహ్మ. కావున లోకమున సత్వగుణమైన శివుని. రజోగుణమై



యుండు విష్ణువును మాత్రమే పూజించుటై యున్నది. తమోగుణమైయుండు బ్రహ్మను పూజించుట లేదు. పూజించుట లోకమున జనులకు ఇది ఏ గుణమని తెలయకయు, దానిని ఆలోచించకయు, తాము చేయు ప్రవర్తనలు ఇటువంటివని తెలియకయు, సత్వగుణము విష్ణువనియు, తమోగుణము శివుడనియు, రజోగుణము బ్రహ్మయనియు చెప్పి, ఏ వివరములేక ఘోషించి నడచు చున్నారు. అది తప్పైయున్నది. కావున సాత్విక గుణమనునది జీవుడు అనగా శివుడు రజోగుణమనునది సాత్వికగుణమైన జీవుని నుండి ఉద్భవించియుండు మనస్సు; అనగా విష్ణువు. తామస మనునది రాజసమైయుండు మనస్సు నుండి ఉద్భవించియుండు అహంకారము అనగా బ్రహ్మ. వీటికే త్రిమూర్తులని పేరు ఈ ప్రకారము త్రిమూర్తులని చెప్పు మూడు గుణములను ఒకటి చేర్చి, ఉద్భవస్థానమై యుండు ఆకాశమున ఎప్పుడు ఒకటై ఐక్యము చేయుదుమో ఆ సమయమున త్రిగుణరహితుడై, త్రిగుణాతీతుడై భవించుట.

ఇదే మోక్షము!



# పదియవ అధ్యాయము

శిష్యుడు : గురూ! మనస్సే విష్ణువు, శక్తి, జలము, శుక్లమని చెప్పినారుగదా? అట్లు ఈ ఒక వస్తువునే ఈ విధమైన వ్యత్యాసముగా చెప్పుటకు కారణమేమి?

గురువు : ఇది ఒకటే వస్తువు. దానికి సందేహమేమి లేదు. అయినను దానికి పలుమార్పులు సంభవించుటవలన పలునామములు కలుగుచున్నవి. అదెట్లనగా, అక్షరమై తానై యుండు వస్తువు ఆకాశమైన ఖాళీ స్థలమై యున్నది. ఆ ఖాళీస్థలమగు ఆకాశమునే సదాశివుడని చెప్పుట. అదియే తానైయుండు జ్యోతి, ఆ జ్యోతియైయుండు తనకుచలనము కలిగిన సమయమున జీవుడైనది. ఆ జీవుడే ఆత్మయై, చైతన్యమై యున్నది. అదే దేహము. ఆ దేహము నుడి ఆవిరై, చెమటై, అగ్ని స్వరూపమయిన శుక్లము ఉద్భవించును. ఆ శుక్లమే మనస్సు. అది జలాంశమయియున్నది. అదే విష్ణువు దానికే శక్తియని చెప్పుట. కావున శక్తి యందే సృష్టి, స్థితి, సంహారాదులు

కలుగుటని చెప్పబడుట. శక్తిలేని యెడలసృష్టి, స్థితి, సంహారాదులు కలుగుటని చెప్పబడుట. శక్తిలేనియెడల సృష్టి, స్థితి, సంహారాదులు కలుగుట లేదు! ఆ శక్తియే శుక్లము. శుక్లము లేనియెడల ఏవిధమయిన సృష్టియు



కలుగదు. ఆ శుక్లమయి ఉండు స్వేదజలవే బ్రహ్మాండము.

అదెట్లనగా, సముద్రమున జలము లేని యెడల, సముద్రము అను నామము వచ్చుటలేదు. అప్పుడది ఎక్కువలోతై, అగాధమయిన విస్తారమయిన ఒక స్థలమయియుండును. దానిలో జలముండి నందున, దానిని సముద్రమని చెప్పుచున్నారు. అట్లుండు సముద్రమున నీటి బుగ్గలు కలుగుచున్నవి అవి కలుగుటకు కారణము జలము చలించి, అలలు కొట్టుటవలననే. ఆ జలమునకు చలనము లేని ఎడలపై జెప్పిన నీటి బుగ్గలు కలుగటలేదు. అలలు కొట్టునప్పుడు కలుగునది, నీటి బుగ్గలందు నురుగై యున్నది. ఆ నురుగు లేకున్న నీటి బుడగలు కలుగుట లేదు. కావున, నురుగు జలమునుండి కలిగి, దాని నుండే నీటి బుగ్గలు కలుగుచున్నవి. ఆ నీటి బుడగలు జలముపై తేలి, గుండమయి, గ్రుడ్డాకారముగా, అర్ధము అనగా, గాజులాగునయున్నది. అనగా జలముపై నురుగు నీటి బుడగలునై యున్నవి. ఈ ప్రకారము ఆకాశమయినది. సముద్రమందు జలములేని స్థితి ఏవిధమో ఆ విధమనియే ఆకాశమని తలచవలయును. జలముండు

నప్పుడు మాత్రమే సముద్రమని చెప్పుట. అలాగే అకాశమునందు వాయువుయుండునప్పుడు సముద్ర మనియు, ఆ సముద్రము మాయాసముద్ర మనియు, గ్రహించవలసినదిగా ఉన్నది. సముద్రమున అలలు



కొట్టినప్పుడు, నురుగు కలుగుచున్నదని చెప్పురీతిగ, మాయాసముద్రమందు వాయువైయుండు జలమున అలలు కొట్టుటవలన మనస్సగు నుఱుగు కలుగును. సముద్రమున అలకొట్టుటవలన కలిగన నీరు, నీటి బుడగలై గుండ్రమయి గ్రుడ్డాకారమయి అద్దమురీతిగ జలముపై ఉన్నదని చెప్పబడియున్నది. అలాగే మాయాసముద్రమున చలనమయిన వాయువు నుండి నుఱుగైయుండు మనస్సు కలిగి, ఆ మనస్సు బుడగయి గుండ్రమయి, గ్రుడ్డాకారమయి, యద్దములాగు మాయాసముద్రముపైన అహంకారమయి ఉన్నదని గ్రహించవలెను. అయిన, సముద్రమున నుండు నటువంటి జలమే అలలుగాను, నుఱుగుగాను, నీటి బుడగలుగాను, ఉద్భవించి జలముపై తేలియుండునది. అవన్నియు సముద్రజలముగానే ఉండునవి. జలములేని ఎడల, ఈ విధమగు ఏదోకటియు కలుగుటలేదు. ఆ ప్రకారమే ఆకాశమునందు వాయువు కలిగినందున, మాయా సముద్రమనియు, ఆ మాయా సముద్రమునందు వాయువైన అలలచలనము నుండి నుఱుగైయుండు మనస్సు, అహంకారమయియుండు నీటిబుగ్గలు కలిగి యుండునవి. ఏ విధమున జలము నుఱుగైబుడగై

భవించుచున్నదో, అప్రకారమే జీవశక్తియైయుండు వాయువు మనస్సై అహంకారమయి ఉద్భవించినది. నీటి బుడగ ఏ ప్రకారముగా జలమందేజలముపై ఉంటున్నదో అదే ప్రకారముగా, అహంకారమయియుండు బుడగయు,



మనసై అహంకారమయి ఉద్భవించినది. నీటిబుడగ ఏ ప్రకారముగా జలమందే జలముపై ఉంటున్నదో అదే ప్రకారముగా, అహంకారమయి యుండు బుడగయు జీవశక్తియైయుండు వాయువునందే వాయువుపై ముందు చెప్పిన నీటిబుడగలాగున ఉంటున్నది. అది అద్దము వర్ణమునయుండుట వలన దానిలో ప్రతిబింబించి తానెవరని తెలియక, నేను అన్నిటికన్న హెచ్చు. సర్వము నాకు క్రిందయేయను దురభిమానమయి ఉంటున్నారు. కాని పై జెప్పిన నీటిబుడగ యొక నిమిషములోపలనే పగిలి ఉద్భవించిన జలములో తానే లయించుచున్నది. అలాగే అహంకారమయియుండు బుడగయు తన్నుతాను తెలియక అభిమానించి స్వల్పసమయములో విరిగి, అది ఉద్భవించిన జీవశక్తియగు వాయువునందే లయించు చున్నది. అది యొకటే వస్తువైయున్నది. ఆ వస్తువే అనేక విధములుగా కలుగునటువంటివి ఈ ప్రకారము దానికి పలుమార్పులు సంభవించుటవలన ఆ మార్పులకు అనుసరించి పలు నామము కలుగుటకు కారణ మయినది.



# పదునొకండవ అధ్యాయము

శిష్యుడు : స్వామీ! మునుపటి అధ్యాయమునందున దాని వెనుకటి అధ్యాయములలోను చెప్పిన ప్రకారము, దేహము వాయువనియు ఈ కనబడు జడము దేహము కాదనియు తెలిసినది. అయిన లోకమునందు స్థూలమనియు, కారణమనియు, సూక్ష్మమనియు, మూడు దేహములున్నవనుచున్నారు. దేహము తాము చెప్పు ప్రకారమయిన, పై జెప్పిన మూడు దేహము లేవేవని వివరింప వేడుకొనుచున్నాను.

గురువు : స్థూల, సూక్ష్మ, కారణమను మూడు దేహములు ఏవి అనిమీరు గ్రహించుచున్నారు.

శిష్యుడు : స్థూలమనునది ఇదివరకు దేహమని సంకల్పించిన ఈ కనబడు; జడము కారణమనునది అవిద్యయే, అనగా విద్యలేక తెలివిలేకయుండు సుషుప్తియనియు, సూక్ష్మమనునది మనస్సనియు చెప్పుచున్నారు.

గురువు : ఇది నిజముకాదు, ఎందుకనగా, మీరు చెప్పినట్లు

మూడు దేహములుండుటకు వీలులేదు. అయిన స్థూలసూక్ష్మ కారణమని చెప్పునవి, జీవుడు, ఆ జీవుని నుండి చలనమయియుండు శక్తియైన మనస్సు, దాని నుండి ఉద్భవించిన మాయయైన అహంకార



మయియున్నవి. ఈ కనబడు జడమయియుండు దేహమును స్థూలదేహమని చెప్పుట కగుటలేదు. ఎట్లనగా, సూక్ష్మ దేహమనునది మనస్సని మీరే చెప్పినారు. ఆ మనస్సు స్థూలమని సంకల్పించే ఈ జడముననే ఉండునదని చెప్పుచున్నారు. స్థూలమనునది పెద్దది. సూక్ష్మమనునది చిన్నదైయున్నది. మనస్సు ఎంతో చిన్నదైయుండు వస్తువైయున్నది. అలాగే చిన్నదైయుండు మనస్సు నుండి ఈ కనబడు లోకము కలిగినదిగాయున్నది. కావుననే లోకము మనస్సుయొక్క సంకల్పమైయున్నదని చెప్పుట. అప్పుడు యెంతో తేలికై చిన్నదై, సూక్ష్మమైన మనస్సు నుండి లోకము అణగుట. ఈ కనబడు జడము అటువంటి మనస్సు నుండి ఉద్భవించినదైయున్నది. ఈ మనస్సు లేనియెడల జడము కలుగుట లేదు కావున జడము సూక్ష్మమైయుండు మనస్సునుండి కల్పింప బడినదై యున్నది. అదిగాక ఒకడు చనిపోయినప్పుడు శవమై యుండు జడమును మనము చూచుచునే యున్నాము. దానిలో మనస్సు ఉండుట లేదు. కావున ఆ శవమునకు లోకము లేదు. ఈ జడమే స్థూలదేహమని చెప్పిన, సత్తువ పోయినప్పుడు శవమైన జడమును మనము చూచుచున్నాము. దాని అవయవములకు ఏదొక

దోషము కనబడుటలేదు. స్థూలముండువరకు, సూక్ష్మ ముంటు న్నదనియు, స్థూలములేనప్పుడు సూక్ష్మము నశించుట లేదనియు చెప్పబడుచున్నది. కాని ఈ జడము స్థూలమయి యుండిన, సూక్ష్మము నశించిపోయినను, ఈ



స్థూలమని చెప్పు జడము నశించకయు కనబడు చున్నది. కావున ఈ జడమున కెప్పుడును స్థూలమని చెప్పుటకు వీలులేదు. సత్తువ పోయినదని చెప్పు సమయమున, ఈ జడమున లేనిదేదనగా, జీవుడే. కావున జీవుడే స్థూలదేహమని చెప్పవలయును. ఆ జీవుడైయుండు స్థూలదేహ ముందుండునదే సూక్ష్మమైయుండు మనస్సు. కారణదేహమని చెప్పునది, అవిద్యయు, ఏదొకటియు, తెలియనిదియు అగు సుషుప్తియైయున్నదని మీరే చెప్పుచున్నారు. అనగా జీవుడు బైట శక్తియై ద్రవించి నప్పుడు ఆ శక్తి నుండి ఉద్భవించిన అహంకారమునకు మాయయని పేరు. ఆ మాయయే ఒకటని తెలియకుండు సుషుప్తియని ఏడవ అధ్యాయమున వివరించియున్నది. స్థూలమైన జీవుని తెలియక ఉండుటవలననే, ఈ జడమును స్థూలమని చెప్పుటకు కారణము.

అదెట్లనగా, ఒక వస్త్రమున రెండు భాగములందును దట్టమైయుండు బంకను అతికించి దానిని తీసి పెట్టుచున్నారు. దానిని సాధారణముగా, చూచిన బంకరాచినవారు తప్ప, తక్కిన ఎవరును ఇటువంటిదని తెలిసికొనుటకు సాధ్యమగుటలేదు. అట్లుండు వస్తువుపైన సిరాతో లోకమునకు అనుసరించిన ఒక పటము

వ్రాయబడియున్నది. అనగా ఆకాశము, భూమి, సముద్రము, యదిగాక, మనుష్య, మృగ, పక్షి, సర్పములు మొదలగునవి అని అభిమానించి చెప్పవచ్చు చిత్రములను వ్రాయబడియున్నవి. అయిన సృష్టులలో మృగ, పక్షి,



సర్పములు మొదలగువాటికి రూఢీలేని ఒక అవస్థని, మనుష్యులని అభిమానించియుండువారైన మనము అనుష్ఠించి వచ్చుచున్నాము. అదేదనగా, వస్త్రమును ధరించునదై యున్నది. పై జెప్పిన బంకను అతికించి ఎండబెట్టిన వస్తువుపైన, మనుష్యులని అభిమానించు రూపమును వ్రాయబడుచున్నది గదా! దానికి గూడ ఒక వస్త్రమును చుట్టవలయును. ఆ మనుష్యరూపము, బంకను అతికించి ఎండబెట్టిన వస్తువుపైన వ్రాయబడియుండుటవలన వేరొక వస్త్రమును గొనివచ్చి చుట్టుటకు సాధ్యము కాదు. కావున వస్త్రములాగుండు రంగునుండి పై జెప్పిన రూపమునకు వస్త్రము చుట్టినట్లు రంగు పూయవలెను. దానిని ఆ విధముగ జేసిన పిదప అది ఒక వస్త్రమని సంకల్పించబడుచున్నది. అయిన అది వస్త్రము కాదు; వస్త్రమువలె పూసిన ఛాయయగు రంగైయున్నది. కాని నిజమగు వస్త్రము కనబడుట లేదు. నిజమగు వస్త్రమును చూచునప్పుడు. పై జెప్పిన వేవియు దానిపై కనబడుటలేదు. యథార్థ వస్త్రమును చూడ వలయుననిన, దాని మీాద అతకబెట్టిన బంకను పోగొట్టవలయును బంకను పోగొట్టిన, దానిమీాద వ్రాసియుండు ఏదొకటియు కనబడుటలేదు. ఆ

ప్రకారముండు నిజమగు వస్త్రమును చూడక, వస్త్రములాగు ఛాయపూసియుండినదే వస్త్రమని సంక ల్పించి వచ్చుచున్నాము. ఈ విధముగా వ్రాసిన చిత్రమునకును, నిజగు వస్త్రమునకును, ఏదొక



సంబంధము లేదు. ఆ వస్త్రమున బంక పూసియుండుట వలననే పై జెప్పిన వాటిని వ్రాయుటకు కారణము. కావున ఆ బంకను తీయుటకు కావలసిన ప్రయత్నమును చేయవలయును. అదెట్లనగా, బంకపూసియుండు ఆ వస్త్రమును జలమునందుంచి ఉతికిన బంకవిడిచి, నిజమగు వస్త్రము కనబడుచున్నది. అప్పుడు దానిలో నుండు చిత్ర మొకటియు కనబడుటలేదు. దీనిలో వస్త్రము స్థూలము, దానిమీద పూసియుండు బంక కారణము. దానిలో వ్రాయబడిన చిత్రములు సూక్ష్మమై యున్నది.

ఈ విధమై తానై యుండు జీవుని, వస్త్రముగా వుండు స్థూలము అనియు, జీవుని చలనము నుండి ఉద్భవించి ఏదొకటిని తెలియక సుషుప్తియై మాయయై వుండు అహంకారమును, ఆ వస్త్రముపై పూసివుండు బంక కారణమనియు, తానైయున్న జీవుని చలనమునుండి కలిగియుండు మనస్సునుండి కారణమైయుండు బంకపై వ్రాయబడిన చిత్రములను సూక్ష్మ అనియు, తెలిసికొన వలసినది. పై జెప్పిన వాటినుండి నిజమగు వస్త్రమును తెలియక చాయచే వస్త్రములాగు వ్రాయబడి ఉండుదానిని వస్త్రముగ సంకల్పించి ఉండులాగుననే

మాయయందు కలిగిన అహంకారమైయుండు ఈ జడమును తెలియకుండుట వలన స్థూలమని సంకల్పించు చున్నాము. ఎప్పుడు తనయొక్క నిజమైన జీవుడైయుండు స్థూలమును తెలియుదుమో, అప్పుడు



వేరొకటిలేదు. అదెట్లనగా, నిజమైన వస్త్రమును తెలిసికొననప్పుడు భిన్నమై వేరేదొకటి ఉండుటలేదు. భిన్నమై, అనగా, వ్యత్యాసమైయుండుదానిని, స్థూలమని చెప్పుటకు కారణములేదు. స్థూలమనునది తానైయుండు జీవుడును కారణమనునది ఆ జీవుని చలనమై యుండుశక్తిచే కలిగిన సుషుప్తియైయుండు మాయయగు అహంకారమును సూక్ష్మమనునది జీవుని చలనశక్తియగు మనసైయున్నది. వీటినే స్థూల, కారణ, సూక్ష్మమని చెప్పవలసినది. కావున మనమిప్పుడు కారణమైయుండు సుషుప్తిలోయుండుటవలన మనము అనుభవించునదై కనబడునవన్నియు స్వప్నమై యున్నది. దీనిని గురించి ఏడవ అధ్యాయమున వివరింపబడియున్నది. అటువంటి స్వప్నములో ఉండుటవలననే స్థూల, కారణ, సూక్ష్మమను తలంపు కలిగినది. పై జెప్పిన ప్రకారము అన్ని అవస్థలును మనము సుషుప్తిలో నుండుట వలన స్వప్నము కలుగుచున్నదేగాని, ఈ ప్రకారము ఒకటియు ఉండుట లేదు.



# పంద్రెండవ అధ్యాయము

శిష్యుడు : గురూ! సుషుప్తి అనునది మాయయనియు, తానై యుండుశక్తితో ఆ మాయ బైటవ్యాపించి, చలించే, తానును శక్తియు జేరి ఒకటై క్షీణించి హెచ్చరిక లేక పరుండియున్నదనియు తెలియవచ్చుచున్నది. ఆ ప్రకారము చేరి క్షీణించి హెచ్చరిక లేక పరుండి ఉన్నప్పుడు తన్ను ప్రత్యేకముగా తెలియుటకు ఏవిధముగ సాధ్యమగునని తెలియజేయుమని వేడుకొనుచున్నాను.

గురువు : తన్ను తన శక్తి యందు ఉద్భవించిన మాయయని చెప్పబడునది నిత్యము, అనిత్యమైయున్నది. వాటిని వేర్వేరుగా తెలియుటకుగాను ఒక దృష్టాంతమును చెప్పెదను అనగా ఒక పాత్రమున కొంత జలమును తీసి ఆ జలములో స్వల్ప లవణమును వేసిన కొంత సేపటికి ఉప్పును చూడలేము. ఉప్పు ఆ జలములో కరగిపోవుచున్నది. అటు వెనుక లవణమును

చూడవలయునని జలమును ఇగురబెట్టవలెను.
అప్పుడదివరకు కనబడుచుండిన జలము ఇగిరిపోయి, కనబడకుండిన లవణము కనబడుచున్నది. ఆ ప్రకారమే నిత్యమైయుండు తాను, అనిత్యమైయుండు మాయలో లయించియున్నది. ఆలాగున లయించుకొనియుండు



తన్ను తెలియవలెననిన, మాయను ఇగురబెట్టవలెను. ఇంతవరకు చూచుచుండు మాయయగు లోకము నశించును. కనబడకుండిన నిత్యమైన బ్రహ్మము కనబడును. అదెట్లనగా, పై జెప్పిన లవణము కరగియుండు జలమును ఇగురుబెట్టుటకు అగ్ని కావలసియున్నదిగదా? ఆలాగే, బ్రహ్మముతో చేరియున్న మాయయగు లోకమును నాశము చేయుటకు అగ్ని కావలసియున్నది. అదివివేకమను అగ్నియైయున్నది. అయిన పై జెప్పిన ఉప్పునకు నాశములేదని తలంచి, దానిని జలము నుండి ప్రత్యేక పరచిన పిదప, దాని నుండి జలమును ఇగురుబెట్టుకు సాధ్యమగుటలేదు. కావున నశించు జలమును దానిలో లయించి నాశములేక యుండు లవణముతో సహా, అగ్నిని రగిలించి, ఇగుర్చుటకు మొదలు పెట్టిన నాశముగలదైన జలమును నాశపరచి, నాశములేని ఉప్పును కనబడునట్లున చేయవచ్చును. ఆ ప్రకారమే నిత్యముగా నుండు తాను, అనిత్యమైయుండు మాయయగు లోకమునందు లయించి యుండుటవలన, తనకు నాశము లేదని గ్రహించి, మాయయైయుండు లోకము నుండి ప్రత్యేకపరచిన వెనుక, ఆ లోకమును నాశపరచుటకు

సాధ్యమగుటలేదు. కావున నాశముగలలోకమును, దానిలో లయించియుండు నాశములేని బ్రహ్మముతో సహా, తన్ను వివేకమను విశేషఅగ్నిచే నాశముగల మాయను నాశము చేసిన, నిత్యముగా నుండు తన్ను



తెలిసికొనవచ్చును.

శిష్యుడు : గురూ! మాయమైయుండు లోకమును వివేకమను వివేషయగ్నిచే ఏ విధముగా దహించ వలయునో వివరించి చెప్పవలసినదని అపేక్షించు చున్నాను.

గురువు : మీరు నిత్యమా? అనిత్యమా?

శిష్యుడు : నేనను చెప్పబడు అవస్థ అనిత్యమై యున్నది.

గురువు : అప్పుడు మీకు నాశముకద్దా?

శిష్యుడు : నేనని చెప్పబడు అవస్తకు నాశముకద్దు.

గురువు : నేనను అవస్త మీకు లేకున్న, ఈ కనబడు లోకము మీకు కలదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు మీకీ లోకమెక్కడనుండి ఉద్భవించినది.

శిష్యుడు : నాలోనుండియే.

గురువు : కావున మీరుచూచు ఈ అవస్థలు మీ లోపలయుండునటువంటివై ఉన్నవి. అదెట్లనగా, సాధారణముగా లోకమున నా రాజ్యము, నాతల్లి, నా

తండ్రి, నాభార్య, నాబిడ్డలు, నా ధనము అనియు, నాకు స్థాన , మాన , శుద్ధ, అశుద్ధ, సుఖ, దు:ఖ, స్వర్గ, నరక, ఆకలి, ఆకలిలేకుండుట, బంధు, వాహన, శత్రు వనియు, ఇక వేరు విధములుగాను చెప్పుచున్నారు. ఇవన్నియు,



నేనను అవస్థయు, నిత్యము కావు. అనిత్యమైయున్నవి. అయిన ఇంత పెద్దదైయుండు లోకముతో నేనను అహంకారము ఉద్భవించినది ఎచ్చట నుండి అనగా, మనస్సై యుండుశక్తి నుండియే. దానికి దృష్టాంతము ఏమనగా, నెను ఆ పర్వతమును ఎక్కి క్రిందకు దిగినందున నా శరీరము క్షీణించి ఆయాసముచే పడినాను. ఈ వాక్యమునందు నేననునది ఆయాసముచే పడినది కాదు. ఈ జడమే ఆయాసముచే పడినది. ఒకడు తనకాలి వ్రేళ్లు యొక రాతికి తగిలినప్పుడు "అయ్యో! నా జీవుడు పోయినది", యనిచెప్పుచున్నాడు. ఈ మాట యందును నేను పోవుట లేదు. నా జీవుడే పోయినది. నేను ఒకరాత్రి యందు శ్మశానము ప్రక్కన కాలిత్రోవగా వచ్చుచున్నప్పుడు ఒక భయంకర `శబ్దమును విని భయపడి, నా మనస్సు చెప్పరాని విధమున భ్రమించిపోయినది. కావున పై జెప్పినవి ఎవరు, నేనుకాదనియు, నాబంధువులై యున్నారనియు, విశదగుచున్నది. అదిగాక మీరు నలుగురు ముగ్గురితో ఒకస్థలమున మాట్లాడుకొనుచున్నారు. అప్పుడు ఒకడు వచ్చి మిమ్ము పెక్కు చెడ్డమాటలతో దూషించినాడు. ఆ

సమయమున మీకు అవమానము, లజ్జ, వ్యసనము కలుగుచున్నవి. ఆ కారణముచేత మీకుఅసహ్యము కలిగి అచ్చట నుండి మీగృహమునకు వచ్చి మీ స్నేహితులతోను, గృహములో నుండువారితోను మాట్లాడు



నప్పుడు, ఇటువంటి వారు వచ్చి నన్ను కోపముతో హెచ్చు చెడ్డమాటలచే దూషించినారని చెప్పిన దానిని వినిన సమయమున "నేను లేకపోతినే" అని ప్రత్యుత్తర మిచ్చుచున్నారు. ఆ మాటయందు ఎవరు లేక పోయినది? జడము, శరీరము, మనస్సు, జీవుడు, ఇవన్నియు ఉన్నవి. ఇవన్నియు పోవుటలేదు అయిన ఎవరు లేదనిన, నేనను అభిమానించి యుండు అహంకారమే. అదిగాక మీరు మరొకరితో సంభాషించి, వారిని ఓడించి, జయము పొందియున్నారు. అప్పుడు మీరు ఏమని చెప్పెదరు? నేను ఈ విషయమున, అటువంటివారితో మాట్లాడి, వారిని జయించినాననియు, వారినోరును మూసివేసినాననియు, అదియునుగాక నేనెవరు? స్థాని, మాని, సమర్థుడనియు చెప్పి, మిమ్ము మీరే పొగడికొని మాట్లాడు చున్నారు. దానికే అభిమానమైయుండు అహంకారమని చెప్పుట. అటువంటి అహంకారమే నాశమగునటువంటిది. అట్లు నశించునటువంటి అహంకారము ఒక్క ఉద్భవము మనస్సునుండి అని స్పష్టముగా తెలియుచున్నది. ఆ మనస్సు జీవునినుండియే ఉద్భవించినది. దానికే శక్తి అని చెప్పుట. ఇదియే జీవశక్తి. ఈ జీవుడే శివుడు. ఆ శివుడే

తాను. అలాగే తానుగానుండు శివునిశక్తియే, మనస్సు. కావుననే, శివశక్తి అని చెప్పునది. ఆ శక్తిని తనలోనే అణచవలయును. కావున పై జెప్పిన ప్రకారము విచారించి తనశక్తి అటువంటిదని తెలిసి ఆ శక్తిని బైట



ప్రతిబింబించనీయక వివేకముగా నుండు విశేష అగ్ని యందుపై జెప్పిన లోకమును దహనము చేసి తనలోతానే వెలిగి తానుగా ఉండవలయును. దానికే నిత్యానిత్య వివేకమని చెప్పుట.



# పదమూడవ అధ్యాయము

శిష్యుడు : స్వామి! దేహము వాయువనియు, మిగతయుండు నవన్నియు దాని నుండి ఉద్భవించినవనియు చెప్పినారు గదా! దేహమనునది, అన్న మయకోశమనియు కావున అన్నమును భుజించిన మాత్రమే జీవించియుండుటకు సాధ్యమనియు, దేహము అన్నముచే పోషింపబడునద నియు చెప్పుచున్నారు. అట్లుండునప్పుడు వాయువును, దేహమని చెప్పిన, అది భుజించుటయు, అన్నముచే పోషింపబడుటయు, పుష్టియు కావలసినది లేదుగదా!

గురువు : అన్నమనగా ఎమని గ్రహించియున్నారు.

శిష్యుడు : అన్నమనగా మనము బుజించు బియ్యముతో చేసిన అన్నము. త్రాగునది మొదలగు అన్ని ఆహారాదులు.

గురువు : అయితే వీటినన్నిటిని భుజించియున్న ఎడల జీవించియుండుటకు సాధ్యమగునా?

శిష్యుడు : అవును.

గురువు : అయితే లోకమున ఇదివరకు ఎవరును చనిపోలేదు గదా?

శిష్యుడు : అనేకులు చనిపోయియున్నారు.



గురువు : కారణమేమి? అన్నమును భుజించిన జీవించి యుండవచ్చునని మీరు చెప్పినారుగదా? చనిపోయిన వారు మీరు చెప్పిన ఏదొక అన్నమును భుజించక యున్నవారా?

శిష్యుడు : వారందరును భుజించినవారే.

గురువు : అదియే విధమున? అన్నమున భుజించిన జీవించియుండవచ్చుననియు, అన్నముచేతనే దేహమును పోషించుటనియు మీరే చెప్పియున్నారు. అట్లు చేసినవారు చనిపోవుటకు కారణమేమి?

శిష్యుడు : ఆయుస్సు తగ్గిపోయినందున.

గురువు : ఆయువు తగ్గిపోవుటని చెప్పుట పెద్దతప్పుగా నున్నపది. అయిన లోకమున అన్నమును భుజించుట లేదు. అన్నమును భుజించిన మాత్రమే జీవించుటకు సాధ్యమగును. దీనికి సందేహములేదు. అయిన ఆ అన్నమును మనము తెలిసికొనుటలేదు. అన్నమనునది అశనము. అశనమనగా అశువైయుండు ప్రాణమును అయనము చేయుట. అయన మనగా తటస్థముచేసి నిలుపుట. అనగా తనలో నుండు ప్రాణమును విడువక

కొనిపోవుటయు. ఆ ప్రాణము అనునది జీవశక్తియగు వాయువు. ఆ జీవుడు పోయిన, శవమునకు ఏదైనను భుజించుటకు వీలగునా?



శిష్యుడు : వీలుకాదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : జీవశక్తియైన వాయువు అశనము లేనందున.

గురువు : అదిగాక హెచ్చుతక్కువగా ఏడెనిమిది దినములవరకు అంబలి మొదలగువాటిని తినకుండిన జీవుడు లేకపోవునా?

శిష్యుడు : పోవుటలేదు.

గురువు : అది అట్లుండనిమ్ము. ఒక దినమంతయు మనము దప్పికిగాను జలమును త్రాగకుండిన చనిపోవుదుమా?

శిష్యుడు : చనిపోవుటలేదు.

గురువు : అయిన, వాయువు ఒక నిమిషసమయము మనకు దొరకని యెడల?

శిష్యుడు : చనిపోవుచున్నాము.

గురువు : అప్పుడు మనకు ఆహారముగా ఉండు వస్తువేది?

శిష్యుడు : వాయువు.

గురువు : అదే అన్నము. ఆ వాయువగు అన్నముండునప్పుడు మాత్రమే ఆశించుటకు అనగా రగులుటకును, జీర్ణించుటకును, ఆకలియగుటకు, త్రాగుటకు, దహించుటకు అనగా వుడుకుటకును, భక్షించుటకును సాద్యమగుచున్నది. దానికి దృష్టాంతమేమనగా, ఒక



శవమునకు పై జెప్పిన ఏదొకటి వీలగుటలేదు. దీని నుండి ఆశించుటయు, జీర్ణించుటయు, దహించుటయు, భక్షించుటయు యేది?

శిష్యుడు : వాయువు

గురువు : కావుననే అన్నమయలేక అన్నముచే పోషింపబడునది అన్నమయము, ఆ అన్నమయము నుండి చైతన్యము అనగా తేజస్సు, ఆ తేజస్సు లోకమని చెప్పచున్నారు. కావున ఈ కనబడు లోకము దేనియొక్క చైతన్యము?

శిష్యుడు : వాయువు యొక్క చైతన్యము.

గురువు : కావుననే జీవశక్తియైయుండు వాయువే అన్నము. ఆ వాయువును భుజించిన మాత్రమే జీవించియుండుటకగును. కావునను ఈ దేహమును అన్నముచే పోషించుటని లోకమున చెప్పచున్నారు. కావుననే అన్నమైన వాయువును (పూరించుట) నింపవలయును, అనగా నిండింపవలయును. అటు చేసిన సత్తువ పోవుట లేదు (చనిపోవుటలేదు).

శిష్యుడు : ఆ వాయువు దేహమనియు, అదే తాననియు, దాని

నుండి లోకము ఉద్భవించినదనియు, పూర్ణముగా నమ్మియున్నాను. కాని ఇంత సూక్ష్మమైన మనలో నుండి ఇంత పెద్దదైన లోకము ఎ విధముగా ఉద్భవించినదని స్పష్టముగా వివరించి చెప్పవలయునని అపేక్షించు చున్నాను.



గురువు : ఇంత సూక్ష్మమైన మనలోనుండి ఎంతో పెద్దదైన కనబడు ఈ లోకము ఉద్భవించిన దానిని చెప్పుచున్నాను. ఎంతో చిన్నదైయుండు ఒక బీజము నుండి ఎంతో పెద్దదైన ఒక వృక్షము కలుగుచున్నది. ఈలాగే మనస్థితియునై యున్నది. అదెట్లనగా లోకమున చాలపెద్దదై విశాలముగ వ్యాపించుకొని పెరుగు వృక్షము మఱ్ఱి వృక్షమైయున్నది. ఆ వృక్షము కాయ ఎంతో చిన్నది. ఆ కాయలో నుండు బీజము దానికన్నను అతిచిన్నది. అనగా యొక ఆవగింజలో నాలుగులో నొక అండమైయున్నది. అంత చిన్నదైన బీజము నుండి ఎంతో పెద్దదైన వృక్షము ఉద్భవించుచున్నది. అది లేని ఎడల ఆ వృక్షము ఉద్భవించుటలేదు. ఎంతో పెద్దదయియుండు ఆ వృక్షము అతి చిన్నదైయుండుబీజము నందు అణగియున్నది ఆ బీజము కాయలోపల అణగియున్నది. ఆ బీజములోపలపప్పు అణగియున్నది. పై జెప్పిన వృక్షము, బీజములోపలనే అణగియుండి తోలుద్వారా బైటకువచ్చి పెరిగి విస్తరించి పెద్దదగుచున్నది. అటు పిమ్మట ఆ పప్పును, తోలును కనబడుటలేదు. ఈలాగే బీజము నందు అణగియుండు పప్పు జీవుడనియు, పప్పు నుండి ఉద్భవించిన వృక్షమును మనస్సనియు, పప్పు

అణగియుండు తోలు అహంకారమైయున్నది. జీవుడై యుండు పప్పు నుండి మనస్సైయుండు వృక్షము మొలచి, అహంకారమైయుండు తోలు ద్వారా బైట వ్యాపించు చున్నది. అహంకారమైయుండు తోలులో జీవుడైయుండు



పప్పు అణగియుండునప్పుడు బీజమని పేరున్నది. ఆ విధమగు బీజము జడముగా నుండు కాయ యందున్నది.

అదెట్లనగా, మఱ్ఱి వృక్షపు బీజము కాయ లోపలయుండునది, అలాగే పై జెప్పబడినట్లు బీజము నుండి మనస్సైన వృక్షము మొలచి బైట వ్యాపించినందున బీజము కనబడుటలేదు. కనబడునది జడము. జడమై యుండు కాయనుండి జీవునితో పై జెప్పిన బీజముపోయిన వెనుక ఈ జడము నుండి మనస్సైన వృక్షము మొలచుటలేదు. అదెందుకనగా, జీవునితో కూడిన బీజము లేనందున. ఎట్లనగా మఱ్ఱివృక్షపుకాయలో నుండు బీజమునుతీసిన, ఆ బీజము ఇదివరకు అణగియుండి ఈ తోలు మొలచుటలేదు. ఆ వృక్షమునకు కాయ గలుగువిధముననే మనస్సుగు వృక్షమునకు కాయగలుగుట. అనగా మఱ్రివృక్షము యొక్క రెండా ఆకులమధ్య పుష్పమై కాయగలుగుచున్నది. ఈ కాయపెద్దదై భూమి మీాదపడి మొలచి వృక్షమై కాయగలిగి పై జెప్పిన ప్రకారము ఫలమై పడి వృక్షము అగుచున్నది! ఇదే ప్రకారము ప్రతి దినము ఒకటి నుండొకటియై అనేక వృక్షములు కలుగుచున్నవి. కాని

పుష్పము పుష్పములన్నియు కాయలగుటలేదు. ఆ పుష్పములలో 7/8 ఎనిమిదిలో ఏడంశములు పలు విధములుగా నశించిపోవుచున్నది. మిగతయుండు నవన్నియు కాయలగుచున్నవి. ఆ కాయలన్నియు పెద్దవై



HIS HOLINESS
SWAMI SIVANANDA PARAMAHAMSA
FOUNDER OF SIDHASAMAJ



ఫలమగుటలేదు. పలువిధములుగా నాశనమై పోవు చున్నవి. ఆ ప్రకారముననే గర్భము కలుగుట.

అదెట్లనగా, మర్రివృక్షములలో నుండు కొమ్మలలోను , వాటి నుండి పెరిగిన ఇతరశాఖలోను ఆకులు మొలచుచున్నవి. ఆ ఆకులు రెండయి వేరయి ఉండునప్పుడు వాటి మధ్యలో మొగ్గ కలుగుచున్నది. అదెట్లనగా, ఆకులను చుట్టు ప్రక్కలయెరుపుగను, వృక్షమునకు తనంతటనే తెలుపువర్ణమైన పాలుకద్దు. ఆకులు రెండై వేరగు సమయమున. ఎరుపైయుండు అంచున వాయువు మార్గమై ఆకులు ఉద్భవించిన కాడలనుండి పాలుపడి , ఆ అంచుతోచేరి, మొగ్గలు కలుగుచున్నది. ఆలాగే మనస్సగు వృక్షము సంభోగము చేయుట. రెండాకులమధ్యయైయున్నది. ఆ ఆకులనుండి రక్త వర్ణమగు అంచు ఉద్భవించినప్పుడు వాయువు మార్గమైన మనస్సగు వృక్షము నుండి శుక్లమగు పాలు గ్రుడ్డాకృతి యైపడి యా రక్తవర్ణమైన అంచుతో చేరి గర్భము అగుచున్నది. ఈ విధమున గర్భము కలిగిన కాయ ప్రతిదినము పెరిగి ఫలమై తొమ్మిది లేక పది నెలలు గడిపి భూమియందు పడుచున్నది. ఆ కాయయైయుండు

గుంటలో ఉంచి పూడ్చుచున్నారు. జీవుడై యుండు బీజముండిన దానిని బహుజాగ్రత్త జేసి, దాని నుండి క్రమేణ మనస్సగు వృక్షము మొలచి దినదినము పెరిగి



పెద్దదై, సంభోగమైన పుష్పములలో మరలకాయకలిగి ఒకటితో ఒకటి వృద్ధిపరచుకొనియుంటున్నది. అయిన అన్ని సంబోగములలోను గర్భము, అన్ని గర్భములును పెరిగి ఫలములై శిశువులు కలుగుటలేదు. అదిగాక మఱి వృక్షములో కలుగు పుష్పములను మనము చూచుచున్నాము. ఆ పుష్పములకు ఏదైన ఒక గురుతు ఉంచిన, కాయలు గలుగుట ఇటువంటి పుష్పము నుండి అని మనస్సు తెలిసికొనవచ్చును. మనస్సుగానుండు వృక్షము ఒక్క పుష్పమును చూచుటకుకును, ఇటువంటి పుష్పము నుండి కాయ కలిగిన కాయ ఆ శిశువని చెప్పుటకువీలులేదు. మనస్సైయుండు వృక్షము యొక్క పుష్పమును చూడక కాయ గలిగిన ప్రకారమే, పుష్పమును చూడకయే కాయకలుగు వృక్షముకద్దు. ఏదనగా, అత్తిచెట్టు. అత్తి చెట్టు పుష్పములను చూచుటకు వీలగుటలేదు. అది చీకటి యందు పుష్పమై స్వల్పసమయములో కాయలు కలుగునటువంటి యున్నది. వానిని పగటి సమయమున చూచునప్పుడు కాయలై కనుపించు చున్నది. ఇటువంటి సమయమున పుష్పమైనదని చెప్పుట కగుటలేదు. అయిన ఈ వృక్షమునకు చీకటిలేని ఎడల పుష్పము కలుగుటలేదు.

అలాగే మనస్సై యుండు వృక్షము చీకటి యందు పుష్పించుట. అనగా అంధకారమైన అహంకారము నందు స్వల్పసమయములో పుష్పమైన, గర్భమైన కాయ కలుగుచున్నది. అహంకారమైన అంధకారములేని యెడల



సంభోగము కలుగుటలేదు. కావున అహంకారమైన అందకారము నందు పుష్పించుటవలన ఇటువంటి పుష్పము ఒక్క కాయయని చెప్పుటకు సాధ్యముకాకున్నది. అయిన యొక మఱ్ఱి వృక్షమును కోసి తీసిన అందువలన ఎన్నో వృక్షములు లేకుండ పోవుచున్నవని లెక్క పెట్టుటకు సాధ్యమగుటలేదు. అ విధమున మనస్సైయుండు వృక్షమును నశింపజేసినందు వలన ఎన్ని మనస్సై వృక్షములు లేకపోవునని లెక్క పెట్టుటకు సాధ్యము కాదు. అ విధమున మనస్సై యుండు వృక్షమునకు సంసారవృక్షమని పేరు. ఈ సంసారవృక్షము పుష్పించి, కాయకలిగి, ఫలమై, భూమి యందు బీజము మొలచి, పై జెప్పిన ప్రకారము కలుగుటయు, నశించుటయుగా నున్నది - అయిన ఎంతో పెద్దదైన మఱ్ఱి వృక్షము ఒక్క బీజము ఎంతో చిన్నది. అయిన ఎంతో విస్తరించియుండు మఱ్ఱివృక్షము ఎట్లు కలిగినదో, అలాగే మనలోపలనుండి మనస్సైన సంసారవృక్షము మొలచి, బైట శక్తియై వ్యాపించి, విస్తరించుకొనియుండు ఒక మఱ్ఱి వృక్షమే ఈ కనపడు లోకము. ఈ ప్రకారముగా నుండు మఱ్ఱి వృక్షము ఒక్క అడుగు భాగముననే దక్షిణా మూర్తియైన గురువు యుండుట.

శిష్యుడు : గురూ! అలాగైన పై జెప్పిన వృక్షము భూమియందు నిలబడియున్నదై కనబడుచున్నది. మనమును ఆ ప్రకారమే చూచుచున్నాము. అదిగాక నన్ను నేను లోకమున చూచుచున్నాను. ఇప్పుడుండు లోకము నాలోనే



అని చెప్పుచున్నారు. అది ఏ విధమని స్పష్టముగా వివరించ వేడుకొనుచున్నాను.

గురువు : లోకము మీలోనయనియు, మీ లోపలనుండి లోక ఉద్భవించినదనియు చెప్పుట కొక దృష్టాంతమేమనగా, ఒక పెద్ద పాత్రమున, నిప్పుగడ్డలను యుంచి దానిలో పొగ కలుగు విధమైనపలువస్తువులను వేసి ఆ పాతయందు పొగ నిండినప్పుడు దాని నోటిని మూసి భద్రముగా కట్టి డాబా యుండు ఒక విశాలమైన గదిలోపలయుంచిన ఆ పాత్రమున ఉన్న పొగ బైటకు కనబడు చున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : ఆ పొగపాత్రములో అణగి, పాత్రము నోటిని మూసి కట్టినందున.

గురువు : ఆ గదితలుపును, కిటకీలను మూసి పై జెప్పిన పాత్రము నోటిని మూసికట్టినదానిని విప్పి తెరచిన ఏమగును?

శిష్యుడు : అప్పుడు పొగ ఆ పాత్రము నుండి బైటకు వచ్చి ఆ గదియంతయు విస్తరించి నిండుచున్నది?

గురువు : అప్పుడు పొగయందు పాత్రమెచ్చట యుండునట్లు కనబడుచున్నది?

శిష్యుడు : పొగయందు.



గురువు : పొగ, పాత్రమున ఉండిన పొగను విడువక, నోటిని మూసికట్టియుండు సమయమున; దానిలోపలనే అణగియుండిన, పొగ ఎప్పుడు ఆ పాత్రము నోటిని కట్టియుండు కట్టును విప్పినప్పుడు, బైటకు వచ్చి వ్యాపించి విస్తరించునో, ఇప్పుడు ఆ గదియంతయు పొగతో నిండి పాత్రము చుట్టు భాగములందును, అడుగునను, పైనను పొగ వ్యాపించి, పొగయందు పాత్రముండునట్లు కనబడును. యదార్థముగా పొగపాత్రమునందే కలిగినది. అట్లు ఆ పొగపాత్రమున లేనియెడల బైట వ్యాపించుటలేదు. ఈలాగే మన లోపలనుండు మనస్సు పొగయై, బైట వ్యాపించి యుంటున్నది. ఆ మనస్సగు పొగయందే మనము ఇప్పుడుండుట అదెట్లనగా, పాత్రములోన ఉండిన పొగ బైటకువచ్చి, వ్యాపించి, పొగయందు పాత్రముండునట్లు కనబడినట్లే, మనలో నుండి బైట వ్యాపించియుండు మనస్సైన పొగలో యుండుట వలన, లోకమున మనము యుండునట్లు కనబడుట. అయిన పై జెప్పిన పొగ ఉద్భవించినది అగ్ని యందు. అగ్ని లేకున్న పొగ కలుగుటలేదు. ఈ ప్రకారముగనే, మనస్సైయుండు పొగ,

జీవుడై యుండు అగ్ని నుండి కలుగుటలేదు. జీవుడై యుండు అగ్ని లేని ఎడల, మనస్సగు పొగ కలుగుటలేదు. అదియునుకాక, మనము లేని ఎడల మనకులోకము లేదు. అది మాత్రమేకాదు. నిద్రలో నుండుటయని చెప్పె సమయమున మనము లోకమును చూచుటలేదు.



కారణమేమనగా, పొగై వ్యాపించిన మనస్సు, మనలోపల అణగియున్నందున, నిద్రలో నుండి హెచ్చరికయైన సమయమున, పాత్రమున యుండిన పొగ బైటకు వచ్చినట్లుగనే మనలోపలనుండి మనశక్తి బైట వచ్చి వ్యాపించుట. అది గాక, నిద్ర నుండి హెచ్చరికకాగానే, లోకమున అన్ని అవస్థలను ఒకటే సమయమున చూచుటకు సాధ్యమగుటలేదు. ఒక టొకటై కన బడుచున్నది. బైట వచ్చి సంచరించునట్లు, మనము యొకటొకటిని అధికముగా చూచుచున్నాము. ఈ ప్రకారము సంచరించు మధ్యమున, తనలో తానుగా నుండు జీవుడు, మనస్సైయుండు పొగయై బైటకు వెళ్ళి ముగియు సమయమున పాత్రమైయుండు జడము పడిపోవుచున్నది. అటుపిమ్మట లోకముండుట లేదు. ఎట్లనగా పై జెప్పిన పొగ ఉద్భవించి, బైట వ్యాపించు, పాత్రము నోటి మూతికట్టును విప్పి, తెరచి, ఆ పాత్రమును జేతిలో ఉంచి, బైట సంచరించు సమయమున పొగ బైట వెళ్ళి వ్యాపించి, పాత్రమున లేకపోయి, పాత్రము మాత్రమే కనబడును. పొగ కనబడుటలేదు. దీనికి కారణమేమనగా పాత్రమునయుండు అగ్ని ఆరిపోవుటవలన దానినుండి అటుపిమ్మట పొగ కలుగుటలేదు. ఈలాగే తనలోనుండు

జీవుడు మనస్సైయుండు పొగయై బైట వెళ్ళి ముగియునప్పుడు తీరిపోవుట. దానికే సత్తువు పోయినదని చెప్పుట. అనగా సత్తు+పోయినది. అదెట్లనగా జడమైయుండు పాత్రము లోపలసత్తువుగా నుండు



జీవుడు మనస్సై యుండు పొగగా బైటకు వెళ్ళి ముగిసినది. అప్పుడే సత్తువు పోయినదని చెప్పుట.



# పదునాలుగవ అధ్యాయము

శిష్యుడు : గురూ! మనస్సే గురవనియు, ఆ మనస్సే మఱ్ఱివృక్షము అనియు, మనస్సగు మఱ్ఱి వృక్షము అడుగుభాగమున దక్షిణామూర్తియైన గురువుయున్నారని చెప్పినారు కదా! అదే విధమని వివరింప అపేక్షించు చున్నాము.

గురువు : మనస్సే గురువనియు, అటువంటి మనస్సే మఱ్ఱివృక్షమనియు చెప్పుటకు, పదిమూడవ అధ్యాయములో చెప్పిన పాత్రములోపలయుండు పొగయే దృష్టాంతము. అదెట్లనగా, పాత్రమునందుండు అగ్ని నుండి పొగ ఉద్భవించి నిండియున్నప్పుడు, పాత్రము నోరును మూసికట్టిన సమయమున, దానిలో పొగ కలిగియుండినది. ఆ సమయమున పొగ బయట వ్యాపించకయుండుటవలన దానిని చూచుటకు సాధ్యముకాలేదు. అయినను పొగ పాత్రమున

అణగియున్న సమయమునను అది పొగగానె ఉంటున్నది. ఆ పొగయే బయట వ్యాపించినది. అలాగున బయట వ్యాపించిన సమయమునమాత్రమే పొగను చూచుటకు సాధ్యమగును. పాత్రమున అణగి ఉండినదియు, బయట వ్యాపించినదియు, ఒకటే పొగ-ఈలాగే మన మనస్సు



లోపల అణగియుండు సమయమున ఒకటే మనస్సై యున్నది; రెండు కాదు. ఈ ప్రకారము అణగియుండు మనస్సే గురువని చెప్పుట. మర్రి వృక్ష మనగా ఈ కనబడులోకమగు సంసారవృక్షము. దీనికి కారణ భూతముగా ఉండునది మనస్సు. ఆ మనస్సు పై జెప్పిన సంసార వృక్షము అడుగు దక్షిణాముఖమై ఉండునటు వంటిది. కావుననే దక్షిణామూర్తియైన గురువని చెప్పుటకు కారణము.

శిష్యుడు : గురూ! భ్రూమధ్యమగు హృదయము నందు గురువు ఉండుటయని చెప్పియున్నారు కదా! ఇప్పుడు సంసారవృక్షము క్రింద దక్షిణముఖమై ఉన్నారని చెప్పుచున్నారు. అదెట్లని వివరముగా చెప్పవలయునని కోరుచున్నాను.

గురువు : దక్షిణమనగా యేదని మీరు తలచు చున్నారు?

శిష్యుడు : తూర్పుముఖమై నిలచిన కుడిభాగము దక్షిణము.

గురువు : తూర్పుభాగమేది?

శిష్యుడు : సూర్యుడుదయించు దిక్కు.

గురువు : ఇది సరికాదు. నీవు జనించకుండిన, ఉత్తరము, తూర్పు, పడమర, దక్షిణము మీకు కలవా?

శిష్యుడు : లేవు.

గురువు : ఎప్పుడు పై జెప్పిన దిక్కులు మీకు కలిగినవి?



శిష్యుడు : నేను జనించి , నాకు తెలివికలిగిన వెనుక.

గురువు : మీరుజనించకున్న మీకురూపము కద్దా ?

శిష్యుడు : లేదు.

గురువు : రూపములేనియెడల ఆది, అంత్యము, ఉత్తరము, తూర్పు, పడమర, దక్షిణము అనునవి ఏవైన యున్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : ఎప్పుడు పైజెప్పిన దిక్కులు కలిగినవి?

శిష్యుడు : నేనను అవస్థ కలిగిన సమయమున.

గురువు : అదిగాక, మీరు నిద్రలో నుండు సమయమున, ఈ అవస్థలు మీకున్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : నేనను అవస్థ లేనందువలన.

గురువు : నేనను అవస్థ ఏ సమయమునందు కలిగినది?

శిష్యుడు : నిద్రనుండి హెచ్చరికయైనపుడు.

గురువు : అప్పుడు పై జెప్పిన అవస్థలన్నియు ఎవరికి ఉండునటువంటివి?

శిష్యుడు : నాకు ఉండునటువంటివి.



గురువు : ఆ సమయమున మీరు తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము పై చెప్పిన భాగములను చెప్పుటకు, చూచుటకు మీకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : మీరు పాఠశాలయందు చదివితిరా?

శిష్యుడు : చదివితిని.

గురువు : మీరు పాఠశాలయందు భూపటమును చూచి యున్నారా?

శిష్యుడు : చూచియున్నాను.

గురువు : ఆ భూగోళ పటమునకు ఉత్తర దక్షిణమేది?

శిష్యుడు : పటముపై భాగము ఉత్తరము, క్రింది భాగము దక్షిణము అయివున్నది.

గురువు : మీ పై భాగమేది?

శిష్యుడు : శిరస్సు.

గురువు : దానికే ఎత్తయిన భాగము ఉత్తరమనియు చెప్పుట. అది మన శిరస్సు. ఆ శిరస్సు నందు భ్రూమధ్యమున

మనస్సైయుండు గురువు; దక్షిణదిక్కులకు అధో ముఖమైయుండుట దీనివలననే గురువునకు దక్షిణామూర్తియని చెప్పుటకు కారణము.

శిష్యుడు : ఉత్తర దక్షిణభాగములు ఉటువంటివి,



ఉటువంటివి అని తెలిసినది. తూర్పు, పడమర భాగము ఏవని వివరించి చెప్పవలయునని అపేక్షించుచున్నాను.

గురువు : తూర్పు అనునది పూర్వ భాగము. పూర్వమనగా మునుపని అర్థము.

శిష్యుడు : మునుపని చెప్పుటకు ఒక వస్తువు కావలెను గదా! ఒక వస్తువు లేనియెడల మునుపని యెట్లు చెప్పుట?

గురువు : ఒక వస్తువు లేనియెడల దానికి మునుపు, వెనుకయని చెప్పుటకు వీలులేదు. అట్లయినను మనము ఇప్పుడు చూచుచున్నదేది?

శిష్యుడు : మనము ఈ కనబడులోకమునే.

గురువు : అప్పుడు లోకము లేనియెడలన ఏదయినను కలదా?

శిష్యుడు : లేదు.

గురువు : కావున లోకమునకు మునుపును మనము పూర్వము అని చెప్పునది. అనగా ఉద్భవస్థానము. అయిన ఈ లోకము ఎక్కడ నుండి ఉద్భవించినది?

శిష్యుడు : అది మనలో నుండి ఉద్భవించినది.

గురువు : అప్పుడు మనలో ఏ భాగము నుండి లోకము ఉద్భవించినది.

శిష్యుడు : మనశిరస్సు నుండి.



గురువు : అయిన శిరస్సు నుండి ఉద్భవించినట్లయిన మనకు ఎప్పుడును లోకమును చూడ సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : ఎందువలన? ఏ సమయమున

శిష్యుడు : అది మనము నిద్రించు సమయమున

గురువు : అప్పుడు లోకము కలదా?

శిష్యుడు : లేదు.

గురువు : అప్పుడు ఏమైనది?

శిష్యుడు : అప్పుడు లోకము తనలో అణగిపోయినది.

గురువు : లోకము తనలో అణగుటకు కారణమేమి?

శిష్యుడు : మనజీవుడు మనలో అణగినందున

గురువు : ఎప్పుడు లోకము కలిగినది?

శిష్యుడు : నిద్ర నుండి హెచ్చరికయైన పిమ్మట.

గురువు : నిద్ర నుండి హెచ్చరికయైన పిమ్మట ఎచ్చట నుండి కలిగినది?

శిష్యుడు : జీవుని నుండి కలిగినది.

గురువు : ఆ జీవుని నుండిఎట్లు కలిగినది?

శిష్యుడు : నిద్ర నుండి హెచ్చరికయైన పిమ్మట మన జీవుడు



లోపల బయట గతాగతము చేయునప్పుడు.

గురువు : అప్పుడు జీవుడు ఏ మార్గమై గతాగతము చేయుచున్నది.

శిష్యుడు : ముక్కు ద్వారము గుండా లోపలబయట గతాగతము చేయుచున్నది.

గురువు : అయిన మనము నిద్రించు సమయమున ఏ మార్గముగా గతాగతము చేయుచున్నది?

శిష్యుడు : మన కొండ నాలుక పైగ నున్న రెండు ద్వారములద్వారా.

గురువు : అయిన నిద్ర నుండి హెచ్చరికయైనప్పుడు ఏ స్థలము నుండి జీవుడు బయటకు వచ్చుచున్నది?

శిష్యుడు : ముక్కు యొక్క ఉర్ధ్వస్థానమై సుషుమ్నలో నుండి.

గురువు : అట్లు గతాగతము చేయుచున్న జీవుడు బయటకు పోయి తీరిపోయిన ఏమగును.

శిష్యుడు : శవమగును.

గురువు : ఆ శవమునకు లోకము కలదా?

శిష్యుడు : లేదు.

గురువు : కారణమేమి?

శిష్యుడు : అందులో జీవుడు గతాగతము చేయనందున.



గురువు : అప్పుడా జీవుడు బయట ఎంత దీర్ఘముగా గతాగతము చేయుచున్నది?

శిష్యుడు : ముక్కు యొద్ద ఉద్భవస్థానము మొదలుదాని చివరవరకు.

గురువు : అప్పుడు జీవుడు విడిపోవుట ఎచ్చటనుండి?

శిష్యుడు : ముక్కు చివర భాగము నుండి.

గురువు : ముక్కు చివరను జీవుడు లేనియెడల లోకము కలదా?

శిష్యుడు : ముక్కు చివరను జీవుడు లేనియెడల లోకము లేదు.

గురువు : అప్పుడేమగును?

శిష్యుడు : శవమగును.

గురువు : ఎందువలన?

శిష్యుడు : జీవుడులేనందున

గురువు : జీవుడున్న అన్ని సమయములందును లోకము కలదా?

శిష్యుడు : లేదు.

గురువు : అది ఎందువలన?

శిష్యుడు : జీవుడుద్భవస్థానమై సుషుమ్నలో అణగినందువలన.



గురువు : అప్పుడు లోకమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : అయిన ఈ కనబడు లోకము ఒక్క పరిమాణమును ఏ రాజులైనను కొలిచి చెప్పుటకు సాధ్యముకాదు. దానిని ఇప్పుడు కొలిచి చెప్పెదను. ఈ లోకము ఒక అంగుష్ఠమాత్రమై ఉన్నది. అనగా చేతిబొటన వ్రేలంత పొడుగు. ఇదిగో చూడుము. నేను ఇప్పుడు ఏమి చేయుచున్నాను?

శిష్యుడు : చేతి యొక్క బొటన వ్రేలిని ముక్కు యొక్క ఉద్భవస్థానము మొదలు దాని చివరవరకు పెట్టియుంచితిరి.

గురువు : అప్పుడు ముక్కు యొక్క కొలత యెంత?

శిష్యుడు : బొటనవ్రేలు పొడుగంతమాత్రమే అయి ఉన్నది.

గురువు : అయినముక్కు యొక్క ఉద్భవస్థానమునుండి జీవుడు పైకి పోయిన లోకము కలదా?

శిష్యుడు : లోకము లేదు.

గురువు : అయిన ముక్కు చివరభాగము నుండి జీవుడు

విడిపోయిన లోకము ఉన్నదా?

శిష్యుడు : లోకము లేదు.

గురువు : అయిన అ లోకము అంగుష్ఠ మాత్రపు దీర్ఘమై



ఉన్నది.అట్లుండు ముక్కు యొక్క పైన, క్రింద, లోకము లేదు. కావున ఈ కనబడులోకము ప్రకృతి నుండి కలిగినదనియు, ఆ ప్రకృతియైన శివశక్తి బొటనవ్రేలి దీర్ఘమంత ముక్కుయొక్క ద్వారములగుండా పైకి క్రిందకుగతాగతము చేయునప్పుడు మాత్రమే లోకము కలదు. అదియే లోకము. ఆ లోకము ఒక్క ఉద్భవస్థానమే తూర్పు. ఆ ఉద్భవస్థానమున ప్రాణమైన సూర్యుడు అణగియున్నప్పుడే సూర్యోదయము. అందువలననే సూర్యుడు తూర్పున ఉదయించుటయని చెప్పుటకు కారణము. సూర్యుడు అస్తమించునదిన పడమర అని చెప్పుటకు కారణము. సూర్యుడు అస్తమించిన చీకటిగా నుండును. చీకటి అగుటకు కారణము వెలుతురు లేనందును. ఏ స్థలము నుండి వెలుతురు కలుగు చున్నదో, ఆస్థలము నుండి వెలుతురు లేక కనబడు సమయమునకే అస్తమానమని చెప్పునది.

శిష్యుడు : అది ఎట్లు? మనము సూర్యుడు తూర్పున ఉదయించి, పడమరన అస్తమించుటను చూచు చున్నాము.

గురువు : అయిన సూర్యుడుదయించుటను మీరు చూచి

యున్నారా? అదెచ్చటనుండి?

శిష్యుడు : చూచియున్నాను, అది ఆకాశమునుండి.

గురువు : ఆకాశము నుండి సూర్యుడుదయించుదానిని మీరు



చూచియున్నారా?

శిష్యుడు : ఈ కనబడు ఆకాశము నుండి సూర్యుడు ఉదయించుటను చూడలేదు. ఉదయించి పైకి వచ్చిన పిదప ఆకాశమున చూచియున్నాను.

గురువు : అప్పుడు సూర్యుడుదయించుటను మీరుచూడలేదు. ఉదయించుచున్నాడని వినియున్నారు. సూర్యుడుదయించిన మనకేమగుచున్నది?

శిష్యుడు : పగలగుచున్నది.

గురువు : పగలగుటకు దృష్టాంత మేమి?

శిష్యుడు : ప్రకాశమున కలుగుటవలన.

గురువు : ఇప్పుడు ఇది ఏ సమయము?

శిష్యుడు : పగటి సమయము.

గురువు : ఇప్పుడు మీకు ప్రకాశమున్నదా?

శిష్యుడు : ప్రకాశమున్నది.

గురువు : అయిన ఈ గృహములోపలయెవరు ఎచ్చట యున్నారనియు, ఎవేవి సామానులున్న వనియు, ఇచ్చట

నుండి చెప్పగలరా?

శిష్యుడు : లోనికి వెళ్లి చూడక చెప్పుటకు సాధ్యపడదు.

గురువు : మీకు ప్రకాశమున్నదిగదా? ఏకారణముచేత



వాటినిచ్చట నుండి చూచుటకు వీలు లేక పోయినది ?

శిష్యుడు : గోడ అడ్డముగా ఉండుటవలన.

గురువు : ప్రకాశమునకు వేరొకటియు తటస్థమగుట లేదు. కావున మీకు ప్రకాశించ లేదు. మీకు ప్రకాశించునదై కనబడినది, ఏవిధము అనగా, మీరు రాత్రి యని తలచు చీకటైన సమయమున ప్రకాశించుట లేదు. ఆ సమయమున దీపమును వెలిగించిన, దాని శక్తి అనుసరించి ప్రకాశము కలుగుచున్నది. పదిమైళ్ళ చదరపు విస్తీర్ణము కలదైన ఒక చిమినీ మూతను ఉంచునంత పెద్దదైన దీపము ఉన్న దాని శక్తిని అనుసరించి ప్రకాశము కలుగుచున్నది. ఆ సమయమున దీపము నాలుగు భాగములయందుగల అన్నివస్తువులు ప్రకాశము వెళ్లు దూరముమరకు, మనకు కనబడుచున్నవి, అయిన దీపము ప్రక్కన, దీపమునకు తగలనియట్లు ఏదైన ఒక వస్తువు నుంచి దీపమునకు అడ్డము పెట్టిన, ఆ ప్రకాశమునకు మరుగుగా ఉంచిన వస్తువు వెనుక భాగము చీకటైకనబడుచున్నది. దానికి కారణము స్వతస్సిద్ధమై యుండు అవస్థ చీకటైయున్నది. ఆ చీకటిలో ఒకదీపము ఉంచబడి ఉన్నది. ఆ దీపమునకు మరుగు చేసిన

సమయమున స్వతస్సిదమైన చీకటి మాత్రమే కనబడుచున్నది. ఈ ప్రకారమే మనకు ఈ సమయము ప్రకాశించుట లేదు. చీకటైయున్నది. ఈ సమయమున చీకటిలో దీపము వెలిగించబడినరీతిని, ఈ చీకటిలో ఒక



ప్రకాశవస్తువు కలదు ఆ ప్రకాశమునకు తటస్థము వచ్చినప్పుడు ప్రకాశము కనబడుట లేదు చీకటైయున్నది. కారణమేమనగా, పై జెప్పిన దీప ప్రకాశమునకు తటస్థము వచ్చినప్పుడు కలుగులాగుననే, సూర్యుడుదయించుట ఆకాశమునందు. ఆకాశము ఇటువంటిదని ఐదవ అధ్యాయమున వివరించి చెప్పబడియున్నది. సూర్యుడని చెప్పినది ప్రాణము. ఆ ప్రాణమును పై జెప్పిన శిరస్సైన ఆకాశమున కదలక నిలిపిన పగలగుచున్నది. పగలని చెప్పబడునది పరమాత్ముడై యుండు మనస్సు. శిరస్సు లోపల ప్రకాశించునప్పుడే. ఆసందర్భమున సూర్యుడు ఉదయించి ప్రకాశింపగలుగుచున్నాడు. అటు వెనుక చీకటి లేదు. ఆ పకారము సూర్యుడుదయించిన, ఏదొక తటస్థము లేక అన్ని అవస్థలు కనబడుటయు తెలియుటయు యైయున్నది. దానికి ఇదొక కాలమును లేదు. ఇప్పుడు మనకు చీకటి. ఈ చీకటి యందే ఇప్పుడు ప్రకాశమున్నదని కనబడుట దీనికి రాత్రియని చెప్పుటకు కారణమేమనగా, ప్రాణముగానుండు జ్యోతి శివశక్తి యైయుండు మూడుగుణములై బైటవచ్చి వ్యాపించి ఉన్నవి. గుణములు , సాత్విర, రాజస, తామసములై యున్నవి. అయిన పై జెప్పిన మూడు గుణములును

ఒకటిగా జేర్చి వాటి ఉద్భవమైయుండు శక్తితో భ్రూమధ్యమున నిలిపి అచ్చటనే మనస్సును, కన్నులను కదిలించక నిలుపుటై యున్నది. అప్పుడు ప్రకాశించును. అప్పుడే ఆకాశమున సూర్యుడుదయించి పగలగుట.



ఇప్పుడు సూర్యుడుదయించుట లేదు. సూర్యుడు ఉదయించిన అటు పిమ్మట చీకటి యగుట లేదు.

శిష్యుడు : స్వామి! ఇదిగో చూడుడు ! సూర్యుడు కనబడుచున్నాడు. దానిని ఏమని చెప్పవలెను?

గురువు : ఈ కనబడునది మనలోనుండు శక్తి ప్రతిబింబించి కనబడుటయైయున్నది. కారణము మీరు మీకన్నులను, మూసికొని చూచిన మీకు ప్రకాశమైదైన కనబడునా?

శిష్యుడు : కనబడుట లేదు.

గురువు : కన్నులను మూసిన సమయమున కనబడకను ప్రకాశించకను ఉండుటకు కారణమేమి?

శిష్యుడు : కన్నులను మూసినందుననే.

గురువు : మనకు ప్రకాశించుట, చూచుట యెప్పుడు?

శిష్యుడు : కన్ను తెరచిన సమయమున.

గురువు : ప్రకాశించుట, కనబడుట ఎచ్చటనుండి.

శిష్యుడు : వానివానిలో నుండి.

గురువు :

అయిన, మనలోనుండు చైతన్యము, మధ్యాహ్న సమయమున వెయ్యికొట్ల సూర్యులప్రకాశమునకు సమానముగలదయి ఉన్నది. ఆ చైతన్యము నుండి కలిగిన జీవశక్తి నుండి విచారము మొదలగునవి కలుగుచున్నవి. ఆ సమయమున భిన్న ప్రకాశము కలుగుచున్నది.



అటువంటి భిన్న ప్రకాశము నుండి మనలో నుండు చైతన్యమును, మనలో నుండి ప్రతిబింబించి చూచుచున్నాము. ఈ ప్రకారముగా ప్రతిబింబించి ప్రకాశించుపై జెప్పిన సూర్యుని ఇప్పుడు మనము చూడలేము. దానిని చూచిన అతి కఠోరమైన కిరణ ములవలన కన్నులు మూసికొనిపోవుచున్నవి. అదెట్లనగా, ఒక అద్దమున చూచినదానిలో మనరూపము ప్రతి బింబించి ఏదొక కష్టము లేక సుఖముగా చూడవచ్చును. ఆ ప్రకారమే మీరు సూర్యుడని చెప్పి మీరు చూచుచున్న కిరణములకు సరిగా పై చెప్పిన అద్దమును పట్టిన ఆ కిరణము ప్రతిబింబించు ప్రకాశమును మనకు కష్టము లేక చూచుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యమగుటలేదు.

గురువు : దానికి హెచ్చుగా కారణమేమనగా జ్వలించు నటువంటి ప్రకాశము చేత కన్నులు మూసికొని పోవుచున్నవి. ఈ రీతిగా పదియవ అధ్యాయమున చెప్పిన ప్రకారము జీవశక్తియైన వాయువు నుండి మనస్సనునది ఉద్భవించి అద్దము వర్ణమైయుండు గ్రుడ్డాకృతిగా ఉండునటువంటి బయటయందు మనలో పై జెప్పు

విధమున ప్రకాశమైయుండు ప్రాణడై ప్రతిబింబించినదే ఈ కనబడు సూర్యుడు దానిని మనము అహంకారముచే చూచుటవలనను ఈ సూర్యుడు హెచ్చుగా జ్వలించు టవలనను, చూచుటకు వీలులేక యుండుట. ఎప్పుడు ఆ



ప్రకారము ప్రతిబింబించుటకు విడువక తనలోపల అణగించు సమయముననే మనకు పగలగుట. మనస్సును, కన్నులను కదిలించక నిలుపుటై యున్నది. అప్పుడు ప్రకాశించును. అప్పుడే ఆకాశమున సూర్యుడు ఉదయించి పగలగుట. ఇప్పుడు సూర్యుడు ఉద యించుట లేదు. సూర్యుడుదయించిన అటు పిమ్మట చీకటి యగుట లేదు.

శిష్యుడు : స్వామి! ఇదిగో చూడుడు! సూర్యుడు కనబడు చున్నాడు. దానిని యేమని చెప్పవలెను?

గురువు : ఈ కనబడునది మనలోనుండు శక్తి ప్రతిబింబించి కనబడుటయైయున్నది. కారణము మీరు మీకన్నులను, మూసికొని చూచిన మీకు ప్రకాశమైదైన కనబడునా?

శిష్యుడు : కనబడుట లేదు.

గురువు : కన్నులను మూసిన సమయమున కనబడకను ప్రకాశించకను ఉండుటకు కారణమేమి?

శిష్యుడు : కన్నులను మూసినందుననే.

గురువు : మనకు ప్రకాశించుట, చూచుట ఎప్పుడు?

శిష్యుడు : కన్ను తెరచిన సమయమున.

గురువు : ప్రకాశించుట, కనబడుడ ఎచ్చటనుండి?

శిష్యుడు : వానివానిలో నుండి.



గురువు : అయిన, మనలోనుండు చైతన్యము, మధ్యాహ్నసమయమున వెయ్యికోట్ల సూర్యులప్రకాశమునకు సమానము గలదయి ఉన్నది. ఆ చైతన్యము నుండి కలిగిన జీవశక్తి నుండి విచారము మొదలగునవి కలుగుచున్నవి. ఆ సమయమున భిన్న ప్రకాశము కలుగుచున్నది. అటువంటి భిన్న ప్రకాశము నుండి మనలో నుండు చైతన్యమును, మనలో నుండి ప్రతిబింబించి చూచుచున్నాము. ఈ ప్రకారముగా ప్రతిబింబించి ప్రకాశించుపై జెప్పిన సూర్యుని ఇప్పుడు మనము చూడలేము. దానిని చూచిన అతి కఠోరమైన కిరణములవలన కన్నులు మూసికొని పోవుచున్నవి. అదెట్లనగా, ఒక అద్దమున చూచినదానిలో మనరూపము ప్రతిబింబించి ఏదొక కష్టము లేక సుఖముగా చూడవచ్చును. ఆ ప్రకారమే మీరు సూర్యుడని చెప్పి మీరు చూచుచున్న కిరణములకు సరిగా పై చెప్పిన అద్దమును పట్టిన ఆ కిరణము ప్రతిబింబించు ప్రకాశమును మనకు కష్టము లేక చూచుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యమగుటలేదు.

గురువు : దానికి హెచ్చుగా కారణమేమనగా జ్వలించు

నటువంటి ప్రకాశము చేత కన్నులు మూసికొని పోవుచున్నవి. ఈ రీతిగా పదియవ అధ్యాయమున చెప్పిన ప్రకారము జీవశక్తియైన వాయువు నుండి మనస్సునునది ఉద్భవించి అర్ధము వర్ణమైయుండు గ్రుడ్డాకృతిగా



ఉండునటువంటి బయటయందు మనలో పై జెప్పు విధమున ప్రకాశమై యుండు ప్రాణడై ప్రతిబింబించినదే ఈ కనబడు సూర్యుడు. దానిని మనము అహంకారముచే చూచుటవలనను ఈ సూర్యుడు హెచ్చుగా జ్వలించుట వలనను, చూచుటకు వీలులేక యుండుట. ఎప్పుడు ఆ ప్రకారము ప్రతిబింబించుటకు విడువక తనలోపల అణగించు సమయముననే మనకు పగలగుట.

శిష్యుడు : అట్లయిన రాత్రియనియు, పగలనియు, కనబడు రెండవస్థలు కలుగుటకు కారణమేమి?

గురువు : మనకు ఈ సమయము రాత్రియనియు చీకటి యనియు మొదటనే చెప్పబడియున్నది గదా! ఆ చీకటి యందు మనలోపలనుండు ప్రాణము బయట ప్రకాశించు సమయము పగలనియు, ఈ విధమున బైట ప్రకాశించిన ప్రాణము ఎప్పుడు మనలోపలనే అణగునో అప్పుడు రాత్రియనియు చెప్పివచ్చుట. అదెట్లనగా మనము రాత్రి యని చెప్పు సమయమున ఈ కనబడు గృహములోపల ఎదురుగ నున్న తలుపుకు సరిగ యొక దీసపమును వెలిగించిన బయట ఆ తలుపునకు సరిగా ఆ ప్రకాశ శక్తి ఎంతదూరము ప్రకాశించునో అంతదూరము వరకు

వెలుతురుంటున్నది. ఆ తలుపును మూసిన బయట చీకటిగా తెలియును. ఆలాగే మన భ్రూమధ్యములోపల ప్రాణమై సూర్యుడైయుండు ప్రకాశము అహంకారమై యుండు తలుపును తీసిన సమయమున బయట



వ్యాపించి ప్రకాశించుట. అప్పుడు మనకు పగలనియు, ఈ అహంకారమైయుండు తలుపును మూసిన సమయమున బయట ప్రకాశించక ఉండునప్పుడు మనము రాత్రి యనియు చెప్పుచున్నాము. ఇదే మనము చెప్పివచ్చు రాత్రి, పగలను స్థితులు ఇప్పుడు చెప్పివచ్చునది. మనకు రాత్రియుకాదు; పగలునుకాదు; ఈ అవస్థ నిద్రయై ఉన్నది. రాత్రి పగలు వున్నదనునది నిద్ర యందు కనబడు స్వప్నము.



# పదునైదవ
# అధ్యాయము

శిష్యుడు : గురూ! ముందు అధ్యాయమున ప్రాణముగా నుండు సూర్యుడు ఎప్పుడు భ్రూమధ్యమున ప్రకాశించునో ఆ సమయమున ఏదొక కాలమును లేదని చెప్పినారు గదా! అయిన భూతకాల, వర్తమానకాల, భవిష్యత్కాలమను మూడు కాలములున్నవనియు, వాటిని అనుసరించియే లోకస్థితియనియు చెప్పుచున్నారు. ఈ ప్రకారము మూడు కాలములు లేని యెడల నడచినది, నడచుచున్నది, నడువబోవనది అని ఇట్లుండు మూడు అవస్థలు లేకపోవుచున్నది గదా? అట్లగుటకు చోటున్నది గదా?

గురువు : భూతకాల, వర్తమానకాల, భవిష్యత్కాలమని చెప్పునవి ఏ ఏ కాలములగురించి?

శిష్యుడు : భూతకాలమనునది, గడచినది, వర్తమాన కాల మనునది ఇప్పుడు నడచునది; భవిష్యత్కాలమనునది ఇకమీాదట వచ్చుకాలమై యున్నది.

గురువు : అది ఏ విధమున ఎట్లు వచ్చుట? ఇదిగో చూడుము. ఇది యేమి?

శిష్యుడు : ఇది ఒక పుస్తకము.

గురువు : దీనిని నేను అప్పుడు ఏమిచేయుటకు ప్రారంభించు



చున్నాను.

శిష్యుడు : దానిని మీరుత్రాకుటకు ప్రారంభించుచున్నారు.

గురువు : అది ఏ కాలమని చెప్పవలయును.

శిష్యుడు : భవిష్యత్కాలమని చెప్పవలయును.

గురువు : ఇప్పుడు ఏమి చేయుచున్నాను?

శిష్యుడు : ఆ పుస్తకమును తీయుచున్నారు

గురువు : అది ఏ కాలము.

శిష్యుడు : వర్తమాన కాలము.

గురువు : ఈ పుస్తకము ఇప్పుడు ఏమి చేసినాను?

శిష్యుడు : చేతిలో తీసి ఉంచుకొనియున్నారు.

గురువు : అదేకాలము?

శిష్యుడు : భూతకాలము.

గురువు : అప్పుడు భూతకాల, వర్తమానకాల, భవిష్యత్కాలమనియా, లేక భవిష్యత్కాల, వర్తమానకాల, భూతకాలమనియా చెప్పవలసినది?

శిష్యుడు : భవిష్యత్కాల, వర్తమానకాల, భూతకాలమనియే

చెప్పవలయును.

గురువు : అయిన మీరు భావించక ఏదొకటిని చేయుటకు సాధ్యమున్నదా?

శిష్యుడు : సాద్యముకాదు.



గురువు : మీరు ఇచ్చుటకు వచ్చుటకుగాను మీ గృహము నుండీ బయలుదేరుటకు తలంచుట భావికాలము. ఇచ్చుట వచ్చుటకుగాను నడచుట వర్తమానకాలము. ఇచ్చుటకు వచ్చిచేరినది భూతకాలమునైయున్నది. భవిష్యత్కాలమనునది భావియైయున్నది. భావియనునది చలనము. అది ఒకటియు లేని అవస్థ నుండి భావికాలమై చలనమై ఉద్భవించినది. అదెట్లనగా, ఈ జడమైన దేహమునకు యేదొక చలనమైన భవిష్యత్కాలము లేని ఎడల ఏదొకటియు చేయుటకు సాధ్యముకాదు. అదెట్లనగా మీరు కూర్చుండు స్థలము నుండి లేవవలయుననిన, మీ చేతులు, కాళ్ళను ఉంచి యుండుచోటునుండి కదలించకలేచుటకు సాధ్యమగు చున్నదా?

శిష్యుడు : సాధ్యము కాదు.

గురువు : అదెట్లనగా చలనము లేనందున లేచుటకు సాధ్యముకాలేదు. చలించుట జీవశక్తియైన వాయువు. అది భవిష్యత్కాలమై యుండు భావికాలము . ఆ భావికాలమై యుండు వాయువునుండి ఉద్భవించిన మనస్సే వర్తమానమై యుండు నడచుకాలము. ఆ మనస్సు నుండి

కల్పింపబడిన ఈ జడమే భూతమైయుండు గడచిన కాలము. అదెట్లనగా జీవశక్తియైయుండు భావికాలమైన వాయువు వర్తమానకాలమైన మనస్సు లేనియెడల సంయోగము కలుగుటలేదు. కావున వర్తమానమై



యుండు మనస్సు, భూతమైయుండు ఈ జడమును, సంయోగము నుండి సృష్టించుట. అది ఏ ప్రకారమనగా, మనస్సనునది రజోగుణము. ఆ రజోగుణమైయుండు మనస్సు భూతమైయుండు గడచిన కాలమైయుండు జడమును సృష్టించుట. ఆ సృష్టిని సాత్వీకమై జీవశక్తియై భావికాలమై యుండు వాయువు రక్షించుట. సాత్వీకమై యుండు వాయువును, రజోగుణమై యుండు మనస్సు కలిగినప్పుడు, నేనను దేహాభిమానమైన అహంకారము ఉద్భవించుట. ఆ సమయమున మూడు కాలములైన అవస్థలు ఒకటై ఈ కనబడు భూతములను సృష్టించుట.

మనము ఏమేమి విని ,ఏమేమి చూచి. తెలిసికోను చున్నాము, ఇవి అన్నియు భూతకాలమైన భూతములే అయియున్నవి. మనక్కిట్లు ఇవి అన్నియు కలుగుడకు అనగా సంభవించుటకు ఉపయోగకరముగా ఉన్న వస్తువు మనస్సైయున్నది. ఆ మనస్సే ప్రవర్తనయై ఉన్నది, ప్రవర్తన మనస్సై యుండుటచేత. మనస్సు జరుగుచున్న వర్తమానమై యున్నది. ప్రవర్తనయైయున్న ఈ మనస్సు ఉద్భవించుటకు కారణము జీవశక్తియైన వాయువై

భావియైన ఈ వాయువు లేనియెడల వర్తమానకాలమై యున్న ప్రవర్తనయైన మనస్సు భూతకాలమైయున్న భూతమైన అహంకారమూ ఉండవు. ఇవియన్నియు భావియై భవిష్యత్కాలమై జీవశక్తియైయున్న వాయువు నుండే కలిగనవి. అందువలన మనము నిద్రించు



HIS HOLINESS
SWAMI SIVANANDA PARAMAHAMSA
FOUNDER OF SIDHASAMAJ



ఉన్నప్పుడు ఈ కాలములేవియు లేక పోయనవి అ సమయమున ఏమియు తెలిసికొనపడుటలేదు. అప్పుడు మనయొక్క శక్తి ఉద్భవించి వాయువుగా బైట చలించుటలేదు. ఎప్పుడు మనయొక్క శక్తి లోపలనిండి బైట వ్యాపించియుండినప్పుడె అది వాయువనబడినది. ఇందువలన భావికాలమైన వాయువునుండి అన్నియు కలగుచున్నవి. కావున ఎప్పుడు బయటయందు మనస్సున్నదో అప్పుడు భావియను భవిష్యత్కాలము ఒకటి తప్ప (ప్రత్యేక ప్రత్యేక) ఏదొక కాలము ఉండుటలేదు. ఆ విధమున భావియై యుండు భవిష్యత్కాలమని చెప్పబడు జీవశక్తియైన వాయువుగానుండు వస్తువు ఎప్పుడు బయటకు చలించక దాని ఉద్భవస్థానమైన భ్రూమధ్యమున లయించునో అప్పుడు కాలము నశించును. ఆ సందర్భమున తానై తన్మయమైయుండుట. కావున తానై బ్రహ్మజ్యోతిగాయుండు వస్తువైయున్నది. తాను తానే ఆకాశమై భవించునప్పుడు దానిలో చలించుట జీవశక్తియైయుండు వాయువు. ఆ వాయువునే భావియైయుండు భవిష్యత్కాలమనియు, శక్తిమనియు, మాయయనియు, చెప్పుట. అది తనలో నుండి తానే చలించుట వలన

బ్రహ్మమాయయనియు, పురుష ప్రకృతియనియు, శివశక్తియనియు చెప్పుట. తానై బ్రహ్మజ్యోతియై, తనశక్తియై, భావియై, అనగా భవిష్యత్కాలమై ఉండు వాయువును ఎప్పుడు తానైయుండు బ్రహ్మములోనే ఐక్యపరచుచున్నామో అప్పుడు సర్వము తనలో తానే



లయించి తానై, తన్మయమై తీరుట. దీనికే కైవల్యమని చెప్పుట.



# పదునారవ అధ్యాయము

శిష్యుడు : స్వామి! లోకమున పూర్వీకము నుండి పరంపరగా వ్రతములు మొదలగువాటిని అనుష్ఠించి క్షేత్రోపవాస ములను చేసిన మాత్రమే ముక్తి సిద్ధించుటని చెప్పివచ్చుచున్నాను. అవిగాక శాస్త్రములందును ఆ విధముగనే ఉన్నట్లుగా చెప్పి, అనుష్ఠించి వచ్చుచున్నారు. దీని యదార్థమేమి?

గురువు : వ్రతాదులు ఉపవాసాదులు ఏవేవి?

శిష్యుడు : ఏకాదశి, ప్రదోషం, శివరాత్రి మొదలగు అనేక వ్రతముల క్షేత్రోపవాసములై ఉన్నవి.

గురువు : మీరు ఏకాదశి మొదలైన అనేక వ్రతములని చెప్పినారుగదా? ఇవి ముక్తికి కావలసినవియైన ఒకటియే చాలును. అనేకము కావలసినదిగి లేదు. ఉండనిమ్ము. ఈ విధము అయిన వ్రతములను ఏ విధమున అనుష్ఠించి

వచ్చుచున్నారు?

శిష్యుడు : చెప్పెదను వినుడు. ఏకాదశి వ్రతమును అనుష్ఠించి వచ్చుట యెట్లనగా, కొందరు ఆ దినమున ప్రాతః కాలమున లేచి స్నానము చేసి, గంధముపూసికొని, విష్ణునామములను జపించి, విష్ణు క్షేత్ర దర్శనము చేసి,



బియ్యము, మినుములు, మొదలగువాటిని ఉపేక్షించి, కొబ్బరినీళ్లు, పండ్లు మొదలగువాటిని తృప్తికరముగా భక్షించి, ఏకాదశి మహాత్మ్యము మొదలగు గ్రంథ పారాయణము చేసి పగటి సమయమును గడుపుట. రాత్రి సమయమున కొందరు నిద్రించకయు, కొందరు నిద్రించి ఉండుటయు కద్దు. ప్రదోష వ్రతమును అనుషించి వచ్చుటెట్లనగా, ఆ దినమున పాతఃకాలమున లేచి స్నానము చేసి, విభూతి రుద్రాక్షములను ధరించుకొని, శివనామసంకీర్తనలను పాడి, శివక్షేత్రములను దర్శించి, పగటి సమయమున ఏదొక ఆహారాదులను భుజించక, త్రిసంధ్యా ప్రదోషసమయమున అనగా సూర్యుడస్తమించి పగలు రాత్రియు కూడి సంధించు సమయమున స్నానము చేసి, శివక్షేత్రదర్శనము చేసి, పూజనైవేద్యములచేసియు, చేయించియు, నైవేద్య ఉచ్ఛిష్టములను భుజించి, నిద్రించుచున్నారు. శివరాత్రివ్రతమనగా, సంవత్సరమున ఒకటే యుండుట. ఆ దినమున ప్రాతఃకాలమున, స్నానము చేసి, విభూతి, రుద్రాక్షములను ధరించియు, శివక్షేత్రములకు వెళ్ళి దర్శన ప్రదక్షిణములను చేసియు, పగలంతయు నిరాహారుడై శివనామములను జపించి, శయనప్రదక్షిణ (అనగా కన్నుకట్టి పరుండి దొర్లి క్షేత్రమును

కుడివైపై చుట్టివచ్చుట) మొదలగువాటిని చేసియు, రాత్రి శివపూజయైన పిమ్మట కొందరు అభిషేక యుచ్ఛిష్టము మాత్రమును భుజించియు; కొందరు పలువిధములైన పలుపదార్థములను భుజించియు, ఒక్కొక్క పురాణ



ములను చదివియు, పలువిధములైన ఆటలను ఆడియు, ఆ రాత్రియంతయు నిద్రించక యుంటున్నారు.

గురువు : ఈ విధమైన వ్రతములుండు దినమున వారు చెప్పిన ప్రకారముగల ప్రవర్తనములుగాక వేరేదైన ప్రవర్తనలను చేయుటకలదా?

శిష్యుడు : వారు వారు ప్రతిదినము చేయు అన్ని ప్రవర్తనలను చేయుచున్నారు.

గురువు : అయిన పై జెప్పిన వ్రతములు మొదలగు దినములందు బియ్యము మొదలగు కొన్ని పదార్థ ములనువిడిచి, వేరే పదార్థములతో చేయబడిన ఫలహారములను తృప్తిగా భుజించి, ప్రతిరోజు నడచివచ్చు ప్రవర్తనములను చేసిన మోక్షము దొరుకు ఎడల, కొన్ని ప్రదేశములలో నుండు ప్రజలు ప్రతిదినము, గోధుమ, రాగి, సజ్జలు, జొన్నలు, మొదలగువాటితో చేయబడిన ఫలహారములను తృప్తిగా భుజించి నిత్యప్రవర్తనములను చేసికొని వచ్చు చున్నారు. అట్లు చేయువారలకును మోక్షము దొరకవలయును గదా? ఈ విధములగు వ్రతములను జనులు అంధ విశ్వాసమున అనుష్ఠించి, ఏదొక యోచన లేక వారి వారిలోనుండు

అధోగతిగా జేసి, నాశనము చేయుటగాక యదార్ధ తత్వమును గ్రహించి వారి వారికి మోక్షము దొరకుటకున్న మార్గమును చూడక నశించిపోవు చున్నారు.

అయిన ఏకాదశి వ్రతమనునది ఏదనగా, తన



లోపలనుండి దశేంద్రియములమార్గమై బయటకు వ్యాపించు శక్తిని తనలో తానే ఒకటై నిలుపుటకే అనగా కన్నులతో చూచి తెలిసికొనుటకు, చెవులతో విని తెలియుటయు, ముక్కుతో వాసన చూసి తెలియుటయు, నాలుకతో రుచి తెలియుటయు వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ, వీటి వృత్తులను తెలియుటయుమయిన మనశక్తిని మనలోనే ఒకటిగా అణగించినిలుపుటయే ఏకాధశి వ్రతము. అయిన ఈ ప్రవర్తనలను తెలియచేయు తెలివి ఏదనగా, తనలోపలనుండు జీవశక్తి పై జెప్పిన వాక్కు మొదలయిన ఐదు ఇంద్రియములతో ఉద్భవించిన శక్తి నుండి పైన జెప్పిన కన్ను మొదలగు ఐదు ఇంద్రియములమార్గమై బయటయందు వచ్చి తెలియుట ఇదో ఏదే అయిన మనము కన్ను మొదలగువాటినుండి తెలిసికొను తెలివియు, చేతులు, కాళ్లు మొదలగువాటితో చేయు ప్రవర్తనలు ఏ విధమున కలుగుటయనగా, మనము నిద్రయని చెప్పు అవస్థతో నుండక, ప్రవర్తనయై యుండు స్వప్నము నందుండుటవలననే కలుగుట. ఎప్పుడు ప్రవర్తనయును స్వప్నమును విడిచి నిద్రయను

అవస్థల నుండునప్పుడు, ఆ సమయమున పై జెప్పిన
దశేంద్రియములనుండు ఏదొక తెలివియు, ప్రవర్తనలును
ఉండుటలేదు. తెలివికి దశేంద్రియములు ఉత్తర వాదులు
కావు మనస్సే ఉత్తరవాది. ఆ మనస్సు ఉద్భవించుటకు
కారణముపై జెప్పిన శ్రోత (చెవులు), చక్షు (కన్ను)
మొదలయిన పంచేంద్రియముల మూలముగా జీవ



శక్తియై కర్మముగా యుండు వాయువు బయటకు వ్యాపించి ఉండుటవలన, కావున అది కలుగు ఉద్భవస్థానమైన బ్రహ్మరంధ్రమునందు జీవశక్తియై చలించుకొని యుండు వాయువును అల్లాడుటకు విడువక నిలుపుటయే ఏకాదశీ వ్రతము.

శిష్యుడు : స్వామి! ఈ యైదు ద్వారములు జ్ఞానేంద్రియముల నియు, వాక్ , పాణి, పాద, పాయు, ఉపస్థ వీటికి కర్మేంద్రియములనియు లోకమున చెప్పుచున్నారు. ఇప్పుడు స్వామివారు చెప్పునది విపరీతముగా నున్నవి గదా!

గురువు : చర్మము, కన్ను, చెవి, ముక్కు, నోరు ఇవి జ్ఞానేంద్రియములనియు, తక్కినవి కర్మేంద్రియముల నియు చెప్పుటకు కారణమేమి?

శిష్యుడు : చర్మము, కన్ను, ముక్కు, చెవి, నోరు, వీటిలో ఒక్కొక్క దాని నుండి తాకుట, చూచుట, వాసన, వినుట, రుచి తెలిసికొనుట; యీ ప్రకారముగా తెలిసికొనుటవలన వీటికి జ్ఞానేంద్రియములనియు, వాక్, వాణి, పాద, పాయు, వుపస్థ; వీటి వలన కర్మములను చేయుటవలన కర్మేంద్రియములనియు చెప్పుట.

గురువు : కర్మమనగా ఏమని మీరు గ్రహించి యున్నారు?

శిష్యుడు : లోకమున కర్మమనునది ప్రవర్తనయని, గ్రహించి వచ్చినది తప్పనియు, కర్మము అనునది ఒక వస్తువనియు, అది వాయువనియు, ఇప్పుడు విశదమైనది.



గురువు : అయిన చర్మము, నోరు, ముక్కు, కన్ను, చెవి మొదలగువాటివలన జ్ఞానము కలుగుటలేదు. అవి జ్ఞానమునకు బాధ్యపడినవి కావు. ఇవి పురమైన జడమునకు ద్వారములు, కిటికీలు అయి ఉన్నవి. కర్మమై, జీవశక్తియైన వాయువు, పరమాత్మయైన వాయువగు విష్ణువు బైట నుండి గతాగతము చేయుటకున్న ముక్కు, నోరు, మొదలగు ద్వారములు, కన్ను , చెవి, మొదలగు కిటికీలును అయివున్నవి. కాబట్టి వాటికి ఏవిధమైన బాధ్యతయు తెలివియులేదు. అదియునుగాక వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థము ఇవి ఏవని మీరు గ్రహించితిరి?

శిష్యుడు : అవి నాలుక, చేతులు, కాళ్ళు , గుదము (అనగా మలద్వారముతో చేరియున్నది) ఉపస్థమనగా స్త్రీలయొక్క మూత్ర ద్వారమనియు లోకమున చెప్పుచున్నారు.

గురువు : అయిన ఇదియంతయు తప్పై ఉన్నది. ఇవి యన్నియు ప్రవర్తన చేయుటకున్న ఆయుధములు, స్థలములు అయి ఉన్నవి. ఎందువలననగా, నవ ద్వారములు; ఐదు ఇంద్రియములను అన్ని జీవరాసులకును ఉన్నవి. మీరు చెప్పు ప్రకారమే అయిన స్త్రీలకు, పురుషులకు ఇవి అన్నియు ఉండుట లేదు.

ఎట్లనగా నవద్వారములనుగురించి మునుపు చెప్పి వుంటిమి గదా! అందు లింగమనునది మూత్రద్వారము కాదనియు, ఈశ్వరలింగమనియు, అది నవద్వారములకు చేరినది కాదనియు, నవద్వారములు ఇటు వంటివనియు



చెప్పియుంటిమి గదా? ఆ లింగము స్త్రీ , పురుషులకు ఉన్నదని చెప్పబడినది గదా? ఇప్పుడు మీరు చెప్పునది , వాక్, పాణి, పాద, పాయు, వుపస్థము; వీటిలో పాయు అనునది గుదమనియు, వుపస్థము అనునది స్త్రీలమూత్రద్వారము అనియు గదా? అట్లుండునప్పుడు నవద్వారములతో చేరిన గుదమునకు కర్మేంద్రియ ములతో చేరిన పాయు అని చెప్పునది. ఇట్లు ఆలోచించునప్పుడు ఏ విధమునను వచ్చుటకు వీలులేదు. ఎందువల్లననగా, ఇద్దరున్నపుడు రెండు వస్తువు లుండవలెను. కారణమేమనగా, గుదము యొక్క పని వేరుగాను, పాయు యొక్క పని వేరుగాను ఉన్నది. రెంటికి ప్రవర్తన వేరువేరుగా నుండుటవలన రెండు వస్తువులు గదా ఉండవలెను, కాని పాయును మనము చూడవీలులేదు. ఉపస్థము మనకు లేదు. అట్లు వచ్చుటకు వీలుండునా ? పంచేంద్రియములు ఇట్టివని లోకమున తెలియుటలేదు. అవి మీరు చెప్పినవి కావు. అది ఎట్లనగా గుదము, ఉపస్థము, లింగము, ఇవి గోప్యమైనవి. అనగా రహస్యమైనవనియు లోకమున చెప్పివచ్చుచున్నారు. ఇప్పుడు లోకమున చెప్పుచున్న

పురుషుడనుటకు గుర్తు ఐన మూత్ర ద్వారము లింగమనియు, స్త్రీలకు గుర్తు ఐన మూత్రద్వారము ఉపస్థమనియు, లోకమున సర్వజీవులకు మలవిసర్జన చేయుటకున్న మలద్వారమును గుదమనియు చెప్పు చున్నారు. ఇది తప్పై ఉన్నది. ఎందువల్లననగా, ఇవి



రహస్యమైనవి కావు. బహిరంగమై, బయటకనబడు చున్నవి. వీటిని ఇప్పుడు రహస్యమని చెప్పుటకు కారణము వస్త్రమును కట్టి మరగుపరచినందువలన. మరుగు చేసి ఉంచినవి రహస్యముకాదు. ఎందువలననగా, మనము పుట్టునప్పుడు మరుగులేదు. అప్పుడు బట్టబయలై బయటయే యున్నవి. వాటిని 4 లేక 5 సంవత్సర ములతరువాత వస్త్రముకట్టి మరుగు చేయుచున్నాము. కాబట్టి ఇప్పుడు పైన చెప్పినవి, ఇప్పుడు చెప్ప బడుచున్నవిగాదు. కాబట్టి ఇప్పుడు పైన చెప్పినవి జనించునప్పుడే రహస్యమై ఉండునటువంటివి. ఎట్లనగా, వివరించి చెప్పెదను. వాక్ అని చెప్పబడునది శబ్దమును, పాణియని అన బడునది పరమాత్మమయిన మనస్సుగు విష్ణువు యొక్క నాలుగుచేతులు ఆయి ఉన్నవి. చేతులందు నాలుగు ఆయుధములు ధరించివున్నది. అవి శంఖము, చక్రము గదా, పద్మము, ఇవియే. అందు శంఖమువల్ల ఉపయోగమేమి?

శిష్యుడు : శబ్దము

గురువు : చక్రము వలన ఉపయోగమేమి?

శిష్యుడు : శత్రువులను సంహరించుటకు.

గురువు : గదవల్లనో?

శిష్యుడు : శత్రువులను నాశనము చేయుటకు.

గురువు : పద్మమువలననో?



శిష్యుడు : అలంకారముకొరకు పట్టుకొనుట.

గురువు : కాని మీరు చెప్పినట్లు గాదు వాటి స్థితులు. శబ్దమును వినుటకు చెవి. ఆ చెవియే పరమాత్మమయిన మనస్సగు విష్ణువు యొక్క ఒకచేయి. చక్రమును నది తిరుగుచున్నది. ఆ మనస్సు తిరుగుచున్నందువలననే పలువిధములుగా చూచుటకు కారణమైనది. గదయనగా గతి చేయునది అనగా నటనము చేయునది. అదియేదనగా మన జీవశక్తియైన వాయువు. అందుకు రాకపోకలు వారికి ముక్కె ఉన్నది. ఆ ముక్కుయే పరమాత్మమయిన విష్ణువు యొక్క ఇంకొక చేయి. పద్మము అనునది జీవశక్తియైన వాయువు బయటకు వచ్చినప్పుడు నేనను అహంకారమైన (తామర) పద్మము కలిగినది. అనగా అక్షరమైన నేను ఆకాశమై అప్పుడు అది తామరయయిన హృదయకమలము అగును. అది నోటి మార్గమై ఉన్నది. అదియే పరమాత్మయయిన విష్ణువు యెుక్క మరొక చేయి పాణియని చెప్పునది. పరమాత్మయు, మనశ్శక్తియు అగును. అప్పుడు పైన జెప్పిన నాలుగు చేతులుగా పరమాత్మమయిన మనస్సే బయటకు వ్యాపించునది. పాదమనునది స్వస్థానము.

అనగా స్వంత స్థానము. పాయు అనగా ఊట ఉండు స్థలము. ఉపస్థమనగా ఉపస్థితి ఉండునది. అనగా ఉప + స్థితి; ఉప = చేరునది; స్థితి = స్థిరపడి ఉండునది. అది దేనితో ననగా లింగముతో స్థిరముగా చేరివుండునది. ఆ లింగమునే ఈశ్వరలింగము అని చెప్పుట. అది



మన భ్రూమధ్యమున వుండునది. ఆ లింగములో ఉపస్థములో నున్నది. అందువలననే ఉపస్థము అని చెప్పుటకు కారణము. ఉపస్థమనునది ఏది అనగ ఉత్పత్తి స్థానము. ఆ ఉత్పత్తి ఎక్కడ నుండి కలుగుననగా అది స్త్రీలమూత్ర ద్వారము నుండి కాదు. ఆ మూత్ర ద్వారము బయటకు వచ్చుటకై ఉన్న ఒక ద్వారము. ఏది వచ్చుట అనగా శిశువు వచ్చుటకు, ఆ శిశువు యొక్కడ నుండి యనగా స్త్రీ యొక్క గర్భము నుండి. స్త్రీ గర్భమునందు శిశువులేనియెడల బయట వచ్చుటలేదు. కాబట్టి అది ఉత్పత్తి స్థానముకాదు. ఆ బిడ్డ కడుపులో కలుగవలెననిన శుక్ల శ్రోణితము ఉండియుండవలెను. శుక్ల శ్రోణితము యెక్కడ నుండి కలుగు ననగా స్త్రీయును, పురుషుడును చేరు సంయోగము నుండి.ఆ సంయోగము వలన కలుగు శుక్లము బ్రహ్మమగును. ఆ బ్రహ్మమైన శుక్లము సంయోగము వలన సంయోగద్వారము గుండా కుంభి, భాగ, నరకమునందు చేరిపడుటయు, ఆ కుంభి భాగ నరకమునుండి బయటకు వచ్చుటకున్న నరక ద్వారమే స్త్రీలసంయోగస్థలము. అనగా మూత్ర ద్వారము.అది

ఎట్లనగా, లింగమూలమునందున్న బ్రహ్మ స్వరూపమైన శుక్లము సంయోగము వలన పై జెప్పిన ప్రకారము కలుగును. దానికి దృష్టాంతము. మీరు శివక్షేత్రమునకు పోయివుంటిరా?

శిష్యుడు : నేను పోయి వుంటిని.



గురువు : ఆ శివక్షత్రమున ఏమి వున్నది?

శిష్యుడు : శివలింగమున్నది.

గురువు : అది దేనిలో ఉండును?

శిష్యుడు : అది క్షేత్రములోపలరాతితో ఒక పీఠమును చేసి ఆ పీఠమునకు యోని ఆకృతిగా ఒక గొయ్య చేసి ఆ గోతి యందు లింగము ప్రతిష్ఠ చేయబడి ఉన్నది.

గురువు : అప్పుడు లింగము యెక్కడ ఉండును?

శిష్యుడు : యోనిలో నుండును.

గురువు : అప్పుడు లింగము యోనియందుండుట వలన దానికి ఉపస్థమని చెప్పుట. అట్లుండుట లింగముపైన అభిషేకము చేయునట్లయిన దానిలో ద్రావకరూపమైనది ఏదైనను ఈ చిత్రము నందు కనబరచిన ప్రకారము అది వూట




వచ్చు స్థలమున పాయువనియు, అది క్రిందపడు చోటు గుదమనియు పేరు. అది యెక్కడ నుండి అనగా, అది స్థానము నుండి అనగా పాదము నుండి, అందువలన వాక్, పాణి, పాదము, పాయు, ఉపస్థము అనునవి ఇవియే. ఇవి

జ్ఞానేంద్రియములు అనగా పాదము యను స్వస్థానము నుండి పరమాత్మయైన విష్ణువు మనశ్శక్తియై నాలుగుచేతులై పురము నందు పాయు యను స్థలము నుండి వూటయై గుదముమార్గమై బయటకు వచ్చుట వలన ఆ నాలుగు చేతులను చేర్చి జీవశక్తిని ఆ గుదము



నందు పైన ఉద్భవస్థానమునకు తీసికొనిపోయి చేర్చునప్పుడే జ్ఞానము కలుగుట. అది యెట్లనగా, చెవులతో విని తెలిసికొనుటయు, కన్నులతో చూచి తెలిసికొనుటయు, ముక్కుతో వాసన తెలిసికొనుటయు, మరియు దోవ ఉండునదియు, నోరువలన ఆహారమైన ఆకాశమును కలుగజేసి పలువస్తువులను కలిగించి తీరునదియు అయిన నాలుగుదోవలగుండా బయటకు వదలక తనలోనే అంతర్యమైయున్న గుదమార్గమై అనగా తనలోపలమార్గమై తనయొక్క ఉత్పత్తి స్థానము నందు పోయి చేరునప్పుడే మనకు జ్ఞానము కలుగుట. అనగా మునుపు జెప్పిన నాలుగు చేతులను పోనివ్వక తనలోపల అణగించునప్పుడే జ్ఞానము కలుగుట. అందువలననే జ్ఞానేంద్రియములని పేరు అదిగాక మీరు చెప్పిన నాలుక, చేయి, కాలు, గుదము, మూత్ర ద్వారము ఇవి ఏవియు కర్మేంద్రియములుగాని, జ్ఞానేంద్రియము లుగాని కావు. అవియన్నియు పనులు చేయుటకున్న ఆయుధములు, స్థలములునై వున్నవి.

అట్లుండు మనస్సు దాని స్వస్థానము నందు స్థితి చేయునది. ఆ ప్రకారముగా స్థితి చేయు మనస్సే విష్ణువని

చెప్పుట. ఆ విష్ణువు అనంతశయనుడై వున్నాడు. అనంతశయనుడనగా, ఆద్యంతము; బయట, లోపల యను అవస్థలు లేని పదవియయి వున్నది. అనగా, తనలోనుండి చలించుచున్న మనస్సు చలించక స్వస్థానమునందు లయించు అవస్థయే. ఇందు వలననే



యేకాదశీవ్రతము అనుష్ఠించిన విష్ణుపదము ప్రాప్తించునని చెప్పుటకు కారణము. ప్రదోషమనునది, త్రయోదశి కూడినదినమని చెప్పియున్నారు. గాని దాని యదార్థము, దశేంద్రియములచేత తనశక్తి, సత్త్వ, రజ, తమో గుణములై బయటయందు వ్యాపించుదానిని, పై జెప్పిన మూడు గుణములచే అంతర్యమున లేక, లోపలనుండు జీవుడైన శివుని ఐక్యపరచుటమై ఉన్నది. శివరాత్రియు, అదే ప్రకారమే. బాహ్యమనగా బయట యందు మూడువిధములైన మాయయందు ప్రకాశించిన ప్రకాశమును, అంతర్యము నందు జీవుడై యుండు శివునితో యైక్యపరచుటయే.

శివరాత్రి వతములస్థితులు ఇలాగున్నవి అయిన శివరాత్రి యనియు చెప్పుచున్నారు. అయిన సంవత్సర మున రాత్రి, పగలై మున్నూటయిరువదియైదు దినము లున్నవి. వాటిలో ఒక దినము రాత్రి మాత్రమే శివునికి రాత్రియనియు, మిగత దినములన్నియు పగలని ఎప్పుడును నమ్ముటకు వీలులేదు. ఎందుకనగా పగలు ఎంతసమయమో అంత సమయము రాత్రి కద్దు. వీటిలో మున్నూటయిరువది నాలుగురాత్రి, పగలు చేరినది

శివునికి పగలుగను, మున్నూటయిరువదిపైదవ దినమైన ఒకటేదినము రాత్రిమాత్రము శివునికి రాత్రిగా వుండుటకు కారణములేదు. దీనిని ఆలోచించక, ఏకాదశియనియు, ప్రదోషము అనియు, శివరాత్రియనియు, వినియు, నేర్చుకొనియు, శాస్త్రాదులయందుచదివియు, దాని ఏదొక



తత్వమును తెలియక, అర్థమును తప్పుగా గ్రహించి, ఏదైన కొన్ని సంగతులను జనులు చెప్పి చూపుచున్నారని మాత్రమే, చెప్పవలసినదిగా నున్నది. అయిన వ్రతములు మాత్రముకాదు. లోకములో, దానిలో నడచునటువంటి అన్ని అవస్థలు తన మనశ్శక్తి బయటయందు వ్యాపించి ఆ శక్తియందు ఉద్భవించినదై వున్నది. కావుననే తనశక్తిని బయట యందు విడువక, తనలో తానే ఉంచినట్లు చేసి, తానే తన్మయమగుటకున్న మార్గమును కనిపెట్టి, ఆ మార్గము గుండా తనశక్తిని మునుపు జెప్పినవిధమున లయింపజేసి తానై తన్మయము అయి ఉండుటయు. దీనికే మోక్షమని చెప్పుట. ఇదిగాక, మీరు చెప్పిన ప్రకారము ఏకాదశి మొదలగు పలువ్రతములని అనుష్ఠించి, తన నిత్య భక్షణములను విడచి, సాధారణముగా తినుసమయమును తప్పించి, ఏదేదో భక్షణములను భుజించి, కడుపు నింపి వ్రతమని జెప్పుకొని యుండుటవలన, ఏదొక ఫలమును దొరకకయు, ఏదొక తత్వమును తెలియకయు, తనశక్తి అధోగతియై నశించిపోవుటకు కారణమగుచున్నది.

శిష్యుడు : వ్రతములు గురించి ఈ విధమైన క్షేత్రము మొదలగువాటిలో ఉపవాసము చేయుట గురించి ఏలాగని చెప్పవలయును?

గురువు : క్షేత్రములు మొదలగు వాటిలో ఉపవాసము చేయునదొకటి మీరు చెప్పిఉన్నారు గదా? అయిన ఎన్ని



క్షేత్రములన్నవి? ఉపవాసమనగా నేమి?

శిష్యుడు : అనేక క్షేత్రములున్నవి. వాటిలో ఆహారము లేకుండ ఉండుటయే ఉపవాసమని చెప్పబడుట.

గురువు : ఆ క్షేత్రములు ఏవి?

శిష్యుడు : శివ, విష్ణు, గణపతి, సుబ్రహ్మణ్య, అయ్యప్పన్, భగవతి, మొదలగు అనేక క్షేత్రములున్నవి.

గురువు : వాటిలో యేయేమి వుంటున్నవి?

శిష్యుడు : వాటిలో సంకల్పించి ప్రతిష్ఠ చేసియుండు దేవతలున్నవి.

గురువు : వాటిలో దేనిని ప్రతిష్ఠచేసి వుండుట?

శిష్యుడు : బింబములను చేసి, వాటిని ఈశ్వరుడని సంకల్పించి, ప్రతిష్ఠ చేసి వుండునటువంటివి.

గురువు : బింబము దేనితోచేయబడినది?

శిష్యుడు : లోహములు, శిలలు మొదలగువాటి నుండి.

గురువు : ఏయే లోహములనుండి? మరియు ఏయే

శిలలనుండి?

శిష్యుడు : బంగారము, వెండి, తామ్రము, ఇనుము, సీసము వీటినుండియు, పాతాళాంజనమునుండియు, కత్తిర రాయి నుండియు, వనన, టేకు మొదలగు మ్రానులనుండియు.



గురువు : లోహములు, శిలలు, మ్రానులు వీటి నుండి, ఈశ్వరుని కల్పించుట ఎవరు?

శిష్యుడు : లోహములతో కంసాలి, కమ్మరి, శిలలతో శిల్పి, మ్రానులతో వడ్రంగి మొదలగువారు.

గురువు : అప్పుడు మొదట కలిగినది ఈశ్వరుడా? లేక వారిని కల్పించినవారా?

శిష్యుడు : ఈశ్వరుడే మొదట కలిగినది.

గురువు : అయిన, పై జెప్పినవారు ఏ విధమున ఈశ్వరుని కల్పించుట మరియు కంసాలి మొదలగువారు లేని యెడల మనము ఈశ్వరునిభజించుటకు సాధ్యమగునా?

శిష్యుడు : దీనిని గురించి ఆలోచించునప్పుడు వడ్రంగి మొదలగువారే మొదట గలిగినవారని చెప్పవలసినది.

గురువు : అది ఏలాగో ఉండనిమ్ము. మనకు ఈశ్వర సేవ చేయుటకుగాను పై జెప్పినవారే కల్పించి, స్థాపించినదై ఉన్నదా!

శిష్యుడు : అట్లు కాదు. భక్తులు, ఈ విధముననే చేయించి,

బ్రాహ్మణులచు ప్రతిష్ట చేసి పెట్టినదై వున్నది.

గురువు : అప్పుడు ఈశ్వరుడు కలుగుటకు మునుపే పై జెప్పిన వడ్రంగి మొదలగు భక్తులు, బ్రాహ్మణులు, కలిగివుండినారని తెలియవచ్చుచున్నది. అదేలాగో ఉండనిమ్ము. బ్రాహ్మణులు ప్రతిష్ఠించునదని చెప్పినారు



గదా? వారు ఈశ్వరుని ప్రతిష్ఠించుట ఎట్లు?

శిష్యుడు : అష్టగంధము పొడిచేసి, రుబ్బి, చేర్చి, క్షేత్రములందు మూలస్థానములో పై జెప్పిన బింబములను పెట్టి పై జెప్పిన అష్టగంధములను కట్టి దానిలో బ్రాహ్మణుడు ప్రాణప్రతిష్ట పూజ నైవేద్యములు మొదలగు వాటిని చేయుటయై వున్నది.

గురువు : ఈ విధముగ చేయు పూజ, నైవేద్యము మొదలగువాటిని ఈ బింబములు తెలిసికొనుటయు, తినుటయుకద్దా?

శిష్యుడు : కద్దు అనియే నమ్మకము.

గురువు : ఇది వరకు పై జెప్పిన భక్షణాదులను ఏదైన ఒక బింబము భుజించినది మీరు చూచినదైనను, తెలిసినదైనను కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : ఆ బింబము ఏదయిన శబ్దము చేయుచున్నదా?

శిష్యుడు : ఏ శబ్దము చేయుటలేదు.

గురువు : అదిగాక మ్రాను తునకచే చేయబడినదీ ఈశ్వరు డనగా ఈ కనబడు స్తంభము, రోలు మొదలగునవి ఈశ్వరుడు కాడా? మీరు వాటిని భజించవలసినది కదా? ఒకే మ్రానులోని యొక తునకనుండి ఈశ్వరుడనియు, మరొక తునక నుండి రోకలి, రోలుగను చేయబడినదై



వున్నది. కావున వాటిని భజించినవాటికి నమస్కరింపవల యును గదా? నాలుగు వస్తువులను మ్రాను తునకనుండి ఒకడే చేసినది. మీరు యే కారణముచే రోలు, రోకలి మొదలగువాటిని భజించి వాటికి నమస్కరించుట లేదు?

శిష్యుడు : అది యొకరూపముగా చేయబడినది కానందున.

గురువు : అప్పుడు ఈశ్వరరూపమును కల్పించిన వాడు వడ్రంగి తెలియవచ్చుచున్నది. అట్లయిన వానిని కల్పించిన వడ్రంగి వానిని కదా భజింపవలసినది?

శిష్యుడు : ఆ వడ్రంగికి రూపమును మాత్రము చేయుట కగుచున్నది. దానికి కావలసిన ప్రాణప్రతిష్ఠ, పూజ, నైవేద్యము మొదలగువాటిని జేసి, స్థాపించిన సమయమున మాత్రమే దానికి శక్తి కలుగుచున్నది.

గురువు : ఆ విధమున చేయువారెవరు?

శిష్యుడు : బ్రాహ్మణులు

గురువు : అయిన బ్రాహ్మణులను భజించినచాలును గదా? మ్రాను రాళ్ళు, లోహము మొదలగువాటి నుండి చేయబడిన బొమ్మలను భజించవలయునా?

శిష్యుడు : స్వామీ? ఆ ప్రతిష్టకు ఏదొక శక్తియు లేదనియా చెప్పుట.

గురువు : ఎట్లనగా, ప్రాణప్రతిష్ట చేయుటనగా, ప్రాణమును స్థాపించుట అనగా స్థిరపరచుట అని అర్థము, ప్రాణుడను



నది తనలోపలతానే ఉండువస్తువు అలాగున్న లోపల నుండు ప్రాణుని, లోహము మొదలగు వాటినుండి చేయబడి వుండు బొమ్మలలో ప్రతిష్ఠించుటని చెప్పుట వలన, ఆ ప్రకారము ప్రతిష్ఠించినవారలప్రాణము అప్పుడే నశించి, అప్పుడే వారు శవమై ఉండవలయును. ఆ ప్రకారము ప్రతిష్ట చేసినప్పుడే ఎవరయినను శవమై పోయినారని మీరువినినదో, తెలిసికొన్నదో, చూచినదో కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అనగా తనలోపలనుండు ప్రాణుని పై జెప్పిన బొమ్మయందు ప్రతిష్టచేసి దానికి శక్తినిచ్చు సామర్థ్య ముగలయొకడుండినట్లయిన దీనికన్నను ఉత్కృష్టమైన గుణము లోకమున కలిగియుండుటకు చోటున్నది. అదేమనగా, లోకమున అనేకులు చనిపోవుచున్నారు చనిపోవుటని చెప్పుట ప్రాణము నశించిపోవుట గదా? ఆ ప్రకారము ప్రాణము నశించి సమయమున పై జెప్పిన బొమ్మయందు ప్రాణమును ప్రతిష్ఠించుటకు శక్తిగలవారు, చచ్చి పడివుండు జడము నందు ప్రాణ ప్రతిష్టచేసి దానికి

ఉండనిమ్ము. పై జెప్పిన ప్రకారము ప్రతిష్ఠించివుండు స్థలమునకు పోవునప్పుడు మీ విచారము అచ్చట ఎవరుండుటని?

శిష్యుడు : ఈశ్వరుడున్నాడని.



గురువు : అయిన మీరచ్చటికి వెళ్ళి ప్రతిష్ఠకు ఏ విధమున నమస్కరించుచున్నారు? నమస్కరించు సమయమున మీ సంకల్పమేమి?

శిష్యుడు : నా రెండు చేతులను చేర్చి పట్టి నా హృదయము మీద వుంచి నమస్కరించుచున్నాను. ఆ ప్రకారము నమస్కరించు సమయమున నా ఈశ్వరుడేనన్ను రక్షింపవలయునని ప్రార్థించుచున్నాను.

గురువు : అట్లు మీరు చెప్పుట గొప్ప తప్పు. అదెందుకనగా మీ రచ్చటకు పోవునపుడు దేవాలయము నందు ప్రతిష్ట చేయబడిన బొమ్మయైన ఈశ్వరుడని మీ సంకల్పము. ఆ ప్రకారము సంకల్పించినందుననే మీరచ్చటకు పోవుటకు కారణమైనది. ఆలాగున సంకల్పించిన అవస్థకు "నా ఈశ్వరుడు" అని చెప్పి వారివారి హృదయమున చేతులను వుంచి నమస్కరించుట సరిగాదు. ఆ ప్రతిష్టకాబడిన బింబము హృదయమున చేతులను వుంచి దేవస్థానమున ప్రతిష్ట కాబడిన ఈశ్వరా! అని సంకల్పించి నన్ను రక్షింపవలయునని ప్రార్థింపవలసినది. ఆ ప్రకారము చేయుటలేదు. కారణమేమనగా, మీ లోపలనున్న

ఈశ్వవ్వరుడు, మీ శక్తి బయటయందు వ్యాపించి మీ యందు సంకల్పింపబడుచున్నది. ప్రతిష్టయందు ఏదొక శక్తియులేదు. ప్రాణప్రతిష్ఠ చేసివున్నదని చెప్పవలయుననన్న, ప్రతిష్ట చేయువారు పై జెప్పిన బింబములను తీసి మరొక సహాయము లేక తన ప్రాణము నుండి మాత్రమే స్థాపించి



ఏదొక చలనము లేక నిలుపవలసినది. అట్లుగాక సీమసున్నముచే చేయబడిన సిమెంటునుండి లేక అష్టగంధముచే కట్టకట్టిపరిచి నిలుపుటకు ప్రాణ ప్రతిష్టయని చెప్పుట కగుటలేదు. అదెట్లనగా, ఇదిగో చూడుము. ఈ నిలబడు తలుపుద్వారబంధము ఎవరు చేసివది?

శిష్యుడు : వడ్రంగి.

గురువు : దానిని స్థాపించిన దెవరు?

శిష్యుడు : గృహమును కట్టు శిల్పి.

గురువు : అదెట్లు స్థాపించుట.

శిష్యుడు : ఆ ద్వారబంధమును నిలిపి, రాళ్ళు, సున్నముచే కట్టి స్థాపించుట.

గురువు : అయిన, ఈ కనబడు ద్వారబంధము ఒక వడ్రంగిచే చేయడినది. దానిని శిల్పులైన రాళ్ళ పనివారు కట్టి స్థాపించులాగుననే, బింబములను చేయుటకు తెలిసిన వారిచే చేయబడి, దానిని కట్టి, నిలిపి, స్థాపించుటకు తెలిసినవారిచే అష్టగంధము, సిమెంటు మొదలగువాటిచే

కట్టించి, స్థాపింపబడియున్నది. ఈ విధముగా స్థాపించియుండు బొమ్మలనే; ఈశ్వరుడని చెప్పి మనము భజించు చున్నాము. అదేలాగనగా, మన యొక్క చేతివ్రేళ్ళను గుంటగా చేర్చిపట్టి, దానినుండి ఐదు వ్రేళ్ళ సందులమార్గమై, బైట భాగము నుండి మోచేయివరకు



జలము పారుచున్నది. అట్లు పారుచుండు జలమును నాకుటకు ఆశతో చేతిని త్రిప్పి, బైట చేతిలో పారు జలమును నాకునప్పుడు, చేతిలో నుండు పాయసము బోర్లగింపబడి లేకపోవుచున్నదిగదా? ఇది మాత్రము కాదు. మరలనాకుటకు వెలుపలచేతిలో జలమును లేక పోవుచున్నది. ఏలననగా, పాయసము నుండియే అటువంటి జలము పారుచుండినది. అటువంటి జలమును మోహించి, పాయసమును చూడక, బైట చేతియందు పారు జలమును నాకినప్పుడు, జలము ఉద్భవించిన పాయసము పోవును. జలము నందు ఆశ కలిగినందున పాయసము రుచి తెలియుట లేదు. జలము ఉద్భవించిన పాయసమునే మొదట భుజించిన, జలము కారుటకు, పాయసము చేతి నుండి లేకపోవుటకు వీలులేదు. ఈలాగే వానివానిలో నుండు ఈశ్వరుని విడిచి ప్రతిష్ఠ కాబడిన బొమ్మనే ఈశ్వరుడని సంకల్పించి, మనలో నుండు ఈశ్వరశక్తిని ఐదుద్వారములగు పంచేంద్రియ ములమూలముగా బైటయందు పార విడిచి, అది నశించిపోవుచున్నది. అది యెంతో తప్పైయున్నది. ఎట్లనగా, మన హృదయస్థానమైన భ్రూమధ్యములో

నుండు ఈశ్వరుని నుండియే శక్తి ప్రవహించుకొని ఉంటున్నది. ఆ విధముగా ప్రవహించుకొనియుండు శక్తి, ఉద్భవస్థానమును తెలియక, ఈ శక్తిని మోహింపచేసి దానియందు భ్రమించి పై జెప్పిన ఈశ్వరుని పోగొట్టు కొనుచున్నాము. ఈశ్వరుని నుండి ప్రవహించుచుండు



శక్తిని మోహించినందువలన యీశ్వరుని స్థితిని తెలిసి కొనుటకు సాధ్యము లేకపోయినది. శక్తి ఉద్భవించిన ఈశ్వరుని సేవించిన, తనలో నుండు శక్తి ప్రవహించుటకు, ఈశ్వరుడు లేకపోవుటకు కారణములేదు.

కాని ప్రాణప్రతిష్ఠయనునది పై జెప్పినవిధమున ఈశ్వరశక్తిని ప్రవహించుటకు విడువక, ఉద్భవస్థానమై యుండు భ్రూమధ్యమున చరించక నిలుపుటైయున్నది. దానికే ప్రాణప్రతిష్ఠయని చెప్పిరి. పై జెప్పిన విధమున ప్రతిష్ఠ కాబడినదే క్షేత్రము. అదిగాత్రక్షేత్రము. ఆ క్షేత్రమునకు తొమ్మిది తలుపులున్నవి. ఈ ప్రకారము మాత్రమే ప్రతిష్ఠ. అదిగాక, లోహము, పాతాళాంజనము, రాళ్ళు, మ్రానులు మొదలగు వాటి వాటి నుండి బొమ్మలను చేసి, సీమసున్నము నుండికట్టి, గట్టిచేసి, దానిని ప్రాణప్రతిష్ఠ చేసియున్నదని ఏదొక వివరము లేకయు, తన్నుతాను తెలియకయు, తన శక్తినుండి ఇచ్చుట పలు సంకల్పములు చేసియు, పై జెప్పిన శక్తిని తెలియక అధోగతియై, నాశపరచుటయే గాక, లోకమున జనులు క్షేత్రోపవాసము చేయుటలేదు. క్షేత్రోపవాస మనునది క్షేత్రములోపల ఉపశించుటైయున్నది. క్షేత్రము

గాత్రక్షేత్రము ఉపవసించుటనగా, కూడియుండుట, అనగా చేరియుండుటై యున్నది. అనగా జీవేశ్వరోరైక్యము. ఈ విధమున పై జెప్పిన గాత్రక్షేత్రమున, ప్రతిష్ఠస్థలమైన భ్రూమధ్యమున, జీవుని ఈశ్వరునియందు ఐక్యమైన అవస్థకే క్షేత్రోపవాసమనిచెప్పుట.



శిష్యుడు : స్వామి! గాత్రక్షత్రమే క్షేత్రమనియు, దానికి తొమ్మిది తలుపులున్నవనియు చెప్పినారుగదా! ఆ తలుపులేవి?

గురువు : నవద్వారములు.

శిష్యుడు : అప్పుడు ఈ జడమంతయు క్షేత్రమై యున్నదా? జడమునకు కదా నవద్వారము లుండునది?

గురువు : జడమంతయు క్షేత్రము కాదు. జడమున ఒక భాగము మాత్రమే క్షేత్రము. ఈ జడమునయుండు అన్ని ద్వారములు నవద్వారములలో అణగినవి కావు. నవద్వారములనునవి క్షేత్రద్వారములు మాత్రమే.

శిష్యుడు : స్వామి! జడమున ఏ భాగము క్షేత్రము?

గురువు : శిరస్సు మాత్రము క్షేత్రమని చెప్పుటకగుచున్నది. ఎందుకనగా, ఇదిగో చూడుము. మట్టితో కట్టబడియుండు ప్రహరీగోడలుగలయొక పెద్ద తోట. ఆ తోటయందు ఉత్తర తూర్పు మూలలయందు ఒక దేవాలయ మున్నది. ఇతర భాగములు దానికి చుట్టు ప్రక్కలయుండు స్థలము. అలాగే ఈ జడము లోకముగను, జడము యొక్క ఉత్తర భాగము అయినపై భాగమున కనబడు శిరస్సు దేవస్థానమై

యున్నది. ఆ దేవస్థానమైన శిరస్సుననే నవద్వారములు లున్నవి.

శిష్యుడు : స్వామీ! నవద్వారములు శిరస్సునందేయని యెట్లు చెప్పుట?



గురువు : నవద్వారములు ఏవియని మీరు గ్రహించితిరి?

శిష్యుడు : నవద్వారములనునవి రెండు చెవులు, రెండు కన్నులు, ముక్కున రెండు ద్వారములు, ఒక నోరును, ఒక మూత్రద్వారమైన ఒక లింగము మలమలద్వారమైన ఒక గుదము, ఇట్లు తొమ్మిది ద్వారములని నేను గ్రహించియున్నాను.

గురువు : మీరు నవద్వారములందు లింగమనునది మూత్ర ద్వారమనియు, గుదమనునది మలద్వారమనియు, చెప్పినారు గదా? నవ ద్వారములందు ఈ రెండు ద్వారములు మాత్రము శిరస్సు నుండి వేరై జడమున కింది భాగమునను మిగిలిన ఏడు ద్వారములు శిరస్సునందును వచ్చుటకు వీలులేదు. అదిగాక, లింగమనునది అతి శ్రేష్ఠమైనది. దానిని మూత్ర ద్వారమని గ్రహించియుండుట గొప్ప తప్పు. లింగము అనునది శివలింగము. అది మూత్ర ద్వారము కాదు. స్త్రీ, పురుషులని చెప్పబడు అన్ని సృష్టులకును అది యున్నది. అటు వంటి లింగము దేవస్థానమునందు ప్రతిష్ఠించబడియున్నది. అటువంటి దేవస్థానమే మన శిరస్సు. అటువంటి శిరస్సునకే తొమ్మిది

తలుపులు గలక్షేత్రమని చెప్పుట. పై జెప్పిన ప్రకారము మట్టి గోడలనుండి అడ్డగింపబడియుండు తోటలో, ఈశాన్య మూలయందు దేవస్థానమున్నది. ఆ దేవస్థానము లోపలకు పోవుటకు నాలుగు భాగములయందును గోపురములున్నవి. అయిన దేవస్థానము లోపలపోవల



యునిన ఏదైన యొక గోపురపు తలుపును దాటి పోయిన చుట్టంబలము (ప్రాకారము) నకు పోవచ్చును. ఆ చుట్టం బలమునకు మూడు తలుపులున్నవి. చుట్టంబలము లేక లోపలనుండు అంగణము తలుపులను దాటిపోయిన శ్రీ కోవిల(ముఖ మంటపము అను మూలస్థానమునకు ముందుగానుండు నమస్కార మంటపమును చూడ వచ్చును. దానికి నేరుగా ఎదురుగా మూలస్థానమున్నది. మూలస్థానమునకు రెండు తలుపులుంటున్నవి. నమస్కార మంటపము నుండి ఆ తలుపులను దాటిపోయిన మూలస్థానమై యుండు ప్రతిష్ఠస్థలమును చూడవచ్చును.

ఈ విధముననే మన చెవి, కన్నులు గోపురము తలుపులు వాటిని దాటి పోయిన చుట్టంబలమైన పై వాకిలికి పోవచ్చును. చుట్టంబలమనుటకు కారణము, నోరు కంఠయని మూసికొనియుండు సమయమున పై జెప్పిన స్థలమునందు వాయువు నిండి చలించుకొని ఉండుటవలన. ఆ చుట్టంబలమునకు మూడు తలుపులున్నవి. అవి ముక్కున రెండు ద్వారములు,

... ఆ మిట్టంబలమును దాటిపోయిన అచ్చట మూలస్థానమునకు ముందుండు నమస్కార మంటమైన నోటిపై భాగము అయిన అంగళమనియు, అన్నార్ యనియు, (రుచి చెప్పు నీటువంటి) ఒక స్థలమున్నది. ఆ అంగళము నుండి నేరుపై భాగమున మూలాస్థానమునకు పోవుటకు తలుపులైన రెండు ద్వారములున్నవి. ఆ



ద్వారములమార్గమై శివుడు దాటి పోయిన ప్రతిష్ఠయై మూలస్థానమైయుండు శివలింగము కనబడును. ఆ రెండు ద్వారములకే గుదమని చెప్పుట. కావుననే శబ్దము కలుగుట.

అదెట్లనగా నమస్కార మంటము నందు వ్రేలాడ గట్టియుండు గంట మూలస్థానము లోపలపోవు సమయమునను, మరలివచ్చు సమయమునను కొట్టుకొనుచున్నవి. ఈ ప్రకారముగనే నమస్కార మంటపమైన అంగళమునుండి మూలస్థానమునకు శ్రీ కొవిలకు జీవశక్తియైన వాయువు దాటు సమయమున లోపల అణగిన శబ్దము బైట వచ్చునప్పుడు మాటలై యుండు శబ్దము కలుగుచున్నది. దానినుండే గుదమనునది గోవును, అనగా శబ్దమును దాన మిచ్చుటయని చెప్పుట. గోయనగా శబ్దము. ఆ శబ్దము కలుగుటకు పై జెప్పిన అంగళము నుండి పై భాగమునకు రెండు ద్వారములున్నవి. ఆ ద్వారములు, ముక్కు ద్వారములు అన్యోన్యముగా చేరునటువంటిది. ఆ స్థలము భ్రూమధ్యమునకు స్వల్పము క్రిందుగ, ఉండుట.

అచ్చట నుండియే ఆకాశాంశమైన శబ్దము కలుగుట. దానికి దృష్టాంతమేమనగా, ముక్కు లేనివారికి స్పష్టముగా మాట్లాడుటకు వీలగుటలేదు. కారణమేమనగా, పై జెప్పిన ద్వారములనుండి శబ్దము ఉద్భవించునప్పుడు వాయు వనకు తటస్థము లేనందున ఒకటై బైట పోవును. ఆ ముక్కుయుండునప్పుడు తటస్థము కలిగి అణగి



స్పష్టముగా మాటలాడుటకు వీలగుచున్నది . అదెట్లనగా, "గ్రామఫోను" అనగా పెట్టె పాటలను మీరు వినియేయున్నారుగదా, ఆ గ్రామఫోను నుండి శబ్దము ఉద్భవించునెట్లనగా, పెట్టెపైన పాటలు అణగియుండు ఒక ప్లేటు అనగా యొక పళ్ళెమునుంచి, దానిలో ఒక "నీడల్" లేక సూదిని పెట్టెపై నుండు శబ్దమును కల్పించు యంత్రమునయుంచి, ప్లేటుకు తాకించి, ఆ పెట్టె బీగమును త్రిప్పిన, ప్లేటు తిరిగి శబ్దము కలుగుచున్నవి. అయినదాని నుండి ఉద్భవించు పాట యొక్క ధ్వని స్పష్టముగా తెలియుటలేదు. కారణ మేమనగా, ఆ శబ్దము ఉద్భవించు స్థలమునందు ఒక హారన్ లేక గ్రామఫోను బూర యుంచక ఉండినందున శబ్దము ఉద్భవించుచోటున తటస్థము లేక దాని నుండి యుద్భవించు వాయువు బైట వ్యాపించిపోవుచున్నది. ఆ బూర ఉంచినప్పుడు అచ్చటనుండి ఉద్భవించు వాయువుతో శబ్దము అణగి బూర మార్గమై బైట వచ్చుచున్నది. అప్పుడు దానిలో కలుగు పాటలు చిన్న బిడ్డలకు గూడ తెలియు విధమున స్పష్టమై కలుగుచున్నవి. ఈ ప్రకారముగనే

క్రిందుగ శబ్దము కలుగు స్థలము నుండి, గొట్టమైన ముక్కు యొక్క సహాయమువలన స్పష్టముగా శబ్దము కలుగును. కావున అంగళమునుండి పై భాగమైయుండు రెండు ద్వారములకే గుదమని చెప్పుట.



లోపలనుండు ఈ రెండు ద్వారములు బైటనుండు కన్నులు రెండు, ముక్కు ద్వారములు రెండు, చెవులు రెండు, నోరు ఒకటి, ఇట్లు ద్వారములు తొమ్మిదైయున్నవి. ఈ విధమైన తొమ్మిది ద్వారములుండు క్షేత్రమే శిరస్సు. ఆ క్షేత్రమునందు ప్రతిష్ఠించియుండునదే లింగము. దానికే శివలింగమని చెప్పుట. ఆ శివలింగము మూలమున శుక్లమున్నది. ఆ లింగము, భ్రూమధ్యమున నున్నది. లింగము మూత్రద్వారము కాదు. లింగమనునది మూత్ర ద్వారమైన, మూత్ర ద్వారము మూలముననే శుక్లము ఉండవలసినది. ఎట్లు ఆలోచించినను, మూత్రద్వారము మూలమున, శుక్ల ముండుటకు కారణములేదు. పై జెప్పిన లింగము మూలముననే శుక్లముండు ననుటకు, అనేక దృష్టాంతములున్నవి. అదిగాక, సంయోగ సమయమున శుక్లము బయలుదేరునప్పుడు తెలి యుచున్నది. ఆ విషయమును గురించి నాలుగవ అధ్యాయమున వివరించబడియున్నది. అదిగాక రామేశ్వర ప్రతిష్ఠ అని చెప్పబడు ఒక చిత్రపటమున్నది. ఆ చిత్రపటమున ఒక శివలింగము, ఆ శివలింగము పాతాళమునకు దిగి పోవుటకను, అట్లు పోకుండుటకు

గాను పార్వతి దానిని చుట్టి పట్టు (కౌగలించు) కొని యుండునదిగాను, దానిలో కనబడు చున్నది. అది సరియైయున్నది. మన భ్రూమధ్యమున ప్రతిష్ఠించిన శివలింగము మన లోపలక్రింద భాగము అయిన పాతామున, శబ్ద రూపమున దహించి, రగిలి,



నశించిపోవుచున్నది. ఆ విధమున పోనీయక పట్టి నిలుపుట, కుండలినీ శక్తియైయున్నది. ఆ కుండలినీ శక్తియే పై జెప్పిన పార్వతి. అదియేగాక, పై జెప్పిన చిత్ర పటమున శివలింగము మూలమునందు తెలుపువర్ణమున సంస్కృత అక్షరమున "ఓం" అను ఒక పదము వ్రాయబడియున్నది. అదియును సరిగా యున్నది. అనగా "ఓం" యనునది బ్రహ్మము. అదియే శుక్లము, ఆ బ్రహ్మస్వరూపమైయుండు శుక్లము పైజెప్పిన కుండలినీ శక్తి నుండి కట్టబడి, శివ లింగము మూలమునయున్నది. అది భ్రూమధ్యము. క్షేత్రముస్థితియు, ప్రతిష్టయు ఈ విధమున నున్నది. ఈ విధమైన గాత్రక్షేత్రము, లేక దేవస్థానము స్థితిని తెలియక, ఏవేవెూ, కొన్ని కట్టడములను కట్టి, వాటిలో లోహములు, శిలలు, మ్రానులు మొదలగువాటి నుండి చేసిన బొమ్మలను నాటి, వాటిని ఈశ్వరుడనియు, అదే దేవస్థానమనియు చెప్పి, భజించి, తానై తనలో క్షేత్రములోపలనుండు జీవశక్తిని బైటయందు విడిచి, మరొకటి దానిలో సంకల్పించి అధోగతియై జనులు నశించిపోవుటయేగాని, క్షేత్రోపవాసము ఎప్పుడును వారికి సిద్ధించుటలేదు.

క్షేత్రపవాసము సిద్ధించవలయుననిన, పై జెప్పిన గాత్రక్షేత్రమున జీవుని ఉపవశించవలయును. ఆ సమయమున క్షేత్రపవాసము సిద్ధించును. ఆ ప్రకారము ఏ ఒకడు చేయుచున్నాడో, వానికి జీవుడు ఊర్ధ్వగతియై పై జెప్పిన శివలింగమునకు వెళ్ళిచేరి, సకలమైన తెలివియు,



సిద్ధించి, తనలోలయించి, తానై తన్మయమై కైవల్యమును పొందుచున్నాడు. అదిగాక , మీరు ఈశ్వర సేవ చేయుట ఈశ్వరునితో చేరుటకా, విడిపోవుటకా?

శిష్యుడు : ఈశ్వరునితో చేరుటకు.

గురువు : ఈశ్వరునితో చేరవలసిన మీరుక్షేత్రమునకు పోయి ఎక్కడ నుండి ఈశ్వరుని నమస్కరించునది?

శిష్యుడు : క్షేత్రమునకు పోయి, శ్రీ కోవిల, గర్భగుడికి బైట నుండి.

గురువు : అప్పుడు మూలస్థానముయొక్క లోపలకు గాని, గర్భగుడిలోపలకుగాని అడగుంచుట వీలుపడునా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : అందు ప్రతిష్టకాబడిన బింబములు వేటిచే చేయబడినవి?

శిష్యుడు : శిలలు, మ్రానులు మొదలగువాటిచే.

గురువు : అయిన, ఎంతమందియో జనులు త్రొక్కి, నడచి, అరిగిపోయినవియు, ఎంతమందియో జనులు మల

విసర్జనము చేసియున్నటువంటి శిలనుండి ఒక ముక్కను విరుగగొట్టి, శిల్పి దానిని త్రిప్పి, త్రిప్పి, దానిని త్రొక్కి, బింబమును చేసి, దానిని దేవస్థానమున శ్రీ కొవిలమను స్థలమునందు ప్రతిష్ఠించిన, దానిని ముట్టరాదనియు, దానిని ప్రతిష్ఠించిన స్థలమునందు అడుగుగూడ



పెట్టరాదనియు, చెప్పునప్పుడు మనము ఎప్పుడు ఏకాలమునకు ఈశ్వరునితో చేరుట? ఇది ఎంతటి అంధవిశ్వాసము! ఇవి ఎంత మోసము!! అదియునుగాక, ఆ బింబముపై బొద్దింక, బల్లి, ఎలుక, నారికేళ పాము, తొండ మొదలైన జీవులు ఆ బింబముపై సంచరించుటయు, గబ్బిలము ఆ బింబమును కఱచుకొని మూత్రవిసర్జనము చేయును. ఇది అంతయు ఉదయమున లేచి ఊడ్చి పార వేయుటను మనము చూచుట లేదా? అప్పుడు ఇది ఎంతటి అన్యాయము? ఈ పై జెప్పిన జీవులకన్న ఎంత నికృష్టజీవులమో మనము? అదియునుగాక, బ్రాహ్మణుడు మొదలు ఛండాలుని వరకు మాదిగ, మాలయని అభిమానించి, స్థాపించి వచ్చిన వారి యొక్క ఎంగిలియైన మత్స్య మాంసములందలి ఎముకలు మొదలగునవి తిని నడుచు పిల్లి, పై జెప్పిన అంబలము లోనికిపోయి అందలి విగ్రహమని అభిమానించబడియున్న బింబమును తాకి నడచుచున్నది. కాని మనము మాత్రము దానిలోనికి పోరాదు. ఇది ఏమి అన్యాయము? అదియునుగాక లోకమునందలి అట్లే

చేయుట కద్దు. ఆ మలముపై ఈగలు వ్రాలుటకద్దు. అప్పుడు ఆ ఈగల కాళ్లకు మలమంటుకొనును. ఆ ప్రకారము మనము విసర్జించినమలమునను ఈగలు వ్రాలుట కద్దు. ఈ ఈగలు వాటి కాళ్ళను అంటుకొనిని మలముతోనే ఎగిరిపోయి పై జెప్పిన బింబముపై వ్రాలును మనము విసర్జించిన మలమును ఆ బింబముపై ఈగలు



పట్టుకొనిపోయి ఉంచును కాని దానిలోపలకు మనము పోగూడదు. ఇది అంతయు ఆలోచించు నప్పుడు మనకు బుద్ధిఏమున్నది? పై జెప్పిన విషయములను ఆలోచించి తెలిసికొనక మనము వంచింపబడి అంధవిశ్వాసములో నున్నాము. ఇదియేనా ఈశ్వర సేవ!

శిష్యుడు : స్వామి! ఇది అంతయు ఆలోచించు నప్పుడు మనకు ఏదొక ఆలోచనయు లేక, వంచకపడి, బుద్ధిలేకపోవుటనిగాక యేమని చెప్పవచ్చును. స్వామి! అదియునుగాక స్త్రీ, పురుషులు మొదలైన సృష్టులకంతను లింగమున్నదని చెప్పినారుగదా? స్త్రీలకు లింగమున్నదని చెప్పుటలేదు. వుపస్థమనియే చెప్పుట. దీని స్థితియేమి?

గురువు : ఓహోహో ! అన్ని సృష్టులకును లింగము, ఉపస్థము యున్నవి. పురుషులని చెప్పువారికి మాత్రమే లింగము, స్త్రీయని చెప్పువారికి మాత్రమే వుపస్థముయున్నదని గ్రహింపరాదు. ఎట్లనగా, నవద్వారములందు ఒక ద్వారము లింగమని మీరే ముందు చెప్పినారుగదా! దానిని గమనింపుము. అప్పుడు స్త్రీలకు లింగమున్నదని వచ్చుచున్నది. అదిగాక వాక్, పాణి, పాద, పాయు,

ఉపస్థమను ఐదు ఇంద్రియములందు ఒక ఇంద్రియము ఉపస్థమనియు మొదటనే మీరు చెప్పియున్న దానిని ఆలోచింపుము. అవి పురుషులని చెప్పబడువారికి గూడ ఉన్నదని తెలియవచ్చుచున్నది. కావున లింగ, ఉపస్థములనున్నవి, అన్ని సృష్టులకును సాధారణమై



యున్నది. ఉపస్థమనునది. ఉప+స్థితి ఉప = సమీప, స్థితి=ఉండుట, అనగా సమీపమున ఉండుట. అనగా శివలింగము సమీపమున ఉండుట. అనగా ఈ శివలింగము సమీపమున యుండునది. దానికే యోనియని పేరు. యోనియే ఉద్భవస్థానము. అదియే శక్తి యోనియని చెప్పబడుట. అది ఇప్పుడు స్త్రీలకన చెప్పబడుచున్నది. బిడ్డలను ప్రసవించుస్థలము యోనికాదు. ఆ ప్రకారము ప్రసవించవలయుననిన మొదట యేమి కలుగవలయును?

శిష్యుడు : గర్భము కలుగవలయును.

గురువు : గర్భముకలుగుటకు ఏమికావలయును?

శిష్యుడు : సంయోగముకావలయును.

గురువు : సంయోగము చేసిన మాత్రముననే గర్భము కలుగునా?

శిష్యుడు : చాలదు. శుక్లము కల్గియుండవలయును.

గురువు : ఆ శుక్రము ఉద్భవించు స్థానమునకు యోనియని

పేరు. ఇది శక్తియోని అనునది. ఆ శక్తియోనియైయుండు బ్రహ్మరంధ్రమునుండియే లోకయుద్భవము. శక్తి అనునది స్త్రీ; కావుననే స్త్రీకి యోనియని చెప్పుటకు కారణము. జీవుడనునది పురుషుడు. ఆ జీవుడు ఎప్పుడు పురుమైన జడములోపల అనగా తనలోపలతానే అణగియుండునో ఆ సమయమున అతడు పురుషుడగుచున్నాడు. ఎప్పుడు





పురుషుడగుచున్నాడో అప్పుడు శివలింగమై యుండు తన లింగమును తెలిసికొనుచున్నాడు. కావుననే పురుష లింగమని పేరైనది. యోనిసితియు, లింగము స్థితియును ఈ ప్రకారమైయున్నది. వాటిని ఇటువంటివియని తెలియక మూత్రద్వారమై యుండు కొళాయిని యోనియ నియు, లింగమనియు, మలద్వారమైన ముడ్డిని గుదమనియు, లోకమున గ్రహించి, జనులు మూఢ బుద్ధిగలవారై యున్నారు. ఈ విధమైన ఇట్టి గ్రుడ్డి నమ్మిక కలుగుటకు కారణము, అనుభవస్థులు తమ అనుభవమును వ్రాసి పెట్టి యుండు దానిని చదివి, తప్పుగా గ్రహించి, తానే అనుభవస్థుడని, తనకే అన్నియు తెలియునని, నటించి, అనుభవము ఇటువంటిదని తెలియక, లోకమున శాస్త్రము మొదలగువాటి సరియైన అర్థము గ్రహించక విపరీతముగా గ్రహించుకొని, లోక జనులకు చెప్పి, నేర్పించినందువలననే ఇలాగైనది. ఈ విధమున లోకవాసులు, అనేక శాస్త్రములు మొదలగు వాటిని నేర్చుకొన్నవారనియు, వీరు చెప్పునది సరిగా నేయునుదని గ్రహించి, ఏదొక వివరము లేకపోవుటకు

కారణమైనది. ఈ ప్రకారమైన తప్పు నమ్మిక వలన యదార్థము దొరుకుట లేదు. కావున మూఢమతియందు మునిగి అధోగతియై జనులు అంధవిశ్వాసముతో నశించి పోవుచున్నారు.



# పదునేడవ అధ్యాయము

శిష్యుడు : స్వామి! ఇది వరకు చెప్పిన దానిలో యోగముల విషయమై ఏదొకటియు ఉపదేశించలేదుగదా? లోకమున అనేక శాస్త్రాదులను నేర్చుకొని పలువిధములగు యోగములున్నవని గ్రహించియున్నారు. ఈ విషయమును గురించి స్పష్టముగా చెప్పవలయునని అపేక్షించు చున్నాను.

గురువు : పలుయోగము లనునవి ఏవి?

శిష్యుడు : కర్మయోగము, హఠయోగము, రాజయోగము మొదలగు అష్టాంగయోగములని గ్రహించి యున్నాను.

గురువు : యోగమనగా ఏమని గ్రహించితిరి?

శిష్యుడు : యోగనగా చేరిక.

గురువు : చేరవలసినవి ఏవి?

గురువు : చేరవలసినవి ఏవి?

శిష్యుడు : జీవుడు, ఈశ్వరుడు.

గురువు : మనకు ఎన్ని జీవులు, ఎన్ని ఈశ్వరులు?

శిష్యుడు : ఒకే జీవుడు, ఒకే ఈశ్వరుడు మాత్రమే.

గురువు : అలాగున ఒకే జీవుడు, ఒకే ఈశ్వరుడు చేరుటకు,



ఇన్ని ఎక్కువైన యోగములు కలుగుటకు కారణములేదు. ఎందువలననగా యోగమనునది ఒకటే. అది జీవేశ్వరో రైక్యము. దానికి పలు అచార్యులు. కారణముచేత పలు పేరులిచ్చి ఉండుటయే తప్ప, పలుయోగములు ఉండుటలేదు. అన్నియు ఒకటే. ఎట్లనగా, కర్మమనునది జీవశక్తియైన వాయువని ఎనిమిదవ అధ్యాయమున చెప్పబడియున్నది. వాయువుయొక్క ఉద్భవస్థానమై యుండు అకాశమైన బ్రహ్మరంధ్రము నందు ఆ జీవశక్తియైన వాయువును చేర్చుటకే కర్మయోగమని పేరు. హఠయోగమనునది బలాత్కారమైన యోగమని లోకమున జనులు గ్రహించియున్నారు. అట్లు గ్రహించుట సరిగాదు. ఎందుకనగా "హ" అనునది ప్రకృతి లేక మాయ. "ఠ" అనునది, ఆ మాయయనుదానిని అణగించు నటువంటిది. (మరచునటువంటిది) దేనిననగా తన నుండి ప్రకృతియై బైటకులోపలయందు వ్యాపించు కొనియుండు ప్రకాశము. ఆ ప్రకృతియందే మనకు ప్రకాశించుట. ఆ ప్రకృతే సూర్యుడైన ప్రాణుని రశ్మియే బైటకులోపల వ్యాపించియున్నది. అట్లు వ్యాపించి యుండు సూర్యుడైన

శక్తియే చంద్రుడు. దాని వలనన ప్రాణాపానము అనునది చెప్పుటకు కారణము. కావున ప్రాణుడనునది సూర్యుడును, అపానమనునది చంద్రుడును అగును. అట్లు అపానుడైన చంద్రుడే మనస్సు. కాబట్టి ప్రాణుడైన సూర్యుని, మనస్సైన చంద్రుని ఐక్యపరచుటయే హఠయోగము. ఇందు వలననే



హఠయోగము సూర్య, చంద్రులను ఐక్యపరచుటయని లోకమున చెప్పుచున్నారు. కావున సూర్య చంద్రులైన ప్రాణాపానులను యైక్యపరచుట. రాజయోగము అనునది రాజయోగమని యున్నది. దీనిలో రాజనునది, రజోగుణమై, విష్ణువైయుండు మనస్సు. యోగమనునది చేరుట. అటువంటి మనస్సును గురించి తొమ్మిదవ అధ్యాయమున వివరింపబడియున్నది. ఆ ప్రకారమైన మనస్సు, దాని ఉద్భవస్థానమైన భ్రూమధ్యమునందు చలించక నిలబడుస్థితికే రాజయోగమని పేరు. యోగ ములస్థితి ఈ విధమైయున్నది. అయిన యెనిమిది అవస్థలు యొకటై కూడునప్పుడు యోగము. అవి ఏవనగా, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, డంబము, అసూయ, ఈ ఎనిమిది అవస్థలు. ఇవి ఉద్భవించుట పై జెప్పిన ప్రకృతియైన చలనమునుండి, ఆ చలనము బైటకులోపల చలించక తనలో తానే లయమగు సందర్భమున పై జెప్పిన యెనిమిది వృత్తులు, వాటి ఉద్భవస్థానమై యుండు ప్రకృతి లో లయించి, అన్యత్వములేక అనగా వేరుపడక

తానై భవించును. దానికే అష్టాంగయోగమని పేరు. అదిగాక జీవుడు, ఈశ్వరుడు యనునవి రెండుగాక ఒకటైయున్నది. ఈశ్వరుడనగా, తనకు పైభాగమున అకాశమైన బ్రహ్మరంధ్రమున ఉండువాడు, ఆ ఈశ్వరుడే క్రిందవై విడిచిపోక, తనలోపలగతాగతము చేయుచుండు జీవుడై యున్నది. ఆ జీవుడు తనలోనుండి బైటయుండు



వాయువు రూపమై చరించుటకు పరమాత్ముడని పేరు. ఆ పరమాత్ముడే మనస్సు. ఆ మనస్సే విష్ణువు. ఆ విష్ణువే విశ్వంభరుడైయున్నాడు. అందువలననే పరమాత్ముడైన వాయువునుండియే లోకము కలగినదని చెప్పుటకు కారణమైనది. ఆ ప్రకారముగా నుండు మనస్సైన బింబమునందు ప్రతిబింబించి కనబడునవన్నియు, మన జీవుడే అదెట్లనగా, ఒక అద్దము నందు మనము చూచునపుడు, ఆ అద్దమునందు మన ప్రతిబింబమును చూచుచున్నాము. ఈలాగుననే మనస్సై యుండు అద్దమునందు చూచునప్పుడు మనము ఏ ఏ విచారము లతో చూచుచున్నామో, ఆ ప్రకారమే బైట మన జీవుని విచారరూపముగా ప్రతిబింబించి చూచుచున్నాము. అట్లు ప్రతిబింబమును చూచునది నేనను అహంకారమునందు ఎప్పుడు ఆ నేనను అహంకారము నశించునో, అప్పుడు ఏదొకటియు చూచుటలేదు. అటువంటి అహంకారము నుండియే జీవుడు, ఈశ్వరుడు అను భేదము కలుగుట. అదెట్లనగా, ఒకనదియందు పాఱుచుండు జలమున ఒక కఱ్ఱముక్క ఏదైన ఒకభాగమును ముంచిపట్టిన, జలము

కళ్ళయొక్క రెండు భాగములనుండియు పాఱుచున్నది. కాని జలము రెండై ఉండుటలేదు. జలము పారుటకు భిన్నము కలిగి రెండు త్రోవలుగా పోవుచున్నదని మనకు కనబడుచున్నది. ఆ కళ్ళనుతీసిన, పాఱుచుండు జలము యొక్క భిన్నత్వము పోయి, నొకటైపారును. ఈలాగుననే, జీవునిబైటకులోపల అను వేగమున మనస్సైనది, నేనను



అహంకారమై ఉండు కళ్ళను పట్టినప్పుడే, జీవుడనియు, ఈశ్వరుడనియు, రెండవస్థలు కలుగుట. ఎప్పుడు అహంకారమైయుండు కళ్ళను తీసివేయుచున్నామో అప్పుడు రెండు లేదు. జీవేశ్వరొరైక్య మగుచున్నది. అయిన లోకమంతయు నుండుట "నే" నను వొక ముడిమీదనే. అదెట్లనగా వొకదారము నుండి వొక గొలసువలె అల్లి కడపట ఆదారముకొనయందు వొక ముడివేసిలాగిన ఆ గొలుసులు విడిపోవుటలేదు. కాని ఆ కొనయందుకట్టిన వొక ముడిని విప్పి లాగిన అన్ని గొలుసులును విడిపోయి ముందులాగున వొకేదారము అగుచున్నది. ఈలాగుననే కర్మమై వాయువైన దారము నుండి విచారాదులైన కట్లులను కట్టుకట్టి కడపట "నేను" అను వొక కట్టును కట్టికొని లాగుకొని యుండునది. దానిని ఎంతగట్టిగా లాగుచున్నామో అంతగా కట్టులు బాగుగా బిగిసిపోవునేగాని విడిపోవుటలేదు. విప్పవలయుననిన పైజెప్పిన దారము కొనయందుండు ముడిని విప్పి లాగునట్లు నేనను అహంకారమైయుండు వొక కట్టును విప్పి లాగిన, అన్నిముడులు వీడివొకటే వస్తువై

పరణమించుచున్నది (ముగియుచున్నది) . ఆ వస్తువు చలనము లేక లోపలలయించినప్పుడు తానై తన్మయ మగుచున్నది. అప్పుడే అన్ని యోగములు దానిలో అణగుచున్నవి. ఇది గాక యోగము అనేకములున్నవని గ్రహించి నానావిధములుగా ఒక్కొక్క ప్రవర్తనలను చేయుటవలన యోగమగుట లేదు. ఆచార్యులు



పలుయోగములను చెప్పినది ఒకటే యోగమునకే. అదెట్లనగా, ఒక వస్తువును పలు పేరులతో పిలచుటకద్దు. అది భాషాభేదమే అగును. ఈలాగే యోగమునకు వొక్కొక్క కారణముచే ఆచార్యులు వొక్కొక్కరు యుక్తాను సారముగా వొక్కొక్క నామమును ఇచ్చియున్నారు. ఇదిగాక యోగములు అనేకములు లేవు. కావుననే బైటకులోపల వ్యాపించి, చలించి, భ్రమించికొనియున్న తానైయుండు శక్తి ఎప్పుడు బైటకులోపల చలించకుండ తనలోపల తానై లయించునట్లు చేయుటయే యోగము. యోగముల స్థితులు ఈలాగై యున్నవి.



# పదునెనిమిదవ అధ్యాయము

శిష్యుడు : స్వామీ! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అను నాలుగువర్ణములవారు ఉన్నారనియు, వారిలో శూద్రులను వారిలో అనేక జాతులున్నవనియు, కనబడుచున్నది. దానిస్థితి ఏమి అని తెలిసికొనుటకు ఆతురతగా నున్నాను.

గురువు : బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వారెవరెవరు?

శిష్యుడు : బ్రాహ్మణులనువారు నంబోదరి, అంబ్రాంద్రి బట్టరు వీరైయున్నారు. నంబోదరి అనువారిని మలయాళపు బ్రాహ్మణులనియు, యంబ్రాంద్రి అనువారు తుళు బ్రాహ్మణులనియు, బట్టరు అనువారిని కన్నడ బ్రాహ్మణులనియు, పట్టరు అను చెప్పబడువారు పాప్పానవారే పరదేశబ్రాహ్మణులనియు వారులే అరవ బ్రాహ్మణులనియు చెప్పబడుచున్నారు. క్షత్రియు

లనువారు పూర్వకాలమున రాజ్యమును పరిపాలించుచుండిన సూర్యచంద్ర వంశోద్భవులైన రాజులు. వైశ్యులనగా ఉత్తరదేశహిందూస్థానపువారైన సేటులు, కన్నడ రాజ్యములో సేట్టులని, అరవరాజ్యమునందు సెట్టీలని పిలువబడు వ్యాపారస్థులు మొదలగువారై యున్నారు. శూద్రులనువారు పైజెప్పినవారు తప్ప, మిగత



అన్ని జాతులవారై యున్నారు.

గురువు : బ్రాహ్మణులను మీరు తాకి చూపుదురా?

శిష్యుడు : చూపవచ్చును.

గురువు : వారెవరు?

శిష్యుడు : పై జెప్పిన నంబోదరి మొదలగువారు.

గురువు : వారు బ్రాహ్మణులని ఎట్లు నిర్ణయించినారు?

శిష్యుడు : వారికి జందెము యుండుట వలన.

గురువు : జందెముండువారిని బ్రాహ్మణులని చెప్పుట శుద్ధతప్పు, ఎందుకనగా కంసాలి, కోమటి, దేవాంగులు, కొంకణి, గానుగవాడు, కమ్మరవాడు మొదలగువారికిని జందెము ఉంటున్నది. వీరందరును బ్రాహ్మణులా?

శిష్యుడు : కాదు.

గురువు : జందెమును ధరించినవారే బ్రాహ్మణులని కదా మీరు చెప్పినది?

శిష్యుడు : జందెము ధరించినంతమాత్రమున కాదు. వృత్తులనుండియు కూడ.

గురువు : బ్రాహ్మణుల వృత్తులేవి?

శిష్యుడు : వేదపారాయణ క్షేత్రాదులయందు పూజ మొదలగు వాటిని చేయుట.



గురువు : క్షత్రియులవృతులేవి?

శిష్యుడు : దుష్టనిగ్రహముచేసి, శిష్టులను పాలించుట.

గురువు : వైశ్యులవృత్తులేవి?

శిష్యుడు : గోరక్షణము, అనగా పశువులను కాపాడుట, వ్యవసాయము, వాణిజ్యము అనగా వ్యాపారము మొదలగునవి.

గురువు : శూద్రుల వృత్తులేవి?

శిష్యుడు : బ్రాహ్మణుల పాదసేవ, మరియు వారికి సేవకుడై యుండుట.

గురువు : హోహో! అట్లయిన మాదిగలని మీరు చెప్పువారిని, స్నానము చేయించి, వారి ఆచారనడతలను సరిపరచి, వారిచే వేదాభ్యాసము చేయించి పూజాక్రమములనే నేర్పించి, జందెము వేయించి, బ్రాహ్మణులని చెప్పబడు వారి సంఘము చేర్చిన మీరు వారిని బ్రాహ్మణులని సమ్మతింతురా?

శిష్యుడు : లేదు.

శిష్యుడు : లేదు.

గురువు : అదెందువలన?

శిష్యుడు : వారు మాదిగాలైనందువలన.

గురువు : మీరు మునుపు చూడకయు, తెలియకయు నుండు నొక మాదిగను పైజెప్పినట్లు చేయించి,



బ్రాహ్మణులని అభిమానించియుండు వారి సంఘము నందు నిలిపిన, మీరు వానిని ఇటువంటి వాడని చెప్పుటకు సాధ్యమగునా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన? బ్రాహ్మణులని వొక ప్రత్యేక జాతియుండునట్లయిన, వారిని మీరు కని పెట్టవలయు నుగదా? అదిగాక మీరు జనించకుండిన పై జెప్పిన నాలుగు వర్ణములు మొదలగు ఏదొకటియు మీకున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఇవన్నియు ఎప్పుడు కలిగినవి?

శిష్యుడు : నేను జనించిన వెనుక.

గురువు : అది అట్లుండనిమ్ము. అయిన మీరు నిద్రలో అణగినప్పుడు ఈ ప్రకారమైన నాలుగు వర్ణములు కద్దా?

శిష్యుడు : లేదు.

గురువు : అదేమి? ఎందువలన?

శిష్యుడు : అప్పుడు మన మనస్సులోపల అణగి ఏదొకటియు లేకుండు స్థితి యందుండుటవలన.

గురువు : అట్లయిన ఇవన్నియు ఎప్పుడు కలిగినవి?

శిష్యుడు : నిద్ర నుండి హెచ్చరికయైనప్పుడు.



గురువు : అప్పుడు యెచ్చటనుండి కలుగుట.

శిష్యుడు : నా మనస్సు నుండి.

గురువు : అట్లయిన, పైజెప్పిన నాలుగు వర్ణములు యుండుట నిజము వాటిని వివరముగా చెప్పవచ్చును. అయిన బ్రాహ్మణులు తమ జాతిలో నొకరినొకరు తాకిన స్నానము చేయవలయునా?

శిష్యుడు : తమలో తాము తాకిన స్నానము చేయవలసినదిగా లేదు.

గురువు : క్షత్రియలలో వొకరితో నొకరు తాకిన స్నానము చేయవలయునా?

శిష్యుడు : అవశ్యములేదు.

గురువు : వైశ్యులకో?

శిష్యుడు : వారిలో నేను వొకరితో నొకరు తాకినస్నానము చేయుటకు అవశ్యములేదు.

గురువు : శూద్రులందో?

శిష్యుడు : తాకిన స్నానము చేయవలయును. అది మాత్రముగాక దగ్గిరకు వచ్చిననే స్నానము చేయవలసిన జాతి వారున్నారు. శూద్రులందు డెబ్బది రెండడుగులు, నలుబది అడుగుల దూరమున నిలుపవలసినవారు, సమీపము వచ్చినను, తాకినను, స్నానము చేయ వలసి



నవారు, చేయుటకు అక్కరలేనివారును యున్నారు.

గురువు : ఇప్పుడు మీారు చెప్పినదంతయు నిజము. అయినను మీారు గ్రహించిన ప్రకారముకాదు. ఎందుకనగా, పైజెప్పిన నాలుగువర్ణముల ఉద్భవము మిమ్ములనుండియు. అనగా మనస్సు, చిత్త, బుద్ధి, అహంకారమనునవియును. వాటిలో మనస్సును నది బాహ్మణుడు, చిత్తమనునది (ప్రకాశమైన) క్షత్రియుడు, బుద్ధియనునది వైశ్యుడు, అహంకారమనునది శూద్రుడు. ఎట్లనగా బ్రాహ్మణుడు అనగా నిత్యానిత్యవస్తువును వివేకము చేయువాడు. నిత్యానిత్య వస్తువు యొక్క వివేకమును గురించి ఆరవ అధ్యాయమునను మరియు పండ్రెండవ అధ్యాయమునను చెప్పబడియున్నది. అట్లు నిత్యమైయుండు వస్తువును తెలియునప్పుడు వాడు బ్రాహ్మణుడు. అతడే వైదికుడు. కావుననే వేదాధికారి బ్రాహ్మణుడు. బ్రాహ్మణులు తప్ప తక్కిన ఎవరును వేదాధికారులుకారు, వేదమనునది తెలివి. ఆ తెలివికి అధికారస్థుడు మనస్సు. మనస్సులేనియెడల ఏదొక తెలివియు లేదు. ఇందువలననే వేదాధికారి బ్రాహ్మణుడని

చెప్పుటకు కారణము. ఆ బ్రాహ్మణుడు మనస్సు.

లోకమునందు బ్రాహ్మణునికన్న కీర్తిగలవాడు క్షత్రియుడు. అటువంటి క్షత్రియుడు చిత్తమైయుండు ప్రకాశము. క్షత్రియుని యొక్క ప్రవర్తనము దుష్ట నిగ్రహముచేసి, శిష్టపరిపాలనము చేయుటని మీరు



చెప్పినారుగదా? దుష్టులనగా మనలోనుండి ఉద్భవించు రాగద్వేషాదులగు దుర్విచారములు. శిష్టులు అనునది. మనస్సు - ఆ మనస్సునకు ఇతర విచారములనుండి వేదమైయుండు తెలివికి తటస్థము వచ్చుచున్నది. ఆ తటస్థములను క్షత్రియుడైయుండు ప్రకాశము తెగగోసి, నాశనము చేసి, మనస్సునందు తెలివిని నిలుపుటయే శిష్టపరిపాలనము.

వైశ్యులకు గోరక్షణ, కృషి, వాణిజ్యము, మొదలగు ప్రవర్తనములు. అవి బుద్ధికి ఉండునటువంటివి. ఎట్లనగా, "గో" అనునది శబ్దము. శబ్దమును రక్షించవలసినది బుద్ధియొక్క ప్రవర్తనము. బుద్ధిగలవానికి మాత్రమే కృషి, వాణిజ్యము మొదలగువాటిని చేయుటకు చేతనగుచున్నది. అదిగాక, లోకమున సాధారణముగా "అతడు బుద్ధిహీనుడు, మాట్లాడుటకును బుద్ధిలేదు, తెలివిలేదు," అనియు చెప్పుచున్నారు. కావున బుద్ధియైయుండు గోవునురక్షించవలయును. ఎట్లనగా, తనలోనుండి ఉద్భవించు శబ్దమును తనలో తానే

నిలుపవలయును. ఎప్పుడు తన శబ్దమును నశించ నీయుక తనలోపలనే నిలుపుచున్నాడో, అప్పుడు అది కృషి. కృషి యనునది, శిరస్సున సుషుమ్నయందు తన శక్తిని అణగించుటయే. అప్పుడు శబ్దము తనలోనే లయమగుట. ఇదియే కృషి. ఇట్లు కృషి చేయు శబ్దము నుండి తనలోతానే వ్యాపించునట్లు చేయుటయే



వ్యాపారము. అలాగుచేసి భక్షణసామానులను బ్రాహ్మణు లకు ఇయ్యవలయును. వైశ్యుల ప్రవర్తనము నుండి పదార్థములు దొరకని ఎడల బ్రాహ్మణుడు నశించి పోవుచున్నాడు. పై జెప్పిన విధమున తన శక్తిని తన లోపలనే అణగించి, వ్యాపించునట్లు చేసిన యెడల, మనస్సు విచారములై బైట యందు నశించిపోవుటలేదు. అప్పుడు బ్రాహ్మణుడై యుండు మనస్సునకు నాశనము లేదు. తనలోపలనే లయమగును. ఇదియే వైశ్యుడై యుండు బుద్ధియొక్క ప్రవర్తనము. శూద్రుడనగా "నే" నను అహంకారము. ఆ అహంకారమునకు అనేక జాతులుండునటువంటిది. ఆ జాతులను దేనికి చెప్పుట అనగా, అనేక విచారభేదములకు అనగా నేను స్థాని, మాని, పండితుడు, మరొకడు మూడుడు, ఛండాలుడు అనగా మాదిగ అనునవి. ఛండాలుడు అనగా కులపాతకము చేయుట. యసత్యమాడుట, దొంగిలించుట, వ్యభీచారము చేయుట, మొదలగు దుర్వృత్తులను చేయుటయు, చేయవలయునను విచారములే. ఈ దుర్వృత్తులను విడిచి వాటి జ్ఞాపకము లేక ఉండవల

యును. ఇందువలననే ఛండాలురవద్దకు పోరాదు అని చెప్పుట. ఇందువలననే శూద్రులలో అనేక జాతులు కలిగినవని చెప్పుటకు కారణము. శూద్రుడై యుండు అహంకారమునందు కల్పించబడిన, పై జెప్పిన అన్ని విచారములును, ప్రవర్తనలను విడిచి, బ్రాహ్మణుడై యుండు మనస్సు యొక్క పాదసేవ చేయవలయును.



పాదమనగా స్థానము. దాని నుండి మనస్సు యొక్క స్వస్థానమైన భ్రూమధ్యమును సేవించవలయును. ఇదే అహంకారమైయుండు శూద్రుని ప్రవర్తనము. ఇట్లుగాక "నేనే బ్రాహ్మణ:పుడు, వేదము, శాస్త్రము, పురాణాదుల న్నియు నేనే నేర్చుకొనవలయును. వేరెవ్వరును నేర్చుకొనరాదు. వేరొకడు శూద్రుడు, ఛండాలుడు, అశుద్ధుడు, అతనిని దూరముగా నిలుపవలయును." అనునదిగా యెవరు తలచుచున్నారో, అసత్యము, మోసము, కులపాతకము మొదలైన ఛండాలవృత్తులను ఎవరు చేయుదురో, వారే ఛండాలురు. బ్రాహ్మణులు కారు. తనలో నుండి బైట యందు చలించి వ్యాపించు మనస్సును, నిత్యమై యుండు తనలోపలనే లయించునట్లు చేసి తన్మయమగువాడే బ్రాహ్మణుడై యున్నాడు. "తాను క్షత్రియుడు, దుష్టులను నిగ్రహించవలయునని గ్రహించి, తుపాకితోను, ఖడ్గముతోను, వేరే ఏ ఆయుధములతోను యొకనిని చంపువాడు క్షత్రియుడుగాడు. నేనను యహంకారము యొక్క దుర్వృత్తులనుండియట్లు చేయువారైనందున

వారును ఛండాలురైన యున్నారు. క్షత్రియులనగా, తన జీవుని తనలోపలనే ప్రకాశించునట్లుజేసి, రాగద్వేషాదులైన శత్రువులను నాశనముచేసి, తన మనస్సునకు ఏదొక చలనములేక స్థిర పరచువాడే క్షత్రియుడు, వైశ్యుడనగా, గోరక్షణ, కృషి, వాణిజ్యమనువాటిని, ముందుగయుంచి, పశువు అనగా ఆవు, గేదె మొదలగువాటి గొంతులయందు



త్రాడును చుట్టి, కట్టి, కష్టపరచియు, వాటి దూడలను వేరుగాకట్టియు, ఆ దూడలు త్రాగవలసిన పాలను పిండి, వాటివాటి దూడలను పట్టి వ్యవసాయము, బండిని లాగుట, మొదలగు వాటికి ఉపయోగపరచి, వ్యాపారమని చెప్పి, పలుసరకులను చేర్చి, తూకమునను, కొలతలోను, కొనునటువంటివారిని మోసగించి, హెచ్చుగా లాభమును పొందువాడు వైశ్యుడుకాడు. నేనను అహంకారము యొక్క దుర్వృత్తులనుండి చేయుటైనందున అతడును ఛండాలుడేయైయున్నాడు. కాబట్టి వైశ్యుడనువాడు "వాక్" (మాట) యైయుండు శబ్దమును తన లోపల అణగించి, కృషి చేసి, పై జెప్పిన విధమున చేయువాడైయున్నాడు. శూద్రుడనగా, బ్రాహ్మణుడని అభిమానించి వచ్చినవారికి సేవకావృత్తులను చేసియు, పాదసేవజేసియు, పలు జీవహింసలను జేసియు, మద్యపానము మొదలగువాటిని చేసియు, నడచువాడు శూద్రుడు కాడు. అతడు అహంకారము యొక్క దుర్వృత్తులచే నడచువాడై నందున అతడును ఛండాలు డేయైయున్నాడు. తన మనస్సు యొక్క ఉద్భవస్థానమైన

భ్రూమధ్యమునందు అణగించుటకు గతిచేసి (త్రోవజేసి) అచ్చట తన జీవుని కొనిపోయి చేర్చుటకు ప్రయత్నించుటయే బ్రాహ్మణపాద సేవ అయిన పై జెప్పిన నాలుగు వర్ణములు వాకటినుండే ఉద్భవించి, వాకటందే అణగుటైనందున జాతియనునదే లేదని బాగుగా స్పష్టమగుచున్నది. కావున నాలుగుజాతులుయుండుట



లేదు. ఈ విధమైన జాతులన్నియు వాడు వాడు పుట్టిన వెనుక తనలోపల అణగియుండు (గుణము) జీవుడు, కర్మమైయుండు వాయువై బైటకులోపలయందు వ్యాపించినప్పుడు దానినుండే నాలుగువర్ణములై ఉద్భవించుట నటువంటిది. అది తనవలననే సృష్టించబడినదై యున్నది. అనగా మనస్సు, చిత్త , బుద్ధి, అహంకారము, వీటినుండియే అన్ని అవస్థలు కలిగినటువంటివేగాని, బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు అని వేర్వేరు సృష్టులు లేవు. ఈ ప్రకారమైన అన్ని సృష్టులు తన శక్తి బైటయందు వ్యాపించి, దాని నుండి ఉద్భవించి, తన్నుతానే తెలియక అంధకారమునందు అణగిపోవుట. తన్నుతానే తెలియవలయునని, వేరైన తనభ్రమ యొక్క వృత్తులను విడిచి, తన శక్తిని తనలోతానే లయించునట్లు చేయవలయును. అప్పుడు తన్నుతాను తెలియవచ్చును. కావున తానై తన్మయుమై వచ్చుటకే కైవల్యమని పేరు.

తన్మయుమై [illegible]



# పందొమ్మిదవ అధ్యాయము

శిష్యుడు : స్వామీ! ముందు రెండు అధ్యాయములలో మద్యపానమును నిషేధించనారుగదా! అయిన మద్యపాన మువలన జ్ఞానము దొరకుచున్నదని వినియున్నాను. అదిగాక శక్తిపూజయందు మద్యపానము చేయకతప్పదని చెప్పుచున్నారు. అట్లు నడచివచ్చుటయుకద్దు. ఇట్లుండిన మద్యపానమును నిషేధించుటకు కారణమేమి?

గురువు : మద్యపానము నుండి ఎవరికి జ్ఞానము కలిగినదిగా మీరువినియున్నారు?

శిష్యుడు : మలయాళ రాజ్యము నందు అన్ని జాతులజనులకు విద్యాభ్యాసము కలుగు మార్గమును ఏర్పరచిన కేరళగురువైన "తుంజత్ ఎళుత్తచ్చన్" (రామానుజ) యను మహాత్ములకు

గురువు : ఇది మీరు ఏదైన శాస్త్రములనుండి తెలిసికొన్నదా? లేక ఎవరైనను జెప్పినదానిని వినినదా?

శిష్యుడు : లోకమున జనులు చెప్పినదానిని వినినదిగా నున్నది.

గురువు : ఆ మహాత్ములు పానము చేసిన మద్యము, ఏవిధమైనదని మీరు వినియున్నారా?



శిష్యుడు : సాధారణముగా లోకమున ఇప్పుడు ఉపయోగించుచు వచ్చుచున్న మద్యములనియే వినియున్నాను.

గురువు : అవి యేవి?

శిష్యుడు : కల్లు, సారాయి మొదలగునవి.

గురువు : అవి యెట్లు కలుగునవి?

శిష్యుడు : కల్లు అనునది కొబ్బరి చెట్లు, తాటి చెట్లు మొదలగు మ్రానులగెలలనుకోసి, వాటి నుండి తీసిన, కల్లుయమ వొకవిధమైన సారము ఆ కల్లును పక్వపరచి తీయునది సారాయి అను వొక విధమైన ద్రావకమై వున్నది.

గురువు : మీరు చెప్పు విధమైన మద్యమును తుంజత్ యెళుత్తచ్చన్ అను మహాత్ములు పానము చేయలేదు. ఆ మహత్ములు పానము చేసినది ఏది అనగా, యెనిమిది జావలకొబ్బరిచెట్టు శిరస్సు నందు ఊటైవచ్చిన మద్యమైవున్నది. ఆ కొబ్బరి చెట్టు శిరస్సనునది, ఈ జడము యొక్క ఏడు జానలపై భాగమున ఎనిమిదవ జానైన శిరస్సు. ఆ శిరస్సు నందుండునదే మధు ఆ మధువును లంబికాముద్రచే పానము చేయుట "లంబిక అనగా

లం+అంబిక. లం = ప్రకాశము, అంబిక = లోకమాతయైన శక్తి. ఆ శక్తి తనలో శిరస్సు లోపల అణుగునప్పుడు అమృతము కలుగును. అనగా తనలోనుండి బైటకు లోపల యందు వ్యాపించియుండు శక్తి తనలోపలనే లయించి, నిండించి ఊబ్బుచున్నది. ఆ సమయమున



శిరస్సు నందుండు అమృతము బైలు దేరును. ఆ అమృతమును పానము చేసిన సదా ఆనందమత్తుడై ఉండవచ్చును. పై జెప్పిన మధువునే ఆ మహాత్ములు పానము చేసినది. దీనిని ఆలోచించకయు, తెలియకయు, లోకవాసులు తప్పుగా గ్రహించి కేరళ గురువుగారు, మహాజ్ఞానిగాను ఉండిన తుంజత్ యెళుత్తచ్చన్ అను జగద్గురులైన ఆ మహాత్ములు, మీరు చెప్పిన కల్లు, సారాయిన త్రాగినారని అపరాధమును చెప్పి, ఆ మహాత్ములపై తప్పునుమోపి, ఆ మహనీయులు చేసిన దానిని మనమేలచేయరాదు? అను అహంభావముతో మాటాలాడియు, ఆ మహాత్ములు భుజించిన మద్యమును తెలియకయు బుద్ధిహీనులై, మీరు చెప్పిన కల్లు, సారాయి మొదలగువాటిని త్రాగి పెద్దలు సంపాదించిపెట్టిన ద్రవ్యము మొదలగువాటిని నావపరచి, గొప్ప అయోగ్యులై తమలో కలహములను కలుగజేసుకొని, దెబ్బలాడుకొని హత్యలు మొదలగు ప్రవర్తనములు చేసి, చెరసాల మొదలగు శిక్షలకు లోబడుచున్నారు. ఇదియును గాక, మీరు శక్తి పూజయనియు, దానికి మధుపానము

చేయకయుండుటకు సాధ్యము లేదనియు చెప్పినది సరియై యున్నది అదెట్లనగా, శక్తియనునది, తనలోనుండి ఉద్భవించునది. ఆ శక్తి బైటయందు వ్యాపించి వుండుటవలన నానావిధములుగా జనులు మోహాంధులై వున్నారు. ఆ విధమైన అంధకారమును దూరపరచుటకు ఆ శక్తిని తనలోపలనే చేర్చవలయును. దానిని



చేర్చవలసినది జీవుడు. ఆ జీవుడు శక్తిని పూజించు నటువంటిది. దీనికే శివుడు శక్తిని పూజించుచున్నాడని చెప్పెదరు. అదెట్లనగా, తననుండి బైటయందు వ్యాపించి భిన్నభిన్నమై బంధింపబడియుండు తన శక్తిని, దాని నుండి జీవుడైవుండు శివుడు విడదీసి, బ్రహ్మరంధ్రము నందు చేర్చుటయే శక్తి పూజ. ఆప్రకారము పూజించునప్పుడు మస్తకమునందుండు మద్యము దిగుచున్నది. ఆ మద్యమునే మహనీయులు పానము చేయుట, దీని నుండే శక్తిపూజయందు మద్యపానము చేయక యుండుటకు వీలులేదని చెప్పుటకు కారణము. శక్తిపూజ ఈ విధమైవున్నది. దీనిని తెలియక జనులు శక్తిపూజ అని చెప్పి మేక, కోడి మొదలగువాటిని చంపి జీవుని నశింపజేసి, ఈ శవములను కూరలుగాచేసి, రొట్టె, వడ మొదలగువాటిని చేసి వొక గదియందు పీట, దీపము, మొదలగువాటిని ఉంచి, కల్లు, సారాయి మొదలగు వాటిని ఆ పీటవద్దవుంచి, పూజచేయుటని చెప్పి కొన్ని పుష్పములను ఆ పీటమీాదను, ఇతర సామానులమీాదను పారవేసి, పూజ ముగిసిన పిదప. కడుపునిండుగ, పై జెప్పిన

శవముల పదార్థములను, మరియు రొట్టె మొదలగు వాటిని భుజించి, కల్లు, సారాయి, మొదలగువాటిని త్రాగి బోధము లేకపడి, చేతులు, కాళ్ళు పండ్లు, పెదవి, కన్ను, ముక్కు మొదలగువాటిని గాయపరచుకొని, స్వల్పమైనను హెచ్చరిక లేక నడచుచున్నారు. సరియగుశక్తిపూజ ఏదనగా, పైజెప్పినట్లు చేయుటయే . అవిధమైన పూజనే



చేయవలసినదై వున్నది. తన శక్తిని ఎవడొకడు తనలోపలనే లయించునట్లుచేసి పూజించుచున్నాడో, అతడు తననుండి కలుగు మధువును పానము చేసి, ఆనందమత్తుడై సర్వజ్ఞుడై ఉండవచ్చును. ఆ మధువునకే అమృతమని పేరు. ఆ విధమైన మధువునే పై జెప్పిన మహనీయులు భుజించినది. మీరు చెప్పిన కల్లు, సారాయి కావు.



# ఇరువదవ అధ్యాయము

శిష్యుడు : సద్గురవే ! లోకము నందు నాలుగు మతములు కలవని చెప్పి, వాటిననుసరించి జనులు నడచుచున్నారు. ఆ మతములు యెట్లు కలిగినవి?

గురువు : ఆ నాలుగు మతములేవి?

శిష్యుడు : హిందు, బుద్ధ, క్రైస్తవ, మరియు మహమ్మదీయ మను నాలుగు మతములు.

గురువు : మనము ఏ మతస్థులము?

శిష్యుడు : మనము హిందూ మతస్థులము.

గురువు : మనము హిందూ మతస్థులమనుటకు ఆధార మేమి?

శిష్యుడు : ఈశ్వర సేవ మొదలగు వాటిని మనము సరిగా చేసికొనివచ్చుట వలననే మనకు హిందుమతస్థులమని పేరు.

గురువు : ఇదివరకు మనము ఈశ్వరసేవ చేసినట్లుగా మీకుతెలియవచ్చుచున్నదా?

శిష్యుడు : ఇది వరకు చేసినదానిని గురించి ఆలోచించిన



మనము, ఈశ్వరసేవ చేయలేదనియే చెప్పవలయును.

గురువు : ఈశ్వర సేవను చేయనివారిని హిందువులని చెప్పుటకు సాధ్యపడునా?

శిష్యుడు : లేదు.

గురువు : లోకమున నానామతములన్నవని చెప్పుట వెర్రితనము. ఎందువలననగా, మతములు మొదలగునవి ఏదొకటియులేదు. అట్లుండిన ఒకే మతముగాక వేరే మతములు ఉండుటలేదు. ఆ ఒకే మతమునకే ఈశ్వరమతమని పేరు. కావున, లోకమున ఈశ్వర మతముగాక వేరొక మతము లేదు. హిందు మతము. హిందు అనగా చంద్రుడు, మతమనగా స్థాపన దేనిని స్థాపింపవలయుననగా, చంద్రుని స్థాపించవలయును. చంద్రుడనునది మనస్సు ఆ మనస్సెయుండు చంద్రుని ఈశ్వరుడై యుండు జీవుని యందు నిలుపుటయే హిందు మతము, ఈ విధముగా ఎవరు నిలుపుచున్నారో వారే హిందు మతస్థులు. ఈ విధముగా చేయకయుండువారు హిందుమతస్థులనియు, బుద్ధమతస్థులనియు, క్రైస్తవ

మతస్థులనియు, మహమ్మదీయ మతస్థులనియు, అభిమానించుటయేగానిచ, మతమును గురించి యేదొక తెలివియున్నవారు కారు, ఏదొక మతస్థులునుకారు. అదెట్లనగా, హిందుమతస్థులని అభిమానించి వచ్చు వారిలో చేరినవారైన మేదరవారు మొదలగు వర్గము వారిని, ఆ మతస్థులైన ఇతరులు బహిరంగ



NITYANANDA ON THE LAP OF
**HIS HOLINESS SWAMI SIVANANDA PARAMAHAMSA**
FOUNDER OF SIDHASAMAJ



స్థలములందును, రాజరస్తాలయందును, తమకు సరిసమానముగా నడుచుటకు విడువక డెబ్బది రెండడుగుల దూరమున నడచునట్లుచేసి, వారిని కష్టపరచి వచ్చుటవలన, వారు తమచే సహించుటకు సాధ్యముగాక మహమ్మదీయ మతస్థులని చెప్పి అభిమానించివచ్చు వారిలోచేరి పలు ప్రవర్తనలను చేసి, ఉపజీవనమును నడిపించుకొనుచున్నారు. ఆ మేదరవారు పై జెప్పినట్లు మహమ్మదీయ మతమునందు చేరి ఆ మతముయొక్క ఏదొక తత్వమును గ్రహించక, తాము మహమ్మదీయులని అభిమానించి వచ్చుచున్నారు. అయిన వారికి మహమ్మదీయ మతమును గురించి ఏదొక తెలివియులేదు. వారు మహమ్మదీయ మతము నందు మూడు మాటలను మాత్రము నేర్చుకొని యున్నారు. ఏవనగా అల్లా, అల్లాహు, బిస్మిల్లా. ఈ మాటల అర్థమునైనను తెలిసియుండు వారుకారు. వాటిని తెలియక, పై జెప్పిన పదములనుచ్చరించి తాము మహమ్మదీయులై అని అభిమానించి నడచి వచ్చు

చున్నాయి. ఈ విధముగాని అన్ని
యొక్క ఏదొక తాత్పర్యములను గ్రహించక తాను హిందు, తాను బుద్ధుడు, తాను క్రైస్తవుడు, తాను మహమ్మదీయుడని వారి వారి మతములను పొగడుకొని, పై జెప్పిన మేదరవారు అభిమానించి నడచు వచ్చునట్లు, అభిమానించినడచు వచ్చునదిగాక మతములగురించి ఏదొక తత్వబోధము, తెలివి, గ్రాహ్యమువారిక యుండుట లేదు.



నిజముగా విచారముచేసిన, ఈ విధమగు ఏదొక మతమును యుండుట లేదు. అన్నియు పై జెప్పిన ఈశ్వరమతమై ఉన్నది! ఆ ఈశ్వరమతమును తెలియకయుండు నొకకాలమున బుద్ధుడు అను యొక మహనీయుడు ఉద్భవించినారు. వారు ఈశ్వరమతము యొక్క తత్త్వమును గ్రహించి, ఈశ్వరధ్యానమును చేయు యదార్థమైన మార్గమును స్థాపించినారు. దానికి ఆ మహాత్ములు పురోహితులై యుండిరి. ఆ పురోహితులైన బుద్ధడను మహానుభావులు స్థాపించిన కారణముచేత దానికి వారి నామముననుసరించి బుద్ధమతమని పేరు కలిగినది. వారు స్థాపించినది ఈశ్వరమతమేగాని బౌద్ధమతము కాదు ఆ మహానుభావులకు బుద్ధుడనిగాక, శుక్రుడని నామ ముండినట్లయిన వారు స్థాపించిన మతమునకు ఏమని పేరు పెట్టవలయును?

శిష్యుడు : శుక్రమతమని చెప్పవలయును.

గురువు : అట్లయిన, బుద్ధమతమని ఒక మతమున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : ఆలాగే, మరొక కాలమునందు క్రీస్తుదను మహానుభావులొకరు వేరొక కాలమున మహమ్మదుయను మహానుభావులు జనించియుండిరి. వారు ఈశ్వర విచారము చేయుటగాను, కావలసిన న్యాయమైన ఒకే మార్గమును స్థాపించినారు. అవి పై జెప్పిన ఈశ్వర



మతమేయైయున్నది. అట్లున మతములను స్థాపించుటకు పై జెప్పిన మహానుభావులు ఒక పురోహితులై యుండిరి. ఆ పురోహితులైన క్రీస్తు అను మహానుభావులు స్థాపించిన దానికి క్రైస్తవ మతమనియు, మహమ్మదను మహాను భావులు స్థాపించిన దానికి మహమ్మదీయ మతమనియు, పేరు కలిగినది. ఆ మహానుభావులనామధేయములను అనుసరించియు మతములకు ప్రత్యేక పేరులను పెట్టియుండిరి. క్రీస్తుయను మహానుభావులకు "జార్జి" యనియు, మహమ్మదు అను మహానుభావులకు "చేకుట్టి" అనియు, నామములుండిన, ఆ మతములను ఇప్పుడు ఏమని చెప్పవలయును?

శిష్యుడు : "జార్జి" మతమనియు, "చేకుట్టి" మతమనియు చెప్పవలసినది.

గురువు : అప్పుడు పై జెప్పిన మతములున్నవా?

శిష్యుడు : లేవు.

గురువు : అట్లయిన, మతములు ఎవరిను అనుసరించి వేరు వేరు పేర్లతో ఉండుట?

శిష్యుడు : గురునాథుల నామములను అనుసరించి ఉండుట.

గురువు : గురునాథులైన ఆ మహాత్ములు ఏ మతమును స్థాపించినది?

శిష్యుడు : ఈశ్వర మతమునే.



గురువు : అట్లయిన ఎన్ని మతము లున్నవి?

శిష్యుడు : ఈశ్వరమతమును ఒకే మతము మాత్రము.

గురువు : ఈశ్వరమతమను ఒక మతముగాక, వేరే ఒక మతములేదు. అట్లుండు ఈశ్వరమతమును ఇటు వంటిదని తెలియక, అనేక కట్టడములను కట్టించి, మసీదులనియు, దేవాలయములనియు, చర్చిలనియు, చెప్పి, వాటిలో బింబాదులను స్థాపించి, అది ఈశ్వరుడని సంకల్పించి, వాటిలో బుద్ధిహీనులై, జీవకారుణ్యములేక కఠోరమనస్సు గలవారై నరబలి, అశ్వబలి, అజబలి (మేకబలి), కుక్కుట బలి (కోడిబలి), మొదలగునవియని చెప్పుచు, మనుష్యులని అభిమానించువారలు, గుఱ్ఱము, మేక, కోడి మొదలగువాటిని చంపి, అతికఠోరమైన, కఠోరకృత్యములను చేయుచుండు కాలమునందు ఉద్భవించిన పై జెప్పిన మహానుభావులకు హెచ్చుబుద్ధి శక్తి వున్నందున, వారు దీని యదార్థమును ఆలోచించి, తెలిసికొని, లోకమునందు అతి కష్టపడి పైజెప్పిన వధలను చేసివచ్చుట తప్పనియు, సరియగు మార్గము ఇటు

వంటిదనియు అనగా లోకమనునది తన శక్తి నుండి ఉద్భవించినదనియు, ఆ శక్తిని తనలోతానే అణగించ వలసినదనియు, తానైయుండు తనశక్తిని తన లోపలనే లయించునట్లు చేయవలెననియు, మిగిలినవన్నియు, సరికావనియు, స్థాపించియున్నారు. దాని నుండి లోకమున ఏ ఏ మహానుభావులు ఉద్భవించివున్నారో



వారందరు చెప్పివచ్చినది పై జెప్పిన ఒకటే మార్గమై యున్నది. ఆ మార్గమునే మనము ఇప్పుడు మీకు కనబరచినది. ఇదియే సరియైనది.



# ఇరువదియొకటవ అధ్యాయము

శిష్యుడు : స్వామీ! మోక్షముదొరకుటకు బ్రహ్మోపదేశమే కావలయుననియు, అది మహావాక్యములై యుండు చతుర్వాక్యములనియు లోకమున చెప్పివచ్చుచున్నారు గదా? నాలుగవ అధ్యాయమున దానిని ఖండించివున్నారు గదా? అయిన చతుర్ వాక్యముల యదార్థము ఎట్లని వివరింపవలయునని వేడుకొనుచున్నాను.

గురువు : చతుర్ వాక్యము లేవి?

శిష్యుడు : "ప్రజ్ఞానం బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి " "తత్వమసి" "అయమాత్మాబ్రహ్మ" ఇవి.

గురువు : చతుర్వాక్యములను ఏమి చేయవలయునని ఉపదేశించుచున్నవి?

శిష్యుడు : వాటి యదార్థములను తెలిసికొని మననము చేసికొని వుండవలయునని.

గురువు : అట్లయిన ఆ నాలుగు వాక్యముల అర్థమేమని మీా గ్రహింపు?

శిష్యుడు : "ప్రజ్ఞానం బ్రహ్మ" అనగా వేరై తెలియబడు తెలివిని బ్రహ్మమనియు, "**అహంబ్రహ్మాస్మి**" అనగా నేను బ్రహ్మమై



ఉన్నాననియు, "**తత్వమసి**" అనునది నీవై యున్నావనియు, "**అయమాత్మాబ్రహ్మ**" అనగా, ఈ ఆత్మయు బ్రహ్మమనియు నా గ్రహింపు.

గురువు : ఈ వాక్యములపై జెప్పిన అర్థములను మననము చేసిన మోక్షము దొరకునా? ఎట్లనగా, కల్కండయను వస్తువును గురించి క్రింద చెప్పనట్లు ధ్యానము చేసిన, అనగా కల్కండయను వస్తువు ఒకటి వున్నది. అది తీపి గలది, తెలుపువర్ణముగలది, తినుటకు రుచియైనది, అని నాలుగు వాక్యములను ధ్యానించిన ఎడల కల్కండ ఇటువంటిదని తెలియునా? దాని తీపి తెలియునా? దాని వర్ణము కనబడునా? దాని రుచి తెలియునా? ఆ తలంపు కల్కండగా వచ్చుటకు సాధ్యమగునా?

శిష్యుడు : ఎప్పుడును సాధ్యముకాదు. దానిని తినిన మాత్రమే దాని గుణములు తెలియవచ్చుచున్నవి?

గురువు : అలాగే మీారు చెప్పినట్లు ఆ మహావాక్యముల అర్థమును విచారము చేయుటవలన బ్రహ్మమను దానిని తెలియుటకు ఎప్పుడును సాధ్యముకాదు. అదిగాక, ఈ

వాక్యముల అర్థము మీరు చెప్పిన ప్రకారముకాదు. "ప్రజ్ఞానంబ్రహ్మ" అనగా, ప్రతిబింబింపబడివుండు తెలివియే బ్రహ్మము, అనగా, తనలోపలనుండి ప్రతిబింబింపబడి వుండు వస్తువలను తెలిసికొను తెలివి ఏదో అదే బ్రహ్మము. ఎట్లనగా, చెవితోవిని తెలిసి కొనుటయు, కన్నువలన చూచి తెలిసికొనుటయు,



ముక్కుతో వాసన తెలియుటయు, నాలుకతో రుచి తెలియుటయు, త్వక్ నుండి స్పర్శించే తెలియుట యైవున్నది. అయిన ఈ ఐదు అవస్థలను తెలియుట కుండు కారణమైన తెలివియే బ్రహ్మము. ఈ ఐదు ఇంద్రియములతో తెలిసికొనుట ఏదని పదునారవ అధ్యాయమునందు చెప్పివున్నదిగదా? ఆ తెలివి ఏదనగా, మనస్సు ఆ మనస్సు తనలోనుండి భిన్నమై బైటకులోపల ఉండు పలువిధములుగా ప్రకాశించుకొనివున్నది. అట్లు ప్రకాశించు మనశక్తిని. భిన్నమై లేక తనలోపలతానే అణగించి నిలుపుటకే "ప్రజ్ఞానంబ్రహ్మ" అని చెప్పుట కావున తననుండి ప్రతిబింబింపబడివుండు ప్రకాశమును తన లోపలనే చలించక, కదలక నిలుపునప్పుడు "ప్రజ్ఞానంబ్రహ్మ" అను విచారమైనను, ధ్యానించుటకు వేరేదైనను వుండుటలేదు. "అహంబ్రహ్మాస్మి" అనగా "అ" కారమైవుండు బైటలోపలయందు తానైవుండు బ్రహ్మమే, "హం" అను ప్రకృతియై - తనలోనుండి మాయయై చలించుకొనివుండుదానిని చలనములేక ఉద్భవస్థానమైన తనలోపలనే అణగించుటయే. ఆ సందర్భమున "అహం

బ్రహ్మాస్మి" అను ధ్యానమైనను, ధ్యానించుటకు వేరేదైనను ఉండుటలేదు. "**తత్వమసి**" అనునది, తత్ + త్వం + అసి. తత్ అనగా బ్రహ్మము. త్వం అనగా నేను, అనగా "న" ఆనగా శూన్యము, "ఇ" ఆనునది శక్తియై, ఆనగా తానైఉండు శక్తి తనలోనుండి బైటకులోపల నశించి వ్యాపించి, చలించుకొనివుండు మనశ్శక్తి; "అసి" అనగా



భవించును, అనగా అయివున్నదని అర్థమగుచున్నది. కావున "**తత్వమసి**" అనునది తత్ అనియు, బ్రహ్మము నుండి త్వం, లేక నీవు అను మనశ్శక్తియు, బైటకులోపల యందు వ్యాపించి నానావిధమై చలించుకొనివుండు శక్తిని, చలించుటకు విడువక బ్రహ్మమునందే లయించియున్న అవస్థ అయినది. అట్లు అ సమయమున చలించి భ్రమించికొనివుండు మనస్సు యొక్క శక్తి. బ్రహ్మమగు చున్నది. అప్పుడు "**తత్వమసి**" అను ధ్యానమైనను, ధ్యానించుటకు వేరేదైనను ఉండుటలేదు. "**అయమాత్మా బ్రహ్మ**" అనునది అయం+ఆత్మా+బ్రహ్మ: అయం=ఈ, ఆత్మా=ఆత్మయు, బ్రహ్మ=బహ్మమనియు అర్థమైయున్నది. "అయం" అనగా "ఈ" అను శక్తి. ఆ శక్తి బైటకులోపలయందు నానావిధమున ప్రవేశించి ప్రకాశించుకొని ఉండునదైయున్నది. ఆ ప్రకారము బైటకులోపలయందు ప్రకాశించుటకు విడువక తన లోపలనే యుండు ఆత్మ యందు ప్రకాశించి చలనములేక నిలుపు అవస్థయైయున్నది "**అయమాత్మా బ్రహ్మ**". ఆ సమయమున "**అయ మాత్మా బ్రహ్మ**" అను ధ్యానమైనను,

ధ్యానించుటకు వేరేదైనను ఉండుటలేదు. పై జెప్పిన నాలుగు మహావాక్యములు బ్రహ్మోపదేశమై ధ్యానించుటకు చెప్పబడినదికాదు. బ్రహ్మము యదార్థస్థితి ఇటువంటిదని చెప్పినదైయున్నది. అదిగాక బ్రహ్మము అను అవస్థను తెలియుటకు రెండు వాక్యములు కలదు. దానిలో ఒకటి "బ్రహ్మజ్యోతిరహం" అయి ఉన్నది. అనగా



"బ్రహ్మ+జ్యోతిన్+అహం" అనగా తానే తానై బ్రహ్మజ్యోతిస్సు అని అర్థమగుచున్నది. ఆ బ్రహ్మ జ్యోతిస్సు, 'అ'కారమైన బైటకులోపలయందు "హం" అను ప్రకృతియై భిన్నమై ప్రకాశించుకొని ఉండునది. ఆ ప్రకాశమును భిన్నపడుటకు విడువక ఒకటే ప్రకాశమైచేసి, ఆద్యంతము లేక యుండిన స్థితినే "బ్రహ్మజ్యోతిరహం", అప్పుడు "బ్రహ్మజ్యోతిరహం" అని ధ్యానమైనను, ధ్యానించుటకు వేరేదైనను ఉండుటలేదు. ఆరవ వాక్యమైన "బ్రహ్మసత్ జగత్ మిథ్య" అని అగుచున్నది. కావున "బ్రహ్మ+సత్+జగత్+మిథ్య" అనగా తానైయున్న బ్రహ్మము తనలోనుండి కలిగిన చలనము తనలో లయించి ఆద్యంతము లేక యుండిన తానై తన్మయగానుండు అవస్థ అగుచున్నది. అప్పుడు బ్రహ్మమాత్రమగుచున్నది. ఆ సమయమున "బ్రహ్మసత్ జగత్ మిథ్య" అని ధ్యానమైనను, ధ్యానించుటకు వేరేదైనను ఉండుటలేదు. అట్లుగాక, నానాప్రకారముగానుండు మంత్రోచ్చారణము నుండియు, త్రిమూర్తులను సంకల్పించు ధ్యానించి, పూజించుటనుండియు, పలు విధమైన వ్రతాదులను

అనుష్ఠించి, ఉపవాసముగ పరుండి, రోగస్థుడగు టవలనను, పలుజీవులను వధించి, యాగాదిహోమములను చేయుట నుండియు, శక్తి పూజయని ఏర్పాటుచేసి కల్లు, సారాయి మొదలగు బోధవస్తువులను సేవించియు, శవములని తిని, స్మృతి తప్పి, క్రిందపడి, పండ్లు, పెదవి మొదలగు వాటిని గాయపరుచు



కొనుటనుండియు. కాశీ, రామేశ్వరము మొదలగు స్థలములకు పోవుటకు నిశ్చయించి, పలుస్థలములందు చుట్టి, తిరిగి, కష్టపడి, రోగములు తగులుటవలనను, లేక గంగాస్నానము, సేతుస్నానము అని చెప్పుకొని పలునదులలోను, ఉప్పునీరు నిండియుండు సముద్రము మొదలగు పలు జలములు గలస్థలములలో స్నానముచేసి, గజ్జి, మొదలగు వ్యాధులను పట్టించుకొనుట వలనను, కైవల్యము దొరకుటలేదు. ఇట్లు చేయుటవలన తన జీవశక్తి అధోగతియై నశించిపోవుటగాక తన్మయము దొరుకుట లేదు. తన్మయము దొరుకవలయునన్న పై జెప్పిన ప్రకారముగా తన శక్తిని తన లోపలనే లయించ వలయును. ఇదిగాక వేరు మార్గములేదు.



# ఇరువది రెండవ అధ్యాయము

శిష్యుడు : గురవే ! ఇదివరకు షడాధారముల విషయములను ఏదొకటి చెప్పలేదు. షడాధారములను దాటి, జీవుని బ్రహ్మరంధ్రమున ఐక్యపరచుటయే మోక్షమని చెప్పుచున్నారు. దీని యొక్క తాత్పర్యమేమని వివరింప ప్రార్థించుచున్నాను.

గురువు : షడాధారములనునవి యేవి? వాటి నామము లేవి?

శిష్యుడు : మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞ అనునవి.

గురువు : ఈ ఆరు ఆధారములస్థితి ఏ ప్రకారమున?

శిష్యుడు : మూలాధారమనునది గుదమై యున్నది. అనగా

ఇదివరకు, గుదమనిన చెప్పివచ్చియుండు మలద్వార
మును తాకుకొని పైగయుండునదియు, స్వాధిష్ఠాన
మనునది ఇదివరకు లింగమని చెప్పివచ్చియుండు
మూత్రద్వారము మూలమును తాకుకొనియుండునది
యు, మణిపూరకమనునది ఇదివరకు నాభియని చెప్పి
వచ్చియుండు బొడ్డును తాకుకొని యుండునదియు,



అనాహత మనునది ఇదివరకు హృదయమని చెప్పి వచ్చి
యుండు రొమ్ము మధ్యయుండు రొమ్ముగుండియయు,
విశుద్ధి అనునది ఇదివరకు కంఠమని చెప్పివచ్చియుండు
కంఠము గుండియయు, ఆజ్ఞయనునది లలాటమై
యుండు భ్రూమధ్యమై యున్నవి.

గురువు : ఇట్లుండు ఆరు ఆధారములు పై జెప్పిన స్థానములందు ఏ ప్రకారముగా ఉంటున్నవని మీ నమ్మకము.

శిష్యుడు : అవియొక టొకటొకటిమెట్లు మెట్లయి ఉన్నవనియు, వాటిలో యొుక్కక్క ఆధారము (మెట్టు) మూలముగా ప్రాణమును దాటించి బ్రహ్మరంధ్రమునందు చేర్చుటని నా నమ్మకము.

గురువు : అట్లయిన మొదటి ఆధారమేది?

శిష్యుడు : మూలాధారము.

గురువు : మూలాధార ఎచ్చటనున్నది?

శిష్యుడు : మాలమైయుండు గుదమునకు చేరి యున్నది. కావుననే దానికి మూలాధారమని పేరు:

గురువు : అట్లయిన, ప్రాణము మనలోపలనా? బైటనా?

శిష్యుడు : ప్రాణము లోపలయుండునటువంటిది.

గురువు : లోపలనుండు ప్రాణమును ఏ విధమున



మలద్వారము మార్గమై దాటించుకొని పోవుట? అది మాత్రముగాక మీరు చెప్పినట్లు మలద్వారమే మూలాధారమై ఆ మార్గముగాన లోపలనున్న జీవుని బ్రహ్మ రంధ్రమువద్దకు తీసికొనిపోవలెనన్న మన లోపలనున్న జీవునిబైటకు వదలిగదా పై జెప్పిన మలద్వారము గుండా పైకి తీసికొని పోవుట ఇట్లు తీసికొనిపోవుటకు సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : లోపలనున్న జీవుని బైటకు వదలిన ఏమగును?

శిష్యుడు : శవమగును.

గురువు : అప్పుడు మీరు జెప్పిన మలద్వారమే మూలాధారమైన లోపలనున్న జీవుని బైటకు వదలిన శవమగును అని మీరేగదా చెప్పినది. అట్లయిన మూలాధారము మలద్వారమగుటకు వీలున్నదా?

శిష్యుడు : వీలులేదు.

గురువు : అదియునుగాక ఆధారములు ఒక్కొక్కటి మెట్లు మెట్లయి పైకి యున్నదనియు వాటిలో ఒక్కొక్క ఆధారము మూలముగా ప్రాణమును దాటించి బ్రహ్మ రంధ్రమునందు చేర్చవలయునని చెప్పితిరిగదా? అదిమన మలద్వారము మొదలు బ్రహ్మరంధ్రమువరకు మెట్లు మెట్లుగా ఉన్నవనుటకు ఒక దృష్టాంతము చెప్పెదను.



ఒంటరిగా ఏదైన ఒక దారిని పోవునప్పుడు హఠాత్తుగా ఒక పెద్ద ధ్వనిగాని, ఏదైనగాని వినినప్పుడు, హఠాత్తుగా భయపడినప్పుడు, మనజీవుడు ఏమగును?

శిష్యుడు : అప్పుడు మన జీవుడు వెంటనే పైకి పోవును.

గురువు : అప్పుడెక్కడనుండి పైకి పోవును? మన లోపల నుండియా లేక బైటనుండియా?

శిష్యుడు : మనలోపల నుండియె.

గురువు : మనలోపలనుండు జీవుడు హఠాత్తుగా పైకి పోయినపుడు ఎట్లుండును?

శిష్యుడు : వారికి ఏదొక తెలివియు, లేక ఏదొక బోధములేక పడియుందురు.

గురువు : దానికి కారణమేమి?

శిష్యుడు : జీవుడు పైకి పోయినందువలన.

గురువు : అప్పుడు మనకు మలద్వారము నుండి ఆరు ఆధారములు మెట్లు మెట్లుగా పైకి ఉన్న యెడల,

మనము భయపడి జీవుడు పైకి పోయినప్పుడు మీరు పైన జెప్పిన ప్రకారము ఆధారములు ఏమియు కన బడుటలేదు. అట్లుండిన జీవుడు పైకిపోవునప్పుడు తట్టి తెరువబడి ఉండవలెను గదా? అట్లుండుటలేదు అదియునుగాక, మనము నిద్రించు నప్పుడు మన జీవుడు మనలోపలగతాగతము చేయుచుండును దానికే



సమీరణన్ అని పేరు. సమీరణన్‌ను గురించి ఒకటవ అధ్యాయమున చెప్పబడియున్నది. ఆ సమీరణన్ లోపలనే పైకి క్రిందికి గతాగతము చేసి బ్రహ్మరంధ్రముతో తాకుకొనియుండు గతియే. అప్పుడు ఆరు ఆధారములు మెట్లు మెట్లుగాన ఉండుటయో, చూచుటయో తెలిసికొనుటయోలేదు. అదియునుగాక మూలమనగా నేమి?

శిష్యుడు : మూలమనగా ఉత్పత్తి స్థానము.

గురువు : అట్లయిన మనయొక్క ఉత్పత్తి స్థానమేది?

శిష్యుడు : పైన జెప్పిన మూలమైయుండు మలద్వారము.

గురువు : ఇది ఎంతయో గొప్ప తప్పైయున్నది. మూల మనునది ఉత్పత్తి స్థానమైయున్నది. అది మొట్ట మొదట ఉద్భవించిన స్థానమైయున్నది. అది మలద్వారమని చెప్పుటకు వీలులేదు. మలద్వారము నుండి ప్రారంభించి ఒక్క సృష్టి గూడ కలుగుటకు వీలులేదు. దానికి దృష్టాంత మేమనగా, స్త్రీ యొకతె యొక బిడ్డను ప్రసవించునప్పుడు,

ఆ బిడ్డయొక్క మూలమైయుండు మలద్వారము మొదట బైట వచ్చుచున్నదా?

శిష్యుడు : లేదు.

గురువు : మరిన యే భాగము మొదట వచ్చుచున్నది?

శిష్యుడు : శిరస్సు అనగా తల.



గురువు : అట్లయిన మలద్వారము నుండి మొదటి సృష్టియైన మలద్వారము కదా మొదట బైట రావలసినది? అది మాత్రము కాదు. మూలమనునది ఉత్పత్తి స్థానము. అది మన శిరస్సై యున్నది. మన సృష్టి శిరస్సు నుండి ప్రారంభించునదై యున్నది. శిరస్సులేనియెడల ఏదొకటి యులేదు. అది మాత్రముకాదు. మనము ఒక జీవి చిత్రము వ్రాయునప్పుడు దాని ఏ భాగమును మొదట వ్రాయవలయును.

శిష్యుడు : ముఖమును మొదట వ్రాయవలయును.

గురువు : అప్పుడు మూలమేది?

శిష్యుడు : శిరస్సు.

గురువు : అదియునుగాక, వృక్షము మొదలగునవి నిలుచుట యెచ్చట?

శిష్యుడు : భూమియందు.

గురువు : ఆ వృక్షము మొదలగు వాటి ఉత్పత్తి ఎచ్చటనుండి?

శిష్యుడు : విత్తునుండి.

గురువు : విత్తు ఒక్క ఏ భాగము నుండి మొలక వచ్చును?

శిష్యుడు : ఆ విత్తు యొక్క ముఖము నుండి

గురువు : విత్తు యొక్క ముఖము పై భాగమా? లేక క్రింద భాగమా?



శిష్యుడు : పై భాగమున.

గురువు : అయిన లోకమునందలి సకలచరాచరములయొక్క ఉత్పత్తి ఏ భాగము నుండి?

శిష్యుడు : పై భాగము నుండి,

గురువు : ఆ ప్రకారము ఉద్భవించి భూమియందు నిలుచు వృక్షములు ఆహారము, నీరు ఏ భాగము నుండి పీల్చుట?

శిష్యుడు : మూలమునుండి.

గురువు : వృక్షము శాఖ యందు లేక రెండు శాఖలు చేరు స్థలమున యెరువులు, జలమువేసిన అది ఫలమిచ్చునా?

శిష్యుడు : లేదు.

గురువు : ఎందువలన?

శిష్యుడు : దాని ఉత్పత్తి స్థానము నందు వేయనందున.

గురువు : అట్లయిన అది ఆహారాదులను పుచ్చుకొనుట దేని నుండి?

శిష్యుడు : దాని మూలమై యుండు యుత్పత్తి స్థానము నుండి

గురువు : మీరు చెప్పిన ప్రకారము మన ఉత్పత్తి స్థానము మలద్వారమైయుండిన, అచ్చటనుండి కదా మనము ఆహారాదులను పుచ్చుకొనవలసినది?

శిష్యుడు : అవును అట్లు చేయుటకు మన మూలమై యుండు



ఉత్పత్తి స్థానము అది కానందున, సాధ్యమగుట లేదు.

గురువు : అట్లయిన మనము ఆహారాదులను పుచ్చుకొనుటకును జలము తాగుటయు దేనినుండి?

శిష్యుడు : మూలమైన శిరస్సున యొక భాగము నందుండు ముఖములో నుండు నోటినుండి.

గురువు : మూలమనునది గడ్డయనగా ఉద్భవ స్థానము , అది మన శిరస్సై యున్నది. మన శిరస్సునుండే మన యొక్క ఉద్భవములన్నియు, ఆ శిరస్సైయుండు మూలము యుండుట పైన, కావున చలాచరములై యుండు సర్వజీవులయుత్పత్తి స్థానము పై భాగమై యున్నది. కావున మూలాధారము మొదలగు అన్ని ఆధారములు అణగియుండుట శిరస్సునందే. మూలాధారమనునది, మూల+ ఆధాం, మూల=ముందు అనగా ఉద్భవ, ఆధార + స్థాన, ఎట్లనగా ముందు యొక్క స్థాన, యనగా "నే" నను అహంకారమైయుండు అవస్థ. ఆ అవస్థకు ఆధారము మనస్సై యున్నది. ఆ మనస్సునకు ఆధారము జీవుడై యున్నాడు. అదెటనగా జీవుడులేని యెడలఏమగు

చున్నది?

శిష్యుడు : శవమగుచున్నది.

గురువు : ఒక శవమునకు ఇటువంటి ఏద్దైన ఒక అవస్తకద్దా?

శిష్యుడు : లేదు.



గురువు : కారణమేమి?

శిష్యుడు : జీవుడు లేక యుండినందున.

గురువు : అట్లయిన జీవుడుండు అన్ని సమయములందును ఈ విధములైన అన్నియుకద్దా?

శిష్యుడు : లేదు నిద్రించునప్పుడు ఏదొకటియు తెలియుటయు, చూచుటయు లేదు.

గురువు : అట్లయిన ఇవన్నియు ఎప్పుడు కలిగినవి?

శిష్యుడు : నిద్ర నుండి హెచ్చరికయైనప్పుడు.

గురువు : అప్పుడు ఏమికలిగినది?

శిష్యుడు : నేనను అహంకారము కలిగినది.

గురువు : ఆ అహంకారము యెచ్చట నుండి కలిగినది!

శిష్యుడు : మనస్సు నుండి.

గురువు : అట్లయిన జీవుడు, మనస్సు, అహంకారము అను మూడవస్థలు మనకుకద్దు. వీటిలో యొకటొకటికి మూడు

మూడు అవస్థలుకద్దు. దీనిలో నేను అహంకార మునకువుండు మూడు అవస్థలు. జాగ్రత్త, సుషుప్తి, స్వప్త, అనునవి. దీని విషయమై ఏడవ అధ్యాయమున వివరింపబడివున్నది. అయిన అది అహంకారమునకు వుండునటువంటిదై వున్నది. అది ఇప్పుడు మనము అనుభవించు జాగ్రత, సుషుప్తి, స్వప్నమైవున్నది.



యదార్థముగా స్వప్న, సుషుప్తి, జాగ్రత అని అగుచున్నది. అనగా స్వప్న జాగ్రతలయొక్కమధ్య సుషుప్తి. అప్పుడు మొదట స్వప్నము, అటు వెనుక సుషుప్తియు, పిమ్మట జాగ్రతయై వున్నది. అయిన లోకమున ఇప్పుడుండు అనుభవము అట్లుకాదు. మొదట సుషుప్తియు, ఆ సుషుప్తియందు స్వప్నము, ఆ స్వప్నము అంత్యమున శీఘ్రముగా హెచ్చరికయై జాగ్రత్తయై వున్నది. ఇవన్నియు అహంకారమునకు అయివున్నవి. అదెట్లనగా ఇప్పుడు మనము అనుభవించునటువంటిది నేనని చెప్పబడు అహంకారమునకు వుండు జాగ్రతయై వున్నది. అది మనస్సుయొక్క ప్రవర్తనయై వున్నది. ఇప్పుడు మనము నిద్రయని చెప్పునటువంటిది అహంకారమునకు వుండునదై వున్నది. అది మనస్సు యొక్క ప్రవర్తనము విడిచిన సమయము. ఆ నిద్రించు సమయమున కనబడు స్వప్నము అహంకారమునకు వుండునదై వున్నది. అది మనస్సు తనచే చేయబడిన ప్రవర్తనలను గురించి ఆలోచించునటువంటిది. ఆ మూడవస్థలు మనము ఇప్పుడు అనుభవించునటువంటివై వున్నవి. ఈ

మూడవస్థలను విడిచి నేనను అహంకారము తన ఉద్భవస్థానమైన మనస్సుననేపోయి చేరునటువంటిది. ముందుగ వుండుస్థానము. అదియే ఉద్భవస్థానము. దానికే మూలాధారమని పేరు. అప్పుడు నేనను అహంకారము తన ముందుగ వుండు స్థానమైన మనస్సునందుపోయి చేరిన సమయము, మనస్సు యొక్క



స్వప్నావస్థ. అదెట్లనగా, అహంకారము స్వస్థానమున ప్రవేశించినప్పుడు బాహ్యావృత్తులందు అనగా బైటకు లోపలనుండి ఏదొకటియు సంకల్పించుటకును ప్రత్యేకించి తెలిసికొనటకు, గ్రహించుటకు మనస్సుకు సాధ్యముకాదు. స్థాపనాశక్తి, అన్నియు నేనను అహంకారమునకు వుండుటైనందున ఆ అహంకారము మనస్సైవుండు తనలో అణగిన సమయమున, బాహ్యావృత్తులను అనగా బైటకులోపలనుండి ఏదొకటి గ్రహించుటకు సాధ్యము కాదు. ఇది మనస్సునకు స్వప్నమగుచున్నది. నేనను అహంకారము ఉద్భవ స్థానమును చేరుట వలన ఈ అవస్థకు **మూలధారము** అని చెప్పుట.

**స్వాధిష్ఠానము** అనునది తన అడుగుస్థానము, అనగా స్వస్థానము: స్వా=తన; స్థానము=వాసస్థానము; అనగా తన వాసస్థానము. ఎప్పుడు అహంకారము మనస్సునందు అణగునో అప్పుడు మనస్సునకు ప్రవర్తనము లేక తన స్వస్థానము నందు ప్రవేశించిన సమయము. ఆ అవస్థ

మనస్సు యొక్క సుషుప్తియై వున్నది. అదెట్లనగా:- అప్పుడే మనస్సుయందు ఏదొక తెలివియులేక, వొకటియులేక ఉండునటువంటిదై వున్నవి. అదెట్లనగా మనము ఇప్పుడు పగలని చెప్పు సమయమున బైట యందు వొకగృహము యొక్క లోపలికి వెళ్ళిన, అప్పుడు చాలచీకటై ఏదొకటిని తెలియని విధముగా వొక భ్రమ కలుగురీతి అగుచున్నది.



ఇది సర్వజనులకు అనుభవముకదా? ఈలాగే బాహ్యము నుండి అహంకారమైవుండు నేను అను అవస్థ, మనస్సైవుండు తనలో చేరిన సమయమున మనస్సై వుండు తన బాహ్యావృత్తులను విడిచి తన స్వస్థాన మునందు ప్రవేశించినప్పుడు ఏదొక ప్రకాశమును, తెలివియు లేక శుద్ధిచీకటై వొకటియు తెలియకవుండు అవస్థ. అది మనస్సు యొక్కు సుషుప్తియైవున్నది. అదియే **స్వాధిష్ఠానము** అగు అవస్థ.

**మణిపూరకము** అనునది మనస్సునకు జాగ్రతావస్థయై వున్నది. అనగా మణి అనునది మనస్సు. పూరక మనగా నిండించుట. అప్పుడు మణియైవుండు మనస్సు యొకటి లేక జీవునితో కూడి తానుగా నిండినది. అచ్చట అతి ప్రకాశమై జ్వలించినది. అదెట్లనగా పైజెప్పిన గృహము యొక్క చిన్న గదిలోనకి వెళ్ళినప్పుడు చీకటై కనబడినను అచ్చటనే స్వల్ప సమయమునుండి చక్కగా చూచిన అచ్చట మంచి ప్రకాశమై అచ్చట నుండు సర్వఅవస్థలును

చూచి సుఖమై తోచుచున్నది. ఇది లోకజనులకు అనుభవమైవున్నది. ఈలాగే మనస్సు స్వస్థానమునకు ప్రవేశించినప్పుడు మొదట చీకటిగాను, స్వల్ప సమయమున అచ్చటనే ఉండునప్పుడు అచ్చట చక్కగా ప్రకాశమై అన్ని అవస్థలను తెలియవచ్చి చాలసుఖమై తోచును. ఇది మనస్సునకు జాగ్రతయై ఉన్నది. ఇదే మణిపూరకము అను అవస్థ.



**అనాహతం** అనగా, అనా+హతం. అనా=అగ్ని; హత=నాశము. అనగా అగ్నిస్వరూపమై ప్రకాశించుకొని వుండు మనస్సు తన ఉద్భవస్థానమైన జీవునియందు లయించినది. అప్పుడు అది జీవుని స్వప్నావస్థయైనది. అనగా ప్రకాశమైవుండు మనస్సు జీవునియందు లయించు సమయమున కలిగివుండు శోభయు, అనగా ప్రకాశము ఇటువంటిదని తెలియుటకు సాధ్యముగాక, స్వప్నతుల్యము అయి ఉంటున్నది. ఇది జీవుని స్వప్నావస్థ. దీనికి **అనాహతము** అని పేరు.

**విశుద్ధి** అని చెప్పనది వి+శుద్ధి; వి= విశేష అనగా తెలివి; శుద్ధి=నిర్మలతో. తెలివి నిర్మలమైనది. అప్పుడు ఏమియు తెలియక ఏదొకటియు తెలివి లేక నిశ్చలమై జీవుడు మాత్రముండుట అవస్థ. ఆ అవస్థ జీవుని సుషుప్తి. ఆ జీవుడు తననుండి ఉద్భవించిన మనస్సు నుండి కలిగిన అన్ని కల్మషములు నాశమై జీవునియందు మనస్సు లయించును. ఆ జీవుడు మాత్రమై ఒకటియు తెలియకవుండు అవస్థయే సుషుప్తి. ఇదియే **విశుద్ధి** అను

అవస్థ.

**ఆజ్ఞ** అనునది జీవుడే శివుడై ఉద్భవస్థానమైవుండు ఆనందమున లయించి మరొకటిలేక ఆనందించుకొని వుండు అవస్థ. అది జీవుని జాగ్రత. దానికి **ఆజ్ఞ** అనిపేరు. షడాధారములయొక్క స్థితి ఈ విధమైవున్నది. ఇదే బ్రహ్మానందము. అయిన, బ్రహ్మానందము ఇటువంటిదని



చెప్పిన ఎవరికిని తెలిసికొనుటకు అసాధ్యమనియు, అదెట్లనగా పాలపాయసమును భుజించినవారికే దాని యొక్క రుచి తెలియుటగాని, దానిని భుజించనివారికి దాని రుచి తెలియవుండునటువంటిదని వేదాంతులు చెప్పుచున్నారు. అయినను బ్రహ్మానందమును తెలిసికొన వచ్చును. అదెట్లనగా, సర్వజీవులు బ్రహ్మానందమును అనుభవించి వచ్చుచున్నవి. అయిన అదెట్లనగా, తాను సదా ఉపజీవనము చేసి జీవించవలసినదైన తన స్వంత సొత్తును తానే దొంగలించి నాశము చెయునది. అనగా ఆ సొత్తును తీయుటకు వెళ్ళి దానిని తాకు సమయమున కలుగునటువంటి అవస్థయే బ్రహ్మానందము.

శిష్యుడు : స్వామి! వాడువాడు ఉపజీవనము చేసి జీవించవలసిన వానివాని స్వంత సొత్తును వాడువాడే దొంగిలించి నాశము చేయునా?

గురువు : అవును నాశముచేయును. లోకమునందుండు సర్వజీవులు వారువారు ఎల్లప్పుడును ఉపజీవనము చేసి జీవించుకొని ఉండుటకు కావలసిన సొత్తును వారు వారే

దొంగిలించి నాశనము చేయుటవలననే చనిపోవుటకు కారణమైనది. అదేమనగా ఇప్పుడు లోకమునందుండు సర్వజీవులు ఎక్కువగా ఆగ్రహించుటయు, ఆగ్రహించు కొనియుండునదియు, మైథునమైయున్నది - అనగా స్త్రీ పురుష సంయోగము. అయిన లోకమునందు ఏదొక ప్రవర్తనమును చేయునప్పుడును మనస్సు దానియందు



నిలువక భిన్నభిన్నమై అటునిటు అల్లాడుకొని ఉంటున్నది. స్త్రీ పురుష సంయోగమను ప్రవర్తనమునందు మనస్సు ఏదొకటియందును వెళ్ళక అనగా కన్నులచే చూచుటకును, చెవులచే వినుటకును, ముక్కుచే వాసన తెలిసికొనుటకును, నాలుకచే రుచి చూచుటకును, త్వక్ నుండి తాకి తెలిసికొనుటకును, ఐదు విధములుగ బైటకులోపలయందు వెళ్ళక జీవునితో తనలోపల అణగి, పైకి క్రిందకు గద్గరించి, అదేదనగా క్రింద పైనయై చలించి, తన జీవశక్తి పైకివెళ్లి బ్రహ్మరంధ్రముననుండు శుక్లమును తాకు సమయమున కలుగు అవస్థ ఇటువంటిదని వర్ణించి చెప్పుటకు ఎవరికైనను సాధ్యమగునా?

శిష్యుడు : సాధ్యముకాదు.

గురువు : అదే బ్రహ్మానందము. ఎందుకనగా బ్రహ్మమనునది శుక్లము. ఆ శుక్లమైయుండు బ్రహ్మమును జీవుడు వెళ్ళి తాకు సమయమున-అతి తక్కువైన ఒక్క నిమిష సమయము-కనతెప్ప మూసి తెరిచిన సమయము-

ఉండుస్థితి ఈ ప్రకారమని ఎవరిచేతను చెప్పుటకు సాధ్యముకాదు. అదియే ఆనందము. దీనినుండే ఆనందమునుండి ఉద్భవమని, ఆనందములో ఉండ వలనని, ఆనందములో లయించువలనని చెప్పుటకు కారణము. ఇప్పుడు లోకమున ఆనందమునందు జనించుట తప్ప ఆనందమునందుండుటగాని, లయించుటగాని లేదు. కారణము, పై జెప్పిన ప్రకారము



బ్రహ్మస్వరూపమైయున్న శుక్లమును దొంగిలించి నశింపజేయుటవలన, ఏదొకటియు తెలియక అధోగతియై నశించిపోవుటవలననే. అందువలననే పైజెప్పిన ప్రకారము ఉద్భవించిన ఆనందమునందు జీవుడుపోయి లయించు టయే బ్రహ్మానందము. అప్రకారము బ్రహ్మస్వరూపమైన శుక్లమును పానముజేసి లయించి, ఎప్పుడును ఉపజీవనము చేసి జీవించి ఉండవలసినదైన సొత్తు శుక్లము అయి ఉన్నది. దానిని మనమున ఆలోచించక, ఒక నిముషమునకుండు సుఖమునకాశించి, తాను ఎప్పుడును ఉపజీవనము చేసి జీవించియుండ వలసినదైన తన స్వంత సొత్తును తన్నుతానే దొంగిలించి నాశపరచుకొనుచున్నారు. కావున పైజెప్పిన మైథున సమయమునందు ఏ ప్రకారముగా జీవుడు మనలోపల అణగి, లోపలనే క్రిందపైన గతించి, జీవుడు శుక్లమును దొంగిలించుటకు వెళ్ళులాగుననే అదే ప్రకారముగా జీవుడు లోపలనే కింద పైన గతిజేసి, పైననుండు బ్రహ్మమై యుండు శుక్లము నందు లయించునట్లు చేసిన, సదా

యానందమత్తుడై యుండవచ్చును. దీనికి బ్రహ్మానంద
మని పేరు. లోకవాసులు ఇది తెలియక, ఆలో
చించకయు, వాని వాని శక్తి బైటకులోపల వదలి,
పలువిధములుగా పలుతరము బందించి అది వాటిలో
భ్రమించి నశించి పోవుచున్నారు. కావున తన్నుతాను
తెలిసికొనవలయును, అని లోకమున చెప్పుచున్నారు.
అట్లు చెప్పుటయేగాని ఎవరును తన్నుతాను



తెలిసికొనుటలేదు. తన్నుతాను తెలిసికొనవలయుననిన తన్ను తాను చూడవలయును. తన్నుతానే చూడక వేరొకటిని చూచి తాను అనునది తెలియక నశించిపోవుట. కావున లోకవాసులైన సర్వజీవులు వాని వానిలో నుండి వచ్చుశక్తిని. వాని వాని లోపలనే పైజెప్పిన ప్రకారము బ్రహ్మమైన శుక్లమునందు లయించి తానై తన్మయమై కైవల్యము ప్రాప్తించి సదా ఆనందమత్తులై ఉండవలెనని ప్రార్థించుచున్నాము.

**శుభం**

చిదంబరావాస మఖండమీశం
సదాశివాంశం మనుజావతారం
సదాశివానంద మశేషకామాన్
సదాప్రదాతార మహంభజామి.

తోన్నిలహో గురుకటాక్షమతిన్ను మేలా
యొన్నుం మహా దురిత వన్ కటలే కటప్పాన్
వంతిచ్చిటట్టే గురువిన్ కళలేవనుంకై
వన్నెత్తిడట్టె పురుషార్థ చతుష్కమెల్లాం

తెలివొందుటకు సద్గురు కటాక్ష మొకటే కావలసినదిగాని మిగిలిన సాధనములు త్రిలోకమున లేవు. గురుపాదములు దొరికిన వెనుక బావులవలెనుండు కష్టములను చాటుచు

మరియు నాలుగు పురుషార్థములను సుఖముగా సంపాదించుకొని యుండవచ్చును.

సమాప్తము.



H.H. ... NESS

SWAMI SIVANANDA PARAMAHAMSA

FOUNDER OF SIDHASAMAJ

**ఈశ్వరుడు**: జీవుడు, గురువు: మనస్సు

**ఉపదేశము**: (ఈశ్వరుని) సమీపస్థానము (ఆ స్థానమును ముట్టి చూపి విద్యను దానము చేయుట.)

**పుణ్యము**: తెలివియైన జీవశక్తియైన వాయువు తీసికొని చేయుట. మన జీవుని స్నేహించి తన లోపలనే చేర్చుట - జీవకారుణ్యము లేక అహింస.

**పాపము**: తెలివిలేక అదేదనగా జీవుని స్నేహములేక మన జీవుని అదోగతిగా నశింప చేయుట- హింసిచుట.

**పంచభూతములు**: ఈ కనబడు ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి కాదు. అవి తనలో తానే ఉండినవి. **ఆకాశము** సదాశివుడైన జ్యోతి. **వాయువు** శివుడైన జీవుడు. **అగ్ని** రుద్రుడైన తేజస్సు. **అప్పు(జలము)** విష్ణు అయిన మనస్సు. **పృథ్వీ(భూమి)** బ్రహ్మమైన అహంకారము. ఈ ఐదును ఒకటై చేరి సృష్టి అగుచున్నది.

**శివుడు**: సత్వగుణము - జీవుడు - స్థూల శరీరము - పురుషుడు(తండ్రి)

**విష్ణువు**: రజోగుణము - మనస్సు- సూక్ష్మ శరీరము - స్త్రీ (తల్లి)

**బ్రహ్మము**: తమోగుణము - అహంకారము - కారణ శరీరము - నపుంసకము.

**ఉపవాసము**: నిరాహార అనుష్ఠానము కాదు, ఈశ్వరునితో చేరియుండు అవస్థ. అప్పుడు ఏదొక ఆహారము వద్దు.

**క్షేత్రోపవాసము**: గాత్రక్షేత్రమైన శిరస్సులో ప్రతిష్ఠ స్థానమైన భ్రూమధ్యములో జీవుడు ఉపసించుట.

**లింగము, ఉపస్థము, గుదము**: సర్వ జీవులలలోను రహస్యమై ఉన్నవి. లింగము పురుష జననేంద్రియము, ఉపస్థము స్త్రీ జననేంద్రియము, గుదము మలద్వారము కాదు.

**షడాధారములు**: మలద్వారమునుండి భ్రూమధ్యము వరకు అరు చక్రములు లేకున్నవి. మనస్సు జీవుడు ఐక్యమగు సమయమున అనుభవించు ఆరు అవస్థలై ఉన్నవి. ఆ ప్రకారము ఐక్యమగునప్పుడు బ్రహ్మానందమును అనుభవించును. అప్పుడు తన్ను తానై